శ్రీః

మహాకవి శ్రీబాణభట్టవిరచితమ్

# శ్రీచణ్డీశతకమ్

(ప్రతిపదార్థ-తాత్పర్య-విపులవివరణ)

ప్రసాదినీవ్యాఖ్యా-దోర్బల విశ్వనాథ శర్మ



ప్రకాశకులు

శ్రీమతి రావి కృష్ణకుమారీ, మోహనరావు దంపతులు

510, Pride Block Platinum County, Opp: Hosanna Mandir,
Gorantla, GUNTUR ` 522 034. A.P. State

శ్రీః

మహాకవి శ్రీబాణభట్టవిరచితమ్

# శ్రీచణ్డీశతకమ్

(ప్రతిపదార్థ - తాత్పర్య - విపులవివరణ)

ప్రసాదినీవ్యాఖ్య - దోర్బల విశ్వనాథ శర్మ

ప్రథమముద్రణ : 8.05.2000 (శ్రీశంకరాచార్యజయంతి - విక్రమ సం.)
ద్వితీయముద్రణ : శ్రీకృష్ణజయంతి 2021
ప్రతులు : 200
పుటలు : 172
వెల రూ. : 120/-

© **R. Mohan Rao, M.Sc., M.A. (Sanskrit),**
510, Pride Block Platinum County,
Opp: Hosanna Mandir,
Gorantla, GUNTUR ` 522 034. A.P. State
**Cell : 9440115411**

**D.T.P. by :**
**P.PARVATHI**
**Cell : 74165 86775**

**Printed at :**
**Karshak Art Printers**
**HYDERABAD**

# అఘమర్షణ

మహాకవి శ్రీబాణ విరచితమైన **శ్రీచణ్డీశతకమ్** శ్రీ దోర్బల విశ్వనాథశర్మ గారందించిన '**ప్రసాదినీ**' వ్యాఖ్యతో మరియు శ్రీ గరిమెళ్ళ సోమయాజులు శర్మ గారందించిన '**పదపాతమ**'నే పీఠికతో, నేటికి పుస్తకరూపాన్ని సంతరించుకొన్నది. ఈ గ్రంథాధ్యయనము సర్వులకు మంచి బాటను చూపుతుంది.

మూలశ్లోకాలను ఆసాంతము పరిశీలించి ప్రసాదినీ వ్యాఖ్యపేర అర్థ–తాత్పర్య–విపులవివరణను అందించిన పూజ్యులు, వేదమూర్తులైన శ్రీదోర్బల విశ్వనాథశర్మగారికి, శుద్ధప్రతిని తయారుచేసిన వారి కుమారులైన దామోదర, ఆనందశర్మలకు, 'పదపాత'మనే అమూల్య పీఠికను అందజేసిన తర్కశాస్త్ర ప్రవీణులైన శ్రీగరిమెళ్ళ సోమయాజులు శర్మగారికి, ప్రూఫు చూచుటయందు కొంత చేయూత నిచ్చిన, మిత్రులైన శ్రీ చింతగుంట సుబ్బారావు గారికి, శ్రీ కుంచాల రఘునాథరెడ్డి గారికి నా హృదయపూర్వకనమస్సులు.

సాధన గ్రంథమండలి, తెనాలి వ్యవస్థాపకులైన శ్రీ బులుసు సూర్య ప్రకాశ శాస్త్రిగారి ఆశీస్సులతో వెలుగుచూడనున్న ఈ వ్యాఖ్యానగ్రంథము **శ్రీకంచికామకోటిపీఠాధిష్ఠాత్రి యైన శ్రీ కామాక్షీదేవి పాదపద్మము**లకు సమర్పితము.

ఒంగోలు వాస్తవ్యుడైన చిరంజీవి **మక్కెన అజయ్‌చంద్ర** చేసిన ఆర్థికసాహాయ్యముతో ఈ వ్యాఖ్యానగ్రంథము ముద్రింపబడినది.

**– రావి మోహనరావు.**

ఓమ్

# పదపాతము



**అర్బుదభావనావిలసితాద్భుతధీనిధి బాణపండిత**
**స్వర్బుధనాథ సృష్టశత చండిఁ బ్రసాదినిఁ జేసి యాంధ్రికిన్**
**గర్బుర నూత్నరత్నమణి కమ్రకిరీటము పెట్టినట్టి మా**
**దోర్బల విశ్వనాథునకు దోయిలి యెత్తి నమస్కరించెదన్.**

**శ్రీచండీశతకము** ప్రసాదినీవ్యాఖ్యతో నిన్ని నాళ్ళకుఁ దెలుఁగు వారి కరకమలముల నలంకరించు చున్నది. ఈ శతకమును రచించిన మహాకవి బాణభట్టారకుఁడు. ఈ వ్యాఖ్యానమును రచించిన మహాపండితులు శ్రీ దోర్బల విశ్వనాథశర్మగారు. ఈ గ్రంథమును వెలుఁగు లోనికిఁ దెచ్చిన పుణ్యము మిత్రులు శ్రీ మోహనరావు గారిది. ఈ పవిత్రమూర్తులను గూర్చి యించుక తెలిసికొనుట మన విధి.

**బాణమహాకవి**

'**బాణోచ్ఛిష్టం జగత్సర్వమ్**' సంస్కృతవాఙ్మయజగత్తంతయు బాణుఁ డెంగిలి గావించి నదే యని సుప్రసిద్ధభాణకము. కాళిదాసు భవభూతుల పిమ్మట నంతటి స్థానము నలంకరించిన మహాకవి బాణభట్టు. అనవద్య హృద్యగద్య పద్యసాహితీ సామ్రాజ్య-సింహాసనమున కతఁ డేకైక సార్వభౌముఁడు. బాణమహాకవి ప్రశస్తిని బ్రాచీన కవిపండిత పుండరీకులే ముక్తకంఠముతోఁ గీర్తించినారు.

ప్రశంసా పరంపర

**1. పులిందభట్టు - ఉత్తర కాదంబరి**

**శ్లో॥ కాదమ్బరీరసభరేణ సమస్త ఏవ మత్తో న కిఞ్చిదపి చేతయతే జనోఽయమ్ ।**
**భీతోఽస్మి యన్న రసవర్ణవివర్జితేన తచ్ఛేషమాత్మవచసాప్యనుసన్దధానః ॥**

కాదంబరీ రసమును ద్రావి జను లందఱు మత్తులో మునుగుచున్నారు. అక్షరవిన్యాసము లేక రసహీనములైన నా వాక్కులతో శేషభాగమును బూరించుటకు భయపడుచున్నాను.

**2. ధనపాలుడు – తిలకమంజరి**

**శ్లో॥ కవలోఽపి స్ఫురన్ బాణః కరోతి విమదాన్ కవీన్ ।**
**కిమ్ పునః క్షప్తసన్ధానపులిన్దకృతసన్నిధిః ॥**

బాణధ్వని యించుక స్ఫురించినంతనే కవుల (నీటి పక్షుల) మదమణఁగు చున్నది. ఇపుడు పుళిందుఁడు (బాణుని కొడుకు – బోయవాడు) సంధించినాఁడు. ఇంకఁ జెప్పున దేమున్నది?

**శ్లో॥ కాదమ్బరీ సహోదర్యా సుధయా వైబుధే హృది ।**
**హర్షాఖ్యాయికయాఖ్యాయి బాణోఽబ్ధిరివ లబ్ధవాన్ ॥**

కాదంబరీ సహోదరి యగు హర్షాఖ్యాయికచే విబుధుల (పండితుల – దేవతల) హృదయములో నమృతమును బోసి బాణుఁడు సుధాసముద్రమైనాఁడు.

**3. గోవర్ధనాచార్యుడు – ఆర్యాసప్తశతి**

**శ్లో॥ జాతా శిఖణ్డినీ ప్రాగ్యథా శిఖణ్డీ తథావగచ్ఛామి ।**
**ప్రాగల్భ్యమధికమాప్తుం వాణీ బాణో బభూవేతి ॥**

భారతములో ద్రుపదుని యజ్ఞకుండమునుండి శిఖండిని పుట్టి శిఖండి యైనట్లే పెద్ద కొప్పుగల సరస్వతీదేవి యింకను బ్రగల్భత్వమును జూపుటకై పురుషరూపము దాల్చి శిఖగల బాణునిగా నవతరించినది.

**4. సోడ్డలుడు – ఉదయసుందరి**

**శ్లో॥ వాగీశ్వరం హన్త భజేఽభినన్దమర్థేశ్వరం వాక్పతిరాజమీడే ।**
**రసేశ్వరం స్తౌమి చ కాళిదాసం బాణన్తు సర్వేశ్వరమానతోఽస్మి ॥**

అభినందుఁడు వాక్కుల కీశ్వరుఁడు (బ్రహ్మ). వాక్పతిరా జర్థముల కీశ్వరుఁడు (శివుఁడు). కాళిదాసు రసమున కీశ్వరుఁడు (విష్ణువు). ఇంక బాణుఁడన్ననో సర్వేశ్వరుఁడు. వీరికి నమస్కరించుచున్నాను.

**5. సోమేశ్వరుడు – కీర్తికౌముది**

**శ్లో॥ యుక్తం కాదమ్బరీం శ్రుత్వా కవయో మౌనమాశ్రితాః ।**
**బాణధ్వనావనధ్యాయో భవతీతి స్మృతిర్యతః ॥**

కాదంబరిని వినినంతనే కవులు మౌనము వహించిరి. బాణధ్వని విన్ననాఁ డనధ్యాయ మని ధర్మశాస్త్ర మున్నది కదా!

**6. విశ్వేశ్వరపాండేయుఁడు – ఆర్యాసప్తశతి**

**శ్లో॥ వర్ణితవిధానపార్థౌ శుకవైశమ్పాయనార్చ్యపదౌ ।**
**ఆకలయామస్తుల్యౌ భారతకాదమ్బరీకారౌ ॥**

భారతకర్త వ్యాసుఁడు. కాదంబరీ కర్త బాణుఁడు. పార్థుల (పాండవుల) చరిత్రమును వర్ణించిన వాఁడు వ్యాసుఁడు. అపార్థము లేకుండ ఁగాదంబరిని జెప్పిన వాఁడు బాణుఁడు. శుకవైశంపాయన మహర్షులచే నర్చింపబడిన పాదములు గలవాఁడు వ్యాసుఁడు. మహా–శ్వేతాశాపముచే ఁజిలుకగా మాఱిన వైశంపాయనునిచే ఁజెప్పబడిన కాదంబరీకథా–పదములు గలవాఁడు బాణుఁడు. అట్టి తుల్యగ్రంథకారులైన వ్యాసబాణభట్టారకులను స్మరించుచున్నాము.

**7. ధర్మదాసు – సదుక్తికర్ణామృతము**

**శ్లో॥ రుచిరస్వరవర్ణపదా రసభావవతీ జగన్మనో హరతి ।**
**సా కిం? తరుణీ నహి నహి, వాణీ బాణస్య మధురశీలస్య ॥**

అందమైన స్వరము (ధ్వని) రంగు (అక్షరములు) పాదములు (పదములు) రసము భావము గలది జగత్తులోని జనుల మనస్సు హరించుచున్నది. ఏమి? ఆమె తరుణియా? కాదు కాదు. మధుర గుణములు గల బాణుని వాణి.

**8. విద్యాకరుడు – సుభాషితరత్నకోశము**

**శ్లో॥ ఉచ్ఛ్వాసోఽపి న నిర్యాతి బాణే హృదయవర్తిని ।**
**కిం పునర్వికటాటోపపదబన్ధా సరస్వతీ ॥**

బాణుఁడు హృదయములోఁ బ్రవేశింపఁగనే యూపిరి యాడదు. ఆటోపముతో వికట పదబంధము గల యతని సారస్వతమునుగూర్చి యేమి చెప్పఁగలము?

**9. హరిహరుడు – హరిహరసుభాషితము**

**శ్లో॥ దణ్డిన్యుపస్థితే సద్యః కవీనాం కమ్పతాం మనః ।**
**ప్రవిష్టేత్వాన్తరం బాణే కణ్ఠే వాగేవ రుధ్యతే ॥**

దండి దశకుమారచరిత్రము చూడఁగనే కవుల మనస్సు కంపించును. బాణుని కాదంబరిలోఁ బ్రవేశించినచో ఁగంఠములోని వాక్కే స్తంభించును. దుడ్డుకఱ్ఱ గల వానిని

జూచినచో గుండె దడదడ లాడును. బా ణము గ్రుచ్చుకొన్నచో ఁగంఠమునుండి వాక్కు వెలువడునా? యని యర్థాంతరము.

**10. రాజశేఖరుడు**

**శ్లో॥ బాణేన హృదిలగ్నేన యన్మన్దోఽపి పదక్రమః ।**
**ప్రాయః కవికురఙ్గాణాం చాపలఞ్చాత్ర కారణమ్ ॥**

బాణము గుండెలో గ్రుచ్చు కొన్నను మెల్లఁగా నడుచు లేళ్ళవలె బాణ సాహిత్యము హృదయములో నున్నను గవులు కవిత కుపక్రమించుటకు ఁగారణము చపలత్వమే కదా!

**11. శ్రీ చంద్రదేవుఁడు**

**శ్లో॥ శ్లేషే కేచన శబ్దగుమ్భవిషయే కేచిద్రసే చాపరేఽ**
**లఙ్కారే కతిచిత్సదర్థవిషయే చాన్యే కథావర్ణకే ।**
**ఆః! సర్వత్ర గభీరధీరకవితా విన్ధ్యాటవీ చాతురీ**
**సంచారీ కవికుమ్భికుమ్భభిదురో బాణస్తు పఞ్చాననః ॥**

కొందఱు శ్లేషాలంకారము వాడుట యందును, గొందఱు శబ్దగుంఫనము నందును, గొంద ఱలంకారము లందును, గొందఱు రసపోషణము నందును, గొంద ఱర్థగౌరవము నందును, గొందఱు కథ చెప్పుట యందును నిపుణులు. ఇవి యన్నియు నొకే చోటఁ గలిసిన గంభీరధీరకవిత్వ మను వింధ్యారణ్యములో ఁజాతుర్యముతో సంచరించుచు కవులను మదగజముల కుంభస్థలములకు వజ్రాయుధము వంటివాఁడైన బాణుడు సింహమువంటి వాఁడు.

**12. ఒకానొక ప్రాచీనకవి బాణవాణి నిట్లు శ్లాఘించినాఁడు**

**శ్లో॥ శబ్దార్థయోస్సమో గుమ్ఫః పాఞ్చాలీరీతిరుచ్యతే ।**
**శిలాభట్టారికావాచి బాణోక్తిషు చ సా యది ॥**

శబ్దార్థముల సమగుంఫనము, పాంచలీరీతి శిలాభట్టారికవాక్కులయందు బాణుని సూక్తుల యందు మాత్రమే గలవు.

**13. మఱియొక పురాతనకవి బాణభారతి నిట్లు సంభావించినాఁడు.**

**శ్లో॥ వాణీపాణిపరామృష్టవీణానిక్వాణహారిణీమ్ ।**
**భావయన్తి కథం నాన్యే భట్టబాణస్య భారతీమ్ ॥**

సరస్వతీదేవిచేతులచే మీటcబడిన వీణానిక్వాణమువలె మనోహారిణియైన బాణభట్ట భారతి నెవ్వరు భావింపరు?

**14.** నన్నెచోడ మహాకవి కుమారసంభవములో బాణుని భగవద్భక్తి నిట్లు కొనియాడినాcడు.

**కం. కరములు దునుముడు cబరముని**
**వరదునిగా గొలిచి కవిత వలననె మగుడం**
**గరములు వడసి జగంబునc**
**బరcగె మహాకవి యనంగ బాణుcడు పేర్మిన్**

ఇంతటి మహాకవి నాదరించి పోషించి యనర్ఘకృతిరత్నములను వెలయింపc జేసిన మహారాజు

## శ్రీహర్షవర్ధనుడు (606 – 647)

ఈ మహానుభావు cడుత్తర భారతదేశమునంతటి నేకచ్ఛత్రాధిపత్యముగా నేలిన చక్రవర్తియే కాక **సరససాహిత్యసామ్రాజ్యసార్వభౌముcడు.** యశోమతీ – ప్రభాకరవర్ధనులు తల్లిదండ్రులు. **రాజ్యవర్ధను** cడన్న. విదేశముల కేగి బౌద్ధధర్మములను బ్రచారము చేసిన విదుషీమణి **రాజ్యశ్రీ** చెల్లెలు. **స్థాణీశ్వరము** (థానేశ్వరము) రాజధాని. 1. నాగానందము, 2. ప్రియదర్శిక, 3. రత్నావళి యను నాటకములు కృతులు. **బాణుcడు, మయూరుcడు, దివాకరుcడు, ధావకుcడు** మొదలగు వారు స్వీయసభను దేదీప్యమాన మొనరించిన విద్వత్కవిరత్నములు. బాణమహాకవి తన కాశ్రయప్రదాత యగు శ్రీహర్షుని జీవితచరిత్రను నోరార వర్ణించినాcడు. బాణమహాకవి తక్కిన సంస్కృతకవులవలె మూకీభావము వహింపక తన వంశమును గూర్చి జీవితవిశేషములను గూర్చి కాదంబరీ, హర్షచరితములలో విపులముగా cదెలియc జేసినాడు.

## బాణుని వంశము

బాణమహాకవి పూర్వవంశీయులు శోణతీరమున నున్న 'ప్రీతికూట' నగర నివాసులు. వాత్స్యాయనగోత్రులు. యజుస్సామవేదాధ్యాపకుcడైన 'కుబేరు' cడను పండితుcడు మూలపురుషుcడు. కుబేరుని కుమారుcడు పాశుపతుcడు. పాశుపతుని పుత్త్రు cడర్థపతి. ఇతను సుతుcడు చిత్రభానుcడు. చిత్రభానుని పుత్త్రరత్నమే మన **బాణమహాకవి.**

## బాణుని రచనలు

### 1. హర్షచరితము

ఇది యెనిమిది యుచ్ఛ్వాసముల గద్యకావ్యము. మొదటి రెం డుచ్ఛ్వాసములందును

బాణుని స్వీయచరిత్రము చెప్పఁబడినది. తక్కిన యాఱు (3–8) ఉచ్ఛ్వాసములందును శ్రీహర్షవర్ధనుని పవిత్రచరిత్రము విస్తరముగా వర్ణింపఁబడినది. క్రీ.శ. సప్తమ శతాబ్ది నాఁటి భారతదేశపరిస్థితులను దెలిసికొనుటకు ఁజారిత్రకుల కీ గ్రంథము వజ్రపు గనియైనది. ధ్వని ప్రస్థాన ప్రస్థాపనాచార్యులగు **నానందవర్ధనాచార్యులు** హర్షచరితరచనాచాతుర్యమును వేనోళ్ళ నుగ్గడించినారు (1) శంకరపండితుని '**సంకేత**' వ్యాఖ్య (2) రంగనాథుని '**మర్మావబోధినీ**' వ్యాఖ్య సుప్రసిద్ధములు. హర్షచరిత వార్తికములు, పద్యహర్ష చరితములు కూడ వెలిసినవి. శ్రీ తిరుపతి వేంకటకవులు హర్షచరిత్రము నందలి మూడుచ్ఛ్వాసములను దెనిఁగించినారు.

**శ్లో॥ హేమ్నాం భారశతాని వా మదముచాం బృన్దాని వా దన్తినాం**
**శ్రీ హర్షేణ తదర్పితాని గుణినే బాణాయ కుత్రాద్య తత్ ।**
**యా బాణేన తు తస్య సూక్తివిసరైరుట్టఙ్కితాః కీర్తయః**
**తత్కల్పప్రలయేఽపి యాన్తి న మనాఙ్మన్యే పరిమ్లానతామ్ ॥**

శ్రీహర్షచక్రవర్తి బాణభట్టున కర్పించిన నూఱు బారువుల బంగారు రాశులు గాని మదించిన యేనుఁగులు గాని యిపు డెక్కడ నున్నవి? శ్రీబాణమహాకవి సూక్తులతో నుట్టంకించిన తత్కీర్తులు మాత్రము ప్రళయకాలమునందు ఁగూడ వాడి పోనివి. అని **వ్యక్తివివేకవ్యాఖ్య**లో రుయ్యకుఁ డుదాహరించిన శ్లోకము ప్రత్యక్షరసత్యము.

**2. కాదంబరీ :**

కాదంబరీ కావ్యము సంస్కృతగద్యశారదకు నవరత్నకిరీటము. బాణుని యశస్సౌధము నకు వజ్రస్తంభము. కాదంబరిలో బాణుఁడు ప్రయోగింపని పదము గాని త్రొక్కని క్రొత్త పోకడలు గాని లేవు. '**కాదమ్బరీ రసజ్ఞానామాహారోఽపి న రోచతే**' యని పండితసూక్తి. కాదంబరి కథానాయిక. కాదంబరి యనగా ఁగల్లు. కాదంబరీ రసము ద్రావిన వారికి నాహారము కూడా రుచింప దఁట. కాదంబరిని జదువుచున్నంత సేపు పాఠకునకు సాహిత్యపు మత్తావరించుట మాత్రము నిజము. **వృత్త్యనుప్రాసము ముక్తపదగ్రస్తము మొదలగు శబ్దాలంకారములకు; శ్లిష్టోపమ పరిసంఖ్య మొదలగు నర్థాలంకారములకు; ఁబ్రౌఢదీర్ఘ–సమాసములకు; నోజోగుణగౌడీరీతులకుఁ గాదంబరి కల్పతరువు.** ఈ గ్రంథములో మూఁడు జన్మముల కథలు ముడిపెట్టఁబడి భారతీయుల పునర్జన్మ సిద్ధాంతము స్థాపింపఁబడినది. మహాశ్వేతావృత్తాంతములో '**సతీసహగమనము**' నిరసింపఁబడుట గమనింపఁదగినది. '**వాసవదత్తా**' కర్తయగు **సుబంధుఁడు**. '**దశకుమారచరిత్ర**' కర్తయగు **దండి**, '**కాదంబరీ**'

కర్తయగు **బాణుఁడు** సంస్కృతగద్యవాఙ్మయప్రపంచమునకుఁ ద్రిమూర్తులు. బాణుఁడు కాదంబరిని సగము మాత్రమే రచించినాఁడు. ఉత్తరకాదంబరిని బాణుని కుమారుఁడు భూషణభట్టు లేక పుళిందభట్టు పూరించినాఁడు. వామనుఁడు, ఆనందవర్ధనుఁడు, రుయ్యకుఁడు, మమ్మటుఁడు, విశ్వనాథుఁడు మొదలగు నాలంకారికులు కాదంబరిని సాదరముగా నుదాహరించినారు. క్షేమేంద్రు ఁడౌచిత్యవిచారచర్చలో నుదాహరించిన –

**శ్లో॥ హారో జలార్ద్రవసనం నలినీదళాని ప్రాలేయశీకరముచస్తు హిమాంశుభాసః ।**
**యస్యేన్ధనాని సరసాని చ చన్దనాని నిర్వాణమేష్యతి కథం స మనోభవాగ్నిః ॥**

అను శ్లోకమును బట్టి బాణుఁడు పద్యకాదంబరిని గూడ రచించినట్లు తెలియుచున్నది. గాని యది నేఁ డలభ్యము. తర్కశాస్త్రముతో '**న్యాయమంజరి**' ని రచించిన జయంతభట్టు కుమారుఁ డగు నభినందుఁడు '**కాదంబరీకథాసార**' మను పద్యకావ్యమును రచించినాఁడు. అక్బరు చక్రవర్తి (1556–1605) యాస్థానపండితు లైన భానుచంద్ర సిద్ధచంద్రగణులు కాదంబరికి '**నిరంతర**' వ్యాఖ్యను రచించినారు. కేతన కాదంబరిని బద్యకావ్యముగాఁ దెనిగించినట్లు సంకలన గ్రంథములను బట్టి తెలియుచున్నది, గాని నేఁడు లభించుట లేదు. పోతన (1370–1450) భాగవతములో బాణ గద్యముల వంటి గద్యములను బెక్కింటిని రచించినాఁడు. శ్రీనాథుఁడు (1370–1450) శివరాత్రిమాహాత్మ్యములోఁ గాదంబరీ వాక్యములను యథాతథముగా గ్రహించినాఁడు. శ్రీ మధిర సుబ్బన్నదీక్షితులు గారు కాశీమజిలీ కథలలోఁ గాదంబరిని సంగ్రహముగా సుందరముగాఁ దెనిగించి నారు. వెలిది శేషయ్య గారు పద్య కాదంబరిని రచించినారు. కన్నడములో నవలలకుఁ గాదంబరి యనియే వ్యవహారము. సంస్కృతాంధ్రకర్ణాటకవులపై గాదంబరీ ప్రభావము మిక్కుటముగాఁ గలదు. '**గద్యం కవీనాం నికషం వదన్తి**' కవులకు గద్యమే గీటుఱాయి యను సామెత బాణమహాకవి యెడ సార్థకమైనది.

**3. చండీశతకము :**

బాణుని యుపలభ్యమానకృతులలోఁ **జండీశతక** మొక్కటియే పద్యకృతి. దీనిని గూర్చి తరువాత ముచ్చటించుకొందము. ఈ మూఁడు కృతులు మాత్రమే నేఁడు లభించుచున్నవి. ఇవి కాక 1. **శివస్తుతి**, 2. **ముకుటతాడితకము**, 3. **శారదచంద్రిక** యను కృతులను గూడ బాణుఁడు రచించినట్లు తెలియుచున్నది.

త్రివిక్రమభట్టు రచించిన నలచంపువునకు దండపాలుఁడు రచించిన వ్యాఖ్యలో

**యదాహ ముకుటతాడితకే బాణః –**

**శ్లో॥ ఆశాః ప్రోషితదిగ్గజా ఇవ గుహాః ప్రధ్వస్తసింహా ఇవ**
**ద్రోణ్యః కృత్తమహాద్రుమా ఇవ భువః ప్రోత్ఖాతశైలా ఇవ ।**
**బిభ్రాణాః క్షయకాలరిక్తసకలత్రైలోక్యదృష్టాం దశాం**
**జాతాః క్షీణమహారథాః కురుపతేర్దేవస్య శూన్యాస్సభాః ॥**

అను శ్లోక ముదాహరింపఁబడినది. ఈ నాటకములో భీమదుర్యోధనుల గదాయుద్ధము, భీముడు దుర్యోధనుని కిరీటమును దన్నుట యితివృత్తము.

శారదాతనయుఁడు భావప్రకాశములో

**శ్లో॥ కల్పితం బాణభట్టేన యథా శారదచన్ద్రికా ।**
**దివ్యేన మర్త్యస్య వధః కావ్యస్యావశ్యభావతః ॥** అనియు

ధనంజయుఁడు దశరూపకములో –

**శ్లో॥ చాన్ద్రాపీడస్య మరణం యత్రప్రత్యుజ్జీవనాన్తికమ్ ।**
**కల్పితం భట్టబాణేన యథా శారదచన్ద్రికా ॥**

అనియుఁ జెప్పుటచే శారదచంద్రికా నాటకమును గూడ బాణుఁడు రచించినట్లు తెలియు చున్నది. పద్యకాదంబరితోఁ గలిపి యీనాలుగు కృతులు నేఁడు లుప్తప్రాయములు. ఇవి కాక **పార్వతీపరిణయ** మను నాటకము కూడ బాణకవి కృతముగాఁ బ్రసిద్ధి గాంచినది. దీని కర్త భట్టబాణుఁడని కొందఱు **వామనభట్టబాణుఁడు** (1375–1445) అని మఱికొందఱు వాదించుకొనుచున్నారు. ఈ చర్చ కిది తావు కాదు. శ్రీ పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రి గారు శ్రీ పార్వతీపరిణయ నాటకము నాంధ్రీకరించినారు.

### బాణుఁడు – మయూరుఁడు

శ్రీహర్షుని సభ నలంకరించిన విద్వత్కవులలో బాణమయూరులు సమానస్కంధులు. బిల్హణుని సూక్తిముక్తావళిలో నుదాహరించిన

**శ్లో॥ అహో! ప్రభావో వాగ్దేవ్యా యన్మాతఙ్గదివాకరః ।**
**శ్రీహర్షస్యాభవత్సభ్యః సమం బాణమయూరయోః ॥**

శ్రీ సరస్వతీ దేవి ప్రభావము నేమని చెప్పగలము? అంత్యకులస్థుఁడగు మాతంగ దివాకరుఁడు కూడ బాణమయూరులతో సమముగా శ్రీ హర్షుని సభాసభ్యుఁడయ్యె నను శ్లోక మీ విషయములోఁ బరమ ప్రమాణము. ఇక్కడ –

**శ్లో॥ సచిత్రవర్ణవిచ్ఛిత్తిహారిణీరవనీపతిః ।**
**శ్రీహర్ష ఇవ సఙ్ఘట్టం చక్రే బాణమయూరయోః ॥**

అను పరిమళపద్మగుప్తుని **నవసాహసాంకచరిత** శ్లోకము కూడ ననుసంధేయము. అందువల్లనే ప్రాచీనకవులు బాణమయూరులను గలిపి స్తుతించినారు.

**పోతన భాగవతము (1 స్క - 12)**

వ ॥ మృదుమధుర వచన వర్గ పల్లవిత స్థాణునకున్ బాణునకుం బ్రణమల్లి కతిపయశ్లోక సమ్మోదితసూరు మయూరు నభినందించి.

**శ్రీనాథుఁడు - శృంగారనైషధము (1-7)**

**సీ. భట్టబాణ మయూర భారతీ సందర్భ సౌభాగ్య గరిమంబు సంగ్రహించి...**

బాణుఁడు హర్షచరిత్రలో '**జాఙ్గులికో మయూరః**' అని మయూరుని బేర్కొనినాఁడు. జాంగలికుఁ డనగా విషవైద్యుడు. మయూరుఁడు విషవైద్యవిద్యాప్రవీణుఁడైనట్లు సూక్తి-ముక్తావళిలో

**శ్లో॥ దర్పం కవిభుజఙ్గానాం గతా శ్రవణగోచరమ్ ।**
**విషవిద్యేవ మయూరీ మయూరీ వాఙ్నికృన్తతి ॥**

నెమలికూత వినినంతనే పాములు భయపడినట్లు విషవిద్యవంటి మయూరుని వాక్కు కవి భుజంగముల చెవిని బడినంతనే గర్వము నణఁచుచున్న దని శ్లోకము చెప్పుచున్నది.

**సూర్యశతకము నందలి**

**శ్లో॥ మీలచ్చక్షుర్విజిహ్వశ్రుతి జడరసనం నిఘ్నితఘ్రాణవృత్తి**
**స్వవ్యాపారాక్షమత్వక్పరిముషితమనః శ్వాసమాత్రావశేషమ్ ।**
**విస్రస్తాఙ్గమ్ పతిత్వా స్వపదపహరతాదశ్రియం వోఽర్కజన్మా**
**కాలవ్యాలావలీఢం జగదగద ఇవోత్థాపయన్ ప్రాక్ప్రతాపః ॥**

అను శ్లోకము కూడ మయూరుని సర్పవిషవిద్యావిజ్ఞానమును జాటుచున్నది. శ్రీనాథ మహాకవి కాశీఖండము (1-139) లో నీ శ్లోకము నిట్లనువదించినాఁడు.

సీ. నేత్రంబు లున్మేష నిస్పృహత్వము నొంద
శ్రుతిపుటంబుల శక్తి చొక్కు మడఁగ
జ్ఞానేంద్రియ జ్ఞాన కళ లౌరు సొరుగా
జిహ్వ వివేకంబు చిఱుతవోవ

నంతరంగమున మహాంధకారము గ్రమ్మఁ
దనువు చేష్టా దరిద్రత వహింపఁ
బ్రాణముల్ శ్వాసమాత్రమున ఁబర్యవసింపఁ
దలచీర యెఱుఁగని దశఘటిల్లఁ

గీ. బాము గఱచిన మూర్ఛిల్లి పడినయట్లు – వితత నిద్రా సమావేశ వివశులగుచుఁ
దరణి దీధితి లేమిఁ జైతన్య మెడలి – పడిరి పాశ్చాత్యదేశంబు పంచజనులు.

దీనిని బట్టి బాణమయూరులు సమకాలికులగుట శ్రీ హర్షునిసభ నలంకరించుట నిర్వివాద మగు విషయము.

మేరుతుంగాచార్యుఁడు ప్రబంధచింతామణిలో "**మయూరో నామ పణ్డితః ప్రతివసతి స్మ । తజ్జామాతా బాణః**" అనియు, మధుసూదనమిశ్రుఁడు సూర్యశతక భావబోధినిలో – "**మయూర భట్టః శ్వశురో బాణభట్టః కాదమ్బరీ గ్రన్థస్య కర్తా తస్య జామాతా**" అనియుఁ జెప్పుటచే మయూరుఁడు బాణునకు మామగా రని తెలియుచున్నది. యజ్ఞేశ్వరశాస్త్రి సూర్య–శతకటీకలో – "**మహాకవి ర్మయూరో ధారానగరీమధివసతి స్మ । తస్య చ భగినీ పతిః కాదమ్బరీగద్యప్రబన్ధనిర్మాతా బాణకవిః ।**" అని చెప్పుటచే బాణునకు మయూరుఁడు బావమఱఁది యని కొందఱు చెప్పుచున్నారు. ఇది మన యాంధ్రసాహిత్యములోఁ బోతన శ్రీనాథుల బాంధవ్యము వంటిది.

ఒకనాఁటి రాత్రి బాణుని భార్య ప్రణయకోపముతో నెప్పటికిఁ బ్రసన్నురాలు కాలేదు. అప్పుడు బాణుఁ డామెను బతిమాలుచు –

**శ్లో॥ గతప్రాయా రాత్రిః కృశతను! శశీ శీర్యత ఇవ**
**ప్రదీపోఽయం నిద్రావశముపగతో ఘూర్ణత ఇవ ।**
**ప్రణామాన్తే మానం త్యజసి న యథా త్వం క్రుధమహో!**

"తన్వంగీ! రాత్రి యించుమించు గడచినది. చంద్రుఁ డస్తమించు చున్నాఁడు. దీపము కూడ నిద్ర వచ్చినట్లు ఘూర్ణిల్లుచున్నది. మ్రొక్కుచున్నను నీవు కోపమును విడిచి పెట్టవేమి?" యని శ్లోకములో మూఁడు పాదముల వఱకుఁ జెప్పెను. అంతలో మయూరుఁడు వచ్చి 'కుచప్రత్యా సత్త్యా హృదయమపి తే చణ్డి! కఠినమ్'. "చండీ! కుచములకు దగ్గఱగా నుండుటచే నీ హృదయము కూడఁ గఠినమైనదా?" యని నాల్గవ పాదమును బూర్తిచేసెను. దీనిని వినఁగనే బాణపత్ని తన యన్నపై (లేక తండ్రిపై) మిక్కిలి కోపించి "నీవు కుష్ఠరోగగ్రస్తుఁడవు కమ్ము"ని శపించెను. ఆ పతివ్రత శాపము తగిలి మయూరుఁడు రోగగ్రస్తుఁడై సూర్యుని నూఱు శ్లోకములలో స్తుతించి రోగవిముక్తుఁ డయ్యెను. సూర్యశతకరచనాచాతుర్యమున కాకృష్టచిత్తుఁడైన బాణుఁడు చండీ శతకమును రచించెను.

## చండీశతకము

చండీశతకము బాణవిరచితము గాదని కొందఱు శంకించుచున్నారు. అది సరిగాదు. బృహత్స్తోత్రరత్నాకరప్రథమభాగములోఁ జండీశతకమునందలి 70 శ్లోకములు 'మహిషాసురమర్దినీస్తోత్ర' మను పేరుతోఁ బ్రకటింపబడినవి. ఈ స్తోత్రము శ్రీ గోవింద భగవత్పాదవిరచిత మని గద్యముండుటకు హేతువు మృగ్యము. భోజుఁడు, అర్జునవర్మ, కుంభనృపతి మొదలగు ప్రాచీన గ్రంథకారులు చండీశతకమును బాణుఁడు రచించినట్లు నొక్కి వక్కాణించినారు.

మార్కండేయపురాణమునందలి '**చండీసప్తశతి**' చండీశతకమునకు మూలము. ఈ శతకములోఁ బ్రతిశ్లోకమునందు దేవి లోకకంటకుఁడైన మహిషాసురుని మర్దించి వధించుట హృద్యముగా వర్ణింపఁబడినది. వీర–శృంగార రసములు పుష్కలముగాఁ బోషింపఁబడినవి. దేవి శివునితోఁ బలికిన నర్మోక్తులు శివుని యనునయోక్తులు, దేవి జయ – విజయ – వినాయకుఁడు – కుమారస్వామి – దేవతలు మొదలగు వారి నుద్దేశించి వచించిన యనుగ్రహవచనములు. మహిషాసురు ఁడఖర్వగర్వముతో ఘోషించిన భీషణభాషణములు విచిత్రరీతులలో వర్ణింపఁబడినవి.

**మయూరమహాకవి** వాడిన పదమును వాడకుండ సూర్యుని పర్యాయనామములు ప్రయోగించినాఁడు. బాణుఁడు కూడ భక్తితో భగవతికి "అద్రికన్య(35) – అద్రిజ(28) – అద్రిసుత(68) – అంబిక(12) – ఆర్య(3) – ఉమ(17) – కాత్యాయని(14) – కాలరాత్రి (53) – కాళి(11) – కాళిక(51) – గౌరి(29) – చండి(9) – చండిక(46) – దుర్గ(8) – దేవి(1) – పార్వతి(10) – ప్రాలేయాచలపల్వలైకబిసిని(55) – భద్రకాళి(22) – భవాని(21) – మాత(67) – రుద్రాణి(70) – శర్వాణి(64) – శివ(2) – శైలపుత్రి(82) – సప్తలోకీజనని (54) – స్మరరిపుమహిషి(69) – హైమవతి(19)" మొదలగు పర్యాయనామములను వాడి విచ్ఛిత్తి విశేషమును గల్గించినాఁడు. మొదటి శ్లోకమునందే దేవి యని నిరుపపదము ప్రయోగించి **దేవీ శబ్దము దుర్గాదేవి యందే రూఢమని** ప్రకటించినాఁడు. యుద్ధరంగములో మహిషాసురుని శిరమును ద్రొక్కుచున్న యమ్మవారి పాదము పాఠకులకు మంగళమొసఁగుఁగాత! యని యనేక భంగుల నాశ్వాసించినాఁడు. సూర్యశతకమును రచించిన మయూరునితోఁ బోటికి నిలఁబడి బాణుఁడు **చండీశతకము**ను రచించి చాల వఱకుఁ గృతకృత్యుఁడైనాఁడు. మచ్చునకు రెండు శ్లోకములను బరికింపుఁడు.

మయూరుఁడు - సూర్యశతకము

శ్లో॥ పాశానాశాన్తపాలాదరుణ! వరుణతో మా గ్రహీః ప్రగ్రహార్థం
తృష్ణాం కృష్ణస్య చక్రే జహిహి న హి రథో యాతి మే నైకచక్రః ।
యోక్తుం యుగ్యం కిముచ్చైశ్శ్రవసమభిలషస్యష్టమం వృత్రశత్రో
స్త్వక్తాన్యాపేక్షవిశ్వోపకృతిరితి రవిశ్శాస్తి యం సోఽవతాద్వః ॥

శ్లో॥ వజ్రిఞ్జాతం వికాసీక్షణకమలవనం భాసి నాభాసి వహ్నే!
తాతం నత్వాశ్వపార్శ్వం నయ యమ! మహిషం రాక్షసాః! వీక్షితాః స్థ ।
సప్తీన్ సిఞ్చ ప్రచేతః! పవన! భజ జవం విత్తపావేదితస్త్వం
వన్దే శర్వేతి జల్పన్ ప్రతిదిశమధిపాన్ పాతు పూష్ణోఽగ్రణీర్వః ॥

బాణుఁడు - చండీశతకము

శ్లో॥ శూలం తూలం ను గాఢం ప్రహర హర! హృషీకేశ! కేశోఽపి వక్ర-
శ్చక్రేణాకారి కిమ్మే పవిరవతి న హి త్వాష్ట్రశత్రో! ద్యురాష్ట్రమ్ ।
పాశాః కేశాబ్జనాళాన్యనల! న లభసే భాతుమిత్యాత్తదర్పం
జల్పన్ దేవాన్ దివౌకోరిపురవధి యయా సాఽస్తు శాన్త్యై శివా వః ॥

శ్లో॥ శార్ఙ్గిన్! బాణం విముఞ్చ భ్రమసి బలిరసౌ సంయతః కేన బాణో
గోత్రారే! హన్త్యహం తే రిపుమమరరిపుస్త్వేష గోత్రస్య శత్రుః ।
దైత్యా వ్యాపాద్యతాం ద్రాగజ ఇవ మహిషో హన్యతే మన్మహేఽద్యే-
త్యుత్ప్రాస్యోమా పురస్తాదను దనుజతనుం మృద్నతీ త్రాయతాం వః ॥

ప్రాచీన పండితులు చండీశతకమును దమ గ్రంథములలో ఁబ్రమాణముగా నుదాహరించినారు.

భోజుఁడు సరస్వతీకంఠాభరణములో

శ్లో॥ యాదృగ్గద్యవిధౌ బాణః పద్యబన్ధే న తాదృశః ।
గత్యాం గత్యామియం దేవీ విచిత్రా హి సరస్వతీ ॥

బాణునకు గద్యరచనలో నున్న నేర్పు పద్యబంధములో లేదు. సరస్వతీ దేవి గమనము మిక్కిలి విచిత్రమైన దని చెప్పి గుణలుబ్ధుఁడు గావున మూఁడు శ్లోకముల నుదాహ-రించినాఁడు. ఇక్కడఁ బద్యబన్ధేఽపి తాదృశః అను పాఠాంతరముకూడ లేకపోలేదు. అపుడు గద్యమువలెనే పద్యమును నడుపుటలోఁగూడ బాణుఁడతిసమర్థుఁడన్న యర్థము వచ్చును.

1. ఆవాక్యసమాప్తేర్వర్గానుప్రాసనిర్వాహో **వేణికా** యథా –
విద్రాణే రుద్రబృన్దే సవితరి తరలే వజ్రిణి ధ్వస్తవజ్రే. (66)

తదేతన్నాతిదుర్బోధమ్ । సోఽయం వర్గానుప్రాసో వేణికేత్యుచ్యతే । పద్యము మొదలు పెట్టినది మొదలు చివరివఱకు వర్గానుప్రాసమును నిర్వహించుట **వేణిక**. పద్య మంతట రెండేసి పదములలో ననుప్రాసమున్నచో జడయల్లికవలె నుండును గాన వేణిక కీపద్య ముదాహరణము.

2. ఉక్తలక్షణేభ్యోఽన్యశ్చిత్రో యథా –

శ్లో॥ **నీతే నిర్వ్యాజదీర్ఘామఘవతి మఘవద్వజ్రలజ్జా నిదానే** అని యీ శ్లోకమును వర్గానుప్రాస చిత్రమున కుదాహరణముగా ఁబేర్కొనినాఁడు.

3. అవస్థానభేదేన యథా –

**శ్లో॥ పాదావష్టమ్భనమ్రీకృతమహిషతనోరుల్లసద్బాహుమూలం**
**శూలం ప్రోల్లాసయన్త్యాః సలలితవపుషో మధ్యభాగస్య దేవ్యాః ।**
**విశ్లిష్టస్పష్టదృష్టోన్నతవిరలవలివ్యక్తగౌరాన్తరాలా–**
**స్తిస్రో నః పాన్తు లేఖాః క్రమవశవికసత్కఞ్చుకప్రాన్తముక్తాః ॥**

అత్ర స్త్రియాః శూలప్రోల్లాసనాదౌ వ్యాపారేఽబుద్ధికారితమపి శరీరావస్థానమాదృశం జాయత ఇతీదమవస్థానం నామ జాతిభేదః । పాదముతోఁ ద్రొక్కి మహిషాసురుని దేహమును వంచి దేవి చేతిలో శూలము ద్రిప్పుచున్నది. బాహుమూలము ప్రకాశించుచున్నది. దేవి దేహము నిలువుగా సాగినది. కంచుకము (ఱవిక) కొంచెము పైకి జరిగినది. నడుము స్పష్టముగాఁ గన్పట్టు చున్నది. ఉదర మించుక యుబికి వళులు (ముడుతలు) విరళము లైనవి. ఇట్టి స్థితిలో దేవియొక్క మధ్యభాగముపై గౌరవర్ణము (పచ్చని–తెల్లని–రంగు)తోఁ గ్రమముగా వికసించి స్పష్టముగాఁ గన్పట్టుచున్న మూఁడు రేఖలు మిమ్ముఁగాపాడు గాక! యని భావము. ఇందు మహిషాసురుని మర్దించుట శూలము త్రిప్పుట బుద్ధిపూర్వకములు. బాహుమూలము ప్రకాశించుట, శరీరము సాగుట, పొట్ట యుబుకుట, నడుముపై నున్న ముడతలు పోయి రేఖలు బయల్పడుట మొదలగునవి యబుద్ధి పూర్వకములు. అయినను స్త్రీ శూలమును ద్రిప్పునప్పుడు శరీరావస్థాన మీవిధముగా నుండు నని వర్ణించుటచే నీ **శ్లోక మవస్థాన మను జాత్యలంకారము**నకు లక్ష్యమని భోజుఁడు వివరించినాఁడు. ఈ శ్లోకము **నాగరచండీశతకప్రతులలో లేదు.** వ్యాఖ్యాతలు గూడ వ్యాకరింపలేదు. దోర్బలవారు వ్యాఖ్యానించినారు. అర్జునదేవవర్మ యమరుశతక రసికసంజీవినీ వ్యాఖ్యలో –

"ఉపనిబద్ధఇ్చ భట్టబాణేనైవంవిధ ఏవ సఙ్గ్రామప్రస్తావే దేవ్యాస్తత్తద్భఙ్గీర్భగవతా భర్గేణ సహ ప్రీతి ప్రతిపాదనాయ బహుధా నర్మ ।" యథా -

శ్లో॥ దృష్టావాసక్తదృష్టిః ప్రథమమివ తథా సమ్ముఖీనాభిముఖ్యే... (53)

అను శ్లోకము నుదాహరించినాఁడు. శార్ఙ్గధరపద్ధతిలోఁ గూడ '**విద్రాణే రుద్రవృన్దే**' (66) అను శ్లోక ముదాహరింపఁబడినది.

సూర్యశతక - చండీశతకములు రెండు **నోజోగుణ గౌడీ రీతి** విలసితములు. శ్లోకము లన్నియు శబ్దానుప్రాస విన్యాస విలాస భాసురములు. మయూరమహాకవి సూర్యశతకము నందలి శ్లోకముల నన్నింటిని స్రగ్ధరా వృత్తములో నడిపినాఁడు. చండీ శతకమునందుఁగూడ భోజుఁడుదాహరించిన '**పాదావష్టంభ**' శ్లోకముతోఁ గలిపి 97 స్రగ్ధరలు గలవు.

'**మ్రభ్నైర్యానాం త్రయేణ త్రిముని యతియుతా స్రగ్ధరా కీర్తితేయమ్**' అని కేదారభట్టు వృత్తరత్నాకరలక్షణము. స్రగ్ధరలోఁ బ్రతిపాదము నందును "మ-ర-భ-న-య-య-య" యను గణము లుండును. స్పర్ధావర్ధిత (25) సద్యస్సాధిత (32) ప్రాక్కామం (37) ప్రాలేయాచల (43) అప్రాప్యేషు (44) బాహూత్క్షేప (72) - ఈ యాఱు శ్లోకములు మాత్రము శార్దూలవిక్రీడితములు.

"**సూర్యాశ్వైర్మసజస్తతాస్సగురవశ్శార్దూలవిక్రీడితమ్**" అని వృత్తరత్నాకరము. శార్దూలములోఁ బ్రతిపాదమునందు 'మ-స-జ-స-త-త-గ' యను గణములుండును.

శయ్య తప్పకుండ నద్భుతవర్ణనములతో స్రగ్ధరాఛందములో శతకమును రచించుట సామాన్య విషయము కాదు. బాణమయూరులకు ముందే పురాణములలోఁ గావ్యములలో నాటకములలో స్రగ్ధర లక్కడక్కడ గలవు. స్రగ్ధరాబద్ధస్తోత్రకావ్యములలో **శ్రీదుర్వాసోమహర్షి** రచించిన '**పరశంభుమహిమ్నస్తోత్రమే**' మిక్కిలి ప్రాచీనమైనది. దీనిలో 120 స్రగ్ధరలు గలవు. శ్రీ శంకర భగవత్పాదాచార్యుల 'శివకేశాదిపాదాంత వర్ణనస్తోత్రము' (29 శ్లో) 'విష్ణుపాదాదికేశాంతస్తోత్రము' (43 శ్లో) మొదలగునవి కూడ స్రగ్ధరాబద్ధములే. కాని కావ్యశైలిలో సంపూర్ణశతకములను రచించి స్రగ్ధరలను బ్రతిష్ఠించి వ్యాప్తి కలిగించిన కీర్తి బాణమయూరుల కిద్దఱకే దక్కినది. ఈ **సూర్యచండీ శతకములను బఠించిన మోహిత-మానసులైన యనంతర కవులు పెక్కుమంది స్రగ్ధరాశతకములను రచించినారు.**

## స్రగ్ధరాశతకములు

రామశతకము - సుదర్శనశతకము - ఆశీర్వాద శతకము - శివశతకము - నారాయణ

శతకము – పూర్ణత్రయీస్తోత్రము – నృసింహశతకము – వ్యాఘ్రాలయ శతకము – ఖడ్గశతకము – శ్రీమన్నృసింహశతకము – చక్రశతకము – సుధాలహరి (30 శ్లోకములు)

**బౌద్ధ సాహిత్యము :** వజ్రదత్తాచార్యుని '**లోకేశ్వర శతకము**', స్వయంభూపురాణాంతర్గతమగు '**కల్యాణపంచవింశతి**', ఆర్యదేవుని '**గండీస్తవము**', అశ్వఘోషుని '**బుద్ధగండీస్తవము**' అజ్ఞాతకర్తృకములగు '**చైత్యనందనాస్తోత్రము**', '**తారాస్రగ్ధరాస్తోత్రము**', '**మంగళాష్టకము**' మొదలగునవి **స్రగ్ధరావృత్త**బద్ధములు.

**జైన సాహిత్యము :** సహజమండనగణి రచించిన '**సీమంధర జిన స్తవనము**' ధర్మశేఖరగణి రచించిన '**జినస్తవము**', అజ్ఞాతకర్తృకములగు '**శ్రీ చక్రేశ్వరీదేవీస్తుతి**', '**ఋషభజినస్తుతి**' మొదలగునవి స్రగ్ధరావృత్త బద్ధములు.

జైన బౌద్ధ సాహిత్యములపైఁ గూడ బాణమయూరులప్రభావ మెక్కువగాఁ గలదు.

## స్రగ్ధరాగ్రంథములు

స్తోత్రములను శతకములను స్రగ్ధరలలో రచించుట యొక యెత్తు. శాస్త్రములను గూడ స్రగ్ధరలలో రచించుట మఱియొక యెత్తు. కవితార్కికసింహులు, సర్వతంత్రస్వతంత్రులు నగు **శ్రీ వేదాంతదేశికులు**, చతురధికశతగ్రంథనిర్మాణచాతురీధురీణులగు **శ్రీమదప్పయ-దీక్షితేంద్రులు** మీమాంసా వేదాంత గ్రంథములను గూడ స్రగ్ధరావృత్తములలో నిబంధించిరి.

**శ్రీవేదాంతదేశికులు**

అధికరణ సారావళి (562 శ్లో)
తత్త్వముక్తాకలాపము (500 శ్లో)
మీమాంసాపాదుక (173 శ్లో)

**శ్రీమదప్పయదీక్షితులు**

విధిరసాయనము (70 శ్లో)
ఆనందలహరి (60 శ్లో)

ఈ విధముగా బాణమయూరుల స్రగ్ధరధాటి యనంతరకవిపండితులచేఁ గదను ద్రొక్కించినది.

చండీశతకము నందలి దేవీపాదవర్ణనమునకు ముగ్ధులై **శ్రీ నారాయణభట్టతిరి** పండితులు '**శ్రీపాదసప్తతి**' ని రచించిరి.

## చండీశతకవ్యాఖ్యలు

'**సత్యం చణ్డీ శతే కాల్యే టీకాస్సన్తి పరశ్శతాః**', ఈ చండీశతకముపై వందల కొలది టీక లున్నవని **కుంభకర్ణనృపతి** వచనము. అవి యన్నియు లుప్త మగుట మన దౌర్భాగ్యము. నేఁడు మూఁడు టీకలు మాత్రమే లభించుచున్నవి.

1. **మహారాణా కుంభకర్ణనృపతి** (15వ శతాబ్దము) : మేవాడ మండలాధీశ్వరుఁడైన కుంభకర్ణ నృపాలుఁడు చండీశతకమునకు విపులమైన వ్యాఖ్యను నిర్మించినాఁడు.

**శ్లో॥ త... దసేవాప్తపరప్రకర్షః శ్రీకుమ్భకర్ణో వసుధామహేన్ద్రః ।**
**బాణప్రణీతే స్తవనే తదీయే టీకాన్తనోత్యాప్తజనస్య తుష్ట్యై ॥**

ఇతఁడు సకలశాస్త్రకోవిదుఁడు. సరసకవితాకుశలుఁడు వ్యాఖ్యానము ప్రౌఢము. పాండిత్య పూర్ణము. ఈ కుంభనృపతి 1. చండీశతకవ్యాఖ్యనే కాక, 2. జయదేవుని గీత గోవిందమునకు '**రసికప్రియా**' వ్యాఖ్యను 3. 'సంగీతరాజ'మను స్వతంత్రగ్రంథమును రచించిన మహాపండితుఁడు.

2. **సంక్షిప్తవ్యాఖ్య** : ఇది యజ్ఞాతకర్తృకము. ఇం దన్వయముఖముగాఁ బ్రతిపదార్థముమాత్రము చెప్పఁబడినది. ఈ రెండు వ్యాఖ్యలతోఁ గలిపి చండీశతకము '**రాజస్థాన పురాతన గ్రంథమాల**' లో 64వ పుష్పముగా 1968లో ఁబ్రకటింపబడినది.

3. **సంగ్రహటిప్పణము** : నిర్ణయసాగరము వారి కావ్యమాల - చతుర్థగుచ్ఛములో సంగ్రహటిప్పణముతో నీ చండీశతకము ప్రచురింపఁబడినది. పండిత దుర్గాప్రసాద ద్వివేదులు సంగ్రహటిప్పణముతో నీ చండీశతకము ప్రచురింపఁబడినది. పండిత దుర్గా ప్రసాద ద్వివేదులు సోమేశ్వరసూనుధనేశ్వరపండితకృతటీకనుండి, యజ్ఞాతకర్తృకటీకనుండి యీ సంగ్రహ టిప్పణము నుద్ధరించిరి.

4. **చండీశతకము** - తెలుఁగు తాత్పర్యము : చండీ శతక ముపోద్ఘాతముతో సంగ్రహతాత్పర్యముతోఁ దెలుఁగులిపిలో మొట్టమొదటి The Sanskrit Academy - Vijayawada వారిచే 1958లో ముద్రింపఁబడినది. (ఇదే యథాతథముగా శ్రీ జి.వి. హరనాథ్ గారిచే సూర్యశతకముతోఁ గలిపి 25-9-1991 నాఁడు వెలువడినది. దీనిలో ముద్రణ దోషములు మెండు.)

## ప్రసాదినీ వ్యాఖ్య

శ్రీచండీశతక - **ప్రసాదినీ వ్యాఖ్య**ను నిర్మించిన పండితపుండరీకులు **శ్రీ దోర్బల విశ్వనాథశర్మ** గారు. సాహిత్యవిద్యా ప్రవీణులు, సంస్కృతాంధ్రపరమపట్టభద్రులు నగు వీరు కవులుగాఁ బండితులుగా నుత్తమవ్యాఖ్యాతలుగా నింతకు ముందే విద్వల్లోకమునకు సుపరిచితులు. దోర్బలవారు రచించిన విపుల వ్యాఖ్యాన గ్రంథములు.

1. మూకపంచశతి - సారోల్లాసినీ వ్యాఖ్య
(ఆర్యా, పాదారవింద, కటాక్ష, స్తుతి, మందస్మిత)

2. హరిమీడేస్తవము - మచర్చికా వ్యాఖ్య
3. పరశంభుమహిమ్నస్తోత్రము - శివప్రియ వ్యాఖ్య
4. అమరుక శతకము - మనసిజ వ్యాఖ్య
5. హలాయుధశివస్తోత్రము - డమరుక వ్యాఖ్య
6. శివమీడేస్తవము - హర్షిణీవ్యాఖ్య
7. చండీశతకము - ప్రసాదినీ వ్యాఖ్య

'చండీశతకము' 'ప్రసాదినీ' వ్యాఖ్య యివి రెండు నన్వర్థనామధేయములు. చండీశతకము నందలి ప్రతిశ్లోకము ప్రతిపదము కొఱుక రాని కొయ్యలు. బాణభారతిని సులభముగా నన్వయించుట కొమ్ములు తిరిగిన పండితులకే కష్టసాధ్యము. అందును రణరంగములో మహిషాసురవధోద్యమములో మిక్కిలి కోపనురాలైన చండిని సమీపించుటయే దుర్ఘటము. ఆ యమ్మవారి నీ స్తోత్రముతోఁ బ్రసన్నురాలిని జేసికొని యనుగ్రహప్రసాదమును బొందుట కీ ప్రసాదినీ వ్యాఖ్య యవతరించినది.

**శ్లో॥ పదచ్ఛేదః పదార్థోక్తిర్విగ్రహో వాక్యయోజనా ।**
**ఆక్షేపశ్చ సమాధానం వ్యాఖ్యానం షడ్విధమ్ మతమ్ ॥**

అను లక్షణమున కనుగుణముగా మల్లినాథపద్ధతిలో నీ వ్యాఖ్య సాగినది. ప్రతిశ్లోకమునకు ముం దవతారికలో శ్లోకములోని భావము తరువాతి శ్లోకములో సంగతి తెలుపఁబడినవి. పిమ్మటఁ బ్రతిపదమునకు నర్థములు చెప్పఁబడినవి. పిదపఁ దాత్పర్యము గలదు. ఆ తరువాత వివరణములో శ్లోకములోని విశేషములు, శాస్త్రవిషయములు, నలంకారములు వివరింపఁబడినవి. ఇట్లీ వ్యాఖ్య యొక వంక సాహిత్యవిద్యార్థులకు, మఱొక్కవంకఁ బండిత-ప్రకాండులకుఁ గూడ నుత్పత్తిదాయినిగా నున్నది.

1. ప్రథమశ్లోకవ్యాఖ్యయందే "**యమ్మవారు మూలప్రకృతి. ఆమె బ్రహ్మమే**" యని **వేదాంతరహస్యము** వెల్లడింపఁబడినది.

'చడి - కోపే' యను ధాతువునుండి చండీ శబ్ద మేర్పడిన దని వ్యాకరణశాస్త్రము చూపఁబడినది.

2. ఆఱవ శ్లోకములో '**శశ్వద్విశ్వోపకారప్రకృతిరవికృతిః**' అను దానిని 'మూలప్రకృతిరవికృతి-ర్మహదాద్యాః ప్రకృతివికృతయః సప్త' అను నీశ్వరకృష్ణుని సాంఖ్యకారికతో నన్వయించి **సాంఖ్యదర్శన సిద్ధాంతము** ప్రతిపాదింపఁబడినది.

3. తొమ్మిదవ శ్లోకములో 'లోకపాలాః' అను ప్రతీకను గైకొని **యష్టదిక్పాలకులనుగూర్చి** చెప్పుట ముచ్చటగా నున్నది.

4. పదునొకొండవ శ్లోకములో – 'నీ శ్లోకమున రూపకాపహ్నావ గర్భితమైన యుత్ప్రేక్షా-లంకార మున్నది... గోళ్ళనుకొనక పోయినను ననుకొన్నట్లు చెప్పుటచే నతిశయోక్తి... '**నఖశశిమణిభిః**' అను సమాసమున రూపకాలంకార మున్నది. అవి రెండు నుత్ప్రేక్షా-లంకారమున కంగములే యైనవి' అని **యలంకార నిరూపణము** గలదు. ఇట్లే యన్ని శ్లోకములందు నలంకార సమన్వయము కలదు.

5. 14–47 శ్లోకములలో 'హ్రీమతీ' యను ప్రతీకను గైకొని **పంచదశీ మహామంత్ర రహస్య** ముగ్గడింపఁబడినది. ఇది దోర్బలవారి మంత్రశాస్త్రప్రావీణ్యమునకుఁ జక్కని యుదాహరణము.

6. 42వ శ్లోకములోఁ గంసుడు రాక్షసుఁడెట్లయ్యెనో తెలుపఁబడినది. 67వ శ్లోకములో వినాయకుఁ డేకదంతుఁ డగుటకు గల వివిధపురాణకథలు నొకే వాక్యములో జ్ఞాపకము చేయఁబడినవి.

7. 49వ శ్లోకములో – '**అమృతభు**' క్పదమును గైకొని 'యమృతం నామ' (శిశు–2–107) అను మాఘుని **శిశుపాలవధ** శ్లోకముతో నన్వయించి యజ్ఞహవిస్సమృతముకంటె గొప్పదని నిరూపించుట దోర్బలవారి వివిధ **కావ్యసూక్ష్మేక్షికకు, నధ్వరమీమాంసా శ్రద్ధకు** నిదర్శనము.

8. 53వ శ్లోకము – "**ప్రథమమివ**" "**పూర్వవత్**" అనునవి దాదాపేకార్థములే కావున నొకటి యనావశ్యక మని యంగీకరింపక తప్పదేమో యనిపించుచున్న దను వాక్యము వ్యాఖ్యాతృ స్వాతంత్ర్యము నుద్ఘోషించుచున్నది.

సంస్కృతవ్యాఖ్యాతలు 'పశుపతి' శబ్దమునకు శివుఁడని మహిషాసురుఁడని రెండర్థములు చెప్పి యీ శ్లోకమును శివపరముగా మహిషపరముగా రెండు విధముల వ్యాఖ్యానించినారు. 'ప్రథమమివ తథా' యను దానికిఁ 'గృతముఖవికృతిః' అను పాఠాంతరము చూపఁబడినది. కుంభనృపతి 'కృతముఖవికృతిః' అను పాఠమునే గైకొనినాఁడు.

9. 70వ శ్లోకములో '**సముదమపి**' – '**సమదమపి**' యను పాఠాంతర వ్యాఖ్యానము దోర్బలవారి వివిధ పాఠపరిశీలన పాటవమును నిరూపించుచున్నది.

10. 70–78 శ్లోకములలో మహిషుని వచనములలో రసాభాసమే కాని రసము లేదని యాలంకారిక సిద్ధాంతము ధ్రువీకరింపఁబడినది. మహిషాసురుని వచనములు విరసములే కాని సరసములు గావు. ఈ విధముగాఁ బ్రసాదినీ వ్యాఖ్యలో నడుగడుగున విశేషములు పొడచూపుచునే యుండును. వానిని బాఠకులే గ్రహింపఁగలరు.

శ్రీ చణ్డీదేవి పదపాతము గంగాజలపాతము. పాపములను బ్రక్షాళన మొనరించును. బాణ పదపాతము యమునా ప్రవాహము. రసతరంగములలో నోలలాడించును. ప్రసాదిని యంతర్వాహిని యగు సరస్వతి. సారస్వతసుధాసముద్రమునకుఁ గొంపోవును. **ఈ త్రివేణీ సంగమములో మునిఁగిన వారికిఁ బార్వతీపరమేశ్వరానుగ్రహము తప్పక లభించును.**

ఈ పుణ్యగ్రంథమును బ్రకటించి వెలుఁగులోనికి ఁదెచ్చిన వారు **శ్రీ రావి మోహనరావు** గారు. ఈ కరాళకలి కాలములోఁ బురాతనసంస్కృతాంధ్రగ్రంథములను వీరు వెలికిఁదెచ్చుట మిక్కిలి హర్షదాయకమగు విషయము. ఆయురారోగ్యభాగ్యములు ప్రసాదించి వీరిచే నితోధికవాణీవరివస్య చేయించు గాక యని మహాకాళీ – మహాలక్ష్మీ – మహాసరస్వతీ స్వరూపుణియైన శ్రీ చణ్డీదేవిని వేడుకొనుచు నీ పీఠిక నింతటితో ముగించుచున్నాను. స్వస్తి.

**తే.గీ. బాణ చండీ శతగ్రంథ వాణిఁ గొలుతు**
**శ్రీప్రసాదినీ వ్యాఖ్యాన రీతిఁ దలఁతు**
**సఖుఁడు మోహను పుస్తకాసక్తి దెలఁతు**
**గ్రంథము పఠింపఁ బాఠకాగ్రణులఁ బిలుతు.**

శ్రీపరమేశ్వరార్పణమస్తు!

**– గరిమెళ్ళ సోమయాజులు శర్మ**

**శ్రీః**

# ఉపోద్ఘాతము

శ్రీచణ్డీశతకము బాణకృతముగా ప్రసిద్ధమై యున్నది. శతకములను పేరులేని శంకరాచార్యాది కృతములైన శివానందలహరీ, సౌందర్యలహర్యాదులెన్నో యున్నవి. అవన్నియు స్తోత్రకావ్యములే. శతకములను పేరున్న కావ్యములలో పెక్కులు స్తోత్ర కావ్యములే. సుభాషితత్రిశతిలో మూఁడు శతకము లున్నవి. శ్రీకృష్ణకర్ణామృతమున మూఁడు శతకము-లున్నవి. అందు మొదటిది మాత్రమే లీలాశుకవిరచితమని విమర్శకుల అభిప్రాయము.

మయూరుని సూర్యశతకము, బాణుని చండీశతకము భావము భాష రీతి మొదలగు సాహిత్యాంగములలో ప్రశంసనీయతను కలిగియున్నవి. చండీశతక రచనము ననుసరించి బాణుని శాక్తేయత నిర్వివాదము. శాక్తేయమున బహువిధస్త్రీదేవతల (సంప్రదాయభేదమున) పారమ్యములు భిన్నభిన్నములుగా నున్నవి. వానిలో శ్రీలలితాపారమ్యమును అంగీకరించు సంప్రదాయము దక్షిణదేశమున బలీయమై యున్నది. ఉత్తరదేశమున **చండీసంప్రదాయము**, వంగదేశమున **కాలీసంప్రదాయము** బలీయములై యున్నవి.

చడి కోపే అను ధాతువునుండి పుట్టిన చండీ శబ్దము యుద్ధదేవతగా ఆరాధింపఁబడి యున్నట్లు నేటికిని మిగిలిన మహానవమి, విజయదశములలో చేయబడు ఆయుధపూజ ప్రబల వాడుకలో ఉన్నది. సప్తశతిలో దుర్గానామమున కన్న చణ్డీ లేక చణ్డికా శబ్దమే బహువారావృత్తమై యున్నది. మహాకాలీ, మహాలక్ష్మీ, మహాసరస్వతులు శరన్నవరాత్రులలో చణ్డికా రూపములుగా ఆరాధింపబడుచున్నారు.

శక్తి సగుణమాయగా, శివుడు నిర్గుణబ్రహ్మకు ప్రతీకముగా ఉపాసింపబడు సంప్రదాయము శాక్తేయసంప్రదాయ సామాన్యముగా నున్నను శక్తి చిచ్ఛక్తిరూపిణిగాను, నిర్గుణబ్రహ్మరూపిణిగా, శివాభిన్నగా ఉపాసింపబడుట కూడ సామాన్యముగానే ఉన్నది. ఈ సంప్రదాయము శివుడు శక్తికి భర్తగా కించిదాధిక్యమును పొంది యుండుటను సహించును. ఈ శాక్తేయమునకన్న కించిద్భిన్నముగా కూడ ఈ శతకమున చండి స్తుతింపబడినది. శివుడు చణ్డికి భర్తగా నున్నను ఇతర దేవతలవలె పారిపోవుట, అమ్మవారు స్వయముగా కూడ పరిహసించుట ఈ స్తోత్రమున పలుమార్లు కానవచ్చును. ఇంతవఱకు నేను చూచిన ఏ శాక్తేయస్తోత్రము నందును ఈ పద్ధతి కనిపించదు. నా దృష్టిలో ఈ చణ్డీ స్తుతి ఈ వైశిష్ట్యము కలిగి యున్నదిది యొక్కటే. శ్రీ లలితాసహస్రనామస్తోత్రమున శివుడు

దూతగా కలవాడు అను అర్థమున నొక నామమున్నది. సప్తశతియందు శివదౌత్యము వర్ణింపబడినది. అయినను శివుడు యుద్ధమునుండి పారిపోవుట అనునది ఆ లలితోపాఖ్యాన చణ్డిసప్తశతీ గ్రంథములలో చెప్పబడలేదు.

చణ్డి మహిషుని ఆయుధములతో చంపుట, ఒక శ్లోకమున కత్తితో, మరొక శ్లోకమున బాణముతో, మరొక శ్లోకమున శూలముతో చంపినట్లీ స్తోత్రమున నున్నది. పెక్కు శ్లోకములలో అమ్మవారు పాదముతోడనే వానిని మర్దించి నట్లున్నది. ఈ భేదమును కల్పభేదపురస్కృతముగా భావించి నిర్విరోధిత సంపాదింపవచ్చును. కొన్ని శ్లోకముల మడమ, కొన్ని శ్లోకముల పాదము మహిషమర్దనముగా చెప్పబడుటయు సమన్వయించుకొనుట కెక్కువ ఇబ్బంది లేదు. సప్తశతియందు శూలమున పొడిచి అర్ధ నిష్కృతుడైన మహిషుని కత్తితో చంపినట్లున్నది. అమ్మవారికి నర్మసఖిగా జయ శివుని పరిహసించుట అనుచితముగా ఈ స్తోత్రమున భావింపబడలేదు. కొన్ని శ్లోకములలో మహిష సమకక్షముగా శివపరిహాస మున్నది.

బాణమహాకవి మహిషు నంధకారప్రతీకగా, అమ్మవారిని ప్రకాశప్రతీకముగా భావించినుట్లు కొన్ని శ్లోకములందు వ్యంజింపబడి యున్నది. దాదాపు అన్ని శ్లోకము లందును బాణమహాకవి లోకక్షేమమును కాంక్షించి అమ్మ వారు మిమ్ము రక్షించుగాక అనియే ఆశించినాడు. భావుకులే (పాఠకులే) 'వః' అను పదమున కర్థము కావున వారిని కాపాడుగాక అని కవి కోరుట కవికన్న భావుకులకున్న స్థానము గొప్పది అని కవి భావించుట స్పష్ట మొనర్చును.

ఈ స్తుతియందు పెక్కు శ్లోకములలో అర్థాలంకారములున్నవి. కొన్ని శ్లోకములలో ముఖ్యముగా తోచిన అర్థాలంకారములను నా వ్యాఖ్యలో పేర్కొని యున్నాను. దాదాపు అన్ని శ్లోకములందును వృత్త్యనుప్రాసాలంకారము లుండుటచే ఈ స్తుతియందు అక్షర రమ్యత ఉన్నదని భావించెదను. కొన్ని శ్లోకములలో యమకము కానవచ్చును. అరుదుగా లటానుప్రాసము కూడ నున్నది. కొన్ని శ్లోకములలో దాక్షిణాత్యమైన యత్యనంతరాక్షరమున ప్రథమాక్షరము తోడి వర్ణమైత్రి కనిపించును. ఈ అలంకారములు సహజ సుందరములుగా నున్నవి. కాదంబరిలోని భాషా భావలాలిత్యముల దృష్టితో నీ శతకమును పోల్చి చూడవలసి వచ్చినచో ఈ చణ్డీ శతకము ప్రౌఢతరమని చెప్పనగును. విజ్ఞులును ఈ చణ్డీశతక ప్రసాదినీ వ్యాఖ్యను ఆస్వాదించెదరు గాక!

ఇట్లు

రామాయంపేట,

**దోర్బల విశ్వనాథశర్మ**

ప్రమాథి మహాశివరాత్రి

# శ్రీః

## మహాకవి శ్రీబాణభట్టవిరచితమ్

# శ్రీచణ్డీశతకమ్

## (ప్రతిపదార్థ-తాత్పర్య-విపులవివరణ)

## ప్రసాదినీవ్యాఖ్యా - దోర్బల విశ్వనాథశర్మ

అజ్ఞానమృగమును చంపు అమ్మవారి చేతిలోని బాణములలోని ఒక బాణమే బాణమహాకవిగా అవతరించినాడేమో యని అనిపించగల అనన్యాదృశప్రతిభావ్యుత్పత్త్యభ్యాసములు కల మహాకవి బాణుడు. అజ్ఞానమహిషవధార్థ మవతరించిన బ్రహ్మమేయగు చణ్డి మహిషాసురుని వధించినది. ఆ విషయమును గుర్తించక ఇంకను వానిపై కోపముతో ఆమె బొమలు ముడివడి యున్నవి. అధర మదరుచున్నది. ముఖమింకను ఎఱ్ఱబారియే యున్నది. చేయి త్రిశూలమును త్రిప్పుచునే యున్నది. ఇట్టి అవయవములను సంబోధించి అవయవి(ని) అగు అమ్మవారు వానిని స్పష్టపరచుచు ఇట్లన్నట్లు కవి చెప్పుచున్నాడు.

**శ్లో॥ మా భాఙ్క్షీర్విభ్రమం భ్రూరధర! విధురతా కేయమస్యాస్య! రాగం**
**పాణే! ప్రాణ్యేవ నాయం కలయసి కలహశ్రద్ధయా కిం త్రిశూలమ్ ।**
**ఇత్యుద్యత్కోపహేతూన్ప్రకృతిమవయవాన్ప్రాపయన్త్యేవ దేవ్యా**
**న్యస్తో వో మూర్ధ్ని ముష్యన్మరుదసుహృదసూన్సంహరత్వఙ్ఘ్రిరంహః ॥ 1**

**ప్రతిపదార్థము :** భ్రూః! = ఓ కనుబొమ్మా!, విభ్రమమ్ = విలాసమును, మా భాంక్షీః = విఱువకుము, అధర! = ఓ క్రింది పెదవీ, ఇయమ్ = ఈ, విధురతా = అదరు, కా = ఎట్టిది?, ఆస్య! = ఓ ముఖమా!, రాగమ్ = ఎఱుపుగల దానివై, అసి కిమ్ = ఉన్నా వేమి?, పాణే! = ఓ హస్తమా!, కలహశ్రద్ధయా = యుద్ధ మందలి ఆసక్తిచేత, త్రిశూలమ్ = త్రిశూలమును, కలయసి కిమ్ = పట్టుకొన్నావేమి? లేక త్రిప్పు చున్నావేమి?, అయమ్ = వీడు, ప్రాణీ = ప్రాణములు కలవాడు(గా), న ఏవ (అస్తి) = లేనే లేడు, ఇతి = అని, ఉద్యత్కోపహేతూన్ = ఉదయించు కోపముయొక్క చిహ్నములను కలిగియున్న, అవయవాన్ = అవయవములను, ప్రకృతిమ్ = తొలుత ఉన్న స్థితిని, ప్రాపయంత్యా ఇవ = పొందించుచున్నదో అన్నట్లున్న, దేవ్యా = దేవిచేత, మూర్ధ్ని = తలపై, న్యస్తః

= పెట్టబడి, మరుదసుహృదసూన్ = దేవతా శత్రువు (మహిషుని) యొక్క ప్రాణములను, ముష్ణన్ = దొంగిలించుచున్న, అంఘ్రిః = పాదము, వః = మీ యొక్క, అంహః = పాపమును, సంహరతు = సంహరించుగాక!.

**తాత్పర్యము :** ఓ కనుబొమ్మా! విఱచి విలాసమును చెఱచకుము, అధరమా! ఈ అదరు పాటేల? ఓ ముఖమా! నీ యందేమి ఈ ఎఱుపు! ఓ హస్తమా! త్రిశూలమును ధరించి త్రిప్పుచున్నావేమి? ఈ మహిషాసురుడు ప్రాణములు లేనివాడే అయి యున్నాడు. ఎవరితో యుద్ధము చేయుటకు శ్రద్ధబూని యున్నావు అని కోపమును చూపు చిహ్నములను ప్రదర్శించు తన అవయవములను యథాస్థితములనుగా చేయఁబూనినదేమో యన్నట్లున్న దేవిచేత మహిషుని తలపై పెట్టబడిన పాదము వాని ప్రాణములను దొంగిలించుచు మీ పాపములను సంహరించుగాక!

**వివరణము :** అమ్మవారు మూలప్రకృతి. మహదహంకార పంచతన్మాత్ర పంచభూతాది రూపమున వికృతిని బొంది బ్రహ్మాండదేహము కలదిగా రూపొందినది. ఆమె అధిష్ఠానము ఆత్మ లేక బ్రహ్మమే. అది స్థూలవ్యష్టిదేహమునం దహంభావము నొంది **విశ్వుడ**ని, స్థూలసమష్టిదేహమునం దహంభావము నొంది **వైశ్వానరుడ**ని, సూక్ష్మవ్యష్టిదేహమునం దహంభావము నొంది **హిరణ్యగర్భుడ**ని, కారణవ్యష్టి-దేహమునం దహంభావము నొంది **ప్రాజ్ఞుడ**ని, కారణసమష్టిదేహమునం దహంభావము నొంది **అవ్యాకృతుడ**ని, వ్యష్టిదేహత్రయమునం దహంభావము నొంది **జీవుడ**ని, సమష్టిదేహత్రయమునం దహంభావము నొంది **ఈశ్వరుడ**ని సంజ్ఞలను పొందినది. వైశ్వానర హిరణ్యగర్భావ్యాకృతులకు జగత్కారణత్వ ముండుటే ఈశ్వరత్వము, అదిలేని విశ్వతైజసప్రాజ్ఞులకు జీవభావము వ్యవహారసిద్ధములైనవి. లోకమున సంతానహేతువునకు స్త్రీ పుం భావములు, మాతా- పితృత్వములు సిద్ధములైనట్లే జగత్కారణేశ్వరునికి స్త్రీపుంభావము లేర్పడి జగన్మాతా పితృత్వములు వ్యవహారసిద్ధములైనవి. కోపించిన స్త్రీ చండి అని లోకమున పిలువబడును. అట్లే జగత్సంహారక-తమోగుణోపాధికుడైన ఈశ్వరుని భార్యగా లోకమునకు జననియైన అమ్మవారును స్త్రీ భావమును వహించినందున చండియని వ్యవహరింపబడినది. చడి (కోపే) అను ధాతువునుండి చండీ శబ్దమేర్పడినది. సంహరించవలెనన్న కోపమవశ్యముగా స్వీకరింపవలసినదే గదా! మహిషాసురుడు తపోబలమున పురుషావధ్యత్వమును వరముగా పొందుటచే వానిని సంహరించుట కమ్మవారు ఏకీభూతమైన దేవతల తేజమునుండి చండిగా నవతరించినది. ఇత్యాది కథాంశము దేవీభాగవత, సప్తశత్యాది గ్రంథములలో విపులముగా వర్ణించబడి యున్నది. దాని యందు ఆమె శూలపాణి యనుట ప్రసిద్ధము. ఆమె జగన్మోహకసౌందర్యముతో నొప్పి యుండుటయు ప్రసిద్ధమే. ఆమె సౌందర్యము శివైకవేద్యమే అయినను మహిషాద్యజ్ఞానులకు మోహకము భ్రామకమగుటలో వింతలేదు. శివుడు శృంగారనాయకుడు. అమ్మవారు శృంగారనాయిక. ప్రణయకోపపరవశ అయినప్పుడెన్ని సార్లు శివుడు కనుబొమ్మల నేల ముడి వేయుదువు. నీకు ముక్కు (ముఖ్యశబ్ద భవము) మీదనే కోపము అందుచేత నీ ముఖమంతయు నెఱ్ఱబడినది. ఆ పెదవి ముఖ్యముగా క్రింది పెదవి మిక్కిలి ఎఱ్ఱబడినది. అనలేదు. గంగను నెత్తిమీద ధరించుట జూచి సహింపలేక

ఆమె ఈ కోపమును పొందినది. శివుడామెను ప్రసన్నము చేసికొనుటకు నీ వింత చండివైనావేమి అనినాడు. అప్పటి ఆ కోపస్థితి మారి శివుని యెడ ప్రసన్నురాలైనను శివునిచేతను ఎల్లప్పుడు అట్లు పిలవ బడుటయే ఆమె కిష్టము. ప్రియుడు ముద్దుగా పెట్టిన పేరు గావున ఇతరు లాపేరున పిలచినప్పుడు ఆ ప్రణయకలహమే జ్ఞప్తికి వచ్చి సంతోషము కలుగుచుండును. అందుచేత భక్తులు ఆ పేరున స్తుతించినప్పుడామె వారిపై మిక్కిలి అనుగ్రహము కలది యగును. అందుచేత భక్తుడైన బాణుడు భక్తితో చేయబడిన ఈ స్తుతి కావ్యము (శతకము) నకు **చండీశతకము**నియే పేరుంచి యుండ వచ్చును. శివునిపై కోపము కలిగినప్పుడామె పెదవి అదరుచుండును. ఏదియో అనబోవును. కాని ఉచితము కాదేమోనన్న భావముచేతను కోపముయొక్క తీవ్రతచేత మాట లోననే ఆగుటచే పెదవికి అదరుపాటు కలుగును. తల్లికి బిడ్డపై కూడ అల్లరి లేక తప్పు చేసినప్పుడు కోపము కలుగును. అప్పుడును భర్త తన ప్రణయకోపసందర్భమున అన్న మాటలు జ్ఞప్తికి వచ్చును. మహిషాసురుడు తనకు సోదరులైన దేవతలకు హాని చేసినాడు. అప్పుడమ్మ వారికి కోపము కలిగినది. అప్పుడు శివుడు ప్రణయకలహసందర్భమున అన్నమాటలే జ్ఞప్తికి వచ్చి కనుబొమ్మా! విలాసము చెడునట్లు విఱువకుము. ఓ పెదవీ, నీకీ అదరుపాటేమి, ఓ ముఖమా, నీకీ రాగ మేలనే, అన్నది. ప్రస్తుతసందర్భము మహిషునిపై పాదము మోపబోవు నప్పటిది. వాస్తవమున కీ మాటలన్నియు కవి యన్నవే. అమ్మవారు తన అవయవముల నన్నట్లు కవి కల్పించినాడు. అవయవములకు పూర్వస్థితి కల్పించుట కేమో అన్నట్లు సంభావింపబడుటచే **ఉత్ప్రేక్షాలంకార** మిట చోటు చేసికొన్నది. దేవి ఈ మాట లన్నదను కొందము. ఎప్పుడు, వాని తలపై పాదము పెట్టిన పిమ్మటనా? ముందా? ముష్యన్ అను వర్తమానార్థకశతృప్రత్యయాంతశబ్దము ప్రయోగింపబడినందున ఈ మాటలనుట, వాని తలపై (ఎడమ) పాదము మోపుట అను రెండు క్రియలు ఏక కాలికములని తెలియుచున్నది. కాని అమ్మవారు పాదము మోపుట వాని ప్రాణములు పోవుట ఒకసారియే జరిగినవి. కాని వాని ప్రాణము పోయిన పిదపనే అమ్మవారా మాటల నన్నది. అల్పకాలభేదము పరిగణింపబడక ఏకకాలికము లన్నట్లు చెప్పబడినది. ఇంతేకాదు ఉద్యత్ అను మరొక శతృప్రత్యయాంతమున్నది. కోపలక్షణములు కలుగుట వాడు చచ్చిన పిదపను అనువృత్తమగుట నా ప్రత్యయము తెలుపును. ఇక్కడను స్వల్పకాలభేదము గణింపబడక కోపప్రాదుర్భావమహిషహననములు ఏకకాలికములన్నట్లు చెప్పబడినది. ఇట్టి ప్రయోగ **మతిశయోక్త్యలంకారచ్ఛాయ**ను సూచించును. ఇట్లు తన అవయవములను తాను సంబోధించుటచే అమ్మవారి యొక్క దేహాతిరిక్తాత్మజ్ఞానము కలిమి ధ్వనించుచున్నది. ఇక్కడ మరొక ప్రశ్న మున్నది. అమ్మవారు తన అవయవములను సంబోధించి వానితో వాని లక్షణములను వీడి ప్రకృతి భావము నొందుమని కోరుచున్నది గదా! అయితే ఆమె ముఖములో కనుబొమ, పెదవి మొదలగు వాని చిహ్నము లెట్లు ఆమెకు కనబడినవి? బహుశః ఈ కోపచిహ్నములు నేను (స్ఫటిక దర్శనుడైన శివుడు) నిమిత్తముగా కలిగినవే కావచ్చును. శివుడామెను ప్రసన్నము చేసికొనుటకు పాదముల కడ వంగినాడేమో, ఆయన శుద్ధస్ఫటికమూర్తి కదా. ఆయన అవయవములను తన అవయవముల

ప్రతిబింబములను చూచి తన అవయముల లక్షణములు తెలిసికొని యుండవచ్చును. లేదా మహిషాసురుని వధించి తమ ఆపదలను పోగొట్టినందుకు వచ్చి పాదములకు నమస్కరించు చున్న దేవతల కిరీటములలోని మణులలోను అమ్మవారికి ఆమె అవయవములు ప్రతిబింబములు కనబడి యుండవచ్చును. అప్పుడామె తన అవయవములలోని కోపచిహ్నములను తెలిసికొని యుండవచ్చును. మొదటి పాదమున భ, రేఫల ఆవృత్తి; నాలుగవ పాదమున మ, రేఫల ఆవృత్తి శ్లోకమున అనుప్రాసాలంకార శోభను, మరుదసుహృదసూన్ అను పదబంధమున **అసు** శబ్దము యొక్క ఆవృత్తి యమకాలంకారశోభను కలిగించుచున్నవి. అసుహృత్ అనగా స్నేహితుడు కాని వాడు, మంచి హృదయము లేనివాడు అని అర్థము. మరుత్ అనగా వాయువు అని మరొక అర్థము. వాయువుయొక్క ప్రాణవాయువునే అపహరించువాడని మరుచ్ఛబ్దము శ్లేషద్వారమున వ్యంజింపఁజేయుచున్నది. మ ర భ న య య మ అను గణములుండుటచే నీ శ్లోకము **స్రగ్ధరా వృత్తము. ముండస్రగ్ధర యగు చండి నీ వృత్తముతో స్తుతించుట యుచితముగా నున్నది.** *

**అవతారిక :** పై శ్లోకమున ఆస్యరాగప్రసక్తి వచ్చినది. ఈ శ్లోకమున మహిషాసురుని కొమ్ములు విరుగుటచే రక్తము కారుచుండగా దాని యందు అమ్మవారు **పాదమునందలి అలక్తకరాగ భ్రాంతి** నొందినట్లు చెప్పబడుచున్నది.

**శ్లో॥ హుఙ్కారే న్యక్కృతోదన్వతి మహతి జితే శిఞ్జితైర్నూపురస్య**
**శ్లిష్యచ్ఛృఙ్గక్షతేఽపి క్షరదసృజి నిజాలక్తకభ్రాన్తిభాజి ।**
**స్కన్ధే విన్ధ్యాద్రిబుద్ధ్యా నికషతి మహిషస్యాహితోఽసూనహార్షీ-**
**దజ్ఞానాదేవ యస్యాశ్చరణ ఇతి శివం సా శివా వః కరోతు ॥ 2**

**ప్ర :** మహతి = గొప్పదైన, న్యక్కృతోదన్వతి = తిరస్కరింపబడిన సముద్రము (ఘోష)గల, హుంకారే = హుంకారము, నూపురస్య = అందెయొక్క, శింజితైః = ధ్వనులచేత, జితే = జయింపబడగా, క్షరదసృజి = కారుచున్న రక్తము గల, శ్లిష్యచ్ఛృంగక్షతే అపి = తగుల్కొనియున్న కొమ్ములు గాయము నందును, నిజాలక్తకభ్రాంతిభాజి = తన లత్తుకయను భ్రాంతిని పొందగా, మహిషస్య = మహిషుని యొక్క, స్కంధే = మూపునందు, వింధ్యాద్రిబుద్ధ్యా = వింధ్యపర్వతభ్రాంతితో, నికషతి = రాచుకొను చుండగా, ఆహితః ఇతి = ఉంచబడినది అని, యస్యాః = ఏ దేవియొక్క, చరణః = పాదము, అజ్ఞానాత్ ఏవ = అజ్ఞానము వలననే, అసూన్ = (మహిషుని) ప్రాణములను, అహార్షీత్ = అపహరించెనో, సా = ఆ, శివా = అమ్మవారు, వః = మీకు, శివమ్ = మంగళమును, కరోతు = చేయుగాక.

**తా :** మహిషుని హుంకారము సముద్రపుహోరును ధిక్కరించు నట్లుండెను. దాని నమ్మవారి పాదనూపురశింజితము జయించెను. ఆ నూపురమున చిక్కుకొనిన మహిషాసురుని కొమ్ము విరిగి గాయమై రక్తము కారుచుండగా అమ్మవారా రక్తమును తన పాదగతమైన లత్తుకగానే భ్రమించెను. వింధ్యాద్రి అనుకొని మహిషుని మూపుపై అమ్మవారు పాదము నుంచగా ఆమెకు తెలియకుండగనే వాని ప్రాణములు పోయెను. అట్టి **శివ మీకు మంగళము కలిగించుగాక!**

**వి :** అమ్మవారిని చూచి మహిషుడు హుంకరించెను. కాని ఆమె కాలి అందె చప్పుడులో కలిసిపోయి ఆమెకు వాని హుంకారము వినిపించలేదు. అమ్మవారి నూపురములో వాని కొమ్ము తగుల్కొని విఱిగి రక్తము కారుచున్నను అది తన లత్తుకవలె ఎఱ్ఱగా నుండుటచే అమ్మవారు గుర్తించలేదు. పర్వతరాజపుత్త్రికయైన ఆమె ప్రాణములు గల పర్వతమో అన్నట్లున్నది. తన తండ్రికన్న ఎత్తుగా నున్నాడని వింధ్యుని శిఖరముపై పాదము మోపి వాని శృంగభంగము చేయదలచిన దేమో, ఇంతలో మహిషుని మూపు తన ఎదుట ఎత్తుగా కనబడెను. ఇంకేమి అదియే వింధ్యాద్రి శిఖర మనుకొని పాదము మోపెను. ఆ సందర్భముననే వాని కొమ్ము ఆమె నూపురమున తగుల్కొని యుండుట నామె గమనించలేదు. వాని ప్రాణము పోయెను. దేవతల కోరిక తీరెను. అప్రయత్నముగా వైలక్ష్యముగా అనుకొనకుండగనే అమ్మవారు పాదము మోపుట, వాని ప్రాణము లెగిరి పోవుట సంభవించినవి, అని అమ్మవారు తెలిసి వానిపై పాదము మోపినను కవి తెలియకుండగనే ఆ పని చేసినట్లుత్ప్రేక్షించినాడు. వాని కొమ్ము విరిగి గాయమున రక్తము కారుచుండగా తన పాదము నందలి లత్తుకగానే భ్రమించినదని అమ్మవారి యందు భ్రాంతిని కల్పించినాడు. అజ్ఞానము వలన భ్రాంతి కలుగుట లోకసిద్ధము. కావున అమ్మవారి కజ్ఞానమున్నదని కల్పించుటలో నీ భ్రాంతి తోడ్పడినది. మూపునందు వింధ్యాద్రి బుద్ధి కూడ భ్రాంతియే. అదియు తోడ్పడినది. కావున ఈ శ్లోకమున **భ్రాంతిమదలంకారము**, తన్మూలమైన **అజ్ఞానోత్ప్రేక్షాలంకారము**ను ఈ శ్లోకమున స్ఫురించుచున్నవి. అమ్మవారు వింధ్యవాసినిగా ప్రసిద్ధురాలు. ఆ పర్వతమామె నివాసము. తన నివాసమున కాలు మోపినంత సులభముగా మహిషుని మూపున కాలు మోపినది. తన నివాసము నందు తనకు ద్వేషముండుట సంభవింపదు. కావున తేలికగా విలాసముగా అడుగు మోపినది. అంత మాత్రమునకే వాడు చచ్చుట వాని మశకతుల్యతను స్ఫురింపజేయును. బ్రహ్మాండమే దేహముగా గల ఆమెకు వాడెంత ఎత్తున్నను ఆమె దృష్టిలో వాడు మశకమే. వాని హుంకారము కూడ మశకధ్వనివలె ఆ అమ్మవారి పాదనూపురశింజితములో మునిగిపోయి ఉండుటచే అమ్మవారికి వినబడకపోవుట స్వాభావికముగానే వున్నది. ఉదన్వతి మహతి అసృజిభాజి అనుచోట్ల **పదాంతానుప్రాస** మున్నది. *

**అ :** పై శ్లోకమున అమ్మవారిది రక్తమందలి అలక్తక భ్రాంతి యని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ **అలక్తకము మహిషునినుండి పిండఁబడినదే** అని చెప్పబడుచున్నది.

**శ్లో॥ జాహ్నవ్యా యా న జాతాఽనునయపరహరక్షిప్తయా క్షాలయన్త్యా**
**నూనం నో నూపురేణ గ్లపితశశిరుచా జ్యోత్స్నయా వా నఖానామ్ ।**
**తాం శోభామాదధానా జయతి నవమివాలక్తకం పీడయిత్వా**
**పాదేనైవ క్షిపన్తీ మహిషమసురసాదాననిష్కార్యమార్యా ॥ 3**

**ప్ర :** అనునయపరహరక్షిప్తయా = ఊరడించబూనిన, హరునిచే చల్లబడిన, క్షాలయన్త్యా = కడుగుచున్న, జాహ్నవ్యా = గంగచేత, యా = ఏది, న జాతా = కలుగలేదో, నూనమ్ =

నిశ్చయముగా, గ్లపితశశిరుచా = తిరస్కరింపబడిన చంద్రకాంతిగల, నూపురేణ = అందెతో, నఖానామ్ = గోళ్ళయొక్క జ్యోత్స్నయా వా = వెన్నెలచేతగాని, యా = ఏది, నో = కలుగలేదో, తామ్ = ఆ, శోభామ్ = శోభను, ఆదధానా = స్వీకరించుచున్నదై, నవమ్ = క్రొత్తదైన, అలక్తకమ్ = లత్తుకను, పీడయిత్వా = పిండి, పాదేన ఏవ = పాదము చేతనే, అసురసాదాననిష్కార్యమ్ = ప్రాణరసమును స్వీకరించుటచేత (ఇక) పనికిరాని, మహిషమ్ = మహిషుని, క్షిపన్తీ = విసరుచున్న, ఆర్యా = అమ్మవారు, జయతి = సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నది.

**తా :** అమ్మవారి ప్రణయకోపము నుపశమింపజేయుటకై శివుడు తన నెత్తిమీది గంగ నామె పాదములపై గ్రుమ్మరించును. ఆ గంగ ఆమె పాదములను కడుగును. అప్పుడా పాదముల కొక శోభ కలుగును. అది చంద్రకాంతిని మించిన (నూపురము చేతను) గోళ్ళ వెన్నెల చేతను ఆమె పాదములకు ఒక శోభ కలుగును. పై శోభ మహిషుని పిండి వాని ప్రాణరసమను లత్తుకను పిండి తనకాలికి పూసికొని ఇక పనికి రాని ఆ మహిషుని (శరీరమును) విసరి వేయునప్పుడు కలుగు శోభకు సాటిరాదు. అట్టి శోభతో నొప్పారు అమ్మవారు సర్వోత్కర్షముగా వర్ధిలుచున్నది.

**వి :** శృంగారనాయకులకు ప్రియురాలు కోపించినప్పుడు చాటూక్తులతో ప్రసన్నురాలు కాని ఎడల చివఱకు కాళ్ళబేరము కన్న మరొక గతి లేదు. అమ్మవారు ప్రణయకుపితయైనప్పుడు శివుడట్లు చేయుట సాధారణ విషయమే. శివుడు గంగను నెత్తి కెక్కించు కొన్నాడనునదే అమ్మవారి కోపమునకు మూలకారణము. శివుడామె పాదములపై బడు నప్పుడా గంగ ఆమె పాదములను కడుగుచునే యుండును. నెత్తికెక్కిన సవతి తన కాళ్ళు గడుగుటచే అమ్మవారి పాదములకు అమితమైన శోభ కలుగును. ప్రియుడు పాదములపై బడునప్పుడు భామినికి కోపము తగ్గిన తగ్గవచ్చును. ఏ ప్రియుడైనను సవతిచే ప్రియురాలి కాళ్ళు కడిగించునా! ఆ సవతి ఈమె పాదములు కడుగుటకు సిద్ధమగునా? ఇదంతయు అసంభవము. ఈ పనిని శివుడు పార్వతిపాదములపై వంగినంతనే అప్రయత్నముగా సంభవించును. శివుని తలపై నున్న గంగ శివుడమ్మవారి పాదములపైకి వంగగానే అమ్మవారి పాదములపై పడును. అంతియే. కాని అమాయకురాలై శివుని ఈ ప్రయత్నోపచారముచేతనే సంతసించును. హృదయము నందలి సంతోషముచే సహజశోభగల శరీరావయములు మరింత శోభించును. అమ్మవారి నూపుర మామె పాదమునకు అలంకారము. ఆమె వ్రేలిగోళ్ళు చందమామకు రూపాంతరము లన్నట్లుండును. ఆ గోళ్ళు అమ్మవారి పాదముల నుజ్జ్వలములుగా చేయుట ఆమెకు సహజశోభయే. సంతోషము కలిగినప్పుడా అవయవముల సహజకాంతి మరింత పెంపొందుట కూడ సహజమే. అమ్మవారి పాదములకు లత్తుక యుండును. ఎప్పటికప్పుడు చెలికత్తెలా పాదములకు లత్తుక వాడనీయక పూయుచునే యుందురు. కాని ఇప్పుడామె మహిషుని చంపి క్రొత్తలత్తుకను తానే పూసుకొన్నది. వాని రక్తమామె పాదముపై చిలికినది. అది పరాక్రామార్జితము. అందువలన అది ఆమె పాదమునకు ఇదివఱకప్పుడు లేనంత శోభ కలిగినది. మహిషుని త్రొక్కినప్పుడా రక్తము చిలికినది. వాని ఒడలిలో రక్తము పిండినట్లైనది. లత్తుకగా ఉపయోగపడు రక్తములేక పనికిరానిదై పోయిన మహిషుని శరీరమును కాలితో విసరి వైచినది.

సాధారణముగా లత్తుక (పారాణి) పసుపు, సున్నము మొదలగు ద్రవ్యములతో సిద్ధము చేయుదురు. ఆటవికులు ఏదో యొక మొక్క రసమునే లత్తుకగా పాదములకు పూసికొందురు. అమ్మవారు గిరికన్య గదా! ఈమె సిద్ధము చేసికొన్న లత్తుక అనిదంపూర్వము. విషయమైన రక్తమసురస (ప్రాణరస) మని చెప్పుట ఎంతో బాగున్నది. ప్రాణులు అసురసులు. ఆ రసములేని వారు నిష్ప్రాణులే. కొన్ని ఇతర రసములు లోపించిన ప్రాణులు చావక పోవచ్చును. కాని రక్తము లేనిచో ప్రాణహీనులే అగుదురు. అందుచే రక్తము అసు (ప్రాణ)రసము. విషయమైన అసురసమును లక్తకముగా కవి సంభావించుటచే నీ శ్లోకమున **ఉత్ప్రేక్షాలంకార** మేర్పడినది. బాణమునకు రక్తము తోడుట పాతపని. కాని బాణుడు సిద్ధము చేసిన ఈ లత్తుక క్రొత్తదే. దీనిని సూచించుటకు కాబోలు '**నవమ్**' అను విశేషణమును అలక్తకమునకు బాణుడు కూర్చినాడు! '**అసురసాదాననిష్కార్యమార్యా**' అను పదబంధ మనుప్రాస బంధురముగా నున్నది. *

**అ :** పై శ్లోకమున మహిషుని రక్త మమ్మవారి పాదమునందలి **లక్తకము**గా సంభావింపబడినది. ఈ శ్లోకమున ఆ **రక్తముయొక్క ధారలు** వర్ణింపబడుచున్నవి.

**శ్లో॥ మృత్యోస్తుల్యం త్రిలోకీం గ్రసితుమతిరసాన్నిస్సృతాః కిం ను జిహ్వాః**
**కిం వా కృష్ణాఙ్ఘ్రిపద్మద్యుతిభిరరుణితా విష్ణుపద్యాః పదవ్యః ।**
**ప్రాప్తాస్సన్ధ్యాస్స్మరారేస్స్వయముత నుతిభిస్తిస్ర ఇత్యూహ్యమానా**
**దేవైర్దేవీత్రిశూలాహతమహిషజుషో రక్తధారా జయన్తి ॥ 4**

**ప్ర :** తుల్యమ్ = ఒకేసారి, త్రిలోకీమ్ = ముజ్జగమును, గ్రసితుమ్ = మ్రింగుటకు, అతిరసాత్ = అత్యాసక్తివలన, మృత్యోః = యమునియొక్క, నిస్సృతాః = చాచబడిన, జిహ్వాః కిం ను = నాలుకలా?, విష్ణుపద్యాః = గంగానదియొక్క, కృష్ణాంఘ్రిపద్మద్యుతిభిః = విష్ణువుయొక్క పాదపద్మముల కాంతులచేత, అరుణితాః = ఎఱ్ఱబారిన, పదవ్యః కిమ్? = మార్గములా?, స్మరారేః = శివునియొక్క, నుతిభిః = స్తోత్రములచేత, ప్రాప్తాః = వచ్చిన, తిస్రః = మూడు, సంధ్యాః ఉత = సంధ్యలా?, ఇతి = అని, దేవైః = దేవతలచే, ఊహ్యమానా = ఊహింపబడుచున్న, దేవీత్రిశూలాహతమహిషజుషః = అమ్మవారి త్రిశూలముచే కొట్టబడిన మహిషునిలో నున్న, రక్తధారాః = రక్తధారలు, జయన్తి = సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నవి.

**తా :** ఒకేసారి మూడు లోకముల మ్రింగుటకు చాచబడిన యముని నాలుకలా, విష్ణువుయొక్క పాదపద్మములచే ఎఱ్ఱబారిన గంగాప్రవాహములా, స్వయముగా శివుడొనర్చిన స్తుతులకు సంతోషించి వచ్చిన త్రిసంధ్యలా అని దేవతలచే ఊహింపబడుచున్న అమ్మవారి త్రిశూలముచే కొట్టబడిన మహిషుని శరీరమునుండి చిమ్మబడిన రక్తధారలు సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నవి.

**వి :** కవి నిబద్ధవక్తలైన దేవతలచే మహిషుని రక్తధారలు మృత్యుజిహ్వలుగా, గంగాప్రవాహములుగా త్రిసంధ్యలుగా సంభావింపబడినందున ఈ శ్లోకమున కవి నిబద్ధవక్తృప్రౌఢోక్తిసిద్ధమైన **మాలోత్ప్రే-క్షాలంకార** మున్నది. జిహ్వాః అను బహువచనాంతప్రయోగముచేత మృత్యువిక్కడ అగ్నిగా

సంభావింపబడును. సాధారణముగా మృత్యుశబ్దముచే పేర్కొన దగిన **యమునకు నాలుక ఒకటే, కాలసర్పమునకు రెండే, మఱి అగ్నికి ఏడు నాలుక లున్నవి**. కావున బహువచనాంతపదము అగ్నియం దుచితముగా నుండును. 1-3 పాదములలో సకారావృత్తి, నాలుగవపాదమున తకారావృత్తి ఉండుటచే ఆ పాదము లనుప్రాస శోభితములు. *

**అ :** పై శ్లోకములలో అమ్మవారి పాదపు త్రొక్కిడిచే చచ్చిన మహిషుని రక్తధార లెగజిమ్మబడగా మిగిలిన పిప్పియైన శరీరమును పాదముతోనే విసరివేయుట వర్ణింపబడినది. ఈ శ్లోకమున అట్లు విసరి వేయబడి నప్పుడు అందెకు తగుల్కొనిన వాని **కొమ్ముకొన** ఈ శ్లోకమున వర్ణింపబడు చున్నది.

**శ్లో॥ దత్తే దర్పాత్ప్రహారే సపది పదభరోత్పిష్టదేహావశిష్టాం**
**శ్లిష్టాం శృఙ్గస్య కోటిమ్మహిషసురరిపోర్నూపురగ్రన్థిసీమ్ని ।**
**ముష్యాద్వః కల్మషాని వ్యతికరవిరతావాదదానః కుమారో**
**మాతుః ప్రభ్రష్టలీలాకువలయకలికాకర్ణపూరాదరేణ ॥ 5**

**ప్ర :** దర్పాత్ = గర్వమువలన, ప్రహారే = దెబ్బ, దత్తే = ఈయబడగా, సపది = వెంటనే, పదభరోత్పిష్టదేహావశిష్టామ్ = పాదముయొక్క బరువుచే పిండి చేయబడిన దేహము మిగిలిన, మహిషసురరిపోః = మహిషరాక్షసునియొక్క, శృంగస్య = కొమ్ముయొక్క, నూపురగ్రంథిసీమ్ని = అందెయొక్క ముడి (యున్న) ప్రాంతమున, శ్లిష్టామ్ = ఇరికిన, కోటిమ్ = కొనను, వ్యతికరవిరతౌ = సంబంధము (యుద్ధము) ముగింపునందు, మాతుః = అమ్మ (చెవి) నుండి, ప్రభ్రష్టలీలాకువలయ కలికాకర్ణపూరాదరేణ = జారిపడిన చెవి అలంకారమైన కలువ మొగ్గ అను ఆదరముతో, ఆదదానః = స్వీకరించు, కుమారః = కుమారుడు, వః = మీ యొక్క, కల్మషాని = పాపములను, ముష్యాత్ = అపహరించుగాక!.

**తా :** దర్పమువలన తన్నగా వెంటనే పాదముయొక్క బరువుతో పిండియైన మహిషుని దేహము నందు పిండిగాక, మిగిలినది అమ్మవారి అందె ముడియున్న చోట చిక్కుకొని పోయిన వాని కొమ్ముకొన యొకటే, దాని నమ్మవారి నుండి జారిపడిన చెవి అలంకారమయిన కలువపూమొగ్గయేమో అనుకొని స్వీకరించిన **కుమారస్వామి** మీ పాపములను నపహరించుగాక!

**వి :** తల్లి ముందు పోవుచుండగా పిల్ల లమ్మ వెనుక వచ్చుచుందురు. తల్లి చాటుగా నుండుటచే తల్లి చేయు పనులమ్మ వెనుక వచ్చు పిల్లలకు కనబడవు. ఒక్కొక్కప్పుడు తల్లి కొప్పు నుండి జారిపడు పువ్వులను పిల్ల లేరుకొను చుందురు. ఒక్కొక్కప్పుడు చిన్న చిన్న సొమ్ములు జారిపడుట తల్లి గ్రహింపక పోవచ్చును. ఆ దారినే వెనుకగా వచ్చు పిల్లలు దాచియుంచి కొంత సేపామెను వెదుక నిచ్చి ఆ తరువాత జరిగిన సంగతి చెప్పి ఆమె కప్పగింతురు. ఆమె అవయవములకు తగిలింతురు. ఆమె అందుకు వారిని ముద్దిడుకొనును. పిల్లలా ముద్దురుచి మఱిగి ముద్దిచ్చినచో చూపించెదము. ఇచ్చెదము అనుచుందురు. కాని ఈ శ్లోకమున ప్రస్తుతమట్లు ఏ సొమ్మును

జారిపడలేదు. కాని అమ్మ వారి వెనుక నూపురమున తగుల్కొని యున్న మహిషాసురుని కొమ్ముకొన నామె చెవికి తొడిగెను. ఈ వస్తు వంతయు మాతృ కుమార సాధారణ పదముల నమ్మవారియెడ, కుమారస్వామి యెడ ప్రయోగింపబడిన మాతుః కుమారః అను పదములు ధ్వనింపజేయుచున్నవి.

సపది పదభరో అను పదబంధమున ఛేకానుప్రాసమున్నది. ఉత్పిష్టదేహావశిష్టామ్ పదములలో పదాంతానుప్రాస మున్నది. లీలాకువలయకలికా అను పదబంధము లకారానుప్రాసాలంకృతము. శ్లోకమున **భ్రాంతిమదలంకార ధ్వని** యున్నది. కుమారుడు పాపముల బోగొట్టుగాక, అని చెప్పుట వలన కుమారునకే పాపాపహరణ సామర్థ్యముండగా తల్లి సామర్థ్య మింకెంత గొప్పదో. ఇది మాటల కందునో, లేదో, కుమారుని వర్ణించు సామర్థ్యమే మన కున్నది. ప్రస్తుతము కింతే చాలు. అదిగాక కుమారుని వర్ణించిన తల్లికి సంతోషమును కలుగుననుట లోక ప్రసిద్ధము. తల్లి సంతోషము కొఱకే కవియు ప్రశంస చెప్పినట్లు ఈ శ్లోకము వ్యంజించుచున్నది. *

**అ :** పై శ్లోకమున మహిషుని శృంగకోటి కుమారునిచే కువలయకలికగా భ్రమింపబడినట్లు చెప్పబడినది. ఈ శ్లోకమున అది అమ్మవారి పాదనూపురమణి ఘంటికలను మ్రోగించి **వీణావాద్య వాదన నాదము** పుట్టించుచున్నట్లు చెప్పబడుచున్నది.

**శ్లో॥ శశ్వద్విశ్వోపకారప్రకృతిరవికృతిస్సాఽస్తు శాన్త్యై శివా వో**
**యస్యాః పాదోపవేశ్యస్త్రిదశపతిరిపుర్ధూర్తదుష్టాశయోఽపి ।**
**నాకే ప్రాపత్ప్రతిష్ఠామసకృదభిముఖో వాదయఞ్ఛృఙ్గకోట్యా**
**హత్వా కోణేన వీణామివ రణితమణీమ్మణ్డలీం నూపురస్య ॥ 6**

**ప్ర :** అసకృత్ = మాటిమాటికీ, అభిముఖః = ఎదురు పడినవాడై, శృంగకోట్యా = కొమ్ముకొనతో, కోణేన = పుల్లతో, వీణామ్ ఇవ = వీణనువలె, హత్వా = కొట్టి, నూపురస్య = అందెయొక్క, రణితమణీం మండలీమ్ = ధ్వనించిన మణుల సమూహము గల దగునట్లుగా, వాదయన్ = వాయించుచు, ధూర్తదుష్టాశయః అపి = ధూర్తుడు దుష్టమైన ఆలోచన గలవాడును ఐన, త్రిదశపతి రిపుః = రాక్షసుడు, యస్యాః = ఏ దేవియొక్క, పాదోపవేశ్యః = పాదప్రాంతమందు కూర్చొనదగినవాడై, నాకే = స్వర్గమునందు, ప్రతిష్ఠామ్ = ప్రతిష్ఠను, ప్రాపత్ = పొందెనో, అవికృతిః = మార్పులేని, శశ్వద్విశ్వోపకారప్రకృతిః = ఎల్లప్పుడు విశ్వమునకు ఉపకరించు స్వభావము గల, సా = ఆ, శివా = శివ, వః = మీయొక్క, శాంత్యై = శాంతికొఱకు, అస్తు = అగుగాక!

**తా :** ధూర్తుడు, దుష్టాలోచనలు గల మహిషాసురుడు కూడ తన కొమ్ముకొనతో అమ్మవారి పాదమునందలి నూపురమును పుల్లతో మాణిక్యవీణనువలె మోగించగా ఆ పుణ్యమున స్వర్గమున చిరస్థానమును సంపాదించెను. వాడు అమ్మవారి పాదసమీపమున కూర్చొన దగిన వాడయ్యెను. అట్లు సర్వులకు ఉపకరించు స్వభావము అమ్మవారిది. దానిలో ఎట్టి మార్పును ఉండదు. శివ అను పేరుగల ఆ అమ్మవారు మీకు శాంతిని గలిగించు గాక!

**వి :** లోకమున కొందఱు పుణ్యాత్ములు, కొందఱు పాపాత్ములు నుందురు. అమ్మవారు పుణ్యాత్ములకు పాపాత్ములకును ఉపకరించు స్వభావము కలిగి యున్నది. కావున ఆమెకు గల **శివ** అను నామము సార్థకము. అది అందఱికిని మంగళములను ప్రసాదించును. పాపాత్ముల కుపకరించు ననుటకు నిదర్శనము మహిషాసురుడు. వాడు అమ్మవారిని పొడువబోయినప్పుడు వాని కొమ్ము ఆమె మణి నూపురమునకు తాకి విరిగెను. అప్పుడు పుల్లతో వీణను వాయించిన ధ్వని వచ్చెను. అమ్మవారి యెదుట వీణ వాయించిన వారికి కలుగవలసిన స్వర్గమున చిరవాసము లభించెను. అంతేకాదు మణిద్వీపమున అమ్మవారి ఆ మణి నూపురము కడనే నిరంతరము కూర్చొను భాగ్యము కలిగెను. అమ్మవారిని పొడువబోగా ఆమె పాదమునెత్తి వానిపై పెట్టి తొక్కెను. వాడు చచ్చెను. భవభూతి చెప్పినట్లు ఈ చావు సత్సంగము వలన కలిగినది. కావున ఆ మహిషుని తరింపజేసినది. **సత్సంగజాని నిధనాన్యపి తారయంతి** (సత్సంగము వలన కలిగిన చావులును తరింపజేయును) అనున దాతని సూక్తి. ధూర్తుడు, దుష్టాశయుడునైన మహిషునకీ భాగ్యమును అమ్మవారు కలుగజేసిన దనగా పుణ్యాత్ముని విషయమున ఆమె చేయు ఉపకారమును గూర్చి చెప్పవలసిన దేమియు లేదు. అందువలన కవి ఆమెకీ శ్లోకమున **శశ్వద్విశ్వోపకారప్రకృతిః** అను విశేషణమును ప్రయోగించినాడు. ఆ స్వభావమున ఎన్నటికీ మార్పురాదు, అని చెప్పుటకు అవికృతిః అను విశేషణముచే స్ఫురింపజేసినాడు. సాంఖ్యసిద్ధాంతమున **మూలప్రకృతిరవికృతిః** అను సూత్రమొకటి ఉన్నది. ఒక వస్తువునకు వికారము కలుగక ముందు ప్రకృతి అనుపేరు, వికారము కలిగిన పిదప నేర్పడిన వస్తువుకు వికృతి అను పేరు కలుగును. ఉదాహరణమునకు మట్టి ప్రకృతి, దానికి వికారము కలిగి కుండ ఏర్పడినది. అది వికృతి. తార్కికులు ప్రకృతి వికృతులు (కారణకార్యములు) విభిన్న పదార్థము లందురు. ప్రకృతియైన మట్టిని కారణమని దాని నుండి యేర్పడిన వికృతియైన కుండను కార్యమందురు. కారణమైన మట్టి కార్యమైన మట్టి భిన్న పదార్థములే అని వారి అభిప్రాయము. సాంఖ్యులీ ప్రకృతివికృతులకు భేదము నంగీకరించరు. వారు సత్కార్యవాదులు. మట్టిలో ఉన్న కుండయే కుమ్మరియొక్క వ్యాపారమున వెలికి వచ్చినది. ఉన్న వస్తువే పుట్టినదని చెప్పబడవలెను. లేని వస్తువు (కుండ) పుట్టినదని చెప్పరాదు. లేని వస్తువు పుట్టునని చెప్పినచో శూన్యము నుండి కూడ కుండ పుట్టవలెను గదా. ఇది సత్కార్యవాదస్వరూపము. మట్టిలో కుండ తొలుతనే ఉన్నచో నీరు తెచ్చుకొనుట కుపయోగించవచ్చును కదా! అట్లుపయోగించుట లేదు. కావున లేనికుండయే పుట్టునను తార్కికుల అసత్కార్యవాదమును సాంఖ్యులు పైన చెప్పిన విధముగా ఖండించిరి. సాంఖ్యులు తొలుత మూలప్రకృతి ఒకటి యుండెనని ఆ మూలప్రకృతి దాదాపు బ్రహ్మవలె సర్వవ్యాపకమై దానిలో నుండి యేర్పడిన వికృతులు సర్వవ్యాపకమైన దానిలోని యేకదేశములలో ఎన్ని వికృతులు పుట్టి గిట్టినను అనగా వికృతిభావము (కుండతనము) నశించి తిరిగి ప్రకృతిభావమును (మట్టి తనమును) పొంది ప్రకృతిలో లీనమగుచున్నను సర్వవ్యాపకప్రకృతిభావము దాన నశించనందున దాని నిత్యతకు భంగము కలుగదు. సర్వవికృతులకు మూలమైన దా ప్రకృతియే. మరొక ప్రకృతి (మూలము) దానికి లేనందున, అదియే వికృతులకన్నిటికి మూలమయినందున **మూలప్రకృతి**

యని చెప్పబడినది. బహుశాస్త్రవేత్తయైన బాణుడు సాంఖ్యశాస్త్రవాసనతో **ప్రకృతిరవికృతిః** అను పదబంధమును అమ్మవారి ఉపకరించు ప్రకృతి (స్వభావము) అవికృతి (ఎల్లప్పుడు మారనిది) అను అర్థమున ప్రయోగించెను. **విశ్వోపకార మనగా నేమి?** విశ్వశబ్దమునకు జాగ్రదవస్థలోని జీవులని ఒక అర్థమున్నది. జాగ్రదవస్థలోనే ఈ విశ్వులకు ఆహారాది భోగములతో ఉపకారము కలిగినప్పుడు సంతోషించుచుందురు. జాగ్రదవస్థలో నున్న విశ్వులకు జాగ్రదవస్థలోని విశ్వములోని పదార్థముల భోగమున సంతోషము కలుగును. కావున అమ్మవారు విశ్వులకు విశ్వములోని వారికి వారు కోరిన వస్తువుల సాన్నిధ్యము కలిగించుటయే అమ్మవారియొక్క **విశ్వోపకార** శబ్దముయొక్క అర్థము. విశ్వులకు విశ్వములోని వస్తువుల సాన్నిధ్యము కలిగించుట అను అర్థమున ప్రయోగింపబడినదని గ్రహింపవలెను. సాధారణముగా పరమేశ్వరుడు – జీవుడు పుణ్యమొనరించిన సుఖమును, పాపమొనరించిన దుఃఖమును వానికి కలిగించును. అట్లా పరమేశ్వరుడు చేయనిచో లోకమున నెవరును పుణ్యము చేయక పాపమే చేసి జీవులు తమలో తామే మీమాంసాదులతో లోకమున అశాంతిని కలుగజేయుదురు. పాపులకు దుఃఖముయొక్క అనుభవమును కల్గించి వారి పాపముల నశింపజేసి వారిచే నిష్కామముగా పుణ్యకర్మలను చేయించి వారి పాపములను నశింపజేసి పుణ్యాత్ములకు సుఖముయొక్క అనుభవమును కలిగించి పుణ్యమును నశింపజేసి జీవులను సంసారమునుండి సముద్ధరించి (జీవుల) స్వరూపమైన శాశ్వతానందస్థితి (కైవల్యము ముక్తి)ని కలిగించుట పరమేశ్వరుని పంచకృత్యములలో నొకటి. ఇదియే **అనుగ్రహము** అని చెప్పబడును. ఈ కృత్యమును పరమేశ్వరాభిన్నయైన అమ్మవారు చేయునని లలితాసహస్రనామస్తోత్రములోని **అనుగ్రహదా** అన్న నామము స్పష్టీకరించుచున్నది. ఈ అనుగ్రహకృత్యము పరమేశ్వరీ–పరమేశ్వరోభయసాధారణమే అయినను అమ్మవారికి పాపులకు దుఃఖము కలిగించుట అవశ్యకమే అయినను స్త్రీత్వ జగన్మాతృత్వ హేతుకమైన వాత్సల్యము పరమేశ్వరున కన్న పరమేశ్వరి కెక్కువయని ఈ శ్లోకములోని విశ్వోపకారప్రకృతి శబ్దము తెలుపుచున్నది. అట్లు చేయుట తప్పని మాటిమాటికి పరమేశ్వరుడు హెచ్చరించుచున్నను ఆమెలోని మాతృత్వమును తత్పురస్కృతమైన పాపులను శిక్షించక క్షమించి యుపకరించుటను ఆమె మానుకొన జాలదు. అందువలన మాటిమాటి కామె క్షమించుచునే ఉన్నది. అప్పుడప్పుడు విశ్వశాంతికి భంగము కలుగుచున్నను ఆమె క్షమించుట మానలేదు. పిల్లలు చేయు తప్పులు కూడ తల్లికి సంతోషము కల్గించుట లోకసిద్ధము. ఒక తల్లి తన కొడుకు దుడుకుతనమును ప్రశంసించుచుండును. ఒక్కొక్కసారి ఇరుగుపొరుగు జగడములకు హేతువగుచున్నను ఆమె వాని అల్లరి పనులను క్షమించుచునే ఉండును. అంతర్హాసమును పెదవుల నదిమి బయట పడకుండ జేసి చేష్టలతో బెదిరించుచునే యుండును. ఆమెలోని ఆ బలహీనతను గమనించని అశక్తుడా ఆ బాలకుడు అమ్మ కోపము వట్టి నటనయే యని తెలిసికొని ఆమె లోపల సంతోషించునని భావించి అల్లరి చేయుచునే వుండును. తండ్రి మాత్రము కొంత కాఠిన్యమును పూని శిక్షించును. అందుకే ఆయన నరకాదిలోకములను పశ్వాది శరీరములను అట్టివారి ప్రవేశమునకై నిర్మించెను. కాని అమ్మ అందులో పడకుండా ఎప్పుడో కాపాడును. ఆ ఎప్పుడో

అనునది తంత్రికిని సంబంధించినదే యైనను జగన్మాతకు సంబంధించనంతవఱకది మాటిమాటికి వచ్చును. ఈ యర్థ మంతయు శ్లోకాది నున్న శశ్వచ్ఛబ్దముచే వ్యంగ్యమగుచున్నది. దేవాలయమున దేవికి ఎదురుగా నుండు గంటను భక్తులు మ్రోగించెదరు. అది పాడుబడిన దేవాలయమున పిశాచరాక్షసాది భూతోచ్చాటనమున కుపయోగించవచ్చును. ఆ ధ్వనికి అదృశ్యముగా నుండి జీవులకు దుష్టసంకల్పములను కల్గించు నా భూతముల యుచ్చాటనము కొఱకు నా సర్వదేవాలయములోని ఘంటానాదము చేయవచ్చును. కాని ఆ గంటల చప్పుడొకవేళ మాణిక్య వీణానాదమువలె మనోహరముగా నున్నచో అందులోని దేవత కానందమును కూడా కలిగించును. అమ్మవారిని పొడువబోయినప్పు డమ్మవారు వానిపై శీఘ్రముగా కాలుమోపినది. ఇంతలో వాడు కదలించిన అమ్మవారి నూపురములోని మణికింకిణులు మ్రోగి అమ్మవారి చెవినబడినవి. వాని సర్వపాపములు క్షమింపబడినవి. దేవాలయమున గంట మ్రోగించిన పుణ్యమే కాక మాణిక్యవీణను మ్రోగించిన పుణ్యమే లభించి అమ్మవారిలోకమున ఆమె పాదనూపుర మణికింకిణీ మనోజ్ఞ ధ్వని ఎల్లప్పుడు విను భాగ్యమా మహిషునకు లభించినది. ఆ ధ్వని ఒకవేళ అమ్మవారి పాదము నిశ్చలముగా నున్నప్పు డాగినను ఆ నూపురమును కదలించుటకు అమ్మవారి లోకమున అమ్మవారి పాదసన్నిధి నున్న మహిషున కా కొమ్ము మిగిలియే యున్నదని శ్లోకములోని ద్వితీయ, తృతీయ, చతుర్థపాదములలోని ఉపమాలంకారము వలనను **రణితమణీం మండలీమ్** అను విశేషణము వలనను వ్యంజితమగుచున్నది. అమ్మవారి యీ నూపురమణికింకిణీరణితము భక్తుల హృదయములలో ప్రతిధ్వనించుగాక. **'రణితమణిమ్' మండలీమ్ నూపురస్య**' అను పాఠాంతర మున్నది. 'శ్వ' యొక్క ఆవృత్తి కృతి అను వర్ణముల ఆవృత్తి అనుప్రాసాలంకృతముగా ప్రథమ పాదము నొనర్చినవి. నాలుగవ పాదమున 'ణ' కార రణనమట్లే చేయుచున్నది. *

**అ :** పై శ్లోకములలో నూపురలగ్న మహిషుని శృంగకోటి వర్ణింపబడినది. ఈ శ్లోకమున కోటి శబ్దప్రసంగ సమాక్షిప్తమైన **అంగుష్ఠకోటిచే మహిషుడు త్రోయబడుట** చెప్పబడుచున్నది.

**శ్లో॥ నిష్ప్యూతోఽఙ్గుష్ఠకోట్యా నఖశిఖరహతః పార్ష్ణినిర్యాతసారో**
**గర్భే దర్భాగ్రసూచీలఘురివ గణితో నోపసర్పన్సమీపమ్ ।**
**నాభౌ వక్త్రం ప్రవిష్టాకృతివికృతి యయా పాదపాతేన కృత్వా**
**దైత్యాధీశో వినాశం రణభువి గమితస్సాఽస్తు దేవీ శ్రియే వః ॥ 7**

**ప్ర :** అంగుష్ఠకోట్యా = (కాలి) బొటనవ్రేలికొనతో, నిష్ప్యూతః = మీట బడినవాడు, నఖశిఖరహతః = గోటికొనతో కొట్టబడినవాడు, పార్ష్ణినిర్యాతసారః = మడమచేత తొలగిన బలరక్తాదిక (సార)ముగల వాడు (ఐన మహిషుడు), సమీపమ్ = దగ్గఱకు, ఉపసర్పన్ = చేఱుచు, గర్భే = గర్భమున, దర్భాగ్రసూచీలఘుః ఇవ = దర్భకొన (సూది) వలె అల్పుడుగా, గణితః న = లెక్కపెట్టబడిన వాడు కాలేదు, దైత్యాధీశః = రాక్షసరాజు, యయా = ఏదేవిచేత, నాభౌ = బొడ్డునందు, వక్త్రమ్ = ముఖము, ప్రవిష్టాకృతివికృతి = ప్రవేశించిన ఆకారముయొక్క వికారము గలుగునట్లు, కృత్వా

=చేసి, రణభువి = యుద్ధభూమియందు, వినాశమ్ = వినాశమును, గమితః = పొందింపబడిన వాడయ్యెనో, సా = ఆ, దేవీ = దేవి, వః = మీయొక్క, శ్రియే = సంపద కొఱకు, అస్తు = అగుగాక!.

**తా :** బొటన వ్రేలికొనతో ఎగురగొట్టబడి, గోటికొనతో కొట్టబడి, మడమతో త్రొక్కబడగా ఆ మహిషుడు గర్భమున గుచ్చుకొను దర్భాగ్రమంత లఘువువలె వాడు సమీపించినప్పుడు దేవిచేత లెక్కింపబడలేదు. వానిని తన్నినప్పుడు వాని ముఖము వాని బొడ్డులోపలికి అణిగిపోయి వికృతాకారము కలవాడయ్యెను. ఇట్లు మహిషుని నశింపజేసిన దేవి మీకు సంపదను గలిగించుగాక!

**వి :** అది యుద్ధభూమియే. ప్రత్యర్థి మహిషాసురుడు. వింధ్యాద్రి పర్వతమంత ఎత్తుగలవాడే, కాని అమ్మవారి పాదమునకు సమాంతరముగానే ఉండెను. దీనిని బట్టి దేవియొక్క ఎత్తు ఊహించుకొన వచ్చును. అమ్మవారికి వానిని చేతితో కొట్టబడునంత ఎత్తు వానికి లేదు. కాలి కందిన వానిని కాలితోనే తన్నగా ఆ కార్యక్రమమున అంగుష్ఠము గోటికొన, మడమ పాల్గొన్నవి అనుటలో భావికాలంకార స్ఫూర్తి ఉన్నది. పశువులు అరుగుమీద నున్న యజమాని పాదమును చూడవచ్చునట్లు ఆ మహిషుడు అమ్మవారి పాదమునకు సమాంతరముగా వచ్చినప్పుడు వానిని తన్నుట అమ్మవారికి సుకరముగా అనిపించి ఆ పని చేసినది. చేతితో కొట్టవలెనన్న కిందికి వంగవలసివచ్చును గదా! గోటితో మీటుట సరిపోవు చుండగా గొడ్డలితో గాని శూలముతోగాని పనియే మున్నది?

కాలి దెబ్బతోనే వాని ముఖము వాని బొడ్డులోనికే అణగిపోయి వాని దీర్ఘగోళాకారము సమ గోళాకారమయ్యెను. పాదము చిన్నది. దర్భముల్లువలె మహిషుడు అంతకన్న చిన్నవాడు. కాలికి గ్రుచ్చుకొన్న కనబడగా పెరికి వేయవచ్చును. పెరికివేయకున్న అది అడుగు భూమిపై మోపినప్పుడు పాదతలపు లోపలి కండర భాగము దాక లోపలికి పోవచ్చును. కావున దానిని అల్పమైనదైనను శ్రద్ధ వహించి పెరికి వేయవలెను. పొట్టకు గ్రుచ్చుకొన్నచో దానిని భూమిపై మోపవలసిన ఆవశ్యకత లేనందున లోపలికి చొచ్చుకొని పోవునను భయము లేకపోవుటచే దాని నుపేక్షింపగా ఎప్పుడో దానంత అదియే ఎప్పుడో ఏ వస్త్రాంచలము తగిలియో ఊడిపోవచ్చును. అందువలన దాని నుపేక్షించిన ఇబ్బంది ఏమియు నుండదు. ఈ అర్థము **గర్భే న గణితః** అను శబ్దములచేత స్ఫురింపజేయబడుచున్నది.

*

**అ :** పై శ్లోకమున అమ్మవారి యెదుట లఘువైన మహిషుడు వర్ణింపబడినాడు. ఈ శ్లోకమున ఇతర **దేవతలు మహిషుని ముందు లఘువులగుట** వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ గ్రస్తాశ్వః శష్పలోభాదివ హరితహరేరప్రసోఢానలోష్మా**
**స్థాణౌ కణ్డూం వినీయ ప్రతిమహిషరుషేవాన్తకోపాన్తవర్తీ ।**
**కృష్ణం పఙ్కం యథేచ్ఛన్వరుణముపగతో మజ్జనాయేవ యస్యా-**
**స్స్వస్థోఽభూత్పాదమాప్య హ్రదమివ మహిషస్సాఽస్తు దుర్గా శ్రియే వః॥ 8**

**ప్ర :** హరితహరేః = ఆకుపచ్చని గుఱ్ఱములుగల వాని(సూర్యుని)యొక్క, శష్పలోభాత్ ఇవ = పచ్చగడ్డిమీద ఆశవలన వలె, గ్రస్తాశ్వః = మింగిన గుఱ్ఱములు గల, అప్రసోఢానలోష్మా = సహించని అగ్ని వేడిగల, స్థాణౌ = శివునందు, కండూమ్ = దురదను, వినీయ = పోగొట్టుకొని, ప్రతిమహిషరుషా ఇవ = పోటీపడు దున్నపోతుమీద కోపము చేతవలె, అంతకోపాంతవర్తీ = యముని సమీపమున ఉండు, యథేచ్ఛన్ = స్వేచ్ఛగా, కృష్ణమ్ = (నల్లని) విష్ణువు అను, పంకమ్ = బురదను, వరుణమ్ = (సముద్రరూపుడైన) వరుణుని, మజ్జనాయ ఇవ = స్నానము కొఱకు వలె, ఉపగతః = సమీపించు, మహిషః = మహిషుడు, యస్యాః = ఏ దేవియొక్క, పాదమ్ = పాదమును, హ్రదమ్ ఇవ = మడుగునువలె, ఆప్య = పొంది, స్వస్థః = తాపమును అనారోగ్యమును వీడి ఆరోగ్యవంతుడుగ (స్వర్గస్థుడు), అభూత్ = ఆయెనో, సా = ఆ, దుర్గా = దుర్గ, వః = మీ యొక్క, శ్రియే = సంపద కొఱకు, అస్తు = అగుగాక.

**తా :** మహిషుడు పచ్చగడ్డి అనుకొని సూర్యుని ఆకుపచ్చ గుఱ్ఱములను మ్రింగెను. వాడు అగ్ని తేజమును (వేడిని) సహింపడు. స్థాణువైన శివుని రాచుకొనును. తనతో పోటీపడు దున్న నెక్కిన యముని కడకేగి నిలచును. బురదయను బుద్ధితో విష్ణువును, మడుగు అను బుద్ధితో సముద్రరూపుడైన వరుణుని సమీపించెను. మడుగును వలె అమ్మవారి పాదమును పొంది వాడు తాపశాంతి రూపమయిన స్వర్గమును పొందిన వాడయ్యెను. అట్టి ఆ దుర్గ మీకు సంపద నొసగుగాక!

**వి :** దుష్టుల హృదయమున అశాంతి (తాపము) నెలకొని యుండును. అది వారి దోషముల వలన కలిగినదని యెఱుగరు. దోషముల నశింప జేసి కొనుటకు యత్నింపరు. తమ అశాంతి (తాపము) కితరులెవరో హేతువు లనుకొని వారిని రూపుమాప యత్నించెదరు. ఒక్కొక్కరిని రూపుమాపు కొలది హృదయగతమైన అశాంతి (తాపము) హెచ్చునేగాని తగ్గదు. మహిషాసురుడు అట్టి తాపము గలిగి అశాంతుడై యుండెను. వాడొక దున్నపోతు. దున్నపోతులు తాపమును సహింపలేవు. సూర్యుడు తాపహేతువు అనుకొని అతని కడకు పోయెను. ఆయన రథమునకు కట్టబడిన ఏడు గుఱ్ఱములు ఆకుపచ్చ వన్నె కలిగి పచ్చిగడ్డివలె నుండుట చూచి పచ్చిగడ్డియని నమలి వైచెను. అనగా యుద్ధమున సూర్యుని విరథాశ్వుని చేసినాడనుట (గుఱ్ఱములు లేని రథమున్నను లేనట్టిదే). సూర్యుని కిరణములకు అశ్వములను పేరు కలదు. మహిషాసురుని తేజము ముందు సూర్యుని తేజము వెలవెలబోయెననుట, సూర్యుడు తేజోవంతుడై వుండుట సహింపని మహిషుడు సూర్యుని తేజోహీను నొనెర్చెననుట లోకమున తానే అధిక తేజశ్శాలినను గర్వముగల సూర్యుని యుద్ధమున నోడించి గర్వహీను నొనరించె ననుట సూర్యునోడించి తనను తపింపజేయు వాని శక్తిని రూపు మాపి నాడనుట ఇట గ్రాహ్యములు. ఎంత చలికాలము నందైనను దున్నపోతు అగ్నిని సహింపదు, సమీపించదు. దానిలోని తాపముచే చలియే వేయదేమో అన్నంత నిబ్బరముగా నుండును. మహిషాసురుడు అగ్నితేజమును సహింపక వానితో యుద్ధము చేసి అగ్నిని నిస్తేజు నొనర్చెను అని **అప్రసోఢానలోష్మా** అను సమాసము తెలుపును. దున్నపోతునకు

దురద ఎక్కువైనప్పుడు చెట్టునకు రాచుకొని దురద తీర్చుకొనును. మహిషాసురునితో పోరాడుట కెవడును సాహసింపక పోవుటచే వానికి యుద్ధకండూతి తీవ్రమయ్యెను. ఇందఱ నోడించి నను శివుడు తనకోడలేదను కొఱత వాని కుండెను. యుద్ధమునకు వాని యొడలు తహతహలాడు చుండెను. అందుచే వాడు శివునితో యుద్ధము చేసి వాని యొడలి దురద తీర్చుకొనెను. జగత్సంహారకస్థాణువు అనగా శివనామక రుద్రుడు తనను సంహరించలేక పోయెనని వాని దురద మరల ఎక్కువయ్యెనో? స్థాణు కండూ శబ్దములీ యర్థమును వ్యంజించును. తన వంటి దున్నపోతుతో పోరాడిన దురద తీరునేమో అని అట్టి దున్న ఎక్కడైన ఉన్నదా అని ఆలోచించెను. సంహారకత్వసామ్యముగల యముడు స్మరణమునకు వచ్చెను. వెంటనే యముని వాహనము యొక దున్నపోతని స్మరణకు రాగా యముని కడకు పోయెను. యముడు వేగముగా పారిపో దలచెను. కాని వాని దున్న అందుకు సహకరించ లేదు. దాని నడక మందముగానే ఉండెను. ఎంత దూరముగా పోవలెననుకొన్నను మహిషాసురుడు తనకు దగ్గఱలోనే యుండెను. పారిపోవుటకును చేతగాని ఈ యమునితో గాని ఆతని వాహనముతో నేమి హానియని మరలిపోయెను. ద్వితీయ పాద ద్వితీయార్థమీ యర్థమును వ్యంజించును. మహిషాసురునకు శరీరాంతర్బాహ్యతాపము హెచ్చెను. తాపము హెచ్చినపుడు దున్నపోతు బురదలో మునిగి తీర్చుకొన యత్నించును. ఆ ప్రయత్నమున నల్లగానున్న యొక్క పదార్థము కనిపించెను. సమీపింపగా ఆ పదార్థము విష్ణువని ఆతడు కూడ ఓడింపదగిన వాడేయని ఆతనితో తలపడి యాతనిని రక్తమాంససమిశ్రితబురదగా చేసికొని ఒడలికి పూసికొన్నంత పని చేసెను. అనగా కొమ్ములతో గ్రుమ్మి కాళ్ళతో బురదతో సంతోషముగా యథేచ్ఛగా క్రీడించెను. వాడా సంతోషమున నుండగా విష్ణువు ఎప్పుడో జారి (పారి) పోయెను. తృతీయ పాద ప్రథమార్థ మీ యర్థమును వ్యంజించును. మరింత పలుచగా నున్నచో పూసికొనుటకు బదులుగా మునుగ వచ్చుననుకొని ఆ విష్ణువు శయనించు సముద్రము చేరెను. సముద్రాది దేవతయైన వరుణుడు వీనిని చూచి వేగముగా ప్రవాహమై పారిపోయెను. ప్రవాహము మిక్కిలి పెద్దదిగా నుండుటచే ఎంతసేపు ప్రవహించినను ఆ మహిషునకు సమీపముననే ఉండెను. ప్రవహించి పారిపోవు జలముకన్న నిలిచియుండు జలముకల మడుగు లభించిన బాగుండునని వాడు తలపోసెను. శాశ్వతముగా అందు మునిగి యున్ననే కాని తన తాపము శమింపదనియు నిశ్చయించుకొనెను. **మజ్జనాయ ఇవ** అను పదము లీ యర్థమును వ్యంజించును. శాశ్వతముగా తాపము శమింపజేయు నొక హ్రదమున (మడుగున)కై సాధకునివలె ఎన్నేండ్లో ఎదిరించుచు పిచ్చి పట్టినట్లు వీరు వారను తారతమ్యములేక అందఱిని కుమ్మి వైచుచు, త్రొక్కి వైచుచు లోకమంత తిరిగెను. తనలోని అశాంతిని లోకమంతను నింపి వైచెను. జీవునియొక్క లోకముయొక్క దుఃఖహేతువైన పాపము శమించి పోగా ఎన్నో పూర్వజన్మల నొనర్చిన పుణ్యము ఫలించగా అమ్మవారి ఎఱ్ఱని లత్తుకయను బురద పూయబడిన పాదము కనిపించెను. మహిషుని దృష్టిలో వర్షాకాలమున నేర్పడిన బురద గుంటవలెనున్న ఆ పాదహ్రదమున మునుగ యత్నించుచు ముందుగా కొమ్ములతో కూడిన తల నందు ముంచ బోయెను. కొమ్ముకొన పాదనూపురమున

కంటుకొని మిగిలియున్నదేమో, ఏమి జరిగినదో (అమ్మవారు వానిని త్రొక్కగా) మహిషుడే బురదగా మారి అమ్మవారి పాదమున లత్తుకయే అయిపోయెను. అనగా మహిషునికి సశరీరముగా సాయుజ్యము సిద్ధించినది. వానికి శాశ్వతమైన స్వస్థత యేర్పడినది. శాశ్వతముగా తాపము శమించినది. (తాప మనుభవించు మనస్సే నశించి మహిషజీవునికి బ్రహ్మాత్మకస్వస్వరూపమే సాక్షాత్కరించినది) అట నున్నదిక ఆనందప్రదమే. అట్టి సచ్చిదానందస్వరూపిణియైన దుర్గ కైవల్యశ్రీని మీకు కాదు, మన కందఱకు అనుగ్రహించు గాక! చతుర్థ పాదమీ యర్థమును వ్యంజించుచున్నది. **హరితహరేః** అను సమాసమున యమక మున్నది. **ప్రతిమహిషరుషే** అను శబ్దములలో అనుప్రాస మున్నది. మహిషాసురునిలోని అసురత్వమును, మహిషత్వమును, స్థాణౌ – కృష్ణమ్ పదములలోని శబ్దశ్లేషబలమున **అప్రసోఢానలోష్మా కండూం వినీయ** పదములలోని అర్థశ్లేషబలమున నిరూపింపబడుట స్థాణువృక్షకృష్ణపంక తదభయైక్యము సిద్ధపఱచబడినది. శ్లోకము **స్వభావోక్త్యలంకృతమైనది.** మొదటి పాదములోని శష్పలోభాదివ అను హేతూత్ప్రేక్ష దున్నపోతునకు గల అశ్వవైరము తన్మూలకముగా కాంతి (జ్ఞాన) వైరము అను రాక్షస సహజమైన తమః (చీకటి) స్వభావము వ్యంజింప జేసినది. కిరణములను గుఱ్ఱములను చెప్పు అశ్వశబ్దముయొక్క ద్వ్యర్థ ప్రతిపాదక శబ్దమూలమున వ్యంజింపజేయబడినది. అట్లే **మజ్జనాయేవ** అను **ఫలోత్ప్రేక్ష** ప్రాదమివ పాదమ్ అను వస్తూత్ప్రేక్షలు శ్లోకములోని స్వభావోక్తికి అనుగుణములుగా నుండుట ఎంతో సుందరముగా నున్నది. తాపశమనమును స్వర్గప్రాప్తి చెప్పు స్వస్థశబ్దము మహిషుని అపవర్గప్రాప్తిని కూడ వ్యంజింపజేయుట ఈ శ్లోకముయొక్క సౌందర్యము నత్యంతము పెంపొందించినది. **గ్రస్తాశ్వ** శబ్దము మహిషజీవుని సువర్ (ద్యు) లోకప్రాప్తిని, **అప్రసోఢానలోష్మా** శబ్దము చంద్రలోకప్రాప్తిని, **స్థాణు**శబ్దము శివలోక (కైలాస) ప్రాప్తిని, **అంతకోపాంతవర్తి** శబ్దము యమలోకప్రాప్తిని (యమలోకము పాపులకు మాత్రమే దుఃఖమును కలిగించును. పుణ్యులకు సుఖమును కలిగించును. చతుర్ద్వారమైన యమలోకమును పాపులు దక్షిణద్వారమున ప్రవేశించెదరు. పుణ్యాత్ములు మిగిలి ప్రాక్పశ్చిమోత్తర–ద్వారముల ప్రవేశించెదరు) **కృష్ణవరుణ** శబ్దములు సముద్రమందలి శ్వేతద్వీపమందలి విష్ణుసారూప్య (వైకుంఠ) ప్రాప్తిని పిదప ఆ లోకముల నన్నింటిని ఆయా దేవతల నోడించి అనగా (దాటి) అతిక్రమించి మణినూపురాస్పదమైన దేవీ పాదమును పొందుట అను అర్థముగల చతుర్థపాదము అమ్మవారి లోకమైన మణిద్వీపముయొక్క ప్రాప్తితోపాటు మాండుక్యోపనిషత్తున చెప్పబడిన చతుర్పాదాత్మ ప్రతిపాదకోంకార మాత్రలలోని చతుర్థ మాత్రార్థస్వరూపమైన బ్రహ్మైక్యమును వ్యంజించుచున్నది. ఇతర దేవతాలోకములు సాతిశయత్వముచేత పూర్ణసుఖమును కలిగించలేకపోవుటచే నిరతిశయసుఖప్రాప్తిరూపస్వాస్థ్యము అమ్మవారి పాదమునందే అను **దేవీ పారమ్యమిందు ధ్వనించుచున్నది.**

*

**అవ :** పై శ్లోకమున సూర్యశివవిష్ణ్వాదులైన కొందఱు దేవతలను మహిషుడు జయించుట చెప్పబడినది. ఈ శ్లోకమున ఇంద్రాది పంచలోకపాలకులను బ్రహ్మను జయించుట చెప్పబడుచున్నది.

శ్లో॥ త్రైలోక్యాతఙ్కశాన్త్యై ప్రవిశతి వివశే ధాతరి ధ్యానతన్ద్రీ-
మిన్ద్రాద్యేషు ద్రవత్సు ద్రవిణపతిపయఃపాలకాలానలేషు ।
యే స్పర్శేనైవ పిష్ట్వా మహిషమతిరుషం త్రాతవన్తస్త్రిలోకీం
పాన్తు త్వాం పఞ్చ చణ్డ్యాశ్చరణనఖనిభేనాపరే లోకపాలాః ॥ 9

ప్ర : త్రైలోక్యాతంకశాంత్యై = మూడు లోకముల భయముయొక్క శాంతికై, వివశే = వివశుడైన, ధాతరి = బ్రహ్మ, ధ్యానతంద్రీమ్ = ధ్యాననిశ్చలత్వమును, ప్రవిశతి = ప్రవేశించగా, ఇంద్రాద్యేషు = ఇంద్రుడు మొదలైన, ద్రవిణపతిపయఃపాలకాలానలేషు = కుబేర వరుణ యమాగ్నులు, ద్రవత్సు = పారిపోవుచుండగా, అపరే = ఇతరులైన, యే = ఏ, చంద్యాః = చండియొక్క, చరణనఖనిభేన = కాలిగోళ్ళ మిషతో, లోకపాలాః = లోకపాలకులు, స్పర్శేన ఏవ = స్పర్శతోడనే, అతిరుషమ్ = మిక్కిలి కోపముగల, మహిషమ్ = మహిషుని, పిష్ట్వా = పిండిచేసి, త్రిలోకీమ్ = మూడు లోకములను, త్రాతవంతః = కాపాడిరో, తే = ఆ, పంచ = ఐదుగురు, త్వామ్ = నిన్ను, పాంతు = కాపాడుదురు గాక!.

**తా :** మహిషుని జయించలేక వివశుడైన బ్రహ్మ త్రిలోకమునకు వానివలన కలిగిన ముప్పును తప్పించుటకు ఏమి చేయవలెనను ఆలోచనలో మునిగి పోయెను. లోకపాలకులైన ఇంద్ర కుబేర వరుణ యమాగ్నులు పారిపోవుచుండగా అమ్మవారి ఎడమపాదము నందలి గోళ్ళు అను ఐదుగురు లోకపాలకులు స్పర్శ మాత్రమున మహిషుని పిండి చేసి లోకత్రయమును కాపాడిరి. ఆ అమ్మవారి అపరలోకపాలకరూపములైన ఐదుగోళ్ళు నిన్ను కాపాడుగాక!

**వి :** ఇంద్రుడు, అగ్ని, యముడు, నిరృతి, వరుణుడు, వాయువు, కుబేరుడు, ఈశానుడు అను ఎనమండుగురు అష్టదిక్కుల (తూర్పు, ఆగ్నేయము, దక్షిణము, నైరృతి, పడమర, వాయవ్యము, ఉత్తరము, ఈశాన్యము) కు అధిపతులు. వీరి నష్టదిక్పాలకులందురు. ఈ దిక్కులలో మూలలను (ఆగ్నేయము, నైరృతి, వాయవ్యము, ఈశాన్యము) విడచి మిగిలిన నాలుగు దిక్కుల (తూర్పు, దక్షిణము, పడమర, ఉత్తరము) ను పాలించు ఇంద్రుడు, యముడు, వరుణుడు, కుబేరుడు అను నలుగురు అగ్నియు కలిపి ఐదుగురిని పంచలోకపాలకులందురు. వీరిలో అగ్ని యొకడు మూల నేలువాడు. ఇంద్రునకు కుడిభుజమువలె కుడివైపు ఉండుటచే లోకపాలక పదవి నింద్రు డిచ్చెనేమో! ఇంద్రుడష్టదిక్పాలకులలోను పంచలోకపాలకులలోను ముఖ్యుడు. ఆయన దిక్పాలకాధిపతి మరియు లోకాలకధిపతి. ఏ దిక్కున నివసించువారికైె ఈ అయిదుగురు లోకపాలకులే దిక్కు. మహిషునిచే జయింపబడి వీరైదుగురికి దిక్కుతోచక ఏ దిక్కునకో పారిపోవుచుండగా ఆ లోకములో నుండువారి గతి యేమి? ఈ లోకమును పాలించువారైన అయిదుగురు పంచత్వమును అయిదుతనము కలవారయ్యు దానిని విడచి ఒక్కొక్కరుగా పారిపోవుచుండగా వారు ఏకాకులైరి. ఎట్లో తిరిగి కలిసి పంచత్వము కలవారై బ్రహ్మ దగ్గఱకు పోయిరి. బ్రహ్మ అంతకు ముందే ఈ ముల్లోకపు ముప్పుగా నున్న మహిషుని కోడి వివశుడై యుండెను. కర్తవ్యమేమి? అను ఆలోచనలో పడి నిశ్చలుడయ్యెను.

కాలు సేతులు కదలుటయే లేదు. నిశ్చేష్టుడైన ఆతనిని జూచి కొందఱు (రాక్షసులు) అలసి కాలు సేతులాడించలేని సోమరి యయ్యె ననుకొని మహిషునితో పాటు విడచిపోయిరి. కొందఱు (దేవతలు) ఏదో యుపాయము నాలోచించుచున్నాడని, ఈ ముప్పు తప్పింపగలడని ఆశించుచు విశ్వసించుచు మాట్లాడించిన ఆయన సమాధి భంగమగునేమో యని, తోచక, తోచిన దిక్కునకు పోయిరి. మిగిలిన దేవతలు మనుష్యులును పాలకులుండవలసిన దిక్కులలో వారు లేకపోగా పంచత్వమ్ము (నాశము) నొందినారేమో అని భావించి దిక్కులేని వారై ఎచ్చటికో పోయి దాగుకొనిరి. దయాళువైన అమ్మవారి ఎడమపాదమునందలి అంగుష్ఠాది పంచనఖము లా పంచలోకపాలకత్వమును వహించి మహిషుని స్పర్శమాత్రమున పిండి చేసెను. లోకపాలకులు చేయలేని మహిషనాశకృత్యము నొనరించి లోకపాలకనామమును ధరించిన వారైరి. పాత లోకపాలకులను పూర్వము లోకములను కాపాడుటచే పూర్వలోకపాలకులని చెప్పవలెను. అమ్మవారి ఈ గోళ్ళు లోకపాలకకృత్యము నప్పుడొనరించుటచే అపరలోకపాలురు అనవలసి వచ్చెను. అపర అనకపోయినను బ్రతుకు మీది ఆశతో పారిపోవుచుండిన ఆ లోకపాలకులే ఈ లోకపాలురేమో అను భ్రాంతి ఎవరికైనను ఎప్పుడైనను కలుగ వచ్చును. వారికి వీరికి పేరొకటైనను హస్తిమశకాంతంతరమున్నదని వ్యంజించుట **కపరశబ్దము** ప్రయోగింపబడినది. అపరశబ్ద ప్రయోగముచే ఈ శ్లోకమున తాద్రూప్యరూపకము చరణనఖములు కప్పిపుచ్చ బడుటచే నేర్పడిన అపహ్నవాలంకారమున కంగభావము నొంది యున్నది. **బొటనవ్రేలు** ఇంద్రస్థానీయము. **పొడుగువ్రేలు** యమ స్థానీయము. **నడిమివ్రేలు** వరుణస్థానీయము. **నాలుగవవ్రేలు** కుబేర స్థానీయము. **చిటికెనవ్రేలు** అగ్ని స్థానీయములుగా ఊహించు కొనవచ్చును. **అతిరుషమ్** అను మహిషుని అతికోపమును చెప్పు విశేషణము వాడు మొదలు తన్ని తరువాత మాట్లాడు వాని స్వభావమును వ్యంజించును. అందుచేతనే లోకపాలకులు పారిపోయినారే కాని సామముచే వాని కోపమును మాన్పు యత్నమును (బ్రహ్మతోపాటు) లోకపాలకులు చేయలేదని వ్యంజించును. మహిషునిచే నోడింబడినను పిదప ఏమి చేయవలెనను కనీసమైన బాధ్యత బ్రహ్మ చేసినాడు. కాని లోకపాలకులా బాధ్యత స్మరింపనే లేదనియు వ్యంగ్యమగుచున్నది. (ధ్యానతంద్రీం) **ప్రవిశతి** అను వర్తమానార్థక శత్రంతము బ్రహ్మ విశేషణము. **ద్రవత్సు** అను వర్తమానార్థక శత్రంతము లోకపాలకులకును కూర్చబడుటచే బ్రహ్మ ఆలోచించు చుండగనే లోకాలకులు పారిపోవుచుండగనే అమ్మవారి పాదాంగుళులు మహిషుని పిండిచేసి త్రైలోక్యాతంకమును పోగొట్టి లోకపాలక నామము సార్థక పఱచుచున్నవి అను అర్థమును వ్యంజించును. ప్రవిశతి వివశే, ద్రవత్సు ద్రవిణ, పయః- పాలకాలానలేషు అను పదబంధములలో **అనుప్రాసాలంకార** మున్నది. **నిభేన** అనుటకు బదులు **మిషేణ** అని ఉండుట బాగనిపించుచున్నది. *

**అ :** పై శ్లోకమున అమ్మవారి చరణ నఖములందు (అపర) లోపాలకత్వ మారోపింపబడినది. ఈ శ్లోకమున వాని యందు **చంద్రత్వము** వ్యంజింప చేయబడుచున్నది.

శ్లో॥ ప్రాలేయోత్పీడపీవ్నాం నఖరజనికృతామాతపేనాతిపాణ్డుః
పార్వత్యాః పాతు యుష్మాన్పితురివ తులితాద్రీన్ద్రసారస్స పాదః ।
యో ధైర్యాన్ముక్తలీలాసముచితపతనాపాతపీతాసురాసుః
నో దేవ్యా ఏవ వామశ్చలమహిషతనోర్నాకలోకద్విషోఽపి ॥ 10

ప్ర : ప్రాలేయోత్పీడపీవ్నామ్ నఖరజనికృతామ్ = మంచుయొక్క ఉత్పీడనముచే లావైన గోళ్ళ పుట్టుకకు హేతువులైన వ్రేళ్ళయొక్క, ఆతపేన = కాంతి (ఎండ) చేత, అతిపాండుః = అతి తెల్లనైన, పితుః = తండ్రియొక్క, పాదః = క్రింది భాగము వలె, తులితాద్రీంద్రసారః = పర్వతేంద్రముయొక్క జలముతో సమానమైన బలముగల, యః = ఏది (పాదము), ధైర్యాత్ = ధైర్యమువలన, పార్వత్యాః = పర్వతపుత్త్రియైన, దేవ్యాః = దేవియొక్క నాకలోకద్విషః = దేవలోకవిరోధియైన, చలమహిషతనోః = చలించు మహిషుని శరీరముయొక్క, ముక్తలీలాసముచితపతనాపాతపీతాసురాసుః = విడువబడిన క్రీడకు తగిన పతనము కల తీవ్రపాతముచేత త్రాగబడిన రాక్షసుని ప్రాణములుగల, నో వామః అపి = (మహిషాసురునికి) సుందరము దక్షిణము కానిదైనను,నో వామః ఏవ (ఇతరులకు) = దక్షిణమేయైన (అమ్మవారికి), ఎడమదే యైన పాదము, యుష్మాన్ = మిమ్ము, పాతు = కాపాడుగాక!

**తా :** మంచురాపిడిచే వాచియున్న వ్రేళ్ళయొక్క గోళ్ళకాంతిచే తెల్లనైనది తండ్రియైన హిమవంతుని పాదమువలె పర్వతేంద్రముయొక్క బలమువంటి బలము కలదియు, ధైర్యమువలన లీలా సముచితముగా గట్టిగా అడుగు మోపుటచే మహిషుని (రాక్షసుని) ప్రాణములు ద్రాగిన, దేవతాశత్రువైన మహిషునికి సుందరము కాక పోయినను మహిషవధోద్యుక్త మగుటచే దేవతలకు సుందరమే యైన కార్యనిర్వహణదక్షమేయైన **పార్వతీదేవియొక్క ఎడమపాదము మిమ్ము కాపాడుగాక!**

**వి :** ప్రథమపాదమున హిమాద్రిపుత్త్రిక హిమముపై నడచుట తప్పక పోవుటచే, దానిపైన నడచుటచే అమ్మగారి కాలి వ్రేళ్ళు వాచి యున్నవి. అందుచే అవి బలిసినట్లు కనబడుచున్నవి. ఆ వ్రేళ్ళ కాంతిచే పాదము మిక్కిలి తెల్లబడినదట. అనగా వ్రేళ్ళ గోళ్ళు చంద్రసదృశము లగుటచే వాని కాంతి పాదముపై వ్యాపించి పాదము మిక్కిలి తెల్లగా నున్నదనుట, వ్రేళ్లనక **నఖరజనికృతామ్** గోళ్ళ పుట్టుకకు హేతువులనుటచేత **పర్యాయోక్త్యలంకారచ్ఛాయ** ఏర్పడుచున్నది. మరియు గోళ్ళకు గల చంద్రసాదృశ్యము **ఆతప** శబ్దముచే ఆ గోళ్ళనుండి బహిర్గతమగు కాంతికి వెన్నెలతోడి పోలిక వ్యంగ్యము అగుటచే **ఉపమాలంకారము** ధ్వనించుచున్నది. రెండవ పాదమున పర్వతరాజపుత్త్రిక– పాదము పర్వతరాజపాదము వలెనే బలము కలిగియున్నదనుట వ్యంగ్యమగుచున్నది. పార్వతికి తండ్రి పోలిక వచ్చిన దనియు ధ్వనించుటచే ఆడపిల్లలకు తండ్రి పోలిక వచ్చిన మంచిదను లోకవిశ్వాసమునకు అనుగుణముగా ఈ విషయము ధ్వనింపజేయబడినది. పితుః పాద ఇవ పార్వత్యాః పాదః అని పాదశబ్దావృత్తితో అమ్మవారి పాదమునకు తండ్రిపాదముతో పోలిక చెప్పబడినది. (పర్వతము క్రిందిభాగము పర్వతపాదమనుట సంస్కృతవ్యవహారసిద్ధము). మూడవ పాదమున అమ్మవారి ధైర్యము పేర్కొనబడినది. పర్వతములు వాయువునకు కదలక పోవుట

ధైర్యము. రాజులకు శత్రువులకు భయపడక పోవుట ధైర్యము. పర్వతరాజైన హిమాద్రి ధైర్యము అమ్మవారి తండ్రి పోలిక. కావున సంక్రమించుటలో వింత లేదు. కాని ఆడపిల్లల కాటలోనే ధైర్యము తక్కువగా నుండును. ఇక పోట్లాటలో ధైర్యమే ఉండదు. పార్వతి కాటలోను అడుగిడుట, నడచుట, పరువెత్తుట మొదలగు లీలలలో పాదము సున్నితముగా మోపబడుచుండును. ఇసుక యందు కూడ ముద్రలు పడనంత సుకుమారముగా మోపబడుచుండును. మహిషాసురునిమీద మోపబడినప్పుడది పాదముయొక్క పతనము కాక ఆపాతమైనది. మహిషపాతమునకే హేతువైనది. వాని రక్తము నంతయు త్రాగి వైచినది అను అర్థము వ్యంజితమైనది. నాల్గవ పాదమున ఇంతకు మహిషుని త్రొక్కి చంపిన ఆ పాదము వానిని సంహరించుటకు దక్షమైనందున దక్షమే అనవలె గదా! అను ప్రశ్నమునకు 'నో వామః' అను సమాధానము చెప్పబడినది. నో వామః అను పదములు ఆ పాదము దక్షపాదము, వామపాదము కాదు అను అర్థము నొసగును. వాస్తవమునకు అమ్మవారు వాని మీ ద మోపిన పాదము వామమే. వామ శబ్దమునకు విపరీతము, ఎడమ, సుందరము అను అర్థము లున్నవి. శరీరమున కుడి భాగము దృఢముగా ఎక్కువ బలము కలదై యుండును. మహిషుని ప్రాణముల దీయుటలో నిది దక్షమే. దక్షిణ పాదమే. కాని వానియందు దానికి దాక్షిణ్యము లేదు. కావున అది వామమే అని చెప్పదగి యున్నది. పాపి కావున మహిషునియందు దాక్షిణ్యము (దయ) లేకపోవుటచే అది వామమని చెప్పబడినదే కాని వాని ఉసురు త్రాగుటలో నది దక్షమే అయినది. కుడిపాదమున కేమియు బలమున తీసిపోలేదు అను అర్థము వ్యంజింపబడినది. మరియు ఆమె దృష్టికి చూచువారి దృష్టికిని అది ఎడమపాదమే. చలమహిషతనువు పాలికది (ఎడమదో కుడిదో) అది అచలమే. కొండ మీదబడ్డట్లు పడి వాడు పిండి పిండి ఆయెను. ఎడమ పాదము శత్రువు నెత్తిపై పెట్టుదమని వీరులు ప్రగల్భము లాడుచుండెదరు. వారట్లు పెట్టగలుగుదురో లేదో (అది యుద్ధానంతరము) శత్రువోడిన గదా అట్లు పెట్టుట సాధ్యమగును. అమ్మవారు మాత్రము అట్టి ప్రగల్భము లాడక ఎడమ పాదమును మోపనే మోపినది. వాడు చావనే చచ్చినాడు. ఓడినవాని నెత్తిపై నెడమ కాలినెవరైన మోపి యుండవచ్చునేమో (కాని వారు చచ్చిన నిదర్శనము లేవియు పురాణములలో కానరావు). అమ్మవారి పాదమునందు మాత్రమే అపూర్వమైన కృత్యము సర్వదేవతాసాక్షికముగా జరిగినది. అమ్మవారి పాదమున కెదురుగా నున్న మహిషున కాపాదము తన కుడి వైపున నుండుటచే అది దక్షపాదమే అయినది. కుడి ఎడమ లని నిరూపించుటకు వాడు మిగులనే లేదు. కావున అది (నో వామః) దక్షమే. దేవికే కాదు. చూచు శివునకును అది వామమే. సుందరమే. వామ శబ్దమునకు విపరీతము అను నర్థమున్నదని ముందుగా చెప్పబడినది. ఆడువారు మొగవానితో యుద్ధము చేయుట, ఆ మొగవాడు చచ్చుట, అమ్మవారిలోని వామత్వమును తెలుపును. శివునితో పోరాడునప్పుడు (మదనకదన సమయమున) అప్పుడప్పుడీ వామత్వము వ్యక్తమయినదేమో, శివునకే ఎఱుక. మనకు తెలియదు. శివుడు చెప్పలేదు గదా. అయినను ఆయన ఆ మాట బయటకు చెప్పునా, చెప్పనే చెప్పడు. కాని ఆమె పాదమునందలి వామత్వము మాత్రము సర్వదేవతా సాక్షికమైనది. దేవి కది వామము (విపరీతము) కాదు. కావున అది నో వామః. మహిషునికి వాని

వారికిని అది సబలము కావున '**నో వామః**' అను నర్థము వ్యంజింపబడినది. ఆతపేనాతిపాండుః పితురివ తులిత, సముచిత, పతనాపాత పీతా సురాసుః అను పదబంధములు అనుప్రాసాలంకార–బంధములు.
*

**అ :** పై శ్లోకమున అమ్మవారి నఖములకు చంద్రసాదృశ్యము వాని కాంతికి వెన్నెలతో సాదృశ్యము వ్యంజింపజేయబడినది. ఈ శ్లోకమున స్వకాంతిజ్యోత్స్నారూపముతో **దేవీ పాదనఖములు నృసింహుని హసించినట్లు** ఉత్ప్రేక్షింపబడుచున్నది.

**శ్లో॥ వక్షో వ్యాజైణరాజః స దశభిరభినత్పాణిజైః ప్రాక్సురారేః**
**పఞ్చైవాన్తం నయామో యువతిచరణజాః శత్రుమేతే వయం తు ।**
**ఇత్యుత్పన్నాభిమానైర్నఖశశిమణిభిర్జ్యోత్స్నయా స్వాంశుమయ్యా**
**యస్యాః పాదే హతారౌ హసిత ఇవ హరిస్సాఽస్తు కాలీ శ్రియే వః ॥ 11**

**ప్ర :** ప్రాక్ = పూర్వము, సః = ఆ, హరిః = సింహము (విష్ణువు), సురారేః = రాక్షసుని (హిరణ్యకశిపువు) యొక్క, వక్షో వ్యాజైణరాజః = ఱొమ్ము అను నెపమున నున్న జింకలరాజును, దశభిః = పది, పాణిజైః = చేతులనుండి జనించినవానిచేత, అభినత్ = భేదించెను. యువతి–చరణజాః = ఆడుదాని కాలినుండి పుట్టిన వార (గోళ్ళ)మైన, ఏతే = ఈ, వయమ్ = మేము, పంచ ఏవ = ఐదుగురమే, తు = కాని, శత్రుమ్ = శత్రువును, అన్తమ్ = చావును, నయామః = పొందించుచున్నాము, ఇతి = అని, ఉత్పన్నాభిమానైః = పుట్టిన అభిమానము గల, నఖశశి–మణిభిః = గోళ్లనెడి చంద్రకాంతమణులచేత, స్వాంశుమయ్యా = స్వకిరణమయమైన, జ్యోత్స్నయా = వెన్నెలచేత, యస్యాః = ఏ దేవియొక్క, పాదే = పాదము, హతారౌ = చంపబడిన శత్రువు కలది కాగా, హసితః ఇవ = అపహసింపబడినట్లు, హరిః = విష్ణువు అయ్యెనో, సా = ఆ, కాలీ = కాళి, వః = మీయొక్క, శ్రియే = సంపదకొఱకు, అస్తు = అగుగాక.

**తా :** హిరణ్యకశిపుని ఱొమ్ము అను జింకను పది గోళ్ళతో భేదించిన విష్ణువును అమ్మవారి పాదము మహిషుని వధించగా ఆడుదాని పాదమునుండి పుట్టిన గోళ్ళమైదుగురుమే వానిని చంపితిమని కాంతి యనెడు వెన్నెల రూపమున అపహసించినట్లున్నవి.

**వి :** విష్ణువు పురుషుడు. ఆయన పురుషసింహుడు కూడా. పురుషసింహముగా అవతరించినవాడు. ఈ శ్లోకమున **హరి శబ్దము** పై అర్థము నంతను తెలుపును. హిరణ్యకశిపువను సురారిని చంపుట కవతరించిన హరి హిరణ్యకశిపువుయొక్క ఱొమ్ము అను మిషతో నున్న జింకను తన రెండు చేతులలోని పదిగోళ్ళచే చీల్చెను. మెత్తని స్వభావముగల ప్రహ్లాదుని గన్న ఱొమ్ము మెత్తనిదై ఉండునని కవి హిరణ్యకశిపుని ఱొమ్ము ఱొమ్ముకాదది ఱొమ్ము అను మిషతో నున్న జింకయే కాదన్నచో జింకలరాజు (కొంచెము దృఢమైనరాజు) అన్నాము సరేనా? ఆ ఱొమ్మును చీల్చుట కా పురుషసింహము రెండు చేతులలోని పదిగోళ్ల నుపయోగించినది. అయినను ఇది అప్పటికి గొప్ప

విషయమే అందురా? ఏమి. గొప్ప సింహమొక చేతితో జింకను చీల్చి చంపును. ఈ విష్ణువను పురుషసింహము రెండు చేతుల గోళ్ళతో చీల్చి చంపెను. అయినను గొప్ప పనియే అనుకొందమన్న అది హరి (హరించువాని (దొంగ)యొక్క) పని అనగా విష్ణువు స్వరూపముతో గాక సింహవేషము వేసికొని దొంగ రూపమున గుర్తింప రాకుండ వచ్చి చేసిన పని అయినను గొప్పదే అని అభిమానము (వైష్ణవాభిమానము)తో ఆ గోళ్ళు అనుకొనుచుండును. ఇంతలో అమ్మవారు ఎడమపాదముతో మహిషుని వధించెను. అమ్మవారి ఆ ఎడమపాదమున కైదే గోళ్ళు. మేమైదుగురుమే. సురారిని (మహిషుని) చంపుచున్నామని విష్ణువును చంద్రకాంతమణులుగా భావింపబడు గోళ్ళకాంతి అను వెన్నెలతో వెక్కిరించినవి. వెక్కిరింపు నవ్వు (అపహాసము) గోళ్ళనెడి చంద్రకాంతమణుల నుండి బయల్వెడలిన వెన్నెల కాంతిగా రూపింపబడినందున ఈ శ్లోకమున రూపకాపహ్నవ గర్భితమైన **ఉత్ప్రేక్షాలంకార** మున్నది. అమ్మవారి ఎడమపాదపు గోళ్ళు మహిషుని చీల్చినవి. మహిషదేహము చాల దృఢముగా నుండును. అయినను ఆ ఐదు గోళ్ళే చీల్చినవి. అమ్మవారెడమ పాదముతో మర్దించినప్పుడీ ఆడుదాని గోళ్ళే మహిషుని దేహమును చీల్చినవి. ఆ సంతోషముతో విష్ణువును వెక్కిరించినవి. సాటివారు పదిమంది కలిసి ఒక పనిచేయగా మేమైదుగురమే అంతకంటె గొప్పపని చేసి మీదేమి గొప్పపనియని అపహసించుట ఈ శ్లోకమున వ్యంగ్యము. విష్ణువునకన్న అమ్మవారే గొప్ప ఎట్లు. హరి అనగా సింహము. దానిని వాహనము చేసికొన్న దమ్మవారు. హరి పదిగోళ్ళతో చేసిన పని నమ్మవారి పాదముయొక్క ఐదు గోళ్ళే చేసినవి. కావున అమ్మవారే గొప్ప అను దేవీ పారమ్యము **అతిశయోక్త్యలంకారచ్ఛాయతో నిరూపింపబడినది**. మేమైదుగురమే మహిషుని చంపుదుమని గోళ్ళనుకొనకపోయినను అనుకొన్నట్లు చెప్పుటయే అతిశయోక్తి. అది ఉత్ప్రేక్షాలంకారమున కంగమే అయినది. అట్లే **నఖశశిమణిభిః** అను సమాసమున **రూపకాలంకార** మున్నది. స్వాంశుమయ్యా జ్యోత్స్నయా అను పదములలోను రూపకాలంకారమున్నది. అవి రెండును ఉత్ప్రేక్షాలంకారమునకు అంగములే అయినవి. *

**అ :** పై శ్లోకమున పాదాంగుళులు మేమైదుగురము మాత్రమే శత్రువు నంతము చేసెదమను వాని మాటలు చెప్పబడినవి. ఈ శ్లోకమున **శివుని మాటలు** చెప్పబడుచున్నవి.

**శ్లో॥ రక్తాక్తేఽలక్తకశ్రీర్విజయిని విజయే! నో విరాజత్యముష్మిన్**
**హాసో హస్తాగ్రసంవాహనమపి దలితాద్రీన్ద్రసారద్విషోఽస్య ।**
**త్రాసేనైవాద్య సర్వః ప్రణమతి కదనేనామునేతి క్షతారిః**
**పాదోఽవ్యాచ్చుమ్బితో వో రహసి విహసతా త్ర్యమ్బకేణామ్బికాయాః ॥ 12**

**ప్ర :** విజయే! = ఓ విజయా!, రక్తాక్తే = రక్తముచే పూయబడిన, విజయిని = విజయము కలిగిన, అముష్మిన్ = దీని (కాలి) యందు, అలక్తకశ్రీః = లత్తుకయొక్క కాంతి, నో విరాజతి = ప్రకాశింపదు, దలితాద్రీంద్రసారద్విషః = ముక్కలు చేయబడిన పర్వతేంద్రసారముగల శత్రువులు గలిగిన, అస్య = దీని (కాలి)కి, హస్తాగ్రసంవాహనమ్ అపి = అరచేతులతో ఒత్తుటయు, హాసః = పరిహాసము,

అద్య = నేడు, త్రాసేన ఏవ = భయముతో వలె, సర్వః = (లోకము) అంతయు, ప్రణమతి = నమస్కరించుచున్నది. అమునా = ఈ, కదనేన = యుద్ధముచేత, క్షతారిః = చంపబడిన శత్రువు కలదైనది, ఇతి = అని, విహసతా = నవ్వుచున్న, త్ర్యంబకేణ = ముక్కంటిచేత, రహసి = రహస్య ప్రదేశమున, చుంబితః = ముద్దు పెట్టుకొనబడిన, అంబికాయాః = అమ్మవారియొక్క, పాదః = పాదము, వః = మిమ్ము, అవ్యాత్ = కాపాడుగాక.

**తా :** ఓ విజయా, ఈ పాదము శత్రువును చంపి నందున వాని రక్తముతో పూయబడి యుండగా లత్తుకయొక్క కాంతి బాగుగా ప్రకాశింపదు. కొండల వంటి దండి శత్రువుల పిండి చేసిన ఈ పాదమును ఒత్తుట కూడ పరిహాసమే అగును. ఈ యుద్ధమున శత్రువు చచ్చినాడను భయముతో నందఱును నమస్కరించుచున్నారని రహస్యముగా శివుడమ్మవారి పాదమును ముద్దిడు కొనెను. అట్టి పాదము మిమ్ము కాపాడు గాక!.

**వి :** స్త్రీలు (భార్యలు) పురుషుల (భర్తలు) కు సాధ్యముకాని కార్యములను సాధించినప్పుడు పురుషులు వారిని ప్రశంసించుటకు మురిపించుట కేదో ఒక పని చేయుట భార్యాభర్తల అనురాగబంధమును పెంచు ప్రక్రియ. మహిషుడు పురుషావధ్యుడు. పురుషుడు పురుషోత్తముడు అయిన శివుడా మహిషుని వధింపఁజాల నప్పుడమ్మ వారా పనికి నడుము బిగించి కార్యమును సాధించినది. అమ్మవారి చెలికత్తె విజయ. స్త్రీలకేమి కావలెనో ఏమి ఇచ్చిన ఏమి చేసిన సంతోషించెదరో స్త్రీలకే బాగుగా తెలియును. కావున శివుడు విజయతో సమాలోచించుచున్నాడు. సంభాషించుచున్నాడు. (లేక విజయే అని దేవినే సంబోధించుచున్నట్లును చెప్పవచ్చును). మహిషుని రక్తము పూయబడిన అమ్మవారి పాదమున అంతకంటె తక్కువ ఎఱుపుగల అంతకు ముందు పూయబడిన లత్తుక విశేషముగా ప్రకాశించదు. పైగా ఇప్పుడు తాను పూసిన లత్తుక ఎఱుపు తగ్గనేమో చాలదేమో రక్తపు టెఱుపును మించదేమో అని తన సంశయమును ప్రకటించినాడు. క్రీడా పర్వతాదుల నెక్కి దిగి అలసినప్పుడు సుకుమారులైన స్త్రీల పాదము లొత్తుట శృంగారనాయకులకు క్రొత్త కాదు. శివునకును కొత్తకాదు. శివున కలవాటైన పనియే. ఇంతవఱకు తాను చేసిన పని తప్పేమో, పొరపాటేమో అని శివున కిప్పుడనిపించుచున్నది. అమ్మవారి పాదముయొక్క శక్తి మహిషుని త్రొక్కి చంపినప్పుడే బయటపడినది. ఆ పాదమున కొండంత బలమున్నది. కావుననే మహిషునిపై మోపగానే వాడు పిండియైనాడు. అట్టి పాదమునకు నొప్పి కలిగినదని దానిని మానుపుటకు సంవాహనము (ఒత్తుట) చేయవలె ననుకొనుట ఆ పాదముయొక్క శక్తి నవమానించి నట్లగునను, పరిహసించినట్లు అగునను శంక శివునకు కలిగెను. ఈ అర్థము శ్లోక పూర్వార్ధమున వ్యంగ్య మగుచున్నది. ఈ పాదముయొక్క కదనముచేతనే కాదు కాదు కదలికచేతనే పైకెత్తి వాని నెత్తిమీద మోపుటచేతనే వాడు చచ్చినాడని అమ్మవారి శక్తికి భయపడిన దేవతలందఱు నమస్కరించుచున్నారు. తాను భీతుడు కాదు గదా, ఈ సందడి లోనను తాను నమస్కరించిన అనగా అందఱ దేవతలవలె పాదములపై తలమోపిన బాగుండదేమో, తనకును భీతి యున్న దనుకొందురేమో, ఒకవేళ అట్లు

చేసినను ఆ సందడిలో ఆమె గమనించునా? అని ఆలోచించి ఆ సందడి తీరిన వెనుక రహస్యముగా ఆమె పాదముపై తలమోపుచు ముద్దు పెట్టుకొన్నాడు. బిగ్గఱగా నవ్వుచు ముద్దుపెట్టుకొన్నాడు. మూడు కన్నులతో పాద సౌందర్యము ననుభవించుచు ముద్దుపెట్టుకున్నాడు. శ్లోకము యొక్క ఉత్తరార్ధమీ యర్థమును వ్యంజింపజేయుచున్నది. ముఖ్యముగా **త్ర్యంబక పదము** నీ పరాక్రమ–సౌకుమార్యమార్దవములకు సూర్యచంద్రాగ్నులే సాక్షులని చెప్పుచున్నట్లు అంబిక పాదము తొలుత నలుపు, గోళ్ళ కాంతితో తెలుపును, మహిషుని రక్తముచే ఎఱుపును పొందినది. మూడు రంగుల సౌందర్యము. ముప్పిరిగొన్న అమ్మవారి పాదము మూడు కన్నులతో చూచుచున్నట్లు వ్యంజించును. రక్తాలక్తక, విజయిని విజయే నో విరాజతి, హాసో హస్తాగ్రసంవాహనమ్, దలితాద్రీంద్రసారద్విషః, రహసి విహసతా, త్ర్యంబకేనాంబికాయా అను పదబంధములలో **అనుప్రాస** సౌందర్య మున్నది. *

**అ :** పై శ్లోకమున లోకేశ్వరుడైన శివు**డమ్మవారి**ని మనసున ప్రశంసించుచు **ముద్దిడు కొనుట** చెప్పబడినది. ఈ శ్లోకమున **లోకమంతయు ప్రశంసించుట** చెప్పబడుచున్నది.

**శ్లో॥ భఙ్గో న భ్రూలతాయాస్తులితబలతయాఽనస్త్రమస్థ్నాం తు చక్రే**
**న క్రోధాత్పాదపద్మమ్మహదమృతభుజాముద్ధృతం శల్యమన్తః ।**
**వాచాలం నూపురం నో జగదజని జయం శంసదంశేన పార్ష్ణే–**
**ర్ముష్ణన్త్యాఽసూన్సురారేః సమరభువి యయా పార్వతీ పాతు సా వః ॥ 13**

**ప్ర :** సమరభువి = యుద్ధభూమియందు, పార్ష్ణే = మడమయొక్క, అంశేన = భాగమున, సురారేః = రాక్షసునియొక్క, అసూన్ = ప్రాణములను, ముష్ణన్త్యా = అపహరించుచున్న, యయా = ఏ దేవిచేత, భ్రూలతాయాః = తీగవంటి కనుబొమ్మయొక్క, భంగః = విఱుపు (మాత్రమే), న చక్రే = చేయబడలేదో, తులితబలతయా = సమానబలము కలిగి యుండుటచేత, అనస్త్రమ్ = అస్త్రము లేకుండగనే, సురారేః = రాక్షసునియొక్క, అస్థ్నాం తు = ఎముకలయొక్క (యు), భంగః = విఱుపు, చక్రే = చేయబడినదో, క్రోధాత్ = కోపమువలన, పాదపద్మమ్ = కమలమువంటి పాదము (మాత్రమే), నో ఉద్ధృతమ్ = ఎత్తబడలేదో, అమృతభుజామ్ = దేవతలయొక్క, మహత్ = గొప్పదైన, అన్తః = లోపలి, శల్యమ్ = ఎముక (యు), ఉద్ధృతమ్ = తీసివేయబడినదో, జయమ్ = జయమును, శంసత్ = ప్రశంసించుచు, నూపురమ్ = అందె మాత్రమే, వాచాలమ్ = ధ్వనించునది, న అజని = కాలేదో, జగత్ = లోకము(ను), వాచాలమ్ = ధ్వనించునది, అజని = ఆయెనో, సా = ఆ, పార్వతీ = పార్వతి, వః = మిమ్ములను, పాతు = కాపాడు గాక!.

**తా :** అమ్మవారి కనుబొమ్మను ముడుచుటతో పాటు సమానబలము కలిగియుండుటచే అస్త్రము లేకుండగనే మహిషుని ఎముకలను కూడ విఱచినది. వాని నెత్తిమీద పాదమును మాత్రమే మోపలేదు. దానితో పాటు దేవతల హృదయములోపలి ఎముకను కూడ తీసివేసినది. అమ్మవారి జయమును ప్రశంసిచుచు అందె మాత్రమే ధ్వనించలేదు. లోకమంతయు ఆ జయమును ప్రశంసించున దయ్యెను. మడమయొక్క అంశమున మాత్రమే మహిషుని ప్రాణముల నపహరించిన పార్వతీ దేవి మిమ్ములను కాపాడుగాక.

**వి :** అమ్మవారి భ్రూలతాభంగముతో బాటు మహిషుని అస్థి భంగము, పాదపద్మోద్ధృతితోపాటు, దేవతల హృదయాన్తశ్శల్యోద్ధృతి చేసినట్లు పాదపద్మోద్ధృతిలో నూపురముచేత స్వజయప్రశంసమును చేయించుటయే కాక లోకముచేతను స్వజయప్రశంసను చేయించునట్లు చెప్పబడినందున **అతిశయోక్త్యలంకృతమైనదీ శ్లోకము**. అమ్మవారు మొదట భ్రూలతాభంగమును పిమ్మట మహిషాస్థిభంగమును చేసినది. అట్లే మొదట తన పాదమును వాని నెత్తిపై పెట్టుట కుద్ధరించినది. ఉద్ధరించిన పాదమును వాని నెత్తిపై పెట్టగా వాడు చచ్చెను. ఆ పిమ్మట దేవతల హృదయాన్తశ్శల్యోద్ధారము జరిగినది. అట్లే పాదము నెత్తినప్పుడు అందె మ్రోగినది. ఆ పిమ్మట లోకము ప్రశంసించుచు మ్రోగినది. మొదటిది కారణము, రెండవది కార్యము. కారణము మొదలు నుండును. పిమ్మట కార్యము కలుగును. కారణము పూర్వభావి, కార్యమనంతర భావి. ఈ రెండు ఒకేసారి యున్నట్లు చెప్పబడుట **అతిశయోక్త్యలంకారము**. ఒక పనితో పాటే మరొక పని జరిగినట్లు చెప్పబడుటచే **సహోక్త్యలంకార స్ఫూర్తియు** నిందున్నది. వాస్తవమున అమ్మవారి పాదమును పైకెత్తునపుడు దాని అందె సహజముగానే మ్రోగినది. దాని నమ్మవారి జయప్రశంసయొక్క మ్రోతగా సంభావింపబడుటచే నీ శ్లోకము యొక్క మూడవ పాదమున అంతః అను ద్వితీయ పాదభాగము, జగదజని జయమ్ జయం శంసదంశేన అను పదబన్ధములు అనుప్రాసాలంకృతములు. రాక్షసునిపై క్రోధముతో అమ్మవారు పాదము నుద్ధరించినది. దేవతల యందలి దయతోడనే వారి హృదయశల్యము నుద్ధరించినది. *

**అ :** దేవతలందు అమ్మవారి దయ పై శ్లోకమున వ్యంజింపజేయబడినది. ఈ శ్లోకమున శివుని ప్రశంసచే **అమ్మవారికి గలిగిన సిగ్గు** చెప్పబడుచున్నది.

**శ్లో॥ నిర్యన్నానాస్త్రశస్త్రావలి వలతి బలం కేవలం దానవానాం**
**ద్రాఙ్నీతే దీర్ఘనిద్రాం ద్విషతి న మహిషీత్యుచ్యసే ప్రాయశోఽద్య ।**
**అస్త్రీసమ్భావ్యవీర్యా త్వమసి ఖలు మయా నైవమాకారణీయా**
**కాత్యాయన్యాత్తకేలావితి హసతి హరే హ్రీమతీ హన్త్వరీన్వః ॥ 14**

**ప్ర :** నిర్యన్నానాస్త్రశస్త్రావలి = జారిపోవుచున్న వివిధాస్త్రశస్త్రములు సమూహము గల, దానవానామ్ = రాక్షసులయొక్క, బలమ్ కేవలమ్ = సైన్యము మాత్రమే, వలతి = పారిపోగా, అద్య = నేడు, ద్విషతి = శత్రువు (మహిషుడు), ద్రాక్ = శీఘ్రముగా, దీర్ఘనిద్రామ్ = దీర్ఘనిద్రను, నీతే = పొందింపబడగా, ప్రాయశః = సాధారణముగా, మహిషీ ఇతి = రాణి అని, న ఉచ్యసే = చెప్పబడవు, త్వమ్ = నీవు, అస్త్రీసంభావ్యవీర్యా = స్త్రీలయందూహింపరాని వీర్యము కలదానవు, అసి = అయి ఉన్నావు, మయా = నా చేత, ఏవమ్ = ఇట్లు, ఆకారణీయా = పిలువబడ దగిన దానవు. న = కావు, ఇతి = అని, ఆత్తకేలౌ = పొందిన క్రీడగల, హరే = హరుడు, హసతి = నవ్వుచుండగా, హ్రీమతీ = సిగ్గు (నొందిన) గల, కాత్యాయనీ = అమ్మవారు, వః= మీ యొక్క, అరీన్ = శత్రువులను, హంతు = చంపుగాక!

**తా :** జారిపోవుచున్న శస్త్రాస్త్రసమూహముగల రాక్షససైన్యము పారిపోవుచుండగా, శత్రువైన మహిషాసురుడు దీర్ఘనిద్రను పొందింపబడగా నిన్ను మహిషి అనరాదు. స్త్రీలలో ఊహింపరాని వీర్యము గల దాని నట్లు పిలువరాదు. ఇట్లు శివుడు క్రీడాసమయమున పరిహసించుచుండగా సిగ్గునొందిన కాత్యాయని మీ శత్రువుల సంహరించుగాక!

**వి :** మొదటి పాదమందలి కేవల శబ్దము మొదట నానాశస్త్రాస్త్రముల ధరించి వచ్చిన దానవసైన్యము వానిని యుద్ధభూమియందు జాఱవిడిచి ప్రాణరక్షణమునకై వానిని మరల గైకొనుటలో ఆలస్యమై అమ్మవారిచేత చావ వలసివచ్చునను భయముతో తమ ప్రభువునకు బాసటగా వచ్చియు ప్రభువును కాపాడలేక వాడు చావగా వాని శవమును సైతము కొనిపోవుటకు యత్నింపక పారిపోవుటను వ్యంజించుచున్నది. మహిషనామము గల శత్రువును దీర్ఘనిద్రను పొందించి అనగా చంపియున్నందున మహిషి అని వాని పేరును స్ఫురింపజేయు శబ్దముతో నిన్ను పేర్కొనుట గాని పిలుచుట గాని యుక్తము కాదని, పైగా మహిషీ శబ్దము స్త్రీలింగము కావున స్త్రీలలో ఊహించరాని పరాక్రమము గల నిన్ను ఆ పేర పిలుచుట నీకు అవమానము కలిగించునను అర్థమును వ్యంజించు శివుని పల్కులు మొదటి మూడు పాదములలో చెప్పబడినవి. **మహిషీ శబ్దమునకు** పట్టాభిషిక్తురాలైన రాజ్ఞి అను అర్థముతోపాటు మహిషస్త్రీ అను అర్థమును కలిగియుండుటచేత శత్రుస్త్రీ ప్రసంగముచేత రసభంగము కలుగును గదా! ఒక వైపు మహిషి అని పిలువదగిన దానవు కావనుచు మహిషీ శబ్దము నుచ్చరించిన శివుని ప్రగల్భవాఙ్నైకపుణ్యమును ఈ శ్లోకము వ్యంజింపజేయుచున్నది. మహిషియై అనగా బలహీనస్త్రీత్వము గలదై మహిషుని చంపుట అను విశేషణమును శివుని పలుకులు వ్యంజించుచున్నవి. పశువైన మహిషుని చంపిన మహిషియైన, పశుపతి యైన తనను మెప్పించగల ఆ కాత్యాయనియందు శివునకు కల్గిన ప్రేమావేశము **నాత్తకేలౌ** అను చతుర్థపాదమందలి పదము వ్యంజించుచున్నది. **వలి వలతి బలం కేవలమ్** అను పదబంధమున ఛేకానుప్రాస మున్నది. ద్రాఙ్నీతే దీర్ఘనిద్రాం ద్విషతి మహిషీ ఇతి హసతి హరే హ్రీమతీ హంత్వరీన్వః అను పదబంధము లనుప్రాసశోభితములు. బలం కేవలం అను పదములనుండి లం బీజమును ఉద్ధరించుకొను నవకాశముండుటచే **శ్లోకముయొక్క మంత్రాత్మకత సిద్ధమగుచున్నది.** ఈ శ్లోకము పూర్వార్ధమున **పంచదశీమంత్రములోని వాగ్భవకూటము** ఉద్ధరింపబడు నవకాశము కలదు.

| శ్లోకాంశము | మంత్రాంశము | | |
|---|---|---|---|
| (క+ఈ) కేవలమ్ | క+ఈ, ల | | |
| నీతే (త్+ఏ) | ఏ | | |
| మహిషీ (హ్+ఇ) | **హ్** | | |
| ద్రాక్ (ద్ ర్ అ) | **ర్** | **హ్రీమ్** | **వాగ్భవకూటము** |
| నీతే (న్+ఈ) | ఈ | | |
| కేవలమ్ | మ్ | | |

ఉత్తరార్ధమున పంచదశిలోని మిగిలిన కామరాజ, శక్తి కూటములు ఉద్ధరింపబడు నవకాశము కలదు.

| శ్లోకాంశము | మంత్రాంశము | |
|---|---|---|
| హసతి | హ స | |
| (క+అ) కారణీయ | క | |
| హరే | హ | **కామరాజకూటము** |
| ఖలు (ఖ్ అ ల్ ఉ) | ల | |
| హ్ర్ ఈమ్ + అతీ (హ్రీమతీ) | హ్రీమ్ | |
| సమ్భావ్య | స | |
| (క+ఈ) కేలౌ (ల+ఓ) | క ల | **శక్తికూటము** |
| (మ్ అమ్) హంత్వరీన్ (ర్+ఈ) | హ్రీమ్ | |

ఇట్లు **పంచదశియేకాక ద్రామ్ ఆమ్ హ్రీమ్ క్రోమ్ వంటి బీజాక్షర మంత్రముల నుద్ధరించుకొను నవకాశము** కూడ నున్నది. పైన పేర్కొనబడిన అంశములవలన స్తోత్రకర్తయొక్క వివిధ-మంత్రోపాసకత, శ్లోకముయొక్క మంత్రాత్మకతయు వ్యంగ్యములగు చున్నవి. *

**అ :** పై శ్లోకమున శివుని మాటలు చెప్పబడినవి. ఈ శ్లోకమున అమ్మవారి మాటలు చెప్పబడు చున్నవి.

**శ్లో॥ జాతా కిం తే హరే! భీర్భవతి మహిషతో భీరవశ్యం హరీణా-**
**మద్యేన్దోర్ద్వౌ కలఙ్కౌ త్యజతి పతిరపాం ధైర్యమాలోక్య చన్ద్రమ్ ।**
**వాయో! కమ్ప్యాస్త్వయాఽన్యే నయ యమ! మహిషాదాత్మయుగ్యం యయాఽరౌ**
**పిష్టే నష్టం జహాస ద్యుజనమితి జయా సాఽస్తు దేవీ శ్రియే వః ॥ 15**

**ప్ర :** హరే! = ఓ హరీ!, తే = నీకు, మహిషతః = మహిషుని నుండి, భీః = భయము, జాతా కిమ్ = కలిగినదా, హరీణామ్ = హరులకు, గుఱ్ఱములకు, భీః = భయము, అవశ్యమ్ = తప్పదు (తప్పక కలుగును), అద్య = నేడు, ఇందోః = చంద్రునకు, ద్వౌ = రెండు, కలంకౌ = కలంకములు, అపామ్ పతిః = వరుణుడు, చంద్రమ్ = చంద్రుని, ఆలోక్య = చూచి, ధైర్యమ్ = ధైర్యమును, త్యజతి = వదలుచున్నాడు, వాయో! = ఓ వాయూ!, అన్యే = ఇతరులు, త్వయా = నీ చేత, కమ్ప్యాః = కదలింపదగిన వారు, యమ! = ఓ యమా!, మహిషాత్ = మహిషునినుండి, ఆత్మయుగ్యమ్ = నీ వాహనము (దున్న) ను, నయ = (దూరము) కొని పొమ్ము, ఇతి = ఇట్లు, యయా = ఏ దేవి చేత, అరౌ = శత్రువు, పిష్టే = పిండి చేయబడగా, నష్టమ్ = పారిపోయిన, ద్యుజనమ్ = స్వర్గములోని జనమును, జయా = జయ, జహాస = నవ్వెనో, సా = ఆ, దేవీ = దేవి, వః = మీ యొక్క, శ్రియే = సంపద కొఱకు, అస్తు = అగుగాక!

**తా :** ఓ హరీ! నీకు మహిషునినుండి భయము కలిగినదా? హరులకు భయము అవశ్యము కలుగును. నేడు చంద్రునకు రెండు కలంకములు, చంద్రుని చూచి వరుణుడు ధైర్యమును వదలు చున్నాడు. వాయూ! నీ వితరుల కంపింపజేయ గలవేమో (మహిషుని నీవు కంపింపజాలవు). ఓ యమా! మహిషునుండి నీ వాహనమైన దున్నను దూరముగా తీసుకొని పొమ్ము. అని అమ్మవారు శత్రువును మర్దించగా దేవతలను దేవి చెలికత్తెయగు జయ వెక్కిరించినది. అట్టి (చెలికత్తెతో కూడిన) దేవి మీకు సంపద నొసగు గాక!

**వి : హరి** శబ్దమునకు జింక, గుఱ్ఱము, సింహము అనవు అర్థము లుండుటచే మొదటి పాదమున ఓ విష్ణూ! నిన్ను హరియని అందఱందురు. నీవు నృసింహావతారము నెత్తితివి. సింహరూపము ధరించితివి. అంత మాత్రమున సింహమునకువలె పరాక్రమనిర్భయతలు కలుగునా? నీకు హరియను పేరు మాత్రమే కాని వట్టి పిరికి వాడవు. అందుచేతనే నీకు జింకవలె భయము కలుగుచున్నది. నీవు జింకవే కాని సింహమవు కావు. నీ పేరైన హరి శబ్దము నీ పిరికితనమును చెప్పుచుండగా నీవు పిరికి వాడవని వేరుగా చెప్పవలెనా? నీ వెక్కడకో దూరముగా పారిపోవు చుండగా చూచితిని. ఇప్పుడు దూరమున గూడ కానిపించక పోయితివి. ఎటుపోయితివి. ఇది వఱకొక హరి(ణము) చంద్రునిలో దాగుకొనియే ఉండెను. దాని వెనుక దాగుకొంటివా? ఓ హరీ! నీవు హయగ్రీవావతారము నెత్తి యుంటివి. వీరభద్రుడు దక్షయజ్ఞమున నీ తల నఱుకగా శివుడు కరుణించి నీకు గుఱ్ఱపు తల నతికించి బ్రతికించినాడు. ఇప్పుడొక వేళ మహిషుడు నీ తలను శృంగములచే విఱిచినను అమ్మవారు మాత్రము నీకు మరొక తల నతికించి బ్రతికించ లేదనుకొంటివా? ఓహెూ! గుఱ్ఱములకు దున్నపోతనిన ఎంతో భయము కలుగును గదా! అందుకే పారిపోయితివి. మహిషుడు (దున్న) అంతవేగముగా పరుగెత్తలేడని నీ యాలోచనము కాబోలు, అను అర్థములు వ్యంగ్యములు. నేడు చంద్రునకు రెండు కలంకములు. ఒకటి హరిణము, రెండవది మహిషుని తోడి యుద్ధము నుండి పారిపోవుట. విష్ణువు మహిషునితోడి యుద్ధము నుండి పారిపోయి పాత హరిణము వెనుక దాగి యున్నాడు. కావున ఒక కలంకమే నీకున్నదని లోకము భ్రమించు-చున్నది. నేనెఱుగుదునులే. నేడు చంద్రునకు రెండు కలంకములు అని నేను చాటుచున్నాను. అను అర్థము రెండవ పాదముయొక్క మొదటి అర్థమున వ్యంగ్యమగు చున్నది. ఆకాశమందుండు చంద్రుడు మహిషాసురునితో యుద్ధము చేయుటకు భూమికి వచ్చి ఓడి పారిపోయి ఆకాశమున మబ్బు చాటు చేసుకొని లోకమునకు ముఖము చూపలేక మబ్బు ముసుగు దాల్చి యున్నాడు. తనలోని జింకనెక్కి పారిపోగల చంద్రుడే పారిపోయిన నేనెచ్చటకి పారిపోగలను. సముద్రమున దాగుకొనిన వాడు సముద్రములోనికి రాక మానునా? కావున యుద్ధము చేసి వానితో నోడి పాఱుట కంటె ముందుగా యుద్ధమునకు పోక పోవుటయే మంచిది. చంద్రునికి పట్టిన గతి నాకేల పట్టకుండును. యుద్ధమున గాయపడుట కంటె యుద్ధము చేయకపోవుటయే మంచిది అని వరుణుడు ధైర్యమునే వదలి వైచెను అను అర్థము ద్వితీయపాద ద్వితీయార్థమున వ్యంగ్యమగు-చున్నది. ఓ వాయూ! చిన్న కొండనే కదలింపజాలని నీవు మహిషుని కంపింపజేయగలవా? పెద్ద

పెద్ద చెట్లను కంపింపజేయుదు నందువా? వానినే కదలించుటకు పొమ్ము అను అర్థము తృతీయ పాద పూర్వార్ధమున వ్యంగ్యమగును. ఓ యమా! ఈ మహిషుడు నీ వాహన మహిషమును చూచి కుమ్మి వైచును. అప్పుడు నీవు వెల్లకిల బడిపోవుదువు. ఆ అవమానము సంభవింపక ముందే దూరముగా దున్నను పఱుగెత్తించి పారిపొమ్ము అను అర్థము తృతీయపాద ద్వితీయార్ధమున వ్యంగ్యమగును. ప్రథమపాదమున **త భ**ల ఆవృత్తి తృతీయపాదమున **య**కారావృత్తి, నాల్గవ పాదమున **జ**కారావృత్తి శ్లోకము ననుప్రాసలతో నలంకరించుచున్నవి. *

**అ :** పై శ్లోకమున దేవి చెలికత్తె జయ మాటలు చెప్పబడినవి. ఈ శ్లోకమున **శివుని భ్రాంతి** చెప్పబడుచున్నది.

**శ్లో॥ శూలప్రోతాదుపాన్తప్లుతమహిమహిషాదుత్పతన్త్యా స్రవన్త్యా**
**వర్త్మన్యారజ్యమానే సపది మఖభుజాం జాతసన్ధ్యాప్రమోహః ।**
**నృత్యన్హాసేన మత్వా విజయమహమహమ్మానయామీతి వాదీ**
**యామాశ్లిష్య ప్రవృత్తః పునరపి పురభిత్పార్వతీ పాతు సా వః ॥ 16**

**ప్ర :** శూలప్రోతాత్ = శూలముచే గ్రుచ్చబడిన, ఉపాంతప్లుతమహిమహిషాత్ = సమీపమున కెగిరిన భూమిగల, మహిషుని నుండి, ఉత్పతన్త్యా = ఎగసిపడుచున్న (అ) స్రవన్త్యా = (రక్త) నదిచేత, సపది = వెంటనే, మఖభుజామ్ = దేవతలయొక్క, వర్త్మని = మార్గము (ఆకాశము), ఆరజ్యమానే = ఎఱుపెక్కు చుండగా, జాతసన్ధ్యాప్రమోహః = పుట్టిన సన్ధ్యా భ్రాంతిగల, పురభిత్ = శివుడు, నృత్యన్ = నర్తించుచు, హాసేన = (ఇతరుల) నవ్వుతో, మత్వా = (సత్యము) తెలిసికొని, అహమ్ = నేను, విజయమహమ్ = విజయోత్సవమును, మానయామి = గౌరవించెదను , ఇతి = అని, వాదీ = పలుకువాడై, యామ్ = ఎవతెను (పార్వతిని), ఆశ్లిష్య = కౌగిలించి, పునః అపి = మరలను, ప్రవృత్తః = పూనుకొనెనో, సా = ఆ, పార్వతీ = పార్వతి, వః = మిమ్ము, పాతు = కాపాడుగాక.

**తా :** శూలముతో గ్రుచ్చబడి భూమినుండి కొంచెము పైకెగిరిన మహిషునినుండి పైకెగిసి పడుచున్న రక్తనదిచే ఆకాశము ఎఱ్ఱబారగా సంధ్యాకాలభ్రాంతి నొందిన శివుడు నర్తించుచు ఇతరులది గమనించి నవ్వుటచే సత్యము తెలిసికొన్న శివుడు దేవియొక్క విజయమహోత్సవమును గౌరవించుచున్నానని ఏ అమ్మవారిని కౌగిలించుకొని తిరిగి నర్తించుట కారంభించెనో ఆ అమ్మవారు పార్వతి మిమ్ము కాపాడుగాక!

**వి :** శూలముచే పొడువబడగా మహిషుని నుండి పైకెగిసినపుడు రక్తనదిచే ఆకాశమెఱ్ఱబడగా శివునకు సంధ్యాభ్రాంతి కలిగినదని చెప్పుటచే పూర్వార్ధమున **భ్రాంతిమదలంకార** మేర్పడినది. శివుడు సంధ్యాకాలమున నర్తించు నలవాటు గలవాడగుటచే నర్తింప మొదలిడెను. అక్కడ నున్న అమ్మవారి చెలికత్తెలు మొదలగు ఆంతరంగిక పరిజనము శివుడు భ్రాంతినొందినాడని నవ్వదొడగిరి. శివుడు వారి నవ్వునకు తన భ్రాంతియే మూలమని యెఱిగి నేను భ్రాంతుడను కాలేదు. పార్వతి

మహిషుని జంపిన సందర్భమున (విజయోత్సవసందర్భము గదా యిది అందుచేతనే) నర్తించు చున్నానని చెప్పి అమ్మవారిని కౌగిలించుకొని మరల నర్తించుటకే పూనుకొనెను. ఉత్తరార్ధమున తన నర్తనహేతువు భ్రాంతికాదని విజయోత్సవమును మన్నించుటనే హేతువుగా చెప్పుట శివుని సమయస్ఫూర్తిని వ్యంజించుచున్నది. ప్రథమపాదమునున '**మహి మహిష**' అనుచోట ఛేకాను-ప్రాసాలంకార మున్నది. **ఉత్పతన్త్యా స్రవన్త్యా** అనుచోట పదాన్తాను ప్రాసమున్నది. పై పదములలో అకారమును ప్రశ్లేషించి నకారమును తొలగించిన అస్రవతి (రక్తనది) అను అర్థము వచ్చును. అస్రవతి అనగా అస్రము (రక్తము) కలది అను అర్థము సన్నిహిత శబ్దస్ఫూర్తి ద్వారమున కలుగును. మూడవ పాదమునకు మహ మహ అనుచోట ఛేకానుప్రాసమున్నది. మకారావృత్తిచే, నాల్గవ-పాదమున పకారావృత్తిచే వృత్త్యనుప్రాస మేర్పడి యున్నది. వీని వలన శ్లోకమునందు **అక్షరరమ్యత** సిద్ధించినది. పై నుండి రక్తము క్రిందబడుట ఉత్పాతము. కొన ఊపిరి పోవునప్పుడు కొంచెమెగిరి పడుట ప్రాణి స్వభావము. **ఉపాంతప్లుతమహి**శబ్దము ఉత్పాతరూపుడైన మహిషుని మరణమును సూచించును. అట్లే అకాలసంధ్యయు ఉత్పాతమే. దానిని భ్రాంతి యని పేర్కొనుట వలన తరువాత శివుని విజయోత్సవనృత్యమును చెప్పుటవలనను లోకమున కలిగిన ఉత్పాతశమనజాతానందము వ్యజింపబడుచున్నది. *

**అ :** పై శ్లోకమున శివుని భ్రాంతి చెప్పబడినది. ఈ శ్లోకమున **దేవతల భ్రాంతి** సూచింపబడుచున్నది.

**శ్లో॥ నాకౌకోనాయకాద్యైర్ద్యువసతిభిరసిశ్యామధామా ధరిత్రీం**
**రున్ధన్వర్ధిష్ణువిన్ధ్యాచలచకితమనోవృత్తిభిర్వీక్షితో యః ।**
**పాదోత్పిష్టస్స యస్యా మహిషసురరిపుర్నూపురాన్తావలమ్బీ**
**లేభే లోలేన్ద్రనీలోపలశకలతులాం స్తాదుమా సా శ్రియే వః ॥** **17**

**ప్ర :** వర్ధిష్ణువిన్ధ్యాచలచకితమనోవృత్తిభిః = పెరుగుచున్న వింధ్యాచలమేమో యని భయము నొందిన మనోవృత్తులు గల, నాకౌకోనాయకాద్యైః = ఇంద్రాదులైన, ద్యువసతిభిః = దేవతలచేత, అసిశ్యామధామా = కత్తివలె నల్లని కాంతిగల, ధరిత్రీమ్ = భూమిని, రున్ధన్ = అడ్డగించుచు, యః = ఏ, మహిషసురరిపుః = మహిషాసురుడు, వీక్షితః = చూడబడెనో, సః = ఆ మహిషాసురుడు, యస్యాః = ఏ అమ్మవారియొక్క, పాదోత్పిష్టః = కాలితో త్రొక్కబడినవాడై. నూపురాన్తావలమ్బీ = అందెకొన నవలంబించిన వాడై, లోలేన్ద్రనీలోపలశకలతులామ్ = కదలు ఇంద్రనీలమణి ముక్కతోడి పోలికను, లేభే = పొందెనో, సా = ఆ, ఉమా = పార్వతి, వః = మీయొక్క, శ్రియే = సంపద కొఱకు, స్తాత్ = అగుగాక.

**తా :** పెరుగుచున్న వింధ్యాచల మేమో యని భయపడు మనోవృత్తిగల వారై దేవతలు మహిషాసురుని చూచిరి. మహిషాసురుడు వింధ్యగిరివలె జనుల రాకపోకల కడ్డుగా నుండెను. అట్టి మహిషాసురుడు అమ్మవారి పాదముచే త్రొక్కబడి అమ్మవారి పాదనూపురమున చిక్కి చెక్కబడిన ఇంద్రనీలమణి శకలమువలె నుండెను. ఆ మహిషుని చంపిన అమ్మవారు మీకు సంపదల నొసగుగాక!

**వి :** వింధ్యగిరి మేరువుతో స్పర్ధించి పెఱిగినపుడు జనుల రాకపోకలకు అడ్డుగా నుండెను. అట్లే మహిషాసురుడును జనుల రాకపోకల కడ్డుగా నుండెను. వింధ్యగిరివలె మహిషుడును నల్లగా నుండెను. అందువలన ఇంద్రాది దేవతలు వానిని మరల వింధ్యగిరి పెరుగుచున్నదేమో యని భ్రాంతి నొంది భయపడిరి అని పూర్వార్ధమున చెప్పబడుటచే **భ్రాంతిమదలంకారము** స్ఫురించు చున్నది. ఉత్తరార్ధమున కాలియందెలో చిక్కుకున్న మహిషుడు ఇంద్రనీలమణి శకలముతోడి (యొక్క) పోలికను పొందెనని ఉత్తరార్ధమున చెప్పబడుటచే ఉపమాలంకార మేర్పడి యున్నది. దీని వలన అమ్మవారి శరీరము మిక్కిలి పెద్దదని వ్యంజింపజేయబడుచున్నది. నాకౌకోనాయకాద్యైర్ధ్వవసతిభిః శ్యామధామా వింధ్యాచల చకిత, సురరిపు ర్న్పురా, లోలేంద్ర నీలోపలశకలతులాం అను పదబ్ధముల లోన, క, ద్య, మ, చ, ర,ల వర్ణములు బహురావృత్తి నొందుటవలన అనుప్రాసాలంకార మేర్పడి యున్నది. ధరిత్రీమ్ రున్ధన్ అను పదములు భూమి నడ్డగించు అను నర్థము నిచ్చును. ధరిత్రీరోధమనగా ధరిత్రిలోని భూమి నడ్డగించుచు అను నర్థము నిచ్చును. ధరిత్రీరోధమనగా ధరిత్రిలోని జనులరోధమే అని లక్షణావృత్తిచే లభించు నీ యర్థము లక్ష్యార్థమై యున్నది. *

**అ :** పై శ్లోకమున దేవతల భ్రాంతి సూచింపబడినది. ఈ శ్లోకమున **నాగుల భ్రాంతి** సూచింపబడు చున్నది.

**శ్లో॥ దుర్వారస్య ద్యుధామ్నామ్మహిషితవపుషో విద్విషః పాతు యుష్మాన్**
**పార్వత్యా ప్రేతపాలస్వపురుషపరుషః ప్రేషితోఽసౌ పృషత్కః ।**
**యః కృత్వా లక్ష్యభేదం హృతభువనభయో గాం విభిద్య ప్రవిష్టః**
**పాతాలం పక్షపాలీపవనకృతపతత్తార్క్ష్యశఙ్కాకులాహిః ॥ 18**

**ప్ర :** విద్విషః = శత్రువైన, ద్యుధామ్నామ్ = దేవతలకు, దుర్వారస్య = వధింపరాని మహిషిత వపుషః = మహిష శరీరముగల రాక్షసుని కొఱకు, పార్వత్యా = పార్వతిచేత, ప్రేషితః = పంపబడిన, ప్రేతపాలస్వపురుషపరుషః = యమదూతవలె పరుషమైన, యః = ఏ, పృషత్కః = బాణము, లక్ష్యభేదనమును, కృత్వా = చేసి, గామ్ = భూమిని, విభిద్య = భేదించి, పాతాలమ్ = పాతాలమును, ప్రవిష్టః = ప్రవేశించినదై, పక్షపాలీపవనకృత = ఱెక్కలను విదలించు చున్నదై, పతత్తార్క్ష్య-శంకాకులాహిః = గరుడుడు వచ్చి పడుచున్నాడే అను భయముచే వ్యాకులమైన సర్పములు గలదై, హృతభువనభయః = (మూడు) లోకముల భయమును తొలగించినదయ్యెనో, (సః) అసౌ = ఆ ఈ బాణము, యుష్మాన్ = మిమ్ము, పాతు = రక్షించుగాక.

**తా :** దేవతలకు వధింపరాని వాడు, మహిషశరీరము గల రాక్షసు నుద్దేశించి అమ్మవారు ప్రయోగించిన బాణము యమదూత వంటిది. అది వానిని చంపి, భూమిని భేదించుకొని పాతాళమును ప్రవేశించి గరుడుడు వచ్చుచున్నాడేమో అను భ్రాంతిని కలిగించెను. అట్టి బాణమును ప్రయోగించిన పార్వతి మిమ్ము కాపాడుగాక!

**వి :** మహిషుడు దేవతలచే అవధ్యుడు. పురుషులచేతనే అవధ్యుడు. శివుడు మహాదేవుడైనను దేవత్వము కలవాడు. పురుషోత్తముడైనను పురుషత్వము కలవాడు. అందుచే మహిషుడు దేవ దుర్వారుడు. పురుషదుర్వారుడైనవాడు కావున పార్వతీదేవియే వానిపై యమదూత వంటి బాణమును ప్రయోగించినది. శివుడు యమునకే యముడైనను, కాలకాలుడైనను మహిషునిపై ఆతని పరాక్రమము పనిచేయలేదు. కాని పార్వతీదేవి యముని దూత వంటి బాణమును ప్రయోగించిన వాడు చచ్చెను. యము నోడించిన వాడు చేయలేని పనిని అమ్మవారు పంపిన యమదూత చేసినా డనుట ఇందలి విచిత్రము. ఆ బాణము మహిషశరీరమును చీల్చి భూమిని కూడ చీల్చుకొని పాతాళమున ప్రవేశించెను. ఆ బాణముయొక్క మొదట ఱెక్కలు అతికించబడి యుండుటచే పాతాళవాసులైన నాగులు ఆ బాణమును గరుడుడుగా భ్రమించి భయము నొందిరి. కావున ఈ శ్లోకమున **భ్రాంతిమదలంకార** స్ఫూర్తి యున్నది. మూడు భువనములులలో స్వర్భువన భయమును భూలోక (మర్త్యభువన) భయమును తొలగించెను. గరుడుడు కాదని తెలిసిన పిమ్మట పాతాళవాసుల భయమును తొలగించెను అని **హృతభువనభయ** శబ్దము వ్యంజించుచున్నది. మహిషితవపుషః విద్విషః యుష్మాన్ అనుచోట దేవతలు మహిషునకు శత్రువులని అర్థము చెప్పుట చమత్కారముగా నుండును. ఇందు వృత్త్యనుప్రాసము కూడ ఉన్నది. పూర్వార్ధమున షకారావృత్తి. పకారావృత్తియు నున్నవి. మూడవ పాదమున రేఫావృత్తి యున్నది. కావున శ్లోకమంతయు వృత్త్యనుప్రాస శోభితమై యున్నది. '**ప్రేతపాలస్వపురుషపరుషః**' అను సమాసమున **ఉపమాలంకారస్ఫూర్తి** ఉన్నది. *

**అ :** పై శ్లోకమున మహిషుని దేవదుర్వారత్వము సామాన్యముగా చెప్పబడినది. ఈ శ్లోకమున విశేషముగా ఏయే దేవతలు మహిషుని వారింప యత్నించి విఫలులైనారో చెప్పబడుచున్నది.

**శ్లో॥ వజ్రం విన్యస్య హారే హరికరగలితం కణ్ఠసూత్రే చ చక్రం**
**కేశాన్బద్ధ్వాఽబ్ధిపాశైర్ధృతధనదగదా ప్రాక్ప్రలీనాన్విహస్య ।**
**దేవానుత్సారణోత్కా కిల మహిషహతౌ మీలతో హ్రేపయన్తీ**
**హ్రీమత్యా హైమవత్యా విమతివిహతయే తర్జితా స్తాజ్జయా వః ॥ 19**

**ప్ర :** హరికరగళితమ్ = ఇంద్రుని చేతి నుండి జారిపడిన, వజ్రమ్ = వజ్రమును, హైమవత్యాః = పార్వతియొక్క, హారే = హారమునందు, హరికరగలితమ్ = విష్ణువు చేతినుండి జారిన, చక్రమ్ = చక్రమును, కంఠసూత్రే = గ్రైవేయకము నందును, విన్యస్య = ఉంచి, అబ్ధిపాశైః = వరుణ (సముద్ర) పాశములతో, కేశాన్ = వెండ్రుకలను, బద్ధ్వా = బంధించి, ధృతధనదగదా = కుబేరుని గదను ధరించినదై, ప్రాక్ప్రలీనాన్ = ముందే దాగి యున్న, మీలతః = చూచుచున్న, దేవాన్ = దేవతలను, విహస్య = అపహసించి, ఉత్సారణోత్కా = పారద్రోలుటలో ఉత్కంఠ గలదైన, మహిషహతౌ = మహిషుని చావునందు (మహిషుడు చచ్చిపోగా), హ్రేపయంతీ కిల = సిగ్గిల చేయుచున్న దానివలెనున్న, హ్రీమత్యా = సిగ్గిలిన, హైమవత్యా = పార్వతిచేత, తర్జితా = బెదిరింపబడిన, జయా = జయ, వః = మీ యొక్క, విమతివిహతయే = శత్రుసంహారముకొఱకు, స్తాత్ = అగుగాక!

**తా :** మహిషుని చూచిన భయమున ఇంద్రుడు జారవిడుచు కొనిన వజ్రము నమ్మవారి హారమున, విష్ణువు జారవిడుచుకొనిన చక్రమును గ్రైవేయకము సూత్రమందు ఉంచి, వరుణపాశములతో అమ్మవారి కేశములను కట్టి కుబేరుని గదను ధరించి ముందే దాగియున్న దేవతలను అపహసించి వారిని ద్రోలుటలో ఉత్కంఠ కలదానివలె మహిషు నమ్మవారు చంపగా కనుల దెఱచిన దేవతలను సిగ్గిలజేయుచు సిగ్గిలిన అమ్మవారిచే బెదిరింపబడిన జయ మీ శత్రువుల సంహరించుగాక!

**వి :** హరికరగలితమ్ = అను సమాసములోని హరిశబ్దము విష్ణువును, ఇంద్రుని బోధించును. ఇంద్రుడు జారవిడచిన వజ్రమునకు, విష్ణువు జారవిడిచిన చక్రమునకు ద్విరావృత్తితో విశేషణముగా అన్వయించుకొన దగినదైయున్నది. కంఠమునుండి ఱొమ్ముదాక లేక పొట్టదాక వ్యాపించునది హారమనబడును. కంఠమున కంటియున్న ఆభరణము **గ్రైవేయకము** (కంటియ) అనబడును. రెంటికిని మధ్య మణి, లేక మణిసువర్ణాది నిర్మితపతకము వ్రేలాడ దీయబడును. జయ యను అమ్మవారి చెలికత్తె ఇంద్రుడు జారవిడుచు కొనిన వజ్రమును హారము మధ్యన, విష్ణువు జారవిడుచుకొనిన చక్రమును గ్రైవేయక మధ్యమునను గ్రుచ్చి వ్రేలాడదీసినది. వరుణుడును పాశములను జారవిడుచుకున్నాడు. వానితో అమ్మవారి కేశములను కట్టినది. గదను ధరించినదియైన జయ ముందే దాగి యున్న దేవతల నపహసించినది. మహిషుని దేవావధ్యత్వము నెఱిగిన జయ వీరెట్లును యుద్ధమున పారిపోవుదురని, వారి పారిపోవుటను చూడవలెనని మనసారా అనుకొన్నది. కనులార చూచినది. అమ్మవారు మహిషుని చంపిన పిమ్మటనే కనుల దెఱచి దాగుకొనిన చోట్ల నుండి బయటకు వచ్చి చూచుచున్న దేవతలు అమ్మవారికి తానలంకరించిన ఆయుధముల జూచు దేవతలు మరింత సిగ్గుపడునట్లు చేసినది. తన కలంకరించినది దేవతల ఆయుధములని గమనించిన పార్వతి తన చెలికత్తె జయ చేసిన ఈ ధూర్తత్వమును చూచి ఆమెను బెదిరించినది. ఈ పొరపాటునకు తాను సిగ్గుపడినది. ఇట్లు దేవతల నపహసించి దేవతల సిగ్గిల జేసిన జయ మీ శత్రుసంహారము నొనరించుగాక! హ్రీమత్యా హైమవత్యా అను పదములు తృతీయాలంతములు అగుటచే పై అర్థము స్ఫురించును. దేవతల ఆయుధములు వారికి ప్రస్తుతము భారమాత్రములే అని, ఇవి కనీసము అమ్మవారికి అలంకారములుగా గూర్చిన, వానికి సార్థకత కలిగినదని వారికి సూచించుచున్నది. ప్రథమపాదాద్యంతములలోని **వజ్రమ్ చక్రమ్** అను పదముల జంట; ప్రథమ పాదారమ్భ ద్వితీయ పాదాంతములలోని **విన్యస్య విహస్య** అను పదముల జంట **పూర్వార్ధ శబ్దరమణీయకతను**, మూడవ పాదములోని **ఉత్సా, ఉత్కా** అను సమాసము, నాల్గవ పాదములోని **హ్రీమత్యా హైమవత్యా** అను పదముల జంట **ఉత్తరార్ధరమణీయకత**ను పెంచుచున్నవి. *

**అ :** పై శ్లోకమున వజ్ర చక్ర గదాద్యాయుధముల యుద్ధోపయోగానర్హత చెప్పబడినది. ఈ శ్లోకమున ఖడ్గదండశూలాద్యాయుధములయొక్క ఉపయోగము మానుట వర్ణింపబడి **అమ్మవారి మడమ మహిషుని త్రొక్కి చంపుట** చెప్పబడుచున్నది.

శ్లో॥ ఖడ్గే పానీయమాహ్లాదయతి హి మహిషం పక్షపాతీ పృషత్కః
శూలేనేశో యశోభాగ్భవతి పరిలఘుస్స్యాద్వధార్హే ఽపి దణ్డః ।
హిత్వా హేతీరితీవాభిహతిబహలితప్రాక్తనాపాటలిమ్నా
పార్ష్ణ్యైవ ప్రోషితాసుం సురరిపుమవతాత్కుర్వతీ పార్వతీ వః ॥ 20

**ప్ర :** ఖడ్గే = ఖడ్గమునందలి, పానీయమ్ = ధార, మహిషమ్ = మహిషుని, ఆహ్లాదయతి హి = సంతోషింపజేయుచున్నది గదా!, పృషత్కః = బాణము, పక్షపాతీ = పక్షపాతము గలది, శూలేన = శూలముతో, ఈశః = శివుడు, యశోభాక్ = యశమును పొందువాడు, భవతి = అగును, వధార్హే = వధకు యోగ్యుడైన వాని యందు, దండః అపి = కఱ్ఱకూడ, పరిలఘుః = మిక్కిలి తక్కువది, స్యాత్ = అగును, ఇతి = అని, హేతీః = ఆయుధములను, హిత్వా ఇవ = విడిచిపెట్టెనో అనునట్లు, అభిహతిబహలితప్రాక్తనాపాటలిమ్నా = తొక్కుటతో ఎక్కువ చేయబడిన, ఎక్కువైన ఎఱుపుగల, పార్ష్ణ్యా ఏవ = మడమ తోడనే, ప్రోషితాసుమ్ = దూరము చేయబడిన ప్రాణములు గలవానినిగా, మహిషమ్ = మహిషుని, కుర్వతీ = చేయుచున్న, పార్వతీ = పార్వతి, వః = మిమ్ము, అవతాత్ = కాపాడుగాక!

**తా :** ఖడ్గధార మహిషుని దప్పిక తీర్చుచు ఆహ్లాదపరుచుచున్నది. బాణము వానిపై పక్షపాతము కలిగి యున్నది. శూలము నుపయోగించుచో శివునకు కీర్తి దక్కును. దండము నుపయోగించుచో వానిని తక్కువగా శిక్షించినట్లగును, అని ఇతరములైన ఆయుధముల నన్నింటిని విడచి, అమ్మవారు తన మడమ తోడనే వానిని త్రొక్కి చంపినది. అట్టి పార్వతి మిమ్ము కాపాడుగాక!

**వి :** ఖడ్గమునకు ధార యుండును. ధార అనగా కత్తి యొక్క అంచు మరియు జలము యొక్క ప్రవాహము అను రెండు అర్థములు. ఖడ్గముతో కొట్టినచో మహిషున కేమియు నొప్పి కలుగదు. మంచి నీరు త్రాగి దప్పిక తీర్చుకొను వారికి కలుగు సంతోషము కలుగును. అది వానిలోని పౌరుషమును పెంపొందించి యుద్ధము చేయు నవకాశము కలిగినది గదా అను సంతోష మా మహిషునకు కలుగునట్లు చేయును. ఖడ్గముతో వాడు చావడని ఎఱిగి అమ్మవారు ఖడ్గమును మహిషునిపై ప్రయోగించలేదు. ధార అనగా వర్షజలధార. అది దున్నపోతునకు మిక్కిలి ఇష్టము. కత్తితో కొట్టినపుడు '**దున్నపోతుపై వాన పడినట్లు**' అను నానుడిని సార్థక పరచుచు వానికే మాత్రము శోభ కల్పింపదు. పైగా వానికి సంతోషమునే కలిగించును. **పానీయమ్** అను పదము (త్రాగదగినది అను అర్థమును కలిగిన దగుటచే) మంచినీటిని బోధించును. ఖడ్గమునందు ధార ఉండుటయే మంచి నీరున్నట్లుగా ఈ శ్లోకమున అభ్యసింపజేయబడినది. అందుచే ప్రథమపాదపూర్వార్ధమున **అతిశయోక్త్యలంకారచ్ఛాయ** యేర్పడినది. దున్నపోతులకు నీరన్న ఇష్టము కదా! అందుచే ఖడ్గధార మంచినీటిధారవలె మహిషు నాహ్లాదింపజేయును అను ఔపమ్యమును ధ్వనింపజేయు చున్నది. గాయము కలిగిన దున్నపోతుపై కాకులు కూర్చుని ఆ గాయమును పొడుచు దృశ్యములు మనకచ్చటచ్చట ఎప్పుడో యొకప్పుడు కనిపించును. అవి ఱెక్కలు విదల్చుచు మరల మరల దాని

వీపుపై వాలి ముక్కుతో పొడుచు చుండును. ఆ ఱెక్కల చిన్న చిన్న ముక్కలు పడునేమో అన్నంతగా అవి ఱెక్కల విదల్చును మరల మరల ఎగిరెగిరి వ్రాలు చుండును. కాకికివలె బాణమునకు అల్లెత్రాటి దగ్గఱనున్న భాగమునకు ఱెక్కలు కట్టబడి యుండును. అట్టి బాణము మహిషుని వీపునకు గ్రుచ్చుకొని ఱెక్కలు జారవిడుచుకొనునేమో కాని వాని వీపున గాయమును మాత్రము చేయలేదు. గాయమును పొడచు కాకులనే పక్షపాతముతో పట్టించుకొనని దున్న బాణముయొక్క ఱెక్కల పాతమును పట్టించుకొనునా? బాణము కూడ వానియందు పక్షపాతము వహించినదో అన్నట్లు నొప్పి కలిగింపనే కలిగింపదు, అను సంభావనమును స్ఫురింపజేయునవి **పక్షపాతీ పృషత్కః** అను పదములు. అమ్మవారి భర్త శివుడు. శూలి అనగా శూలము కలవాడు. అమ్మవారు శూలమును ప్రయోగించినచో ఒకవేళ వాడు చచ్చియుండునేమో కాని ఆ శూలము శివుడమ్మ వారికి ప్రసాదించినదే అని వానిని చంపిన ఘనత శివున కాపాదింపబడునని శూలముయొక్క ప్రయోగము నమ్మవారు మానుకొన్నది శివుడు చేయని పని వలన శివుడు యశోవంతుడగుట శివునకు చిన్నతనమే అని అమ్మవారి ఉద్దేశ్యము. దండము (కఱ్ఱ) నుపయోగించుట మహిషుని విషయమున మిక్కిలి చిన్న శిక్ష యగును. అదిగాక దున్నపోతును అపరాధము చేయకున్నను దండము (కఱ్ఱ) నుపయోగించుచుండుట సాధారణ విషయము. కఱ్ఱతో కొట్టిన దున్నపోతు సాధారణముగా చావదు. చంపదలచుకొన్నప్పుడు దున్నపోతుపై కఱ్ఱ నుపయోగించుట అవివేకమగును. చాలసేపు కఱ్ఱ నుపయోగించి ఎక్కువసేపు ఎక్కువ దెబ్బలు కొట్టిన దున్నపోతు చావవచ్చునేమో కాని అది అపరాధిపట్ల అనవసరమైన అధికహింస యగును. అదికాక మడమతో త్రొక్కి చంపుటకు వీలున్నప్పుడు కఱ్ఱనేగాదు ఏ ఆయుధము నుపయోగించుట అనావశ్యకమే అగును. అదిగాక శూలము శివుని ఆయుధము, ఖడ్గము నిరృతి ఆయుధము, బాణము శ్రీరాముని ఆయుధము, వారా ఆయుధ ప్రయోగములలో సిద్ధులు సిద్ధహస్తులు. ఇతరు లాయాయుధముల ప్రయోగించినను వారి కీర్తి నందుకొనలేరు. ఎవరు దండము ధరించినను దండధారి అనుపేరు యమునియందే రూఢమై యుండును. కాని దండధారి అనుపేరు కూడా ఇతరులకు సంక్రమించదు. దండమనగా శిక్ష అను అర్థము కూడ కలదు. అపరాధిని లేక శత్రువునే యాయుధముతో శిక్ష దండమే అగును. యముడు మాత్రము ప్రాణత్యాగమునకన్న తక్కువ దండము విధించువాడు కాడు. కావున దండధారులైన రాజాదులకన్న ఆయన యందే దండధారిత్వము రూఢమైనది. అదిగాక ఆయన చచ్చిన పిదప నరకయాతనల గలిగించి శిక్షించును. ఏ దండధారియు అట్లు శిక్షింపలేదు. ఇతరుల శిక్ష లొకప్పుడు అపరాధిని సంస్కరించు నుద్దేశమున విధింపబడు చుండును. యముడు విధించు శిక్ష మరణమో మరణానంతరనరకయాతనమో అయి యుండును. కావున యముని మించిన దండధారి లేడు. భైరవుడు కూడ దండపాణియని చెప్పబడును. ఆయన క్షేత్రపాలకుడు. కావున క్షేత్రాంతర్గతులై నియమముల పాలింపని వారి యందు మాత్రమే ఆయన దండము (శిక్ష) పరిమితము. అమ్మవా రితరు లుపయోగించిన ఆయుధముల ధరించినను మహిషుని వధించుటలో వానిని ప్రయోగింపదలచ లేదు. అందుచేత మొత్తమెత్తగా నున్న తన మడమకే మరింత మెఱుపును

కలిగించుచు వానిని త్రొక్కి చంపినది. మహిషునకు ఖడ్గధార నీరు త్రాగినట్లు సంతోషము కలిగించును. వాని చర్మములోనికి చొచ్చుకొనిపోయి రక్తము చిందునట్లు చేయు శక్తి దానికి లేదు. బాణమునకు ఆ శక్తి లేదు. కాని పక్షపాతము వహించి మాత్రమే వానిని హింసించుట లేదు అన్నట్లుగా పక్షపాతాభినయమును మాత్ర మొనరించును. శూలమునకును ఆ శక్తిలేదని అమ్మవారికి తెలియును. కాని శివగౌరవభంగవ్యాజమున లేక శివునకే కీర్తి గలుగునను మిషపెట్టి మాత్రమే దానిని ప్రయోగింపలేదు. ఆ శూలము ధరించిన తన భర్త గౌరవమును కాపాడుటకు మాత్రమే దానిని ప్రయోగింపలేదు. ప్రయోగించి అది విఫలమైనచో అది తన మడమసాటి రాలేదన్న అపకీర్తి ఆ శూలమునకు వచ్చును. అందుచే దాని నమ్మవారు ప్రయోగించలేదు. శరీరావయవమును (కాలినో చేతినో) ప్రయోగించి శత్రువును చంపలేనప్పు డాయుధము ప్రయోగించుట ఉచితమని మొదట ఆయుధముల నన్నింటిని ఆమె ఉపేక్షించియే ప్రయోగించలేదు. గోటితో పోవు దానికి గొడ్డలి యెందుకన్న నానుడి ఉండనే యున్నది. అది ఆమెకు తెలిసినదే. అదీకాక ఆయుధము లన్నియు చేతపట్టుకొని ప్రయోగింపదగినవి. కాలితో తీరు సమస్యకు చేతి నుపయోగించుట యేల? కాలికన్న చేయి ఉత్తమము అని జఘన్యమైన కాలినే తొలుత ఉపయోగించినది. దాని తోడనే వాడు చచ్చినాడు. *

**అ :** పూర్వశ్లోకములలో మహిషభయగ్రస్తులైన దేవతల అవమానము చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ అవమానముతో ఆత్మహత్య చేసికొన వలదని దేవతలు ఉపదేశింపబడుచున్నారు.

**శ్లో॥ కృత్వేదృక్కర్మ లజ్జాజననమనశనే! శక్ర! మాఽసూన్విహాసీ-**
**ర్విత్తేశ! స్థాణుకణ్ఠే జహి గదమగదస్యాయమేవోపయోగః ।**
**జాతశ్చక్రిన్విచక్రో దితిజ ఇతి సురాంస్త్యక్తహేతీన్బ్రువన్త్యా**
**వ్రీడామాసాదితారిర్జయతి విజయయా నీయమానా భవానీ ॥ 21**

**ప్ర :** లజ్జాజననమ్ = సిగ్గును కలిగించు, ఈదృక్ = ఇటువంటి, కర్మ = కర్మను, కృత్వా = చేసి, అనశనే! = వజ్రాయుధము లేనివాడా!, శక్ర! = ఓ యింద్రుడా!, అనశనే = అశనము లేని తనమున (ఉపవాసమున), అసూన్ = ప్రాణములను, మా విహాసీః = విడువకుము, విత్తేశ = ఓ కుబేరుడా!, స్థాణుకంఠే = శివుని కంఠమున, గదమ్ = వ్యాధిని, జహి = నశింపజేయుము, అగదస్య = గదలేని వాని (వైద్యుని) యొక్క, ఉపయోగః = ఉపయోగము, అయమ్ ఏవ = ఇదియే, చక్రిన్! = ఓ చక్రధారియైన విష్ణూ!, దితిజః = రాక్షసుడు, విచక్రః = చక్రహీనుడు, జాతః = అయినాడు, ఇతి = అని, త్యక్తహేతీన్ = ఆయుధముల విడచిన, సురాన్ = దేవతల గూర్చి, బ్రువన్త్యా = పలుకుతున్న, వ్రీడామ్ = సిగ్గును, నీయమానా = పొందింపబడుచున్న, ఆసాదితారిః = చంపబడిన శత్రువులుగల, భవానీ = భవాని, జయతి = సర్వోత్కర్షముగా వర్ధిల్లుచున్నది.

**తా :** లజ్జాకరమైన ఇటువంటిపని (ఆయుధపరిత్యాగము) నాచరించిన ఓ ఇంద్రా! ఆహారమును మానివేసి ప్రాణముల విడువకుము. ఓ కుబేరా! గదను పారవేసి అగదుడవైతివి. (వైద్యుడవైతివి)

కావున శివుని కంఠమందలి నలుపు అను వ్యాధిని తొలగించుము. వైద్యుని ఉపయోగము మిత్రుని వ్యాధిని తొలగించుటలో నుండును గదా!, ఓ చక్రీ నీ శత్రువైన రాక్షసుడు చక్ర (సైన్య) హీనుడైనాడు, అని ఆయుధ పరిత్యాగ మొనరించిన దేవతలను సిగ్గిలజేయు మాటలు మాట్లాడుచు విజయ శత్రుసంహారము చేసిన అమ్మవారికే సిగ్గును కలిగించినది. అట్లు సిగ్గునొందిన భవాని సర్వోత్కర్షముగా వర్ధిలుచున్నది.

**వి :** శత్రువునకు భయపడి ఆయుధమును పారవేయుట పిరికివాని లక్షణము. శూరుడైన వాడు బలహీనుడైనను యుద్ధముచేసి ప్రాణముల విడచుటకైనను సిద్ధపడును. కనుక ప్రాణరక్షణము కొఱకు యుద్ధభూమినుండి పారిపోడు. ఆయుధమును పారవేయడు. శూరుడు ఆయుధమును పారవేసిన వానితో కాని, పారిపోవు వానితో గాని, శరణుజొచ్చిన వానితో గాని యుద్ధము చేయడు. శూరుడైన మహిషుడు ఇంద్రాదులు ఆయుధముల జారవిడిచి పారిపోయినందుననే వారి వెంటబడి వారితో యుద్ధము చేయలేదు. పిరికివారితో యుద్ధము చేసి ఆయుధమును పారవేసిన వారితో యుద్ధము చేసి శూరు డపకీర్తి నొందుట కిష్టపడడు. ఈ విషయమున ఇంద్రాదులకన్న మహిషుడే శూరధర్మమును పాటించినాడని స్పష్టపడును. ఇంద్రుని ఆయుధము అయిన వజ్రమునకు **అశని** అను పేరున్నది. ఇప్పుడు దానిని పారవేసి జారవిడుచుకొని ఇంద్రుడు అనశని యైనాడు. వజ్రహీనుడైనాడు. 'అనశనే' అను పదము అనశన శబ్దముయొక్క సప్తమ్యంతము కూడ నగును. అప్పుడనశనే అను పదమునకు ఆహారము లేకపోవుట యందు అను అర్థమిచ్చును. గావున దాని యందు ప్రాణముల విడవవద్దు. అవమానమైన నేమి? ప్రాణము ముఖ్యము కదా! అని విజయ ఇంద్రుని సిగ్గుపడునట్లు చేసినది. అనశనే అని సంబోధించి ఉపవసించి ప్రాణము తీసికొన వద్దన్నది. నీకంత సాహసమేయున్న యెడల యుద్ధమే చేసెడి వాడవు. ఉపవసించి ప్రాణముల తీసుకొను ధైర్యముకూడ నీకు లేదని ఎత్తిపొడుచుచున్నది. కుబేరుడు విత్తేశుడు. ఆయనకు ధనమును పెంచుకొనుట యందున్నంత శ్రద్ధ శూరుడని కీర్తి సంపాదించుటయందు లేదు. సాధారణముగా ధనవంతులు ప్రాణముల కాపాడుకొని తన ధనమును చూచుకొనుచు అదే ప్రాణతుల్యమని భావించి బ్రతుక గోరుదురు. పునర్జన్మమునందు అంత ధనము లభింపదేమో అని భయపడుటచే యుద్ధాదులకు సాహసములకు దూరముగా నుండి బ్రతుక గోరుచుందురు. విత్తేశుడైన కుబేరుడా కారణము చేతనే తన గదను పారవైచి ప్రాణముల గాపాడుకొనుటకై పరుగెత్తినాడు. అట్టి వానిపై ఇంద్రునందు వలెనే జాలిదలచి మహిషుడు వెంటబడి చంప పూనుకొనలేదు. గదాధారియైన కుబేరుడు గదను పారవైచి అగదుడైనాడు. గదాహీనుడైనాడు. అగద శబ్దమునకు వైద్యుడను మరొక అర్థమున్నది. అందుచేత గదాహీనుడైన కుబేరుని వైద్యుడవైనావు గదా! శివుడు నీ మిత్రుడు గదా! ఆయన లోకకళ్యాణముకొఱకు ప్రాణముల తృణప్రాయముగా నెంచి సముద్రమున బుట్టి లోకముల కాల్చివేయు విషమును తన కంఠములో నిలిపినాడు. ఆయనవలె కాకున్నను కనీసము దిక్పాలక దేవతాభిమానముతోనైనను ఆయన అట్లు విషము త్రాగి తెచ్చుకొన్న కంఠముయొక్క నలుపు అను వ్యాధిని నివారించుటకైనా ప్రయత్నించుట నీ ధర్మమని గుర్తు చేయుచున్నాను. అట్లు చేసి

మిత్రధర్మమునైనను కాపాడుకొనుము. అగద శబ్దమును పొందినందుకు దానిని సార్థక మొనరించుకొనుము అని **విజయ** చెప్పుటలో మిత్రుడైన శివునివలె లోకకల్యాణము నొనరింపకున్నను కనీసము దిక్పాలకత్వమునకును అర్హతను కోలుపోకుందువు. పారిపోవు పని యొనరించితివి. శివుని మిత్రుడనని చెప్పుకొనుటకు నీకు సిగ్గులేక పోయెనే అను ఎత్తి పొడుపున్నది. అగదుడవైనందుకైనా శివుని కంఠముయొక్క నీలిమను నశింపజేయ యత్నించి అగద శబ్దమునైనను సార్థకపఱచుకొనుటతో కొంతలో కొంత యైనను నీ అపకీర్తి తగ్గునేమో యోచించుకొనుము అను ఉపదేశమును ఉన్నది. ఓ విష్ణూ! నీవు మహిషునకు భయపడి, చక్రమును జాఱవిడచుకొనియు చక్రి నామము ధరించియే యున్నావు. చక్రమును జారవిడచుకొనియు చక్రినామము విడనాడుటకు సిగ్గుపడుచున్నావా! చక్రమును పారవేసినపుడు లేనిసిగ్గు చక్రినామము విడుచునప్పుడేల. నీవు చక్రముతో మహిషాసురుని (సైన్య) చక్రమును నిర్మూలింప గలవాడవై ఉండవలసి యుండగా వాడు (సైన్య) చక్రము కలిగి చక్రియై యుండుటకు వీలు గలిపించి మరియొక చక్రి ఉనికికి సిగ్గు పడలేదు. ఇప్పుడు అమ్మవారు (సైన్య) చక్రమును పారద్రోలి ఆ మహిషుని నిశ్చక్రు నొనరించినది. ఇప్పుడు వీరిరువురు చక్రహీనులైనారు. మరియొక చక్రి ఉన్నాడన్న చింత నీకక్కఱలేదు. పారవైచుకొన్న చక్రమును వెదకి పట్టుకొని మరల చక్రిగా తల ఎత్తుకొని తిరుగుము. ఇప్పుడు మహిషుడు లేడు కావున వానివలన మరొకసారి చక్రము జారవిడచుకొని పరిస్థితి రాదులే అని విష్ణువు నపహసించినది విజయ. '**జాతశ్చక్రిన్విచక్రో దితిజః**' అను పదములవలన ఇది వఱకే నీవు విచక్రుడ వైనావు. ఇప్పుడు మహిషుడు విచక్రుడైనాడు అను అన్వయము కూడ విచక్రపదావృత్తితో సాధించుకొన–వచ్చును. విజయ ఆయుధముల విడచిన దేవతల నెత్తిపొడచుట అమ్మవారి ప్రశంసతో పర్యవసించుటచే అమ్మవారు శాలీనతతో సిగ్గు పడినది. ఉత్తములు స్వప్రశంసకు సిగ్గు చెందెదరు. అట్లు సిగ్గుపడుట ఆమె సర్వోత్కర్షమైన సర్వోత్తమత్వముగల ఇల్లాలితనమును వ్యంజించుచున్నది. **ఆసాదతారిః** అను పాఠమున కన్న **ఆసాదితారిః** అను పాఠము సముచితముగా నున్నది. '**జననమనశనే**' '**గదమగదస్య**' '**చక్రిన్విచక్రః**' **జయతి విజయయా నీయమానా భవానీ** పదములు యమక వృత్త్యనుప్రాసములై తామున్న పాదముల నలంకరించుచున్నవి. *

**అ :** పై శ్లోకమున ఊర్ధ్వలోకవాసులైన ఇంద్రాదుల పరిహాస్యత చెప్పబడినది. ఈ శ్లోకమున అధోలోకవాసియైన **శేషుని వంద్యమానత్వ మమ్మవారి నూపురవలయిత పాదమునం దుత్ప్రేక్షింప బడుచున్నది.**

**శ్లో॥ దద్యాద్వో వాఞ్ఛితాని చ్ఛలమయమహిషోత్ప్రేషరోషానుషఙ్గా–**
**న్నీతః పాతాలకుక్షిం హృతభువనభయో భద్రకాల్యాస్స పాదః ।**
**యః ప్రాదక్షిణ్యకాఙ్క్షావలయితవపుషా వన్ద్యమానో ముహూర్తం**
**శేషేణేవేన్దుకాన్తోపలరచితమహానూపురాభోగలక్ష్మీః ॥ 22**

**ప్ర :** ఛలమయమహిషోత్ప్రేషరోషానుషంగాత్ = కపటముతో నిండిన మహిషుని మర్దించు కోపము–

యొక్క సంబంధమున, పాతాలకుక్షిమ్ = అపహరింపబడిన లోకముల భయముగల, భద్రకాల్యాః = భద్రకాళియొక్క, యః = ఏ, (పాదః = పాదము), ప్రాదక్షిణ్యకాంక్షావలయితవపుషా = ప్రదక్షిణ మొనర్చు కోరికతో చుట్టుకొనబడిన శరీరముగల, శేషేణ = శేషుని చేత, ముహూర్తమ్ = కొంచెము సేపు, వంద్యమానః ఇవ = నమస్కరింపబడుచున్నట్లు, ఇందుకాంతోపలరచిత మహానూపురా-భోగలక్ష్మీః = చంద్రకాంతమణి రచితమైన గొప్ప నూపురముయొక్క పడగవంటి కాంతి గలదై యున్నదో, సః = ఆ, పాదః = పాదము, వః = మీ యొక్క, వాంచితాని = కోరికలను, దద్యాత్ = ఇచ్చుగాక.

**తా :** కపటముగల మహిషుని మర్దించు కోపమున పాతాళమునకు చేరగా శేషుడు ప్రదక్షిణము చేయవలెనను వాంఛతో చుట్టుకొని భువనభయము తొలగించినందులకు వందనము చేయుచున్నట్లు నూపురము కలిగిన అమ్మవారి పాదము మీ కోర్కెల దీర్చుగాక!

**వి :** అమ్మవారు కపటము లేనిది. కపటము లేనివారికి కపటులనిన గిట్టదు. మహిషుడు కపటి. సాధారణముగా దున్నపోతునకు కపట ముండదు. ఇది సాధు జంతువనియే అందరి విశ్వాసము. కాని మహిషుడు కపటి. వాని కపటమును కనుగొనుట కష్టము. సాధు వేషమున్న కపటి మహిషుడని అమ్మవారికి తెలియగానే వానిపై కోపము హెచ్చినది. అట్టి కోపముతో త్రొక్కినది. దానితో వాడు పాతాళమును చేరినాడు. వానితో పాటు అమ్మవారి పాదమును చేరినది. సకలలోకభయమును తొలగించిన దీపాదమే అని శేషుడు కూడ గమనించినాడు. అందుచేత శేషునకు అమ్మవారి పాదమునకు వందనము చేయవలెనను కోర్కె కలిగినది. ఆ శేషుడా అమ్మవారి పాదమును చుట్టుకొని వందనము చేయుచున్నాడేమో అను (భ్రాంతి) భావము అమ్మవారి పాదమునందున్న మణి నూపురము చూచు వారికి కలుగును. అని అమ్మవారి పాదనూపురమున శేషవలయత్వ సంభావన ముండుటచే నీ శ్లోకమున **ఉత్ప్రేక్షాలంకార మేర్పడి యున్నది.** '**మహిషోత్ప్రేషరోషానుషంగాత్, హృతభువనభయో భద్రకాల్యా నీతః పాతాలకుక్షిమ్**' అను పదబంధములలోని వృత్త్యనుప్రాసములు నూపురమువలెనే అలంకరించుచున్నవి. **దేవ్యా వో వాంఛితాని** అను పాఠము నంగీకరించిన శ్లోకమున క్రియాలోప మేర్పడును. *

**అ :** పూర్వశ్లోకమున విజయ చేసిన దేవతా పరిహాసము చెప్పబడినది. ఈ శ్లోకమున **మహిషు డొనర్చిన దేవతాపరిహాసము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ శూలం తూలం ను గాఢం ప్రహర హర! హృషీకేశ! కేశోఽపి వక్ర-**
**శ్చక్రేణాకారి కిమ్మే పవిరవతి న హి త్వాష్టశత్రో! ద్యురాష్ట్రమ్ ।**
**పాశాః కేశాబ్జనాలాన్యనల! న లభసే భాతుమిత్యాత్తదర్పం**
**జల్పన్దేవాన్దివౌకోరిపురవధి యయా సాఽస్తు శాన్త్యై శివా వః ॥ 23**

**ప్ర :** శూలమ్ = శూలము, తూలమ్ ను = దూదియా!, గాఢమ్ = గట్టిగా, హర! = ఓ శివా!, ప్రహర = కొట్టుము, హృషీకేశ! = ఓ విష్ణూ!, చక్రేణ = చక్రముచేత, కేశః అపి = వెంట్రుక కూడ,

వక్రః = వంకరగా, అకారి కిమ్ = చేయబడినదా, త్వాష్ట్రశత్రో! = ఓ యింద్రా!, ద్యురాష్ట్రమ్ = స్వర్గరాజ్యమును, పవిః = వజ్రాయుధము, న అవతి హి = కాపాడలేదు గదా!, పాశః = పాశములు, కేశాబ్జనాళాని = (ఓ వరుణా!), తామరతూండ్లు, అనల! = ఓ అగ్నీ!, భాతుమ్ = వెలుగుటకు (అవకాశము), న లభసే = పొందవు, ఇతి = అని, ఆత్తదర్పమ్ = గర్వము ప్రకటింపబడునట్లుగా, దేవాన్ = దేవతల గూర్చి, జల్పన్ = వాగుచున్న, దివౌకోరిపుః = దేవశత్రువు (మహిషుడు), యయా = ఏ దేవిచేత, అవధి = చంపబడెనో, సా = ఆ, శివా = అమ్మవారు, వః = మీ యొక్క, శాన్త్యై = శాంతికొఱకు, అస్తు = అగుగాక.

**తా :** ఓ శివా! నీ శూలము దూదియా! గట్టిగా కొట్టుము. ఓ విష్ణూ! నీ చక్రము నా వెంట్రుకను కూడ వంకర చేయలేదు గదా! ఓ ఇంద్రా! నీ వజ్రము నీ స్వర్గరాష్ట్రమును కాపాడలేదు గదా! ఓ వరుణా! నీ పాశములు తామరతూండ్లు, ఓ అగ్నీ! ఇక నీవు ప్రకాశించు నవకాశము పొందలేవు అని గర్వముగా దేవతల యెదుట వాగుచున్న మహిషు నే దేవి చంపెనో ఆ దేవి మీకు శాంతి నొసగుగాక.

**వి :** ఓ శివా! నీ శూలము దూదివలె మెత్తగా తగులు చున్నది. ఏ మాత్రము గ్రుచ్చుకొనుట లేదు. నీవు శూలము నలంకారముగా ధరించి నావేమో? దానిని ప్రయోగించలేవేమో అని నాకనిపించు చున్నది. ఎంతగట్టిగా గ్రుచ్చగలవో అంత గట్టిగా గ్రుచ్చుము. నా కేమైన నొప్పిని కలిగించునేమో చూచెదను. నీ పరాక్రమము తెలియును. అప్పుడు నీ మీద నాకున్న శక్తి నెంత ప్రయోగించ వచ్చునో నిశ్చయించు కొందును. అల్పునిపై అధికశక్తిని ప్రయోగించుట వ్యర్థముగదా! ఓ హృషీకేశా! సంతోషింపజేయు కేశములు అనగా కిరణములు గలవాడా! చక్రము నా ఒక్క వెంట్రుకను కూడ వక్రము చేయజాలదేమి? **హృషీకేశ** శబ్దము ఇంద్రియముల స్వాధీనమొనర్చుకొన్న ప్రభువును అనగా మునిని బోధించును. ఆ సంబోధనము నీవు తపసునకు సమర్థుడవేమో కాని యుద్ధమునకు జాలవు అని వ్యంజింపజేయును. **కేశ** శబ్దము కిరణములను సైతము బోధించును. కిరణములు హర్షింపజేయు కిరణములు. నీ చక్రముయొక్క అంచులనుండి వెడలు అగ్ని కిరణములును నాకు చంద్రకిరణములవలె సంతోషమునే కలిగించుచున్నవి. నా వెంట్రుకను కూడ వంకర జేయలేని నీ చక్రముయొక్క అంచులు నాకేమి నొప్పిని కలిగింపగలవు? దున్నపోతు చర్మము స్థూలముగా నుండుటచే సూర్యకిరణములే తపింపజేయలేవు. కావున ఎండలో కూడ అది పనిచేయును. ఆ సూర్యకిరణముల సాటి కూడ నీ చక్రముల అంచులు నన్ను తపింపజేయలేకున్నవి. అయినను దున్నపోతునకు నీటిని చూచిన అందు తపించిన దానివలె మునిగి ఆనందించునే కాని ఎంత సేపైనను నీటినుండి బయటకు వచ్చుట కిష్టపడదు. అందుచేత మహిషుడు కేశుని దగ్గఱకు పోయెను. క అనగా జలము, దాని ప్రభువు వరుణుడు. ఆతడు పాశములు మహిషునిపై ప్రయోగించెను. సముద్రములోని తీగలను జలములో పుట్టు కమలముల నాళములవలె అవి మెత్తగా తగులుచున్నవే కాని నన్నేమియు నొప్పింప లేకున్నవి. ఈ మధ్యన ఇంద్రుడు కనబడినాడు.

ఓ ఇంద్రుడా! నీవు ప్రయోగించిన వజ్రము నాకు కొంచెము కూడ నొప్పిని కలిగింప లేకపోయినది. ఇటువంటి వజ్రము తోడనా నీవు స్వర్గరాజ్యమును కాపాడుకొనదలచినది. దానితో కాపాడుట అసంభవమని తెలియుము. వరుణ పాశములు వదలించు కొనుటకు నేనొకింత కదలితినో లేదో ఓ అగ్నీ! ఆ వరుణ (సముద్ర) జలములు నిన్నార్పి వైచినవి. నీ విక వెలుగుటకే పనికిరావు. నన్నేమి కాల్చగలవు? అని దేవతల నీసడించి పల్కుటలో మహిషుని గర్వము ప్రకటింపబడినది. అసమర్థులైన దేవతల నీసడించి ఏవేవో వాగుచున్న అవాకులు చెవాకులు ప్రేలుచున్న మహిషు నమ్మవారు చంపివైచినది. లోకములెల్ల తాపదూరములై శాంతి నొందినవి. ఆనాడు ఆ యుగమున అన్ని లోకములకు శాంతిని కలిగించిన అమ్మవారు మీకు కలియుగమున శాంతిని కలిగించుగాక. **'శూలం తూలం'**, **'వక్రశ్చక్రేణ'**, **'పవిరవతి'**, **'పాశాః కేశాబ్జనాళాని'**, **దేవాన్ దివౌకోరిపురవధి త్వాష్ట్రశత్రో ద్యురాష్ట్రమ్**' పదబంధములలో **వృత్త్యనుప్రాసాలంకార** మున్నది. 'ప్రహర హర' 'హృషీకేశ కేశోఽపి అను పదబన్ధములలో **యమకము** ఉన్నది. అనల! న లభసే అను పదబన్ధమున **ఛేకానుప్రాస**మున్నది. *

**అ :** పైన మహిషుని దేవతాపరిహాసము చెప్పబడినది. ఈ శ్లోకమున **అమ్మవారు దేవతల యుద్ధ ప్రయత్నమునుండి విరమింపజేయుట** చెప్పబడుచున్నది.

**శ్లో॥ శార్ఙ్గిన్! బాణం విముఞ్చ భ్రమసి బలిరసౌ సంయతః కేన బాణో**
**గోత్రారే! హన్మ్యహం తే రిపుమమరరిపుస్త్వేష గోత్రస్య శత్రుః ।**
**దైత్యా వ్యాపాద్యతాం ద్రాగజ ఇవ మహిషో హన్యతే మన్మహేఽద్యే-**
**త్యుత్ప్రాస్యోమా పురస్తాదను దనుజతనుమ్మృద్నతీ త్రాయతాం వః ॥ 24**

**ప్ర :** శార్ఙ్గిన్! = ఓ విష్ణూ!, బాణమ్ = బాణమును, విముంచ = వదులుము, భ్రమసి = భ్రమించుచున్నావు, అసౌ = ఇతడు, బలిః = బలి, కేన = ఎవనిచేత (ఎందుచేత), బాణః = బాణము, సంయతః = కట్టబడినది, గోత్రారే! = ఓ ఇంద్రా, తే = నీ యొక్క, రిపుమ్ = శత్రువును, అహమ్ = నేను, హన్మి = చంపుచున్నాను, ఏషః = ఈ, అమరరిపుస్తు = రాక్షసుడైతే, గోత్రస్య = వంశమునకు, శత్రుః = శత్రువు, దైత్యాః! = దైత్యులారా!, ద్రాక్ = శీఘ్రముగా, అజ ఇవ = మేకవలె, మహిషః = దున్నపోతు, అద్య = నేడు, మన్మహే = నా ఉత్సవమున, హన్యతే = చంపబడుచున్నది, ఇతి = అని, పురస్తాత్ = ముందుగా, ఉత్ప్రాస్య = వెక్కిరించి, అను = పిమ్మట, దనుజతనుమ్ = రాక్షసశరీరమును, మృద్నతీ = మర్దించుచున్న, ఉమా = పార్వతి, వః = మిమ్ము, త్రాయతామ్ = కాపాడుగాక!

**తా :** ఓ విష్ణూ! బాణము వదులుము, ఈతడు బలియని భ్రమించుచున్నావు. బాణము నెందుచేత బంధించితివి. ఓ ఇంద్రా! నీ శత్రువైన ఈ మహిషుని వధించుచున్నాను. వీడు అమరరిపువు కావున నీ గోత్రమునకు శత్రువే, రాక్షసులారా! (వీనిని) ఈ దున్నను నాయుత్సవదినమైన నేడు మేకనువలె చంపుడు. లేదా నేనే చంపెదను అని ఉల్లసమాడి, ఆ పిదప వాని శరీరమును మర్దించుచున్న ఉమ మిమ్ము కాపాడుగాక!

**వి :** శార్ఙ్గిన్! అను సంబోధనము బాణమును ఎక్కుపెట్టిన శార్ఙ్గ ధనువు గలవాడా అను అర్థమును వ్యంజింపజేయును. 'బాణం విముంచ' అని వెంటనే ఉన్నందువలన పై అర్థము లభించును. బాణమును సంధించియు ఏల ప్రయోగించవు? అను ప్రశ్నమొక యర్థము. నేనే చంపుచున్నాను గదా! (అమ్ముల పొదిలోనికి) బాణమును వదలివేయుము అని విష్ణువు నాజ్ఞాపించుట మరొక అర్థము. '**భ్రమసి**' అను పదము వీనిని చంపుదునని భ్రమించి బాణము నెక్కుపెట్టినట్లున్నావు. అది నీవలన కాదులే అని అని యొక అర్థమును, వీడు బలియని భ్రమించినావా? అని మరొక అర్థము నిచ్చును. **సంయతః కేన బాణః** ఎవడో బాణమును పట్టియుంచినట్లు బాణమును ప్రయోగింప కున్నావేమియని ఒక అర్థము. బహుశః ఆ పట్టుకొన్న వాడు నీ కుమారుడైన బ్రహ్మ కావచ్చును అను మరొక అర్థమును ఇచ్చును. కేన అను పదము బ్రహ్మచేత అను అర్థము కలిగియున్నందున పైన చెప్పబడిన రెండవ అర్థము నిచ్చుటకు వీలుకలిగినది. సంయతః అను పదమును బలిరసౌ అను వాక్యమునం దన్వయించి వీడు బలి యనుకొన్నావేమో, అట్లనుకొన్నను వానిని ఈవఱకే బంధించినావు. కావున ఇప్పుడు బాణమును ప్రయోగించుట అనుచితమను మరొక అర్థమును పొందవచ్చును. బంధించిన పిదప బాణమును ప్రయోగించి చంపుట శూరధర్మము కాకపోవుట ఆ అనుచితత్వమునకు హేతువు. ఇది ప్రథమపాదవివరణము.

రెండవపాదమున మహిషుడు గోత్రముయొక్క శత్రువని చెప్పబడినాడు. **గోత్రమనగా వంశము**. ఇంద్రుని గోత్రము అనగా వంశము అమరగోత్రము లేదా కాశ్యప గోత్రము. రాక్షసులది కూడ కాశ్యప గోత్రమే అయినను కయ్యమునకు కాలుదువ్వి సర్వరాక్షసనాశమునకు కారణమైన మహిషుడు గోత్ర శత్రువే. అదికాక కాశ్యపులైన అమరులకు రిపువై, కశ్యప గోత్రమునకు శత్రువైనాడు. జ్ఞాతులతోనే వాడు కయ్యమునకు కాలుదువ్వి నందువలనను వాడు గోత్ర శత్రువని చెప్పబడనగును. ఇంద్రుడును గోత్రారియని సంబోధింపఁబడినాడు. **గోత్రమనగా పర్వతము**. ఒకప్పుడు పర్వతములకు ఱెక్కలుండి భూలోకములోని గ్రామ నగరములపై వ్రాలి వానికి నాశము కలుగఁజేయుచుండగా లోకపాలకుడైన ఇంద్రుడు వాని ఱెక్కల దునిమి గోత్రారియను ప్రసిద్ధినొందెను. పెక్కురు రాక్షసులను కాశ్యపగోత్రులను చంపినందున ఇంద్రుడు గోత్రారియైనాడు. జ్ఞాతులు స్వగోత్రశత్రువులగుట లోకసాధారణము. ఒకడు దేవేంద్రుడు. మరొకడు మహిషుడు. మహిషుడే కాదు ఏ రాక్షసరాజైనను ఇంద్రునకు శత్రువే. కావున అమ్మవారు నీ శత్రువును చంపుచున్నానని చెప్పినది. అనగా మహిషుడు జగజ్జననియైన తనకు శత్రువు కాదని చెప్పినట్లైనది. లోకకంటకత్వాంశమును పురస్కరించుకొని మహిషవధకు పూను కొన్నది. అదికాక వానిని చంపి లోకక్షేమముతోపాటు వానికిని ముక్తి కలిగించదలచి వానిని చంపబూనుకొన్నది. గోత్రజులను మమకారముతో దుష్టులైన రాక్షసుల నింద్రుడుగాని మరెవ్వడైనగాని ధర్మాత్ముడు క్షమింపకూడదు. అధర్మాత్ములైనచో స్వగోత్రజుడైనను, తన పుత్రునైనను వధించుట రాజధర్మము. ఇంద్రుడు రాజై ఆ పని చేయలేని కారణమున అమ్మ వారి నాశ్రయించి ఆమెను వాని జంప బ్రార్థించి ఆమెతో తద్వధము చేయించినాడు. రాజధర్మమును నిర్వర్తించినాడు. ఇది ద్వితీయపాదవివరణము.

మూడవపాదమున ఓ దైత్యులారా! ఈ వేళ నా ఉత్సవము. కావున ఈ యుత్సవసందర్భమున మేకను గోయుట మీ కలవాటే. ఈనాడు మేక కన్న నాకెక్కువ సంతోషకరమైన దున్నపోతున్నది. దానిని నాకై బలి ఈయుడు. ఈ దున్నను చంపుడు అని అమ్మవారు చెప్పినది. ఏ దైత్యులతో మహిషుని బలి ఈయుడని చెప్పినదో ఆ దైత్యులకా మహిషుడు ప్రభువు. వారు ప్రభువు నెట్లు బలి ఈయగలరు. వారి కా మహిషుడు రక్షకుడు గదా! తమ రక్షకుని అమ్మవారి భక్షణమునకై ఇత్తురా, అమ్మవారట్లు కోరుట యేల? ఓ రాక్షసులారా ఇదివఱకు అమాయకసాధుప్రాణియైన మేకను ఇచ్చి చేసిన అపరాధమునకు నిష్కృతి ఈ కపటిమహిషుని బలియిచ్చిన కలుగునని అమ్మవారట్లు చెప్పినది. కాని వారెట్లును ఈయరని అమ్మవారికి తెలియును. వాడు దైత్యావ్యాపాద్యుడు అనగా దైత్యులచే అవ్యాపాద్యుడు. దైత్యావ్యాపాద్యత ఆ మహిషుని యందున్నది. **దైత్యావ్యాపాద్యతాం** అను రెండు పదముల నొక సమాసముగా భావించినచో దైత్యులచే చంపదగి యుండక పోవుట అను అర్థము దాని యందు కలుగును. మీ చేత ఆ పని కాదని గమనించియే నా చేతనే వీడు (ఈ మహిషుడు) చంపబడుచున్నాడు. చూడుడు అని అమ్మవారు చెప్పినది. వ్యాపాద్యతామ్ హన్యతే అను రెండు పదములు దాదాపు ఏకార్థములుగా నుండుటచే ఈ అన్వయాంతరం ఇచట సంభవించినది. ఈ అర్థాంతరమును సంభవించినది. **మన్మహే** అను పదము మీచేత మహిషుని అవ్యాపాద్యత తలచుచున్నాము అను అర్థమును గ్రహించి పై అన్వయాంతరము అర్థాంతరము సంపన్నములగు చున్నవి. ఇట్లు మొదట ఇంద్రోపేంద్రులతో నుల్లసమాడి మహిషశరీరమును మర్దించుచున్న పార్వతి దేవతల రక్షించినట్లు మిమ్ము రక్షించుగాక. నాల్గవపాదమున '**దను దనుజతనుః**' అనుచోట ఛేకానుప్రాసాలంకారమున్నది. వృత్త్యనుప్రాసాలంకారమున్నది. **మహిషో హన్యతే మన్మహే** అనుచోటను **వృత్త్యనుప్రాసాలంకార** మున్నది. *

**అ :** పై శ్లోకమున దేవరాక్షసరాజగతగోత్రశత్రుత్వము ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున **రాక్షస స్వభావకంసబన్ధుకులధ్వంసముత్ప్రేక్షింపబడుచున్నది.**

**శ్లో॥ స్పర్ధావర్ధితవిన్ధ్యభూధరభరవ్యస్తాద్విహాయస్తలం**
**హస్తాదుత్పతితా ప్రసాదయతు వః కృత్యాని కాత్యాయనీ ।**
**యాం శూలామివ దేవదారుఘటితాం స్కన్ధేన మోహాన్ధధీ-**
**ర్వధ్యోద్దేశమశేషబాన్ధవకులధ్వంసాయ కంసోఽనయత్ ॥ 25**

**ప్ర :** యా = ఎవతె, స్పర్ధావర్ధితవింధ్యభూధరభరవ్యస్తాత్ = స్పర్ధతో పెరిగిన వింధ్య పర్వతము యొక్క బరువుతో జారిన, హస్తాత్ = చేతి నుండి, ఉత్పతితా = పైకెగిరినదో, యామ్ = ఎవతెను, దేవదారుఘటితామ్ = దేవతారు నిర్మితమైన, శూలామ్ ఇవ = శూలమునువలె, అశేషబాన్ధవకుల-ధ్వంసాయ = సర్వబంధుకుల ధ్వంసము కొఱకు కంసుడు, వధ్యోద్దేశమ్ = చంపబడు చోటికి, అనయత్ = కొని పోయెనో, (సా = ఆ), కాత్యాయనీ = అమ్మవారు, వః = మీ యొక్క, కృత్యాని = కర్తవ్యములను, (కర్మలను), ప్రసాదయతు = నిర్మలముల నొనరించుగాక!

**తా :** కంసుడు బంధుకుల ధ్వంసమునకై ఎవతెను దేవదారు నిర్మిత శూలమును వలె భుజములపై వధ్యస్థానమునకు మోసికొనిపోయెనో ఎవతె వాని భుజమును వింధ్యపర్వతభారమున జారునట్లు చేసి దానినుండి ఆకసముపై కెగిరిపోయెనో ఆ కాత్యాయని మీ కర్మల నిర్మలముల నొనరించుగాక!

**వి :** దేవకీ వసుదేవుల అష్టమపుత్త్రుడు తనను చంపునను విషయమును నారదునివలన నెఱిగిన కంసుడు దేవకికి తొలుత జన్మించిన ఆఱుగురు కుమారులను చంపెను. దేవకి కేడవ సంతానము నెలలు నిండక మునుపే జారిపోయినదని భావించిన కంసుడు ఎనిమిదవ పుత్రునికై ఎదురుచూచుచుండగా వాని కెనిమిదవ సంతాన మాడు పిల్లయని తెలిసెను. ఆమెను భుజమున మోసుకొని వధ్యస్థానమునకు కొనిపోవుచుండగా వింధ్య పర్వతమంత బరువెక్కిన ఆ కాత్యాయని భుజమునుండి ఆకాశముపై కెగిరిపోయెను. వాడు భుజమున వధ్యస్థానమునకు గొనిపోవు సమయమున దేవదారుకాష్ఠనిర్మితశూలమువలె మిగుల తేలికగా నుండెను. అక్కడకు చేరు సరికి వింధ్యపర్వతమంత బరువై వాని లఘిమాశక్తి నుపయోగించుకొని మిక్కిలి తేలికగా పిమ్మట గరిమాశక్తి నుపయోగించుకొని మిక్కిలి బరువై అనగా ఆ కంసుడు మోయజాలనంత బరువై వానిచేత విడువబడి పైకెగిరిపోయెను. అట్టి సిద్ధులు గలదా కాత్యాయని. ఆమెను కొలచు వానికి నా సిద్ధులు లభించు-చుండగా ఆమె కవి ఉండుటలో వింతయేమి? కంసుడు ఆ వైష్ణవమాయయగు కాత్యాయనిని చంపదలచుకొనెను. కాని వాని ఆ ప్రయత్నము సబాంధవముగా, సవంశముగా కంసుడు తాను నశించుటకై చేసినట్టి దయ్యెను. తాను తలచినది దేవకీవసుదేవులయొక్క వంశాంకురమైనా లేకుండ జేయుట, కాని వాని వంశమే సమూలముగ నశించెను. కాత్యాయని కంటె అణువుగా లఘువుకన్న లఘీయముగా మహత్తున కన్న మహీయముగా గురువు కన్న గరీయముగా నుండునట్టిది. ఆమె ఈ విలాసమును ప్రకటించుట కంసుని నాశనము కొఱకే యైనది. ఆ దుష్కర్మ ఫలముగా శ్రీకృష్ణునిచే బంధుకులములతో కలిపి వాని కులమును గూడ నిర్మూలింపజేసెను. వాడాత్మాత్మీయకుల-ధ్వంసమునకే ఆ పనిచేసినట్లు సంభావింపబడుటచే ఉత్తరార్ధమున **ఫలోత్ప్రేక్షాలంకార**మున్నది. పూర్వార్ధమున స్పర్ధావర్ధిత కృత్యాని కాత్యాయనీ అను పదములో వృత్త్యనుప్రాసాలంకార మున్నది. అట్లే **వధోద్దేశమశేషబాంధవకులధ్వంసాయ కంసోఽనయత్** అను నాల్గవపాదమునను వృత్త్యనుప్రాసాలంకార మున్నది. అట్లే మూడవ పాదమున '**స్కంధేన మోహాంధధీః**' అనుచోటను ఆ వంశమును కాత్యాయని ధ్వంస మొనర్చెనేమో అను సంభావన మీ శ్లోకమున వ్యంగ్యమగుచున్నది. వీరుడైనవాడు ప్రత్యర్థి ఆయుధము ను లాగుకొని దానితోనే ఆ ప్రత్యర్థిని వధించుట లోకప్రసిద్ధమే. కృత్యముల ప్రసాదింపజేయుట అనగా కృత్యము లొనర్చుశక్తి నొసంగుట వానికి తగిన సుఖఫలము నొసగుట అను రెండు విధములుగా అనుగ్రహించుట. సాధారణముగా వింధ్యపర్వతమే మిక్కిలి బరువైనది. అది మేరుపర్వతముపై గల స్పర్ధతో వర్ధిలినప్పుడు దాని బరువు మరింత అధికమగును. ఆ భారాతిశయద్యోతనమునకై **స్పర్ధావర్ధిత** అను విశేషణముతో వింధ్యపర్వతము విశేషింపబడినది. *

**అ :** పై శ్లోకమున దుష్టధ్వంసము ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున **దుష్టశత్రుధ్వంసతుష్టఇంద్రాది-శిష్టులుస్తుతి** చెప్పబడుచున్నది.

**శ్లో॥ తూర్ణం తోషాత్తురాషాట్ప్రభృతిషు శమితే శాత్రవే స్తోత్రకృత్సు**
**క్లాన్తేవోపేత్య పత్యుస్తతభుజయుగలస్యాలమాలమ్బనాయ ।**
**దేహార్ధే గేహబుద్ధిం ప్రతివిహితవతీ లజ్జయాఽఽలీయ కాలీ**
**కృచ్ఛ్రం వోఽనిచ్ఛయైవాపతితఘనతరాశ్లేషసౌఖ్యా విహన్తు ॥ 26**

ప్ర : శాత్రవే = శత్రువు, శమితే = శమించగా, తూర్ణమ్ = శీఘ్రముగా, తురాషాట్ప్రభృతిషు = ఇంద్రాదులు, స్తోత్రకృత్సు = స్తోత్రము చేయువారు కాగా, క్లాన్తా ఇవ = అలసిన దానివలె, ఉపేత్య = సమీపించి, తతభుజయుగలస్య = విశాలభుజద్వయముయొక్క, పత్యుః = భర్తయొక్క, అలమ్ = పూర్ణమైన, ఆలంబనాయ = పట్టుకొఱకు, దేహార్ధే = అర్ధదేహమునందు, గేహబుద్ధిమ్ = గృహబుద్ధిని, ప్రతివిహితవతీ = చేసిన, కాలీ = కాలి, లజ్జయా = సిగ్గుతో, ఆలీయ = ముడుచుకొనిపోయి, అనిచ్ఛయా ఏవ = కోరకుండగనే, అపతితఘనతరాశ్లేషసౌఖ్యా = సిద్ధించిన గాఢాలింగనసౌఖ్యము గలద్రై, వః = మీయొక్క, కృచ్ఛ్రమ్ = కష్టమును, విహన్తు = నశింపజేయుగాక!

**తా :** శత్రువు నశింపగా వెంటనే ఇంద్రాదులు స్తోత్రమొనర్చువారు కాగా అలసిన దానివలె శివుని దీర్ఘబాహువుల సమీపించి వాని మధ్యభాగమైన శివుని దేహముయొక్క అర్ధమునే తన యిల్లుగా చొచ్చుకొని పోయి కోరకుండగనే లభించిన శివుని గాఢాలింగనము గలదైన కాలి మీ కష్టమును నశింపజేయుగాక!

**వి :** ఇంద్రాదులు మహిషుని మర్దించినందుకు అమ్మవారిని స్తుతించుచుండగా వారి పొగడ్తల నిష్టపడని ఆ కాలి అలసిన దానివలె, భర్తను సమీపించి ఆతని విశాలభుజద్వయమధ్యమైన దేహముయొక్క అర్ధ (వామార్ధ) భాగమున సిగ్గుతో ముడుచుకొని పోయినది. ఆయన ఆమె రాకను గమనించియే దీర్ఘములైన తన భుజముల చాచినాడు. అవి ఎంత దీర్ఘములుగా నున్నవనగా ఆయన దేహమును చేరుటకు పట్టిన కాలము ఇంటిలోనికి పోవుటకు పట్టిన కాలముతో సమానమైనది. అమ్మవారు తన ఇంటిలోనికే పోయినా ననుకొన్నది. కాని అది శివుని భుజ మధ్యభాగమని ఆమె గమనించలేదు. గమనించినంతనే ఆమె మరింత ముడుచుకొని పోయినది. శివుడా అవకాశమును గైకొని ఆమెను తన బాహువులతో గాఢముగా బంధించి ఆమెకు గాఢాశ్లేష సౌఖ్యమును గలిగించినాడు. ఇట్టి సమయమున భక్తుల కష్టము గుర్తుకు వచ్చినచో ఆ ఆనంద సమయమున వారిని శీఘ్రముగా కరుణించి వారి కష్టములు తీర్చదా! సంతోషసమయముననే దయగల సంపన్నులు ఇతర దీనులకు అధికముగా దానాదుల నొసగుట వారి క్లేశములను తీర్చుట లోకప్రసిద్ధము. అందుచేతనే ఆ ఆలింగనముతో నా సౌఖ్యము గల కాలి మీ కష్టముల తీర్చవలెను. అని మీ పక్షమున కవి ప్రార్థించుచున్నాడు. ఈ శ్లోకమున భుజయుగమధ్యదేహార్ధభాగమునందు స్వగేహభ్రమ వ్యంగ్యమగుచున్నందున **భ్రాంతిమదలంకారవ్యక్తి** యున్నది. క్లాంతేవోపేత్య పత్యు... స్యాలమాలమ్బనాయ అను ద్వితీయపాదముయొక్క పూర్వోత్తరార్ధములలో వృత్త్యనుప్రాసాలంకార మున్నది. అట్లే మూడవపాదముయొక్క పూర్వార్ధమున **దేహార్ధే గేహబుద్ధిమ్** అనుచోటను ఆ

అలంకారమున్నది. అట్లే **ప్రతివిహితవతీ లజ్జయాలీయ కాలీ** అనుచోటను అది యున్నది. దేవతలు స్తుతించి నప్పుడు ఆమెకు కలిగిన సిగ్గును దాచుకొనుటకే ఆమె అక్కడనుండి వెడలిపోవుటలో ఆమె చేసిన భావగోపనయత్నము వ్యంగ్యమయినది. తన యిల్లనుకొని శివుని భుజమధ్యము చేరి ఆతని కౌగిలింతకు గురియై మరింత ముడుచుకొనిపోయి ఆమె తననే దాచుకొని తన సిగ్గును బయటపడకుండ బయటపడునట్లు చేసినది. ఆలీయ అను శబ్దముచే మొదట అలసినట్లు నటించి అక్కడనుండి వెడలిపోయి సిగ్గును దాచుటకు యత్నించినది. తాను భర్త కౌగిలింతకు గురియై నానని తెలిసికొని తనను దాచుకొన్న తన సిగ్గు తనకే మనోహరముగా నుండగా శివునకెంతో మనోహరమై చెప్పవీలుకాని **శృంగారరసాభివ్యక్తియై** యున్నది. అది ఈ శ్లోకమున కవిగత రతిభావమున కంగమై **గుణీభూతవ్యంగ్య**మగుచున్నది. *

**అ :** పూర్వశ్లోకమున దేవతలతో అమ్మవారు పలికిన సోత్ప్రాస వాక్కులు చెప్పబడినవి. ఈ శ్లోకమున **మహిషు దమ్మవారితో పలికిన సోత్ప్రాసవాక్కులు** చెప్పబడుచున్నవి.

**శ్లో॥ ఆస్తాంముగ్ధేఽర్ధచన్ద్రః క్షిప సురసరితం యా సపత్నీ భవత్యాః**
**క్రీడా ద్వాభ్యాం విముఞ్చాపరమలమమునైకేన మే పాశకేన ।**
**శూలం ప్రాగేవ లగ్నం శిరసి యదబలా యుధ్యసేఽవ్యాద్విదగ్ధం**
**సోత్ప్రాసాలాపజాతైరితి దనుజముమా నిర్దహన్తీ దృశా వః ॥ 27**

**ప్ర :** ముగ్ధే! = ఓ అమాయకురాలా!, అర్ధచన్ద్రః = అర్ధచన్ద్రబాణము, ఆస్తామ్ = ఉండుగాక, యా = ఎవతె, భవత్యాః =నీకు, సపత్నీ = సవతియో, తామ్ = ఆ, సురసరితమ్ = దేవనదిని, క్షిప = విడువుము, ద్వాభ్యామ్ = రెంటితో, క్రీడా = ఆట, (భవతి = ఉండును), అపరమ్ = మరొకదానిని, విముంచ = విడువుము, అమునా = ఈ, ఏకేన = ఒకటైన, పాశకేన = పాచికతో, మే = నాకు, అలమ్ = చాలును, అబలా = ఆడు దానవై, యుధ్యసే = యుద్ధము చేయుచున్నావు (అనునది). యత్ = యేదో, (తత్ = అది), శూలమ్ = శూలముగా, ప్రాక్+ఏవ = ముందే, శిరసి = శిరమున, లగ్నమ్ = తగులుకొన్నది, విదగ్ధమ్ = ప్రగల్భముగా, సోత్ప్రాసాలాపజాతైః = ఉత్ప్రాసతో కూడిన మాటల సమూహములతో (కూడిన), దనుజమ్ = రాక్షసుని, దృశా = చూపుతో, నిర్దహన్తీ = కాల్చుచున్న, ఉమా = పార్వతి, వః = మిమ్ము, అవ్యాత్ = కాపాడుగాక!.

**తా :** ఓ అమాయకురాలా! అర్ధచంద్రముండనీ, గంగను విడువుము. ఆట రెండింటితో గదా. మరొక పాచికను కూడ విడువుము. పోనీ ఈ ఒకటి నాకు చాలునులే. ఇది వఱకు ఆడుది పోరాడుచున్నదనునది తలలో శూలమైనది. ఇట్టి సోత్ప్రాసవాక్యసమూహము లాడుచున్న రాక్షసుని చూపుతో కాల్చుచున్న పార్వతి మిమ్ము కాపాడుగాక!

**వి :** అర్ధచన్ద్రము అనునది ఒక విధమైన బాణము. దాని చివఱ అర్ధచన్ద్రమువలె పదునైన అంచుండును. అట్టి అర్ధచన్ద్రబాణమును ప్రయోగించకుము. అర్థాంతరమున అర్ధచన్ద్రము నీ

శిరసుపైననే ఉండనిమ్ము లేక నీ భర్త శిరసుపైననే ఉండనిమ్ము (శివుని అర్ధ శరీరమగుటచే శివుని వలె పార్వతియు అర్ధచంద్రధారిణి యైనది). శివుడు నీ సవతియైన గంగను శిరసున దాల్చి యున్నాడు. ఆ గంగను విడువుము. నేను దున్నపోతును గదా. నాపై ఆ గంగను వర్షధారవలె క్రుమ్మరింపుము. నాకు తృప్తిగా నుండును. అనునది ఒక అర్థము. నీ నెత్తిపైనను ఉన్న గంగను శివుని నెత్తిపై నొక చోటనే ఉండునట్లు విడచివేయుము అని మరొక యర్థము. నీ చేతిలోని యొక పాశ(క)మును నన్ను కట్టివేయుటకై విడిచియున్నావు. పాశకముగా పాచిక యనునది మరియొక అర్థము. ఒక పాచికను విడచితివి. మరొక పాచికను కూడ విడువుము. రెండు పాచికలతో కదా ఆట ఆడబడును. పోనీలే రెండవ పాచికను విడువకున్నను పరవాలేదు. ఇదివఱకు విడచినది నాకు చాలులే అని మహిషుని వాక్యమున నీవు విడచినది పాశమని అనుకొన్నావు. నా దృష్టిలో అది పాశకము. అల్పమైన పాశము. అది నన్నేమియు చేయలేదు. పాశకమనగా పాచిక అని మరొక అర్థము కదా. నీ దగ్గఱ విడచుటకు మరొక పాచిక లేదు. రెండు పాచికలు లేనిదే ఈ పాచికల ఆట ఆడుట ఎట్లు సాధ్యమగును. పోనీ ఒక పాశకము (పాచిక)ను విడచినావు గదా నా కది చాలును. నీవు విడచిన దానిని నీ అనురాగముయొక్క చిహ్నముగా దానినే దాచుకొందును. మన ఈ ఇరువురి యుద్ధము నాకు పాచికల ఆట యంత సులభముగా నున్నది. ఈ ఆటలో నే నోడిన నీకు దాసుడ నగుదును. అప్పుడు నీ (కేశ) పాశకముతో నన్ను బంధించవచ్చును. నీవే ఓడిన నీవే నాకు స్వాధీనురాల వగుదువు. నీకు నాకు మదనకదన ముచితమే. కాని ఈ యుద్ధము ఉచితము కాదు. నీవు ఆడుదానవు. నన్నోడించుటకు వృధా ప్రయాసము చేయుచు అలసిపోవు చున్నావు గదా అనునదే నా శిరమున శూలమై అనగా నొప్పియై యున్నది. పోనీ గెలువ వలెనని నీకున్న పాచికల ఆటలో నీవు నన్ను గెలుచుట కవకాశమున్నది. నీ శిరసు నాక్రమించుకొని యున్న గంగను ఆ శివునికై శివుని శిరసుపై విసరి వేయుము. పారవేయుము. ఇంతదనుక నీతో సంసారము చేసినందు కాయన మీద ఈ జాలిని జూపి ఆయనతో తెగదెంపులు చేసికొమ్ము. మరొక విధముగా నీ వంటి భార్య యుండగా గంగను నీకు సవతిగా చేసినందుకు నీ వాతనిని విడచుటయే న్యాయము. ఆయన చేసిన అపరాధమునకు అది శిక్ష కూడ నగును. పోనీ కట్టుకున్న వాడుగదా అని అభిమానమున్నచో ఆ గంగతోనే శివుని కులుకనిమ్ము. నీకేమి నష్టము. నీకు నేనున్నాను కదా! ఇట్లు విదగ్ధముగా అనగా శృంగారనాయకుని రీతి మాట్లాడు మహిషుని కంటితో కాల్చినట్లు చూచిన **అమ్మవారు మీలోని అజ్ఞాన (రూప మహిష) మును కాల్చివేయుగాక!** కొట్లాట, పాచికలాట రెండును ఉభయుల మధ్య జరుగును. ఒక్కరితో సాధ్యముగానివి అని '**ద్వాభ్యాం క్రీడా**' అను పదములు వ్యంజించుచున్నవి. యుద్ధమును క్రీడగా భావించుట వీరులకు సాధారణము. పాచికలాటను వైరులవలె ఆడి కొట్లాడుచున్నారా అన్నట్లు ద్వేషాదుల నొకరొకరిపై నొందుట క్రింది తరగతికి చెందిన మనుజుల లక్షణము. అమ్మవారు వీరనారివలె పోట్లాడ బోవుచుండగా మహిషుడు దానిని పాచికలాటగా దిగజార్చ యత్నించుట ఈ శ్లోకమున వ్యంగ్యమగు చున్నది. తన శిరమున ఈ వఱకే శూలముండగా మరొక శూలమును ప్రయోగించెదవేమో. అక్కఱలేదు

అను శూలశబ్దశ్లేషతో మహిషుడు తన మాటలో విదగ్ధతను ప్రదర్శించినాడు. అట్లే **పూర్వార్ధమంతయు మహిషు వాగ్వైదగ్ధ్యము**. ఈ మాటలు అమ్మవారి చెవులలోనికి గ్రుచ్చుకొనిన అర్ధచంద్రశూలములవలె బాధను కలిగించగా ఆమె మనసు, శరీరము కోపాగ్నితో నిండిపోయినది. అగ్నిజ్వాల కన్నులనుండి బయలుదేరినది. ఇక మహిషుడు చచ్చుటకు సంశయమేమి. అర్ధచంద్ర శూల శబ్దముల వలన వ్యంగమగు నర్థము. *

**అ :** పై శ్లోకమున మహిషుని అమ్మవారితో మాట్లాడుటలోని వైదగ్ధ్యము చెప్పబడినది. ఈ శ్లోకమున **మహిషుడు ఇతర దేవతలతో నాడిన మాటలలోని చాతుర్యము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ వక్త్రాణాం విక్లవః కిం వహసి బత రుచం స్కన్ద షణ్ణాం విషణ్ణా-**
**మన్యాః షణ్మాతరస్తే భవ భవ! సకలస్త్వం శరీరార్ధలబ్ధ్యా ।**
**జిహ్మాం హన్మ్యద్య కాలీమితి సమమసుభిః కణ్ఠతో నిర్గతా గీ-**
**ర్గీర్వాణారేర్యయేచ్ఛామృదుపదమృదితస్యాద్రిజా సాఽవతాద్వః ॥ 28**

**ప్ర :** స్కన్ద! = ఓ కుమారస్వామీ!, షణ్ణామ్ = ఆఱు, వక్త్రాణామ్ = ముఖములతో, విక్లవః = విన్నదనము, కిమ్ = ఏమి (ఎందుకు), బత = అయ్యో, విషణ్ణామ్ = విషాదము గల, రుచమ్ = కాంతిని, వహసి కిమ్ = ధరించెదవేమి (ఏల), తే = నీకు, అన్యాః = ఇతరులైన, షణ్మాతరః = ఆఱుగురు తల్లులు (సంతి = ఉన్నారు), భవ! = ఓ శివుడా!, త్వమ్ = నీవు, శరీరార్ధలబ్ధ్యా = అర్ధ శరీరము పొందుటచేత, సకలః = సమ్పూర్ణుడవు, భవ = అగుము, అద్య = నేడు, జిహ్మామ్ = కుటిలురాలైన, కాలీమ్ = కాలిని, హన్మి = చంపుచున్నాను, ఇతి = అని, అసుభిః = ప్రాణములతో, సమమ్ = కూడి (సమానముగా), యయా = ఏ దేవి చేత, ఇచ్ఛామృదుపదమృదితస్య = స్వేచ్ఛతో మెత్తని పాదముచే మర్దింపబడిన, గీర్వాణారేః = రాక్షసునియొక్క, కంఠతః = కంఠము నుండి, గీః = వాక్కు, నిర్గతా = బయలుదేరినదో, సా = ఆ, అద్రిజా = పార్వతి, వః = మిమ్ము, అవతాత్ = కాపాడు గాక.

**తా :** ఓ కుమారస్వామీ! నీ ఆఱు ముఖములలో విన్నదనమేమి? అయ్యో వానిలో విషాదపు కాంతిని ధరించెదవేమి? ఓ శివా! ఇదిగో ఈ కాలిని చంపుచున్నాను. నీవిక పూర్ణశరీరుడ వగుము. అని అమ్మవారి మృదుపదముచే మర్దింపబడిన మహిషాసురుని ప్రాణములతో బాటు వాక్కు బయలుదేరినది. అట్టి పార్వతి మిమ్ము కాపాడుగాక!

**వి :** అమ్మవారు మహిషునితో తలపడనుండగా కుమారస్వామి ఆఱు ముఖములలో విన్నదనము, విషాదము అలముకొన్నవి. ఆ అంశమును గమనించిన మహిషుడు, ఓ కుమారస్వామీ! నీ ముఖములలో ఆ విన్నదనము, విషాదము అనవసరములు. నీయీ తల్లి పార్వతి చచ్చిపోయిననేమి? నీకితర మాతలార్వురున్నారు గదా! అదిగాక ఈ పార్వతి నిన్ను గన్న తల్లి కాదు. పాలిచ్చి పెంచిన తల్లి కాదు. షట్కృత్తికలు నిన్ను కని పెంచిన తల్లులు. వారి కడకు పోయి హాయిగా ఆటలతో

కాలము గడుపుము. వారు నిన్ను పోషించెదరు. కన్న కుమారుని పోషించకుందురా ఏమి? నీకు ఈ పార్వతి చనిపోవునని దిగులు అక్కఱలేదు. ఈ ఒక్కతె చచ్చిపోయిన ఆఱుగురు తల్లులో ఏదో ఒక తల్లి పోషించకుండునా? మహిషునితో కాలి (పార్వతి) తలపడనుండగా శివునికున్న ఐదు ముఖములలోను విషాదము, విన్నదనమును మహిషుడు గమనించి శివునితో నీ అర్ధభాగమును లాగుకొని నిన్ను సగము శరీరము గల వాని (సగము పురుషుని)గా చేసిన ఈ కుటిల కాలిని నేను చంపుచున్నాను. ఆమె లాగుకొన్న సగము శరీరమును మరల పొంది నీవు ఇక పూర్ణశరీరము కలవానినిగా కలిగించి మేలు చేయ బోవుచున్నాను. ఇక నీకు విషాదమక్కఱలేదు. నీ శరీరార్ధమునే లాగుకొని నిన్ను సగము పురుషునిగా చేసినందుకు ఒక పురుషుడుగా నీ పక్షము వహించి ఆమె చేసిన ఆ ఆగడమునకు తగిన శాస్తి నామెకు కలిగించుచున్నాను. ఇంక నీకు దిగులెందుకు? పూర్ణపురుషుడు కాబోవు చున్నందులకు నీవు సంతోషమునే పొందవలసి యున్నది. ఈమె కాలి, నల్లనిది. నీవు తెల్లని గంగను తెచ్చి నెత్తిన పెట్టుకొన్నావని ఈమె నిన్ను ఱాచి ఱంపాన బెట్టుటచే సగమైనావు. ఇక నీకు ఈమె పీడ విరుగడ యగునట్లు చేయుచున్నాను. ఇక నీవు పూర్ణపురుషుడవై గంగతో కులకుచు సుఖముగా నుండుము. ఇక నీవు పూర్ణపురుషుడవై భవుడ వగుము. పునర్జన్మము నొందిన వాడవగుము. భవ నామము సార్థక మొనరించుకొనుము. అందుకు నేను సంపూర్ణముగా సహకరించెదను. నీవు వదలించుకొనజాలని ఈమెను నీ నుండి వదలించి నీ సంసార (భవ)మును అనగా గంగతో పూర్ణగృహస్థుడవుగా పునర్జన్మ నందుటలో తోడు పడెదను. ఈ కాలి నీ సగము శరీరము లాగుకొనుటచే నీ వింతవఱకు వికలుడవై యున్నావు. ఇకనుండి నీవు సకలుడవుగా వైకల్యరహితుడవుగా పునర్జన్మము నందిన వాడవగుము. ఈ మాటలతో పాటే మహిషుని ప్రాణములు కూడ అమ్మవారు మృదుపదమున త్రొక్కగానే పైకి వెడలి వచ్చినవి. ఈ మాటలు పలికిన తరువాత నేనీ మాటలంటిని చతురముగా మాట్లాడితిని అని సంతోషించుటకు వాడు మిగులనే లేదు. **అద్రిజ** పాదము అద్రియంత అమృదువైనది. కావుననే వానిని మర్దించగలిగినది. అమ్మవారు లోకకంటకుడైనను జగజ్జననియైన తన సంతానమునకు చెందిన వాడై నందున వానిని మృదువుగానే మృదుపదము తోడనే త్రొక్కినది. ఎంత మృదువుగా త్రొక్కినను అది అద్రిజ పాదము గదా, అది ఇంతకన్న మృదువుగా ఉండగలదెట్లు? అదిగాక ఆమె కాలియని ఈ శ్లోకమున చెప్పబడినది. ఆమె కాలితో మృదువుగా త్రొక్కుటయే యైనను అది సంహారలాస్యమునకు అంగమే యగును. ఆమె (మహా) కాలుని భార్య. కాలకాలుని భార్యగదా ఆమె పాదస్పర్శ చాలును. పాదమర్దనమే అక్కఱలేదు. **షణ్ణామ్ విషణ్ణామ్, గీర్గీర్వాణారేః** అను పదములలో **యమకానుప్రాసాలంకారము** లున్నవి. ఈ మాటలను మహిషుడు అనకున్నను అన్నట్లు కవిచే చెప్పబడుటచే **అతిశయోక్త్యలంకార** మేర్పడి యున్నది. *

**అ :** పై శ్లోకమున మహిషుని మాటలు చెప్పబడినవి. ఈ శ్లోకమున **అమ్మవారి మాటలు** చెప్పబడుచున్నవి.

శ్లో॥ గాహస్వ వ్యోమమార్గం గతమహిషభయైర్బ్రధ్న! విశ్రబ్ధమశ్వైః
శృఙ్గాభ్యాం విశ్వకర్మన్ఘటయసి న నవం శార్ఙ్గిణః శార్ఙ్గమన్యత్ ।
ఐభీ త్వఙ్నిష్ఠురేయం బిభృహి మృదుమిమామీశ్వరేత్యట్టహాసా
గౌరీ వోఽవ్యాత్ క్షతారిః స్వచరణగరిమగ్రస్తగీర్వాణగర్వా ॥ 29

ప్ర : బ్రధ్న! = ఓ సూర్యుడా!, గతమహిషభయైః = పోయిన మహిషునియొక్క భయముగల, అశ్వైః = గుఱ్ఱములతో, విశ్రబ్ధమ్ = సవిశ్వాసముగా, వ్యోమమార్గమ్ = ఆకాశమార్గమును, గాహస్వ = గడచిపొమ్ము, విశ్వకర్మన్ = ఓ విశ్వకర్మా!, శృంగాభ్యామ్ = శృంగములతో, శార్ఙ్గిణః = విష్ణువునకు, నవమ్ = కొత్తదైన, అన్యత్ = మరొక, శార్ఙ్గమ్ = విల్లును, న ఘటయసి = కూర్చవా?, ఈశ్వర! = ఓ (శివా) ప్రభూ!, ఐభీ = ఏనుగునకు సంబంధించిన, ఇయమ్ = ఈ, త్వక్ = చర్మము, నిష్ఠురా = గరుకైనది, మృదుమ్ = మెత్తనైన, ఇమామ్ = దీనిని (మహిష చర్మమును), బిభృహి = కప్పుకొనుము, ఇతి = అని, అట్టహాసా = బిగ్గఱ నవ్వుగల, స్వచరణగరిమగ్రస్తగీర్వాణగర్వా = తన కాంతి గొప్పతనముతో (బరువుతో) మ్రింగిన దేవతల గర్వము గల, క్షతారిః = కొట్టబడిన శత్రువుగల, గౌరీ = గౌరి, వః = మిమ్ము, అవ్యాత్ = కాపాడుగాక!.

**తా :** మహిషుడు చచ్చినాడు. కావున ఓ సూర్యా! మహిషభయములేని గుఱ్ఱములతో ఆకాశమార్గమున పయనించుము. ఓ విశ్వకర్మా! విష్ణువునకు చచ్చిన ఈ మహిషుని కొమ్ములతో మరొక విల్లును చేసి ఇమ్ము. ఓ శివా! గరుకైన నీ ఏనుగు చర్మమునకు బదులు ఈ మహిషునిచర్మము కప్పికొమ్ము అని అట్టహాసము చేయు దేవతల గర్వము నడచిన గౌరి మిమ్ము కాపాడుగాక!

**వి :** మొదట నేను మహిషుని చంపెదను. నేను మహిషుని చంపెదను అను గర్వముతో మహిషుని ముందుకుఱికిన సూర్యుడు, విష్ణువు, శివుడు మొదలగు దేవతలు ఆ పని చేయలేక వెనుదిరుగగా దేవి స్వయముగా బయలు దేరి మహిషుని కాలితో త్రొక్కి చంపిన ఆనందముతో దేవతల గర్వము నణచిన మాటలిట్లున్నవి. ఓ సూర్యా! మహిషుని చూడగానే నీ గుఱ్ఱములడుగు ముందుకు వేయలేక పోయినవి. నీ ప్రయాణ మాగిపోయినది. ఇప్పుడు నీ గుఱ్ఱములకు (మహిషుడు చచ్చినందున) వాని వలన భయములేక అవి నడవగలవు. ఇక నీ ప్రయాణము కొనసాగింపుము. ఓ విశ్వకర్మా! విష్ణువున కున్న శార్ఙ్గము మహిషుని ముందు పనిచేయలేదు. వాని వేగమునకు తగినట్లు బాణముల వేయలేని తన శార్ఙ్గమును యుద్ధభూమిలోనే జాఱవిడచుకొని పారిపోయినాడు. ఇదిగో ఈ మహిషుని కొమ్ములతో (శృంగములతో) మరొక క్రొత్తశార్ఙ్గమును విష్ణువునకు సిద్ధము చేసి ఇమ్ము. ఇవి విష్ణుగర్వము నడచిన మాటలు. శివుడు మహిషునితో యుద్ధము చేయలేక వానికి భయపడి ఏనుగు చర్మమును తాను కనబడకుండ కప్పుకొన్నాడు. ఓ శివా! నీకా ఏనుగు చర్మము గుచ్చుకొనుట లేదా! మహిషుడు చచ్చినాడు. ఇటు వచ్చి ఈ మహిషుని చర్మము కప్పుకొమ్ము. ఇవి శివుని గర్వము నడచిన మాటలు. శార్ఙ్గిణః అను మాట శార్ఙ్గమును జారవిడచుకొన్న పిమ్మట గూడ ఆ పేరు ఉచితముగాక పోయినను లోకమున నింకను ఆ పేరనే విష్ణువు పిలువబడుట సూచించును.

ఈశ్వర! అని శివుని సంబోధించుట మహిషుని చంపలేక పోయినందున ఆ పేర పిలవబడుట కర్తృత కోలుపోయినను లోకమున నింకను ఆ పేర బిలవబడుట సూచించును. శార్ఙ్గిన్ అని పిలువబడ వలెననినచో విశ్వకర్మ మరొక క్రొత్త విల్లును మహిషుని కొమ్ముల (శృంగముల)తో నిర్మించి ఇచ్చిన విష్ణువు దానిని ధరింపవలెను. పిమ్మట విష్ణువున కాపేరు ఉచితముగా సార్థకముగా నుండును. ఏనుగుచర్మమును వీడి మహిషచర్మము గప్పికొన్నచో లోకము మహిషుని చంపి వాని చర్మమును ధరించినాడని భావించు లోకులు ఈశ్వర అని సంబోధించుటకు సందేహించరు. తలకెక్కిన దేవతల గర్వమును (దేవతలు తలతోడను మహిషవధ చేయలేక తలవంచు కున్నారు). అమ్మవారు ఆ దేవతలు తలతో చేయలేని పనిని కాలితో చేయగా వారి తల దన్నినట్లైనది అని చతుర్థపాదము వ్యంజింపజేయును. వృత్త్యనుప్రాస మీ పాదము నలంకరించుచున్నది. *

**అ :** పై శ్లోకమున అమ్మవారి మాటలు చెప్పబడినవి. ఈ శ్లోకమున **శివుడమ్మ వారితో పరిహసించుచు పలికిన పలుకులు** చెప్పబడుచున్నవి.

**శ్లో॥ క్షిప్తో బాణః కృతస్తే త్రికవినతితతో నిర్వలీర్మధ్యదేశః**
**ప్రహ్రాదో నూపురస్య క్షతరిపుశిరసః పాదపాతైర్దిశోఽగాత్ ।**
**సఙ్గ్రామే సన్నతాఙ్గి! వ్యథయసి మహిషం నైకమన్యానపి త్వం**
**యే యుధ్యన్తేఽత్ర నైవేత్యవతు పతిపరీహాసహృష్టా శివా వః ॥ 30**

**ప్ర :** తే = నీ యొక్క, బాణః = బాణము (బాణుడు), క్షిప్తః = విసరివేయ బడినదిగా (నవాడుగా), కృతః = చేయబడినది (నాడు), త్రికవినతితతః = మూడు వంపులచేత విస్తృతమైన, మధ్యదేశః = నడుమ భాగము, నిర్వలీః = వలులు లేనిదిగా, కృతః = చేయబడినది, క్షతరిపుశిరసః = కొట్టబడిన శత్రువు తల గల, నూపురస్య = అందెయొక్క, ప్రహ్రాదః = ధ్వని (ప్రహ్లాదుడు), పాదపాతైః = తన్నులతో, దిశః = దిక్కులను, అగాత్ = చేరెను. సన్నతాంగి! = వంగిన నడుము గలదానా!, త్వమ్ = నీవు, సంగ్రామే = యుద్ధమున, ఏకమ్ = ఒక, మహిషమ్ ఏవ = మహిషునే, న వ్యథయసి = చంపుటలేదు, యే = ఎవరు, అత్ర = ఇచట, న యుధ్యంతే = పోరాడుట లేదో, (తాన్ = ఆ), అన్యాన్ అపి = ఇతరులను గూడ, వ్యథయసి = చంపుచున్నావు, ఇతి = అని, పతిపరీహాసహృష్టా = భర్తయొక్క పరిహాసమున సంతోషించిన, శివా = శివ, వః = మిమ్ము, అవతు = రక్షించుగాక!

**తా :** నీవు బాణమును విసరుట (బాణుని చంపుట) నీవు నిటారుగా నిలబడి నడుమునందు వళులు లేకుండ జేయుట, (మధ్య దేశమున అనగా భూలోకమున బలిని లేకుండ జేయుట), మహిషుని తలను కొట్టిన నీ నూపురముయొక్క ధ్వని దిగంతముల జేరుట (ప్రహ్లాదుడు పారిపోవుట), నీ వొక్క మహిషుని తోడనే యుద్ధము చేయుచున్న నీవు మహిషుని చంపుటయేగాక యుద్ధము చేయని బాణ బలి ప్రహ్లాదులను చంపుచున్నావు అను **శివుని పరిహాసవచనములకు సంతసించిన శివ మిమ్ము రక్షించు గాక!**

**వి :** బాణమును విసరుట, బాణుని చంపుట, మధ్య దేశమును వలి రహితముగా చేయుట, బలిరహితముగా చేయుట, ప్రహ్రాదము దిక్కులకు పోవుట, ప్రహ్లాదుడు దిక్కులకు పోవుట అను విషయత్రయ విషయిత్రయముల అభేద్యావసాయము శ్లేషబలమున నిర్వహింపబడుటచే నిందు **రూపకాతిశయోక్త్యలంకార** మేర్పడి యున్నది. మొదటిపాదమున **తే** అను పదము తరువాత అకార ప్రశ్లేష మొనర్చుటచే నీ వలన దేశమత్రిక మగుటచే అనగా బాణబలిప్రహ్లాదరహిత మగుటచే అచటి అనగా ఆ మధ్య దేశ (లోక) వాసుల స్తోత్రములచే విస్తరించినది అను అర్థాంతరవ్యక్తి కలుగును. అత్రికము అందుచేతనే వినతితతము అను హేతుగర్భవిశేషణము మధ్యదేశమును విశేషించుచున్నట్లు వీరోచితముగా నుండుటచే ఆ వీర వనితా మధ్యము స్తుతిపాత్రమే అనునను అర్థాంతరము కూడ వ్యక్తమగును. విష్ణుకృత బలిబాణభంగ ప్రస్తావనమున అమ్మవారి యందు తదభేదము వ్యంగ్యమగును. ద్వితీయపాదాది **ప్రహ్రాద** శబ్దమందలి 'ర' లకారముతోడి అభేదమున ప్రహ్లాదుని బోధించును (రలయోరభేదః) ప్రహ్లాద బలి బాణులు ముగ్గురుఅదితి యొక్క పుత్రపౌత్రాదిక వంశమునకు చెందినవారు. మహిషుని చంపుటలో శక్తిలేని మేము (దేవతలము) బాణబలిప్రహ్లాదుల నణచి నా మనుట వట్టిది. అప్పుడు మాలో నీవు (శక్తివి) ఉండుటచేతనే సంభవించినది. కావున తత్సంబంధకీర్తియు నీకు చెందినదే అను సత్యము శివుని పరిహాసవచనములలో వ్యక్తము. *

**అ :** పై శ్లోకమున శివుడు పార్వతితో నాడిన పరిహాసవచనములు చెప్పబడినవి. ఈ శ్లోకమున **అమ్మవారు శివునితో నాడిన పరిహాసవచనములు** చెప్పబడుచున్నవి.

**శ్లో॥ మేరౌ మే రౌద్రశృఙ్గక్షతవపుషి రుషో నైవ నీతా నదీనాం**
**భర్తారో రిక్తతాం యత్తదపి హితమభూన్నిస్సపత్నోఽత్ర కోఽపి ।**
**ఏతన్నో మృష్యతే యన్మహిషకలుషితా స్వర్ధునీ మూర్ధ్ని మాన్యా**
**శమ్భోర్భిన్ద్యాద్ధసన్తీ పతిమితి శమితారాతిరీతీరుమా వః ॥ 31**

**ప్ర :** మేరౌ = మేరువు, రౌద్రశృంగక్షతవపుషి = క్రూరములైన కొమ్ములతో కొట్టబడిన శరీరము కలది కాగా, మే = నాకు, రుషః = కోపములు, న నీతా ఏవ = కొనిరాబడినవి (చేరినవి) కానేలేదు, నదీనామ్ = నదులయొక్క, భర్తారః = పతులు, (సముద్రములు), రిక్తతామ్ = శూన్యతను, నీతా (ఇతి) యత్ = పొందింపబడుననుట యేదో, తద్ అపి = అదియు, హితమ్ = మేలు, అభూత్ = ఆయెను, అత్ర = ఈ విషయమున, కోఽపి = ఒకడయినను, నిస్సపత్నః = శత్రుహీనుడు, అభూత్ = ఆయెను, శమ్భోః = శివునియొక్క, మూర్ధ్ని = తలయందు, మాన్యా = గౌరవింపదగిన, స్వర్ధునీ = స్వర్గనది (గంగ), మహిషకలుషితా యత్ = మహిషునిచే పాడుచేయబడిన దనునది, ఏదో, ఏతత్ = ఇది, నో మృష్యతే = సహింపబడదు, ఇతి = అని, పతిమ్ = భర్తను, హసన్తీ = వెక్కిరించుచు, శమితారాతిః = చంపిన శత్రువుగల, ఉమా = పార్వతి, వః = మీ యొక్క, ఈతీః = బాధలను, భిన్ద్యాత్ = నశింపజేయుగాక!

**తా :** మహిషుడు తన క్రూరములైన కొమ్ములతో మేరుపర్వతముయొక్క శరీరమునకు గాయము లొనర్చెను. గంగానది నదుల భర్తలైన సముద్రముల శుష్కింపజేసెను. అయినను నేను కోపింపలేదు. సముద్రముల శుష్కింపజేసి నప్పుడొకనికి (శివునకు) మేలైనది. ఆతడు శివుడు సపత్న (శత్రు) హీనుడైనాడు గదా! శివుడు తలపై పెట్టుకొని గౌరవించిన గంగను వాడు కలుషిత మొనర్చుటను మాత్రము సహింపక ఇదిగో వానిని చంపుచున్నానని శివుని వెక్కిరించుచు వానిని చంపిన పార్వతి మీ బాధల నశింపజేయుగాక!

**వి :** మహిషుడు తన క్రూరములైన కొమ్ములతో మేరుశృంగములను గ్రుమ్మి మేరుపర్వతము యొక్క శరీరముయొక్క పై భాగమును శృంగరహితము చేసెను. మేరువునకు శృంగభంగము కలిగించెను. మహిషునివలె మేరువు శృంగి, ఒక శృంగి మరొక శృంగితో పోరాడి దాని శృంగములకు భంగము కలిగించుట అనునది కొమ్ములు (శృంగములు) కల పశువులలో సాధారణముగా కనిపించు దృశ్యము. **శృంగ** శబ్దమునకు పశువు కొమ్ములు, పర్వతశృంగములు (శిఖరములు) అను రెండర్థము లుండుటచే మేరువుయొక్క శృంగిత్వమును తత్కృతమైన ఔన్నత్యమును సహింపని మహిషుడు తన కొమ్ములతో మేరువుయొక్క (శిఖరములను) విరుగగొట్టెను. ఈ అర్థమంతయు శృంగ శబ్దశక్తి వలన లభించు వ్యంగ్యము. సముద్రములు నదులకు భర్తలు. ఎట్లు భర్తలకడకు భార్యలు పోవుదురో అట్లు నదులు సముద్రముల చేరుటచే సముద్రములు నదులకు భర్తలు అని, నదులు సముద్రముల భార్యలు అని చెప్పుట కవి సమయము. నదియైన గంగను శివుడు తలపై ధరించుట ఆమెను భార్యగా చేసికొనుట రామాయణాదులలో వర్ణింపబడినది. హిమవంతుడు తన కూతురైన గంగను శివున కొసగినట్లు కథ యున్నది. అట్లే పార్వతిని కూడ శివున కొసగిన కథ అంతకంటెను ప్రసిద్ధముగానే ఉన్నది. నదులలో చేరి నదిగా గంగ సముద్రమునకు భార్యయై యున్నది. ఒకవైపు శివుని నెత్తిపై కూర్చొని కులుకుచు సముద్రము (మరొక భర్త)ను చేరుచున్నది. అందుచేత శివునకు సముద్రుడు సపత్నుడు (శత్రువు) లేనివాడైనాడు. ఇది శివునకు మేలైనట్లుగా పార్వతి చెప్పినది. కాని గంగను శివుడు నెత్తిపై పెట్టుకొనుట అర్ధాంగి, అర్ధనారి కావున తననెత్తిపై ఆమెను పెట్టినట్లే అనుటచే పార్వతికి శివునిపై కోపము హెచ్చుగానే వున్నది. అందుచేత ఒకడు నిస్సపత్నుడాయెనని చెప్పెనే కాని శివుని పేరెత్తుట కిష్టపడలేదు అను వ్యంగ్యము '**కోఽపి**' అనుటచే ఏర్పడుచున్నది. సముద్రుని భార్యయైన గంగను శివుడు పెండ్లాడుట ఆ శివునకు అనుచితమైన పని. మరొక భార్య కావలసి వచ్చినచో అవివాహితను తెచ్చుకొనవచ్చు గదా! తాను అర్ధాంగి అయి యుండగా మరొకర్తెను నెత్తిపై పెట్టుకొనుట అందును ఇరువురి (పెక్కురి)ని భర్తలుగా నంగీకరించిన గంగను నెత్తిపై పెట్టుకొనుట పార్వతికి సహింపరానంత కోపమును కలిగించినది. సముద్రమును '**నదీనామ్ భర్తారః**' (సముద్రము లేదుగదా) అను బహువచనముతో చెప్పుటతో పై అర్థము వ్యంగ్యమయినది. మహిషుడు గంగను కలుషితము చేసెననగా స్వర్గము నాక్రమించి ఆ శ్రమను పోగొట్టుకొనుటకై అందులో తానమాడి, యుద్ధమువలన నేర్పడిన మాలిన్యమును కడిగి వేసికొనుట, పార్వతికి సవతి (శత్రువు) అగుటచే గంగకు మహిషునివలన పరాభవము కలిగినందుకు లోలోపల సంతోషించు-

చున్నను శివునందు తన కెక్కువ ప్రేమ యున్నదని నిరూపించుటకు మహిషుని చంపుచున్నానని చెప్పుచు చంపినది. గంగను కలుషితము చేసినందుకే, ఇదిగో మహిషుని చంపుచున్నానని చెప్పి చంపినది. మహిషుడు చేసిన మేరుపర్వతక్షతి సముద్రశుష్కీకరణము అను రెండు అపరాధములకంటె శివునకు మిక్కిలి ప్రియురాలై నెత్తిన పెట్టుకొని మన్నింపబడిన గంగను కలుషితమొనర్చుట తనకు సహింపరానిదని చెప్పుచు అందుకే చంపుచున్నానని చెప్పుచు చంపినది. ఇది యంతయు ఒక విధముగా శివుని వెక్కిరించుటయే. కావున ఈ శ్లోకమున గంగా శివులను ప్రశంసించుచునే గంగయొక్క ద్విబహుభర్తృకతను పరునియందు మనస్సు కలిగి, వానిని చేరబోవు గంగను తన శీర్షము నందు ధరించుట అను శివుని అనుచిత కర్మము చెప్పుట (నిందించుట) వ్యంగ్యము లయినందున ఈ శ్లోకమున **వ్యాజస్తుత్యలంకారవ్యక్తి** ఉన్నది. అతివృష్టి, అనావృష్టి, ఎలుకలు, మిడతలు, కఱవులు, గత్తరలు మొదలగునవి ఈతి బాధలు అని చెప్పబడును. ఈతి శబ్దము ఈ శ్లోకమున బాధా సామాన్యవాచిగానే ప్రయోగింపబడినది. ప్రథమపాదారంభమున **మేరౌ మేరౌ** అను వర్ణముల జంటయొక్క పునరావృత్తిచే **ఛేకానుప్రాసము** అను శబ్దాలంకార మేర్పడి యున్నది. శ్లోకమున తకారావృత్తి బహువారముండుటచే వృత్త్యనుప్రాసమను శబ్దాలంకారము కూడ అలంకారముగా నున్నది. వపుషి రుషో, మహిషకలుషితా, స్వర్ధునీ మూర్ధ్ని మాన్యా అను పదములలో కూడ వృత్త్యనుప్రాసము లున్నవి. మహిషుని శృంగములు రౌద్రము లనుటచే మహిషుని క్రూరత్వము లోకప్రసిద్ధమని వ్యంగ్యమగును. శృంగములులేకయే తనను సవతిని నెత్తిని పెట్టుకొని పరిహసించు శివుని రౌద్రము తనకు (పార్వతికి) మాత్రమే తెలియును అనియును వ్యంగ్య మగును. **నదీనామ్ శంభోర్మూర్ధ్ని మాన్యా** అని అన్వయించిన శంభుశీర్షమున విరాజిలు సౌభాగ్యము ఒక్క గంగానదికే తప్ప మరే యితర నదికిని పట్టకపోవుటచే గంగానదియొక్క సర్వశ్రేష్ఠత్వము వ్యంగ్యమగును. **స్వర్ధునీ** అని గంగను చెప్పుటచే దాని పవిత్రతయు వ్యంగ్యమగును. *

**అ :** పై శ్లోకమున అమ్మవారు శివునితో నాడిన పరిహాసవచనములు చెప్పబడినవి. ఈ శ్లోకమున **జయ పరిహాసవచనములు** చెప్పబడుచున్నవి.

**శ్లో॥ సద్యస్సాధితసాధ్యముద్ధృతవతీ శూలం శివా పాతు వః**
**పాదప్రాన్తవిషక్త ఏవ మహిషాకారే సురద్వేషిణి ।**
**దిష్ట్యా దేవ! వృషధ్వజో యది భవానేషాపి నః స్వామినీ**
**సఞ్జాతా మహిషధ్వజేతి జయయా కేలౌ కృతేऽర్ధస్మితా ॥ 32**

ప్ర : పాదప్రాంతవిషక్తే ఏవ = పాదప్రాంతమున తగులుకొని యుండగానే, మహిషాకారే = దున్నపోతు ఆకారముగల, సురద్వేషిణి = రాక్షసునందు, సద్యః = వెంటనే, సాధితసాధ్యమ్ = సాధింపబడిన సాధ్యము గల, శూలమ్ = శూలమును, ఉద్ధృతవతీ = ఉద్ధరించినదై, దేవ = ఓ ప్రభూ!, భవాన్ = నీవు, యది = ఒకవేళ, వృషధ్వజః = ఎద్దు జండా గలవాడవైనచో, దిష్ట్యా = దైవికముగా, ఏషా = ఈ, నః = మా యొక్క, స్వామినీ = యజమానురాలు (పార్వతి), మహిషధ్వజా

= మహిషుడు జండా గలది, సంజాతా = అయినది, ఇతి = అని, జయయా = జయచే, కేలౌ = ఆట (హాస్యము), కృతే = చేయబడగా, అర్ధస్మితా = సగము నవ్వుగల, శివా = శివ, వః = మిమ్ము, పాతు = కాపాడుగాక!

**తా :** మహిషుడు కాలికి తగులుకొనగానే శూలముతో వాని శరీరమును తూట్లు పొడిచిన అమ్మవారా శూలమును పైకెత్తినది. అప్పుడు జయ ఓ ప్రభూ! నీవు వృషధ్వజుడవైనచో మా యజమానురాలైన శివ కూడ నేడు మహిషధ్వజ యైనదని హాస్యమాడగా **మందస్మిత మొనరించిన అమ్మవారు** మిమ్ము రక్షించుగాక!

**వి :** మహిషవధము సాధ్యము. దానిని సాధించిన సాధనము శూలము. సాధనమనగా పనిముట్టు. మహిషవధము అను పనికి అది ఉపయోగపడు కరణము (సాధనము). ఆ పని పూర్తియైన పిదప సాధనమును యథాస్థానమున నుంచవలెను. అందుకొఱకు మహిషుని శరీరమున గ్రుచ్చుకొని యున్న ఆ శూలమును అమ్మవారు ఉద్ధరించినది. అనగా పైకి లాగినది. ఉద్ధరించుట అను పదమునకు పతితులను స్వర్గాది ఊర్ధ్వలోకములకు పంపించుట మరొక అర్థము. లోకకంటక శూలతుల్యుడై, లోకశూలరూపుడైన మహిషుని చంపి వానిని సర్వోన్నతమైన తన లోకమునకు పంపినది. లోకులు పాపముల నొనర్తురు. వారికి దుఃఖము కలిగించిననే వారి పాపములు నశించును. అందుచేతనే అమ్మవారు లోకశూలప్రాయులైన మహిషాది దుష్టులను సృష్టించి లోకులకు బాధ కలిగించి వారి పాపముల నశింపజేసి దుఃఖదూరుల చేసి ఉద్ధరించును. అట్లే లోకులకు దుఃఖము కలిగించి సృజించిన ఆ మహిషాదులను తానే వారిని వధించి అనగా వధరూపమైన తన (సత్) సంగముచేత వారిని గూడ ఉద్ధరించవలె గదా! అందుకే అమ్మవా రట్లు చేయుచుండును. ఇప్పుడట్లే చేసినది. ఈ దృష్టిలో సాధ్యమనగా లోకుల పాపములనుండి (దుఃఖము కలిగించి) దూరము చేయుట, తత్సాధనరూపులైన మహిషుడు (మొదలగువారు) శూలము అనియే అనబడవలెను. వారిని ఉద్ధరించుట కూడ సాధితసాధ్యశూలోద్ధరణమే. గెలిచిన వారోడిన వారిపై నెక్కుట పిల్లల ఆటలో కనిపించును. అట్లే శత్రువుల నోడించి వారి ఆకృతులను జండాగుడ్డపై చిత్రించుట రాజులు చేయు పని. ఇతర కారణముల వలనను విభిన్నములైన ఆకృతులు జండాగుడ్డలపై చిత్రించుట కూడ రాజుల విషయమున కనిపించును. వరాహము నోడించినవాడు వరాహధ్వజుడగుట ఆ పిమ్మట ఆ వంశములలో జన్మించిన వారందఱును ఆ ధ్వజచిహ్నములనే కలిగియుండుట రాజ సాధారణ విషయము. వినాయకుడు మూషికాసురు నోడించి వాని కోరికపై మూషికవాహనుడయ్యెను. జండాగుడ్డపై నుండు చిత్రము దేనిదో దానిని వాహనముగా స్వీకరించుటయు కలదు. శివుడు వృషతురంగుడు. అనగా ఎద్దు వాహనముగా గలవాడు. అట్లే వృషధ్వజుడు కూడ. అట్లే విష్ణువు గరుడవాహనుడు. గరుడధ్వజుడు కూడ. శివుడు వృషమును గెలిచిన కథ కానరాదు. కాని ఈ శ్లోకమున జయ నీవు వృషధ్వజుడవైనట్లు ఈనాడు మా యజమానురాలు నీ భార్యయునైన శివ మహిషవధానంతరము **మహిషధ్వజ** యైనదని చెప్పుటచే

శివుడు వృషము నోడించిన లేక చంపిన కథ ఎచ్చటనైన ఉండి యుండవచ్చునని తెలియుచున్నది. ఇప్పటివఱకు ఈమె నీతో పాటు నీ వెనుక వృషముపై కూర్చొని నీతో వచ్చుచున్నది. ఇక ముందట్లు గాక నీవు వృషముపై నూరేగునప్పుడు ఈమె మహిషునిపై ఊరేగుచు రాగలదు. లేక ఇంతకుముందు సింహము వాహనముగా గలదై ఉండెను. దానిని చూచి నీ వాహనమైన ఎద్దు భయపడుచుండెడిది. ఇప్పటినుండి మహిషధ్వజయై మహిషవాహన యగును. కావున నీ వాహనమైన ఎద్దు భయపడకుండును. నీ సమస్య ఈ విధముగా తీరిన దను వస్తువు ఈ శ్లోకమున వ్యంజింపజేయబడినది. ఈ విధముగా శివుని పరిహసించి నందులకు శివ మందస్మిత మొనర్చెను. శివుడు తెల్లనివాడు. ఆయన వాహనమైన ఎద్దు తెల్లనిది. అమ్మవారు నల్లనిది. ఇప్పటికి తన రంగునకు నప్పని వాహనముతో సరిపుచ్చుకొనుచున్న మా యజమానురాలు ఇప్పటినుండి తన రంగునకు నప్పిన నల్లని మహిషమునే వాహనము నొనరించు కొనగలదు. ఈ విషయములోనను ఈ శివ ఓ శివా నీతో సమానమైనది యనియు ఈ పరిహాసమున వ్యంగ్యమగుచున్నది. శివుడు పురుషుడు. కావున కొంచెము వేగముగా నడచు ఎద్దు అతనికి వాహనముగా తగియున్నది. శివ మందగమన కావున ఆమె వాహనము కూడ ఆ మందగమనమునకు తగినట్లే ఉన్నదనియు ఈ పరిహాసమున వ్యంగ్యమగుచున్నది. మరొక విధముగా మహిషవాహనుడైన యముడు మహిషున కోడిపోయెను. కావున ఆ లోక(పాపుల) శిక్షణమున కాతడు పనికిరాని వాడైనాడు. ఇకనుండి మహిషవాహనుడు (కాలుడు) చేయుపని నిర్వహించి కాళీ నామకురాలగును. లేక కాళీ నామము సార్థక మొనరించు కొనును అనియు వ్యంగ్యమగును. వృషధ్వజుడవైన నీకింతవఱకు (పట్ట) మహిషియైన ఈ శివ స్వయముగా మహిష ధ్వజయైనది అనియు వ్యంగ్యమగును. ఈ పరిహాసము శివు నుద్దేశించిన దగుటయేగాక మరొక విధముగా శివ నుద్దేశించిన పరిహాసము కూడ నగుచున్నది. ఏ దేవతకును లేని మహిషధ్వజము నీమె సమకూర్చుకొన నున్నదనుటయే ఆ పరిహాసము. చెలికత్తె చేసిన ఈ పరిహాసమునకు కోపగించుకొనక చెలికత్తె మాటకారితనమునకు సంతసము నొంది శివ మందస్మిత మొనర్చినది. మహిషుని శరీరమునుండి శూలము నుద్ధరించినట్లు భక్తుల హృదయశల్యములను (మానసికతాపములను) ఉద్ధరించి భక్తుల కాపాడుగాక అని **శూలమ్ ఉద్ధృతవతీ శివాః వః పాతు** అను పదములు వ్యంజింపజేయును. వృష అను ద్వివర్ణ (ద్వ్యక్షర) పదార్థధ్వజుడైన శివునికన్న మహిష అను త్రివర్ణ (త్ర్యక్షర) పదార్థధ్వజురాలైన శివ ఆధిక్యము వృషధ్వజ మహిషధ్వజ పదములచే వ్యంగ్యమగును. *

**అ :** పై శ్లోకమున అమ్మవారియందు శివుని కన్న ఆధిక్యము చెప్పబడినది. ఈ శ్లోకమున ఆమెయందు **విష్ణువునకన్న ఆధిక్యము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ ఆహన్తుం నీయమానా భరవిధురభుజస్రంసమానోభయాంసం**
**కంసేనైనాంసి సా వో హరతు హరియశోరక్షణాయ క్షమాపి ।**

**ప్రాక్ప్రాణానస్య నాస్యద్గగనముదపతద్గోచరం యా శిలాయాః**
**సమ్ప్రాప్యాగామివిన్ధ్యాచలశిఖరశిలావాసయోగోద్యతేవ ॥ 33**

**ప్ర :** భరవిధురభుజస్రంసమానోభయాంసమ్ = బరువుచే పట్టుకోల్పోయిన బాహువుల నుండి జారుచున్న మోచేతులు గలుగునట్లుగా, ఆహన్తుమ్ = చంపుటకు, కంసేన = కంసునిచేత, నీయమానా = కొనిపోబడుచున్నదై, హరియశోరక్షణాయ = విష్ణువుయొక్క కీర్తిని కాపాడుటకొఱకు, క్షమా అపి = శక్తురాలయ్యు, యా = ఎవతె, శిలాయాః = (వధ్య) శిలయొక్క, గోచరమ్ = గోచరమైన, గగనమ్ = ఆకాశమును, సంప్రాప్య = సమీపించి, ఆగామివింధ్యాచలశిఖరశిలావాసయోగోద్యతా ఇవ = రాబోవు వింధ్యపర్వతశిఖరశిలానివాసయోగమునకు బయలుదేరిన దానివలె, ఉదపతత్ = పైకెగిరినో, సా = ఆమె (కాత్యాయని), వః = మీయొక్క, ఏనాంసి = పాపములను, హరతు = హరించుగాక!

**తా :** బరువుగానున్న కాత్యాయనిని మోసికోని పోవుచుండగా కంసుని భుజములు శిథిలములయ్యెను. వధ్యశిల వఱకు వాడుపోగా వానిని చంపగల సమర్థురాలయ్యు విష్ణువుయొక్క కీర్తిని కాపాడవలెనని వానిని ఆమె చంపలేదు. రాబోవు జన్మమున వింధ్యాచలవాసినిగా అవతరింపనున్నందున వధ్యశిలాప్రాంతగగనతలమున కామె యెగిరిపోయెను. ఆ కాత్యాయని మీ పాపముల నశింప జేయుగాక!

**వి :** శిశురూపము ధరించియున్న కాత్యాయని నవలీలగా వధ్యశిల వఱకు మోసుకొనిపోయి అచట చంపవలెనని తలచి కంసు డామెను మోసికొని పోవుచుండగా ఆమె బరువునకు కంసుని భుజములు శిథిలము లయ్యెను. కావున ఆమె ఆ కంసుని చంపుటకును సమర్థురాలని తేలినది. ఆమె విష్ణువుద్వారా కంసుని చంపించి కంససంహారి అనుకీర్తిని కల్పించగోరినది. ప్రతికల్పము నందును కంసుని కృష్ణరూపము ధరించి విష్ణువే చంపెను. విష్ణువునకు పూర్వకల్పీయకంససంహారి యన్న కీర్తి నామె రక్షింపగోరినది. అందుచేతనే కంసునామె సంహరింపలేదు. అనగా విష్ణువునందు ఆ ప్రత్యక్షశక్తిరూపముననుండి విష్ణువుచే నా పని నామె చేయించినది. లేక ఆమెయే చేసినది. అయినను విష్ణువునకే ఆ కీర్తి కలుగుచున్నట్లు చేసినది.

ఆతని పూర్వకల్పీయకీర్తిని రక్షించినది. (వధ్య) శిలాప్రాంతగగనతలమునకా కాత్యాయని కంసుని భుజములనుండి ఎగిరిపోయినది. ఎట్లును ఆమె రాబోవు జన్మమున వింధ్యపర్వతశిఖరశిలా–సంపర్కము నొందబోవుచున్నది. ఇప్పుడును ఆ ఆసక్తిచేత శిలకడకు కంసుడు పోవుదాక వాని భుజములపై నుండి అక్కడకు పోగానే పైకెగిరి పోయినదా యనునట్లు ఎగిరిపోయినది అను సంభావన ఉత్తరార్ధమున చెప్పబడినందున **ఉత్ప్రేక్షాలంకార** మేర్పడి యున్నది. **ఉభయాంసమ్** అను సమాసమునందలి **ఉభయ** శబ్దము ఆమె బరువుచేత వాడు తన ఒక భుజమునుండి మరొక భుజమునకు కాత్యాయనిని మార్చుకొనుటను వ్యంజించును. భయాంసమ్, కంసేన, ఏనాంసి పదములు వృత్త్యనుప్రాసాలంకృతములై యున్నవి. హరతు హరియశోరక్షణాయ క్షమా, ప్రాణానస్య నాస్యత్ అను పదములును అట్టివేయై యున్నవి.

*

**అ :** పై శ్లోకమున అమ్మవారు కంసునియందు చంపుటయను నాల్గవదైన దండోపాయమును ప్రయోగింపకపోవుట చెప్పబడినది. ఈ శ్లోకమున మహిషునియందు **యముని దండ** (ఉపాయ) **ప్రయోగవైఫల్యము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ సామ్నా నామ్నాయయోనేర్ధృతిరకృత హరేర్నాపి చక్రేణ భేదాత్**
**నేన్ద్రస్యైరావణస్యాప్యుపరి కలుషితః కేవలం దానవృష్ట్యా ।**
**దాన్తో దణ్డేన మృత్యోర్న చ విఫలయథోక్తాభ్యుపాయో హతోఽరి-**
**ర్యేనోపాయస్స పాదస్సుఖయతు భవతః పఞ్చమశ్చణ్డికాయాః ॥ 34**

**ప్ర :** ఆమ్నాయయోనేః = వేదముల జన్మభూమి (బ్రహ్మ) యొక్క, సామ్నా = సామము (సామమును మొదటి ఉపాయము) చేత, ధృతిః = పట్టు (ధైర్యము), న అకృత = చేయబడలేదు, హరేః = విష్ణువుయొక్క, చక్రేణ = చక్రకర్తృకమైన, భేదాత్ = భేదము (మూడవ ఉపాయము) ద్వారమున, న = (ధైర్యము చేయబడ) లేదు, ఇంద్రస్య = ఇంద్రునియొక్క, ఐరావణస్య = ఐరావతముయొక్క, ఉపరి = పైన, దానవృష్ట్యా కేవలమ్ = ఒక మదజల (రెండవ ఉపాయమైన దాన)ము యొక్క వర్షముచేత , న కలుషితః = కలుషితుడుగా చేయబడలేదు, మృత్యోః = యమునియొక్క, దండేన = దండముచేత, దాన్తః న = దమింపబడినవాడు కాలేదు, విఫలయథోక్తాభ్యుపాయః = విఫల మొనర్చబడిన చెప్పబడిన (నాలుగు) ఉపాయములుగల, అరిః = శత్రువు (మహిషుడు), యేన = దేనిచేత, హతః = చంపబడెనో, సః = ఆ, పంచమః = ఐదవ, ఉపాయః = ఉపాయమైన, చండికాయాః = చండికయొక్క, పాదః = పాదము, భవతః = మిమ్ము, సుఖయతు = సుఖింపజేయుగాక.

**తా :** బ్రహ్మదేవుని సామవాక్కు (ప్రథమోపాయము) చేత, విష్ణువుయొక్క చక్రకర్తృకమైన భేదము (తృతీయోపాయము)చేత, ఇంద్రుని ఐరావతముయొక్క మదజల (దాన) వర్షము (ద్వితీయోపాయము)చేత, యమునియొక్క దండము (చతుర్థోపాయము)చేతను సాధింపరాని మహిష శత్రువు నమ్మవారు తన పాదము అను అయిదవ ఉపాయముచేత చంపినది. అట్టి పాదము మిమ్ము సుఖింప జేయుగాక!

**వి :** రాజులకు తమ శత్రువుల సాధించుటకు సామదానభేదదండములను నాలుగు ఉపాయము లున్నవి. దేవతలు తమ శత్రువైన మహిషుని సాధించుటకు ఆ ఉపాయములను ప్రయోగించినారు. బ్రహ్మ యొక్క ఒక ముఖమునుండి సామము (మూడవ వేదము) వెలువడును. ఇది ఇచట సామోపాయము. పైన చెప్పబడినవానిలో మొదటి ఉపాయముగా అభేదాధ్యవసాయము చేయబడినది. విష్ణువు చక్రముచేత పెక్కురు రాక్షసుల శరీరముల భేదించెను. మొండెముల వేరు చేసెను. వారిని వేరుచేయుట భేదోపాయ మనబడును. విష్ణుచక్రభేద మిట భేదమను మూడవ ఉపాయముగా అభేదాధ్యవసాయము చేయబడినది. బలవంతుడైన శత్రువునకేదియైన (ధనాదికము) నిచ్చి వానిని మిత్రునిగా చేసికొనుట దానము అనబడును. ఇది పై నాలుగుపాయములలో రెండవది. ఇంద్రుని వాహనమైన ఐరావతము మదజలమును వర్షించును. అది ఇంద్రకృతమైన

దానోపాయముగా అభేదాధ్యవసాయము చేయబడినది. ఇంద్రుడైరావతము నొసగియు మహిషుని మిత్రునిగా చేసికొనలేకపోయిన దనుట ఈ రెండవ పాదముయొక్క సారము. పై ఉపాయములలో నాల్గవది దండము. యముని ఆయుధము దండము. ఇదియే దండోపాయము. అంతియేకాని యముడు మహిషునితో యుద్ధము చేయలేదు. వాస్తవమునకు యుద్ధము చేయుటయే దండో-పాయము. అయినను యముని ఆయుధమునకు దండమను పేరుండుటచే శ్లేషముచే నది దండోపాయముగా అధ్యవసింప జేయబడినది. ఇట్లు బ్రహ్మేంద్రోపేంద్రయములొనర్చిన సామదాన-భేదదండోపాయములు విఫలములుకాగా అమ్మవారి పాదము అయిదవ ఉపాయమై మహిషుని వధించుట సంభవించినది. శత్రువును సాధించు ఉపాయములు నాలుగే. అయిదవ ఉపాయము లేకున్నను ఇట అమ్మవారి పాదము అయిదవ ఉపాయముగా సంభావింపబడినందున ఈ శ్లోకమున **ఉత్ప్రేక్షాలంకార** మేర్పడి యున్నది. సామదానభేదదండశబ్దముల శ్లేషబలమున పైన పేర్కొనబడిన నలుగురు దేవతల చతురుపాయముల వైఫల్యము చెప్పబడినందున ఈ ఉత్ప్రేక్ష **శ్లేషాను-ప్రాణితమైనది.** *

**అ :** పై శ్లోకమున అమ్మవారి (ఎడమ) పాదము మహిషుని వధించుట చెప్పబడినది. ఈ శ్లోకమున **ఎడమపాదముయొక్క బొటనవ్రేలికొన తగిలి మహిషుడు మరణించుట** చెప్పబడుచున్నది.

**శ్లో॥ భర్తా కర్తా త్రిలోక్యాస్త్రిపురవధకృతీ పశ్యతి త్ర్యక్ష ఏష**
**క్వ స్త్రీ క్వాయోధనేచ్ఛా న తు సదృశమిదం ప్రస్తుతం కిమ్మయేతి ।**
**మత్వా సవ్యాజసవ్యేతరచరణచలాఙ్గుష్ఠకోణాభిమృష్టం**
**సద్యో యా లజ్జితేవాసురపతిమవధీత్పార్వతీ పాతు సా వః ॥ 35**

**ప్ర :** భర్తా = భర్త, త్రిలోక్యాః = లోకత్రయికి, కర్తా = కర్త, త్రిపురవధకృతీ = త్రిపుర సంహారము అను కృతము (చేసినపని) కలవాడు, ఏషః =ఈ, త్ర్యక్షః = ముక్కంటి, పశ్యతి = చూచుచున్నాడు, స్త్రీ = స్త్రీ, క్వ = ఎక్కడ, ఆయోధనేచ్ఛా = యుద్ధవాంఛ, క్వ = ఎక్కడ, ఇదమ్ తు = ఇది మాత్రము, న సదృశమ్ = తగినది కాదు, మయా = నా చేత, కిమ్ = ఏమి, ప్రస్తుతమ్ = పూనుకొనబడినది, ఇతి = అని, యా = ఏ, పార్వతీ = పార్వతి, సద్యః = వెంటనే, లజ్జితా ఇవ = సిగ్గుపడినదానివలె, మత్వా = తలచి, సవ్యాజసవ్యేతరచరణచలాఙ్గుష్ఠకోణాభిమృష్టమ్ = నెపముతో కూడిన ఎడమపాదముయొక్క బొటనవ్రేలికొనచేత, స్పృశింపబడిన, అసురపతిమ్ = రాక్షసరాజును (మహిషుని), అవధీత్ = చంపెనో, సా = ఆమె, వః = మిమ్ము, పాతు = కాపాడుగాక.

**తా :** తనకు భర్త, లోకత్రయికి కర్త, త్రిపురసంహర్త అయిన **ముక్కంటి** చూచుచుండగా, ఈ ఆడుదాననైన నేనెక్కడ, ఈ యుద్ధవాంఛ ఎక్కడ ఈ ప్రస్తుత కార్యము (మహిషవధము) తగినది కాదు అని తలచియే పార్వతి తన ఎడమ కాలి బొటన వ్రేలిని వ్రాయుట అను నెపమున మహిషునికి తగిలించి చంపెనో ఆమె మిమ్ము కాపాడుగాక.

వి : **పార్వతీపరమేశ్వరులు** లోకత్రయికి **జననీజనకులు. త్రిలోకీ** శబ్దము స్త్రీలింగమగుటచే దాని పుత్రీత్వము వ్యంగ్యమగును. తన యెత్తు ఎదిగిన కూతురు చూచుచుండగా నడియీడు వచ్చిన తాను (పార్వతి) యుద్ధమువంటి సాహసకృత్యమునకు పూనుకొనుట అను కుటుంబవ్యవహారము స్ఫురించుచుండుటచే నీ శ్లోకమున **సమాసోక్త్యలంకారచ్ఛాయ** ఏర్పడినది. కర్తా త్రిలోక్యాః అను పదములు శివుడు మూడులోకముల తండ్రి అని తెలియజేయుచున్నవి. కొన్ని కుటుంబములలో ఇంటి యజమాని సంతానమును కని తండ్రి యని పిలువబడునే కాని పోషణాది కృత్యములలో బాధ్యత వహింపకుండుటచే ఆ యింటి యజమానురాలే పిల్లల రక్షించుట అను కృత్యమును కూడ చేయవలసిన స్థితి యేర్పడి యుండును. ఈ శివుడు అట్టివాడే అనుకొందమా అట్లనుకొన కూడదు. ఏలననగా ఇదివఱకు ఒకరిద్దరు కాదు ముగ్గురు త్రిపురులు లోకత్రయికి తన సంతానమునకు బాధ కలిగింప బూనగా వారిని వధించి తండ్రిగా సంతానరక్షణకృత్యమునకు పూనుకొని సామర్థ్యమును చాటిన వాడే కావున ఇప్పుడమ్మవారు మహిషుని చంపబూనుకొనుట అనుచితము. భర్త అసమర్థుడో నిర్లిప్తుడో అయినప్పుడు దానికి అట్టి కృత్యమునకు పూనుకొనుట తప్పనిసరి యగును. ఇప్పుడట్టి పరిస్థితి లేదు. గావున నేను ఆడదాననై మహిషవధకు పూనుకొనుట అనుచితము. అదిగాక, మా ఆయన (నా భర్త) ఇంటనుండి చూచుచుండగా నేనీపనికి పూనుకొనుట ఎట్లుచితమగును. నేనేల ఈ పనికి బూనుకొంటినని తలపోయు పార్వతీదేవికి సిగ్గు కలిగెను. భర్త గుడ్డి వాడైనప్పుడో ఇంటిలో లేనప్పుడో ఇంటిలో ఉన్నను కార్యాంతరవ్యగ్రుడయి నప్పుడో ఇట్టి పనికి పూనుకొనుట అనుచితము కాదు. కాని ఈయన తన మూడుకకన్నులు పెట్టుకొని చూచుచునే యున్నాడు. అందఱిలాగా రెండు కన్నులు పెట్టుకొని చూచుట కాదు. అదిగాక ఇదివఱకు ఈ మూడవకన్నే త్రిపురవధకృత్యమున ప్రధానకరణముగా ఉండినదే. ఆ కన్ను మూసికొనలేదు. తెఱచుకొనియే ఉన్నది అని **త్ర్యక్ష** శబ్దము వ్యంజించుచున్నది. చూచి మాత్రమే చంపగలవాడు చూచుచుండగా నేనేల ఈ మహిషవధకృత్యమునకు పూనుకొంటినని అమ్మవారు సిగ్గుపడినది. ఈ దేవతలు వచ్చి అట్టి శివుని ప్రార్థింపక మహిషవధ నొనరింపుమని నన్నే కోరుట యేల? నేను తగుదునని అంగీకరించుట యేల? అంగీకరించి చేయకపోవుట ఉచితము కాదే? అను కొనుచు సిగ్గుతో ఎడమకాలి బొటనవ్రేలిని నేలకు వ్రాయునెపమున ఆ మహిషునికి తగిలించి చంపినది. ఇట్లు చేయుటలో ఎవరికిని ఈ చంపు ప్రయత్నము కనిపించలేదు. తన హృదయములోని సాక్షిరూపుడైన ముక్కంటి యెఱుగకుండ చేయుట సాధ్యమని యే యీ పని చేసితినా? అని తలచి ఆమె మరింత సిగ్గు పడినది. **అట్టి పార్వతి లోకత్రయిని కాపాడుగాక!** సంతానవంతు డయిన తండ్రికి కొంచెమో గొప్పయో సంతానమునందు రాగముండకపోదు. దేవతలు మహిషవధను కోఱి యుండినచో చేసియే యుండును. కాని ఈ దేవతలాయన వద్దకు పోవుటకే జంకినారేమో? ఆయన మూడు కన్నుల చూచి ఎవరు జంకకుందురు? అందుకే వారు నన్ను ఈ పనికి అర్థించినారు. నాకీ పని చేయవలసివచ్చినది. కావున ఇక ముందును ఇట్లే చేయవలసివచ్చునేమో అని ఆలోచించుచున్న ఆ పార్వతి మిమ్ము రక్షించుగాక! అని కవి ఆశించుచున్నాడు. *

**అ :** పై శ్లోకమున అమ్మవారి సిగ్గు చెప్పబడినది. ఈ శ్లోకమున ఆమె **నవ్వు** వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ వృద్ధోక్షో న క్షమస్తే భవతు భవ! భవద్వాహ ఏషోఽధునేతి**
**క్షిప్తః పాదేన దేవం ప్రతి ఝటితి యయా కేలికాన్తం విహస్య ।**
**దన్తజ్యోత్స్నావితానైరతనుభిరతనుర్న్యక్కృతార్ధేన్దుభాభి-**
**ర్గౌరో గౌరేవ జాతః క్షణమివ మహిషస్సోఽవతాదమ్బికా వః ॥ 36**

**ప్ర :** భవ! = ఓ శివుడా!, అధునా = ఇప్పుడు, భవద్వాహే = నిన్ను వహించుటయందు, ఏషః = ఈ, వృద్ధోక్షః = ముసలిదైన ఎద్దు, న క్షమః = శక్తమైనది కాదు. ఇతి = అని, దేవమ్ ప్రతి = ప్రభువును గూర్చి (ప్రభువైన శివుని వైపు), పాదేన = పాదముతో, ఝటితి = శీఘ్రముగా, యయా = ఎవతె (అంబిక) చేత, కేలికాన్తమ్ = కేళ్యంతమునందు, విహస్య = నవ్వి, క్షిప్తః = విసరివేయబడెనో, సః= ఆ, మహిషః = మహిషుడు, అతనుభిః = గొప్పవైన, న్యక్కృతార్ధేన్దుభాభిః = ధిక్కరింపబడిన అర్ధచంద్రకిరణములు గల, దన్తజ్యోత్స్నావితానైః = దన్తముల వెన్నెల పందిరులచేత, అతనుః = బలిసినదై, క్షణమ్ = క్షణకాలము, గౌరః = తెల్లనైన, గౌః ఏవ = ఎద్దుగానే, జాత ఇవ = అయినట్లుండెనో, సా = ఆ, అమ్బికా = అమ్మవారు, వః = మిమ్ము, అవతాత్ = కాపాడుగాక!

**తా :** ఓ శివుడా! నిన్నింక ఈ ముసలి ఎద్దుమోయలేదు. అని కేళికాంతమున నవ్వుచు అమ్బిక మహిషుని కాలితో శివుని వైపు తన్నినది. ఆమె నవ్వినపుడు బయల్వెడలిన ఆమె దంతకాంతి అర్ధచంద్రుని వెన్నెలకాంతిని ధిక్కరించు నంత తెల్లగా నుండుటచే దాని (ఆ కాంతి) చేత నల్లని మహిషాసురుడు క్షణకాలము తెల్లయెద్దుగానే కనిపించినాడు. అట్లు నవ్వుచున్న ఆ అమ్బిక మిమ్ము కాపాడుగాక!

**వి :** ఒకనాడు పార్వతీపరమేశ్వరులు కేళీవనమునకు విహారమునకై వెళ్ళిరి. వారిద్దరిని మోయలేనంత ముసలితనము కలిగిన తెల్లయెద్దుపై శివుడొక్కడే కూర్చొని యుండెను. ఆతనిని సైతము మోయలేక-పోవుటచే మెల్లగా ఎట్లో నడచుచున్నట్లు పార్వతి గమనించినది. ఇంతలో మహిషాసురు డెదురు పడినాడు. వానిని చూచి దీనిని శివునకు వాహనముగా చేసినచో బాగుండునని ఆమెకు తోచినది. నవ్వుచు వెంటనే ఆమె బంతినివలె ఆ మహిషుని శివుని వైపునకు తన్నినది. ఆ నవ్వుయొక్క వెన్నెలవంటి తెల్లని కాంతిలో క్షణకాలము మహిషుడు తెల్లని యెద్దువలె అయినాడని చెప్పుటచే **తద్గుణాలంకార** మేర్పడినది. ఈ చెప్పుట సంభావనమే కాని యథార్థము కాకపోవుట వలన ఈ శ్లోకమున **ఉత్ప్రేక్షాలంకార** మేర్పడినది. ఈ రెండు అలంకారముల కంగాంగీ భావము లేకపోవుటచే ఇట ఈ రెండలంకారముల సంసృష్టి ఏర్పడినది. అమ్మవారు పలికినట్లున్న మాటలన్నియు కవి అతిశయోక్తులే. కల్పితవాక్కులే కావున **అతిశయోక్త్యలంకారము** కూడ ఏర్పడి యున్నది. ఇది ఉత్ప్రేక్షకు అంగముగా నున్నందున సంకరము కూడ ఇట ఏర్పడి యున్నది. అమ్మవారి నవ్వు కాంతులు శివుని శిరము నందలి అర్ధేందుకాంతుల ధిక్కరించిన వనుటలో ఉపమాన తిరస్కారమూలమైన **ప్రతీపాలంకారము** కూడ నేర్పడి యున్నది. ప్రథమపాదమున భవ భవత్

అనుచోట భవవర్ణద్వయావృత్తి అవ్యవహితముగా నున్నందున ఛేకానుప్రాసమను శబ్దాలంకార మేర్పడి యున్నది. '**భవతు భవ**' అనుచోట భవశబ్దావృత్తి ఉండుటచే యమకాలంకారమను శబ్దాలంకార మేర్పడి యున్నది. అట్లే మూడవపాదమున అతను శబ్దావృత్తి చేతను **యమకాలంకార** మేర్పడి యున్నది. అట్లే నాల్గవ పాదమున గోశబ్దావృత్తి 'గౌరో గౌరేవ' అనుచోటను యమకాలంకార మేర్పడి యున్నది. ఇచటనే గరవర్ణద్వయావృత్తి అవ్యవహితముగా నుండుటచే **ఛేకానుప్రాసము** కూడ నేర్పడి యున్నది. అమ్బికా శబ్దావృత్తిచే అమ్మవారికి వాహనమైన నందీశ్వరుని యందలి వాత్సల్యముచేతనే వాహనాంత రావశ్యకతను శివునితో చెప్పినదని వ్యంజింపజేయబడినది. శివునివైపు మహిషుని తన్నిన పిమ్మట వాడు బ్రతికి యున్నట్లు చెప్పకపోవుట అమ్మవారి నవ్వు (హాసము) పరిహాసము (విహాసము)గా నున్నట్లు **విహస్య** శబ్దముతో కవి వ్యంజింపజేసినాడు. 'ప్రాణమున్నచో వీనిని వాహనము చేసికొమ్ము. లేనిచో నీకీ ముసలి యెద్దేగతి' అనునదే ఆ పరిహాసము వలన వ్యంగ్యమగు నంశము. మహిషునకు గల **అతనుః** (గొప్పవాడు) (శరీరము లేనివాడు) అను రెండర్థములు గల విశేషణము నందలి శబ్దశక్తి ఈ వ్యంగ్యమునకు హేతువై యున్నది. **కేలికా+అంతమ్** అను విశేషణమును దేవమ్ అను పదమునకు విశేషణముగా నన్వయించిన కేళికాంతమున అమ్మవారిచ్చిన బహుమతియే మహిషుని శరీరమను నర్థమున విహస్య అను అసమాపకక్రియకు విశేషణముచేసి కేళి ముగియు వఱకు అమ్మవారు నవ్వుచునే యున్నదను నర్థమును వ్యంగ్యముగా సంపాదించుకొనవచ్చును. ఈ శబ్దము బంతి ఆట అను కేళిలో శివుడు మనోహరముగా నున్నాడు అని అర్థము చెప్పుటకు **కేళి – కాంత** అను విభజనమునకు వీలుగా నున్నది. అది శివుని కాంతత్వమును అనగా మనోహరత్వమును వ్యంజించును. బంతి ఆట అను కేళి మనోహరముగా నున్నందుననే అమ్మవారు నవ్వినది అనియు వ్యంగ్యము అగును. ఆమె నవ్వు ఆ కేళి కాంత మొనర్చినది. మనోహర మొనర్చినది అనియు వ్యంగ్య మగును. *

**అ :** అమ్మవారి (కేళికా+అంత) హాసము వర్ణింపబడినది. ఈ శ్లోకమున **అమ్మవారి పాదములపై** (కేళి+కాంత) **శివుడు పడుట** వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ ప్రాక్కామం దహతా కృతః పరిభవో యేన త్రిసన్ధ్యానతైః**
**సేర్ష్యా వోఽవతు చణ్డికా చరణయోః స్వం పాతయన్తీ పతిమ్ ।**
**కుర్వత్యాఽభ్యధికం కృతే ప్రతికృతమ్ముక్తేన మౌలౌ ముహు-**
**ర్బాష్పేణాహితకజ్జలేన లిఖితం స్వం నామ చన్ద్రే యయా ॥ 37**

**ప్ర :** కృతే = చేసినదానియందు, అభ్యధికమ్ = మిక్కిలి అధికముగా, ప్రతికృతమ్ = ప్రతీకారమును, కుర్వత్యా = చేయుచున్న, యయా = ఎవతెచేత, ముహుః = మాటి మాటికి, మౌలౌ = శిరస్సునందు, ముక్తేన = విడువబడిన, ఆహితకజ్జలేన = కాటుకతో కూడిన, బాష్పేణ = కన్నీటితో, స్వమ్ = తన, నామ = పేరు, చన్ద్రే = చన్ద్రునందు, లిఖితమ్ = వ్రాయబడినదో, సా = ఆ, చండికా = చండిక,, ప్రాక్ = పూర్వము, కామమ్ = కాముని, దహతా = కాల్చుచున్న, యేన = ఎవనిచేత, త్రిసన్ధ్యానతైః

= త్రిసన్ధ్యానమస్సులతో, పరిభవః = అవమానము, కృతః = చేయబడినదో, (తమ్ = ఆ), స్వమ్ = తన, పతిమ్ = భర్తను, చరణయోః = పాదములందు, పాతయన్తీ = పడునట్లు చేయుచున్న, సేర్ష్యా = ఈర్ష్యతో కూడిన, చండికా = చండిక, వః = మిమ్ము, అవతు = కాపాడుగాక!

**తా :** మూడు సన్ధ్యలలో వందనములు చేయుటతో పార్వతియొక్క కోరిక నవమానించిన శివుని తన పాదములయందు పడునట్లు చేసి శివుడు చేసిన దానికి ప్రతీకారము చేయుటయేకాక ఆయన శిరమునందలి చంద్రునిపై కాటుకగల సిరాతో తన పేరు వ్రాసిన చండిక మిమ్ము కాపాడుగాక!.

**వి :** త్రిసన్ధ్యలందు శివుడు స్వాత్మానుసన్ధాన మొనర్చుచుండుటచే ఆయన కాముని (స్త్రీవాంఛను) కాల్చగలిగెను. తన కోర్కెను దహించిన శివునియందు అమ్మవారికి కోపము కలుగుటచే ఆమె చండిక అయినది. **చడీ కోపే** అను ధాతువునుండి పుట్టిన చండికా శబ్దమునకు కోపముగల స్త్రీ అని అర్థము. చచ్చిన కోరిక శివుని హృదయమున మరల జన్మించినది. ఇదియే కాముని పునర్జన్మము. దీనికి కారణము అమ్మవారు చేసిన ఘోరతపము. ఆమె తపస్సు సకామము. తపఃఫలము నిచ్చువాడు పరమేశ్వరుడు. తనలో ఆమె కోరిక కనుకూలమైన కోరిక అనగా ఆమెను సంగమించు వాంఛను పొందినాడు. అప్పుడామె శివుని వాంఛను నిరాకరించినది. శివునకప్పుడామె పాదములపైపడియైనను తన వాంఛను తీర్చుకొను ఆవశ్యకత కలిగినది. అందుచేతనే శివుడామె పాదములపై పడినాడు. ఇప్పుడామెకు తన కామము తీరనున్నందులకు సంతోషము కలుగవలసినదే. కాని ఇంతవఱకు తన కోర్కె తీరకుండ అడ్డుపడిన వారిపై కోపము కలిగినది. వారెవరు? త్రిసన్ధ్యలు. **త్రిసన్ధ్యా** శబ్దము స్త్రీలింగము అగుటచే సన్ధ్యలు స్త్రీలుగా ఆకాలము లందలి వందనములు, ధ్యానములు. శివునికి వారిపట్లగల కామమునకు నిదర్శనములైనవి. ఈ విధముగా పార్వతికి వారలు సవతులైనారు. సవతులపై శివునకు కామము కారణముగా ఇప్పటివఱకు తన సంగమర్థింపక పోవుటచే వారిపై పార్వతికి నీర్ష్య కలిగినది. ఎంతో కాలముగా ఆ ఈర్ష్య శోకముగా మారి పార్వతి యెదలో ఘనీభవించినది. శివుడు పాదములపై పడగానే ఆ శోకము కరిగి కాటుక పూతగల కన్నులనుండి జారి కన్నీరుగా శివుని శిరముపై పడినది. అనగా ఆ శిరముపై నున్న చంద్రునిపై పడినది. ఆ చంద్రుడు కాగితమువలె తెల్లనివాడు. ఆమె కన్నీరు కాటుకతో కూడి యున్నందున సిరా యైనది. ఆ చన్ద్రునందాకాటుక నీరు అను సిరా అమ్మవారి పేరుగా రూపొందినది. శివుడామె పట్ల అత్యధికముగా అనగా త్రిసన్ధ్యల ధ్యానవందనముల మానవలసినంతటి కామోద్రేకమునకు లోనైనాడు. వారిరువురి సంగము ఎడతెగనిదైనది. వారిరువురు విడదీయ రానంతగా అనగా ఏకశరీరమే వారి దనునట్లుగా ఏకమైపోయినారు. త్రిసన్ధ్యావందనమే ఇట ప్రతినాయికాసక్తిగా స్ఫురించు-చుండుటచే **సమాసోక్త్యలంకార** మేర్పడినది.

పతియొక్క ప్రతినాయికాసక్తి నాయికయైన పార్వతికి వారిపై ఈర్ష్యను కలిగించుటే పార్వతి **సేర్ష్య** అయినది. ఆ ఈర్ష్య భర్తయందు కోపముగా మారుటచే ఆమె చండిక అయినది. విశేష్యమైన చండికా శబ్దమిట సాభిప్రాయముగా ప్రయోగింపబడుటచే **పరికరాంకురాలంకారవ్యక్తి** యేర్పడినది. పతిపాదప్రణామముతో లోని కోపజనితశోకము కన్నులద్వారా బయటికి పోయినది. కావున ఆమె

చండికాత్వము తొలగినది. ఆమె శివునందు ప్రసన్నమైనది. కావుననే భక్తుల ననుగ్రహించుటలో ఆమె మిక్కిలి ఉదారముగా నుండగలదు అని **తదలంకారవ్యక్తి** కలుగు వ్యంగ్యార్థము నిందు గలదు. శివకృత త్రిసంధ్యానతములవలన నేర్పడిన ఈర్ష్య శివుడామె పాదములపై పడుటతో తొలగినది. అందువలన కోపశోకములును తొలగినవి. కారణము తొలగిన కార్యమును తొలగిపోవును గదా! అందుచేత ఆమె ప్రసన్నత ఈ శ్లోకమున ప్రధానవ్యంగ్యమైనది. శివుడెక్కడ తల యెత్తుకొని తిరిగినను ఆతని తలపైని చంద్రునిలో అమ్మవారి పేరు ప్రస్ఫుటముగా కనబడును. అమ్మవారి పేరు శివుడే వ్రాసుకొని ఆమెపట్ల మాటలకందని ప్రేమ ఉన్నదని పైనుండి చూచు దేవతలు గ్రహించెదరు. ఒక వేళ అమ్మవారే వ్రాసిన దనుకొన్నను తానామె పాదములపై వంగినప్పుడు కదా ఆమె వ్రాయగలిగినది. అట్లు ఆమె పాదములపై పడుట ఆమె స్వాధీనపతికాత్వము వ్యంజింపజేయుచునే ఉండును. శివుడు బైరాగి వేషము వేసి ఎంత తాపసత్వము నటించినను ఆయన బండారము బయటపడి పోయినది. ఎంత వారైనను కాంతాదాసులే గదా! ఇదివఱకే కాంతాదాసులైన రసికులందఱు శివుడు తమలో చేరి ఆయన ఆధిక్యమును కోలుపోయినందుకు మరింతగా ఆనందించెదరు. ఇది యంతయు కవి కల్పనమే. శివుని నిష్కామతను గ్రహించు జ్ఞానులు కోటి కొకరుందురేమో? **పూర్వశ్లోకము లన్నింటిలో దాదాపు మహిషవధ ప్రస్తావింపబడియే యున్నది. ఆ ప్రస్తావన లేని శ్లోకములలో నిది యొక్కటి.** *

**అ :** పూర్వశ్లోకమున మహిషుడు అమ్మవారి దంతకాంతిచే తెల్లయెద్దుగా నయినాడని చెప్పబడినది. ఈ శ్లోకమున చచ్చి నోరు తెఱచియున్న మహిషుడు తన దంతకాంతిచేతనే తెల్లని కైలాసము అను భ్రాంతిని కలిగించినట్లు చెప్పబడుచున్నది.

**శ్లో॥ తుఙ్గాం శృఙ్గాగ్రభూమిం శ్రితవతి మరుతాం ప్రేతకాయే నికాయే**
**కుఞ్జౌత్సుక్యాద్విశత్సు శ్రుతికుహరపుటం ద్రాక్కకుప్కుఞ్జరేషు ।**
**స్మిత్వా వస్సంహృతాసోర్దశనరుచికృతాకాణ్డకైలాసభాసః**
**పాయాత్పృష్ఠాధిరూఢే స్మరముషి మహిషస్యోచ్చహాసేవ దేవీ ॥ 38**

**ప్ర :** సంహృతాసోః = సంహరింపబడిన ప్రాణములు గల, దశనరుచికృతాకాండకైలాసభాసః = దంతకాంతిచే చేయబడిన కలిగించబడిన నిష్కారణ కైలాసపర్వతకాంతులు గల, మహిషస్య = మహిషునియొక్క, ప్రేతకాయే = చచ్చిపడిన శరీరమున, తుంగామ్ = ఎత్తయిన, శృంగాగ్రభూమిమ్ = కొమ్ము పైభాగమును, మరుతామ్ = దేవతలయొక్క, నికాయే = సమూహము, శ్రితవతి = ఆశ్రయించగా, ద్రాక్ = శీఘ్రముగా, కకుప్కుంజరేషు = దిగ్గజములు, కుంజౌత్సుక్యాత్ = పొదలు అను ఉత్కంఠతో, శ్రుతికుహరపుటమ్ = చెవి అను గుహను, విశత్సు = ప్రవేశింపగా, స్మిత్వా = నవ్వి, స్మరముషి = శివుడు, పృష్ఠాధిరూఢే = వీపుపై నెక్కగా, ఉచ్చహాసా ఇవ = పెద్దనవ్వుగలదో అన్నట్లున్న, దేవీ = దేవి, వః = మిమ్ము, పాయాత్ = కాపాడుగాక!

**తా :** అమ్మవారు మహిషుని శిరమును త్రొక్కగా వాడు నోరి తెఱచుకొని చచ్చిపడి యుండెను. ఆ

నోటిలోని వాని దంతముల కాంతి వాని శరీరమునందంతట వ్యాపించి వాడొక కైలాసపర్వతమువలె కానవచ్చెను. అందుచేత దేవతలు వాని కొమ్ముకొన నాశ్రయించిరి. దిగ్గజములు వాని పొదవంటి చెవిలోనికి పోయి సేద తీర్చుకొనుచుండెను. అప్పు డమ్మవారు నవ్వినది. శివుడును అట్లను కొని పై భాగము నెక్కగానే అమ్మవారు బిగ్గఱగా నవ్వినట్లున్నది. అట్లున్న అమ్మవారు మిమ్ము రక్షించుగాక!

**వి :** దేవతలు దిగ్గజములు మహిషుని చూచి కైలాసభ్రాంతి నొందగా శివుడు అట్టి భ్రాంతిని పొందినాడు అని అమ్మవారు నవ్వువలన తెలియవచ్చుటచే ఇందు గుణీభూతముగా **భ్రాంతిమదలంకారము** వ్యంగ్యమైనది. ద్వితీయపాదాద్యంతములలో **కుంజ** శబ్ద ద్విరావృత్తిచే యమకాలంకార మేర్పడి యున్నది. చతుర్థ పాదమున పృష్ఠ శబ్ద ప్రయోగముచే శివుడు మహిషుని స్వవాహన వృషభముగా భ్రమించి నాడనియు స్ఫురించు చున్నది. దేవతలు మొదట తాము మహిషుని దేహమును కైలాసము అని భ్రమించి శివుని దర్శించుకొన శృంగాగ్రభూమి అనగా మహిషుని కొమ్ముకొనను కైలాసశిఖరాగ్ర భాగమనుకొని అచటికి చేరినారు అను ప్రథమపాద వ్యంగ్యము శృంగాగ్ర శబ్దశక్తి వలన సిద్ధమైనది. మహిషుని ప్రతాపము సూర్యతాపముగా తప్తములయిన దిగ్గజములు ఏ పొదలోనైనను దూరి తాపము నుండి తప్పించుకొను నుత్సుకతతో మహిషవధానంతరము వాని చెవిని కైలాసకుంజముగా భ్రమించి దాని లోనికి దూరిన వనుట **ద్వితీయపాదవ్యంగ్యము**. *

**అ :** పై శ్లోకమున దిగ్గజదేవతాదిగంబరు (శివు)లు మహిషుని కైలాసమను కొనుట చెప్పబడినది. ఈ శ్లోకమున **పాతాళపంకమున విహరించు ఆదివరాహసంభావనము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ కృత్వా పాతాలపఙ్కే క్షయరయమిలితైకార్ణవేచ్ఛావగాహం**
**దాహన్నేత్రత్రయాగ్నేర్విలయనవిగలచ్ఛృఙ్గశూన్యోత్తమాఙ్గః ।**
**క్రీడాక్రోడాభిశఙ్కాం విదధదపిహితవ్యోమసీమా మహిమ్నా**
**వీక్ష్య క్షుణ్ణో యయారిస్తృణమివ మహిషస్సాఽవతాదమ్బికా వః ॥ 39**

**ప్ర :** పాతాలపంకే = పాతాళపు బురదయందు, క్షయరయమిలితైకార్ణవేచ్ఛావగాహమ్ = ప్రలయకాలపు వేగమున కలిసిపోయిన ఒకే సముద్రమున స్వేచ్ఛతోడి మునకను, దాహన్నేత్రత్రయాగ్నేః = కాలుచున్న మూడు కన్నుల అగ్నినుండి (తప్పించుకొనుటకై), కృత్వా = చేసి, విలయనవిగలచ్ఛృంగశూన్యోత్తమాంగః = దాగుకొనబోవుటతో విఱచుకొన్న కొమ్ములు లేని తలగల, క్రీడాక్రోడాభిశంకమ్ = క్రీడావరాహ శంక కలుగునట్లుగా, విదధత్ = చేయుచు, మహిమ్నా = ఎత్తుతో, అపిహితవ్యోమసీమా = కప్పిన ఆకాశము గల, మహిషః = మహిషుడు (అనబడు) అరిః = శత్రువు, యయా = ఎవతెచేత, తృణమివ = గడ్డివలె, వీక్ష్య = చూడబడి, క్షుణ్ణః = త్రొక్కబడినాడో, సా = ఆ, అమ్బికా = అమ్మవారు, వః = మిమ్ము, అవతాత్ = కాపాడుగాక.

**తా :** అమ్మవారి మూడుకన్నులు నిప్పుల గురిపించుచుండగా తప్పించుకొనుటకు వేగముగా

సముద్రములో మునక వేసి పాతాలపంకమున ఆదివరాహశంకను కలిగించుచు ఆకాశపు హద్దులను కప్పిన మహిషుడు గడ్డివలె కనబడగా, త్రొక్కిన అమ్మవారు మిమ్ము కాపాడుగాక!

**వి :** అమ్మవారి నొసటికన్ను తెరువబడినచో అగ్ని కురియును. కాని మహిషుడు అమ్మవారిని కామించి తనకు భార్యవు కమ్మని ప్రలాపము లాడుటచే తత్ప్రలాపమును సహింపని అమ్మవారు మూడుకన్నులలోనుండి నిప్పులు కురియుచుండెను. ఆ నిప్పులు వేడికి మహిషుడు తట్టుకొనలేక పోయినాడు. సాధారణముగా దున్నపోతులు సూర్యుని మధ్యాహ్నపు వేడి సహింపలేక మడుగులలో పొరలాడుచుండుట మన మెఱుగుదుము. అమ్మవారు మూడు కన్నులనుండి గురిపించు చిచ్చును భరించలేక సముద్రములోనికి స్వేచ్ఛగా చొచ్చుకొని పోయెను. ప్రలయకాలవేగమువంటి ఆవేశమునకు అన్ని సముద్రములును ఏకమయ్యెను. పాతాళము ఆ సముద్రపు అడుగున బురదగా మారిపోయెను. హిరణ్యాక్షుడు భూమిని సముద్రమున ముంచినప్పుడు ఆ భూమి బురదగా మారగా అందు హిరణ్యాక్షుని చంపిన సంతోషమున ఆదివరాహముగా నవతరించిన విష్ణువును కొందరు చిరంజీవులు చూచి యుండిరి. ఇన్నాళ్ళ తరువాత ఇప్పుడు పాతాలపంకమున నున్న మహిషుని చూచి ఆదివరాహమేమో అని వారు శంకించిరి. వారి కట్టి శంకను కలిగించినాడా మహిషుడు. మహిషములవలె వరాహములు కూడ బురదలో విహరించుట సాధారణమే కాని కొమ్ములు (శిరసున) లేని మహిషమును చూచిన వారికి శృంగి వరాహ భ్రాంతి యట్లు కలుగును? దీనికి సమాధానము మూడవపాదమున చెప్పబడినది. అగ్నినుండి తప్పించుకొని పాఱిపోవు తొందరలో సముద్రములోని బడబాగ్నివలన మహిషుని కొమ్ములు కఱిగి పోయినను వాడు గమనింప లేకుండెను. ఎట్లో పాతాళపు బురదను చేరియున్న ఆ మహిషుడు కొమ్ములులేని వాడనుటచే వరాహశంకను కలిగించెను. లేక అమ్మవారి నేత్రత్రయాగ్నిచే వాని కొమ్ములు కఱగి పోయిన వనుకొనియు సరిపుచ్చుకొనవచ్చును. ఆ శ్లోకములోని మహిషవర్ణనము వాడు మూడు లోకముల వ్యాపించియున్న అవ్యక్తమా అనిపించునట్లున్నది. చీకటి యెంత అధికముగా వ్యాపించియున్నను దీపముతో తొలగి పోవునట్లు అమ్మవారి నిప్పు వంటి చూపున అంతరించి పోవలసినదే. కోపము అను అమ్మవారి కన్నులలోని నిప్పునకు వాడు కాలిపోయిన పిమ్మటనే (కాలిన) గడ్డివాము వంటి ఆ మహిషుని త్రొక్కివేసినదేమో? మొదటి మూడు పాదములలో **క్రీడావరాహముగా** సంభావింప బడినందున **ఉత్ప్రేక్షాలంకారము**. నాల్గవపాదమున **తృణమివ** అనుటచే **ఉపమాలంకారము**ను ఏర్పడి యున్నవి. '**విలయన–విగలచ్ఛృంగశూన్యోత్తమాంగః**', '**క్రీడాక్రోడా, వ్యోమసీమా మహిమ్నా**' అను పదబంధములలో వృత్త్యనుప్రాసాలంకారమేర్పడి యున్నది.

*

**అ :** పై శ్లోకమున **మహిషుడమ్మవారి దృష్టిలో** గడ్డిపోచవంటి వాడని చెప్పబడినది. ఈ శ్లోకమున **ఇతర దేవతల వివిధాయుధములకు కలతనొందని వాడుగా** వర్ణింపబడుచున్నాడు.

**శ్లో॥ శూలే శైలావికమ్పం న నిమిషితమిషౌ పట్టిశే సాట్టహాసం**
**ప్రాసే సోత్త్రాసమవ్యాకులమపి కులిశే జాతశఙ్కం న శఙ్ఖే।**

**చక్రేఽవక్రం కృపాణే న కృపణమసురారాతిభిః పాత్యమానే**
**దైత్యం పాదేన దేవీ మహిషితవపుషం పింషతీ వః పునాతు ॥** **40**

**ప్ర :** అసురారాతిభిః = దేవతలచేత, శూలే = శూలము, పాత్యమానే = (పైన) పడవేయబడుచుండగా, శైలావికమ్పమ్ = కొండ వలె కదలని, ఇషౌ = బాణము, పాత్యమానే = పైన పడవేయబడుచుండగా, న నిమిషితమ్ = ఱెప్పవేయని, పట్టిశే = బడిసె పైన పడవేయబడుచుండగా, సాట్టహాసమ్ = పెద్దనవ్వుగల, ప్రాసే = బల్లెము పైన పడవేయబడుచుండగా, సోత్ప్రాసమ్ = వెక్కిరింపుగల, కులిశే = వజ్రము పైన పడవేయబడు చుండగా, అవ్యాకులమ్ = వ్యాకులుడు కాని, శంకౌ = శంకువు పైన పడవేయబడు చుండగా, న జాతశంకమ్ = శంకితుడు కాని, చక్రౌ = చక్రము పైన పడవేయబడుచుండగా, అవక్రమ్ = వక్రుడు కాని, కృపాణే = కత్తి (పైన పడుచుండగా), న కృపణమ్ = దీనుడు కాని, పాదేన = పాదముతో, పింషతీ = పిండి చేయుచున్న, త్రొక్కుచున్న, దేవీ = దేవి, వః = మిమ్ము, పునాతు = రక్షించుగాక!

**తా :** దేవతలలో నొకడు (శివుడు) శూలము వేసిన కొండవలె మహిషుడు కదలనే లేదు. ఒకడు బాణము వేసిన ఱెప్పవాల్చలేదు. మరొకడు బడిసె వేసిన బిగ్గఅగా నవ్వినాడు. ఒకడు బల్లెము వేయగా వెక్కిరించినాడు. ఇంకొకడు (ఇంద్రుడు) వజ్రమును ప్రయోగింపగా వాడు వ్యాకులత నొందలేదు. ఇంకొకడు శంకువును విసరగా భయపడలేదు. ఇంకొకడు (విష్ణువు) చక్రము వేయగా వంగిపోలేదు. ఇంకొకడు కత్తిని విసరగా దైన్యము నొందలేదు. అట్టి **మహిషుని పాదముతో పిప్పి చేసిన అమ్మవారు మిమ్ము కాపాడుగాక!**

**వి :** దేవతలు వివిధాయుధముల ప్రయోగించినను అవి యన్నియు మహిషునియందు వ్యర్థము లయ్యెను. వానిని ఆయుధము కాని తన పాదముతో అమ్మవారు పిప్పిచేసినది. వానిలోని రక్తాది జీవరసాయనము లన్నియు సముద్రములోనికి వలె ప్రవహించి పోయినవి, అని శ్లోకమున వ్యంగ్యమైన అంశము. **శూలే శైలావికంపమ్, న నిమిషితమిషౌ, ప్రాసే సోత్ప్రాసమ్ అవ్యాకులమపి కులిశే, పట్టిశే సాట్టహాసమ్, 'జాత శంకం' న శంకౌ, చక్రేఽవక్రమ్, కృపాణే న కృపణమ్** అను వ్యస్త (మహిష) విశేషణము లందు వృత్త్యనుప్రాసము లున్నవి. అట్లే పాత్యమానే దైత్యమ్, మహిషిత వపుషమ్ పింషతీ, అను పదబన్ధములందును వృత్త్యనుప్రాసము లున్నవి. అసురులనగా ప్రాణముల తీయువారు. వారికి అరాతులు (శత్రువులు) అనగా ప్రాణముల నీ(తీ)య (జాలి)ని వారు. కావుననే వారు తమ ఆయుధములతో మహిషుని ప్రాణముల తీయజాలకపోయిరి అను అంశమును **అసురారాతి** శబ్దము వ్యంజించుచున్నది. *

**అ :** పై శ్లోకమున దేవతలు ప్రయోగించిన ఆయుధములకు మహిషుడు కలగక పోవుట చెప్పబడినది. ఈ శ్లోకమున **మహిషుడు ప్రయోగించిన ఆయుధములకు దేవి కలగక పోవుట** చెప్పబడుచున్నది.

**శ్లో॥ చక్రే చక్రస్య నాశ్ర్యా న చ ఖలు పరశోర్న క్షురప్రస్య నాసే-**
**ర్యద్వక్రం కైతవావిష్కృతమహిషతనౌ విద్విషత్యాజిభాజి ।**
**ప్రోతాత్ప్రాసేన మూర్ధ్నః సఘృణమభిముఖాయాతయా కాలరాత్ర్యా**
**కల్యాణాన్యాననాబ్జం సృజతు తదసృజో ధారయా వక్రితం వః ॥ 41**

**ప్ర :** కాలరాత్ర్యాః = కాలరాత్రి (అమ్మవారి) యొక్క, యత్ = ఏది, చక్రస్య = చక్రముయొక్క, పరశోః = గండ్రగొడ్డలి, క్షురప్రస్య = కొడవలియొక్క, అసేః = కత్తియొక్క, అశ్ర్యా = అంచుచేత, వక్రమ్ = వంకరగా, న చక్రే = చేయబడలేదో, కైతవావిష్కృతమహిషతనౌ = కపటమున ప్రకటింపబడిన మహిషశరీరముగల, ఆజిభాజి = యుద్ధమును పొందు, విద్విషతి = శత్రువు నందు, ప్రాసేన = శూలమున, ప్రోతాత్ = గ్రుచ్చబడిన, మూర్ధ్నః = శిరమునుండి, అభిముఖాయా-తయా = ఎదురుగా వచ్చుచున్న, అసృజః = రక్తముయొక్క, ధారయా = ధారచే, సఘృణమ్ = దయతో కూడినదై, వక్రితమ్ = త్రిప్పబడిన, తత్ = ఆ, ఆననాబ్జమ్ = ముఖకమలము, వః = మీకు, కల్యాణాని = శుభములను, సృజతు = సృజించు గాక!

**తా :** మహిష శరీరమును కపటముగా ధరించి యుద్ధరంగమున నెదురుగా నిలబడిన మహిషుడు అమ్మవారిపై చక్ర పరశు క్షురప్ర ఖడ్గాద్యాయుధముల ప్రయోగించినను వాని అంచులకు భయమునొందక ముఖమైన త్రిప్పని అమ్మవారు ఆ శత్రువు తలపైన బల్లెము గ్రుచ్చినందు వలన వాని ఆ తలనుండి తన కభిముఖముగా ప్రవహించి వచ్చిన రక్తపుధారను చూచినప్పుడు జాలితో త్రిప్పబడిన అమ్మవారి ఆ ముఖకమలము మీకు కల్యాణములను కలిగించుగాక!

**వి :** పూర్వార్ధమున ఆయుధములచేత అమ్మవారి ముఖము వక్రముగా చేయబడలేదని చెప్పబడినందున ఆమె భయరాహిత్యము వ్యంగ్యమగుచున్నది. భయములేని తాను అనగా అంత గట్టిగా తలపై శూలమును గ్రుచ్చినందువలన కాఱిన రక్తధారను చూచి మాత్రము, తల త్రిప్పుకొన్నదని, శత్రువునందును ఆమె దయ ఉత్తరార్ధమున వర్ణింపబడినది. ఆ దయతో వక్రితమైన ఆమె ముఖము కల్యాణముల కలిగించుటలో ఆశ్చర్యము లేదను అంశము ఉత్తరార్ధమున వ్యంగ్యమగుచున్నది. **చక్రే చక్రస్య వక్రమ్, మహిషతనౌ విద్విషతి, సృజతు తదసృజో** అను పదబన్ధములలో వృత్త్యనుప్రాసము లున్నవి. *

**అ :** పూర్వశ్లోకములలో ఒకటి రెండు సార్లు ప్రస్తావింపబడిన **కంస కాత్యాయనీ వృత్తాంతము** ఈ శ్లోకమున మరల ప్రస్తావిపబడుచున్నది.

**శ్లో॥ హస్తాదుత్పత్య యాన్త్యా గగనమగణితా ధైర్యవీర్యావలేపం**
**వైలక్ష్యేణేవ పాణ్డుద్యుతిమదితిసుతారాతిమాపాదయన్త్యాః ।**
**దర్పానల్పాట్టహాసద్విగుణితరసితాస్సప్తలోకీజనన్యా-**
**స్తర్జన్యా జన్యదూత్యో నఖరుచితతయస్తర్జయన్త్యా జయన్తి ॥ 42**

**ప్ర :** హస్తాత్ = చేతినుండి, గగనమ్ = ఆకాశమును గూర్చి, ఉత్పత్య = ఎగిరి, యాన్త్యా = పోవుచున్న, ధైర్యవీర్యావలేపమ్ = ధైర్యవీర్యములుగల, వైలక్ష్యేణ ఇవ = స్తబ్ధతతోవలె, పాండుద్యుతిమ్ = తెల్లని కాంతిని, అదితిసుతారాతిమ్ = రాక్షసుని (కంసుని), ఆపాదయన్త్యాః = కలిగించుచున్న, తర్జయన్త్యా = బెదిరించుచుచున్న, సప్తలోకీ జనన్యాః = ఏడు లోకములకు తల్లియైన, తర్జన్యాః = చూపుడువ్రేలియొక్క, అగణితాః = లెక్కలేని, దర్పానల్పాట్టహాసద్విగుణితరసితాః = గర్వముతో గొప్పగా నున్న పెద్దనవ్వుతో రెండింతలైన ధ్వనిగల, జన్యదూత్యః = యుద్ధదూతికలైన, నఖరుచి–తతయః = గోటికాంతి సమూహములు, జయన్తి = సర్వోత్కర్షముగా వర్ధిలుచున్నవి.

**తా :** కాత్యాయని కంసునిచేతినుండి ఆకాశమున కెగురగా ధైర్యవీర్యములు గల కంసుడే హఠాత్సంఘటనతో స్తబ్ధతతో వలె తెల్లదనము నొందిన కంసుని తన చూపుడు వ్రేలితో బెదిరించు చుండగా సప్తలోకజననియైన ఆమె నవ్వుతో రెండింతలై యుద్ధదూతికలై గర్జించుచున్నట్లున్న లెక్కలేని ఆమె చూపుడు వ్రేలి గోటికాంతుల గుంపులు సర్వోత్కర్షముగా వర్ధిలుచున్నవి.

**వి :** కంసుడు ధైర్యవీర్యములు కలవాడు. కాత్యాయనిని చంపవలెనని భుజముపై వేసికొని చేత బట్టుకొని వధ్యశిలవైపు పోవుచుండగా వానిచేతినుండి ఆమె ఆకసమున కెగిరెను. ఈ హఠాత్సంఘటనతో వాడు స్తబ్ధత నొందెను. అందువలన పాలిపోయిన కాంతి కంసు నాక్రమించినది. వాస్తవమున కా కాంతులు అమ్మవారి చూపుడువ్రేలిగోటి కాంతుల గుంపులకు చెందినవి. ఆమె బిగ్గఱగా నవ్వుచున్నది. ఆ నవ్వులు కూడ ఆ కాంతులు ఆ కాంతులలో రెండింతలైనవి. వానితోపాటు ఆ ధ్వనియు రెండింతలైనది. బెదరించుచున్న అమ్మవారి చూపుడువ్రేలి గోటికి చెందిన వా కాంతులు. కావున యుద్ధదూతికలా యన్నట్లున్నవి అను సంభావనము గమ్యమగుటచే నీ శ్లోకమున **నుత్ప్రేక్షాలంకార** మున్నది. ఆమె ఆ నవ్వు దర్పమున అనల్పమైనది. అది సప్తలోకములలోనను ప్రతిధ్వనించుచున్నట్లున్నది. దంతకాంతులతో కలసిన ఆ చూపుడు వ్రేలి గోటి కాంతులతో ద్విగుణితము లైనవి. ఈ ద్విగుణితత్వము అటు కాంతిలో కనబడుచున్నది. ఇటు ధ్వనిలో చేరి వినిపించుచున్నది. సంస్కృతమున చూపుడు వ్రేలిని తర్జని యందురు. బెదిరించువారు చూపుడు వ్రేలితోడనే సాధారణముగా బెదిరించుటచేత ఆ వ్రేలికి తర్జని అనుపేరు సార్థకమైనది. ఆ తర్జని తర్జించుచున్న అమ్మవారి చేతికి చెందినది. అని తర్జయన్తీ తర్జన శబ్దములు బెదరింపును కూడ రెండింతలు చేయు చున్నట్లున్నవి. ఈ సంభావనము వ్యంగ్యమే. వాచ్యముకాని గమ్యము. **ద్విగుణితర–సితాః** అని లేక **ద్విగుణిత–రసితాః** అని విభజించి తెల్లని కాంతి, ధ్వని అను రెండింటి ద్వైగుణ్యమును వాచ్యము చేయనగును. లేక సమాసాంతగత రసిత శబ్దములోని 'సిత' వర్ణములే కాంతి ద్వైగుణ్యమును వ్యంజింపజేయుననియు చెప్పవచ్చును. 'ఉత్పత్యయాంత్యా ఆపాదయంత్యాః తర్జయన్త్యా. గగనమగణితా దైర్యవీర్యావలేపమ్, పాండుద్యుతిమదితిసుతారాతిమ్ ద్విగుణితరసితా సప్తలోకీజనన్యాః తర్జన్యా జన్యదూత్యః తర్జయన్త్యా జయన్తి' ఇత్యాది పదబన్ధములలో వృత్త్యనుప్రాసము లున్నవి. ఈ శ్లోకమున అమ్మవారు సప్తలోకజనని యని చెప్పబడినది. ఈ సప్తలోకములు గాయత్రీ

శీర్షమందలి భూరాది సత్యాంతములైన ఊర్ధ్వలోకములు గాని అతలాది పాతాలాంతాధో లోకములు గాని కావచ్చును. కాని ఊర్ధ్వలోకము లనుటయే ఉచితముగా నుండును. ఈ శ్లోకమున కంసుడు అదితిసుతారాతి (రాక్షసుడు) అని చెప్పబడినాడు. కంసుడు ఉగ్రసేనుని కుమారుడు. ఉగ్రసేనుడు 'భోజ' అను క్షత్రియవంశమునకు చెందినవాడు. ఆతడు కృతయుగమున పూర్వజన్మమున కాలనేమి అను రాక్షసుడై జన్మాంతరమున (ద్వాపరయుగమున) క్షత్రియుడుగా పిలువబడినాడు. ఉగ్రసేనుని భార్య ఉద్యానవనమున విహరించుచుండగా ఒక రాక్షసునిచే బలాత్కరింపబడగా జన్మించిన వాడు గావున ఉగ్రసేన (క్షత్రియ) క్షేత్రమున జన్మించుటచే క్షత్రియుడుగా పిలువబడినను రాక్షసవీర్య-సంజాతుడైనందున రాక్షసుడుగా పిలువబడినను ఉపపన్నమే. స్వభావముచేతను దేవవిరోధి కావునను రాక్షసుడని చెప్పబడుట ఉపపన్నమే. *

**అ :** పై శ్లోకమున అమ్మవారు సప్తలోకజననిగా చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ **సప్తలోకములు** ఆమె చరణసరోజకమలప్రాంతమున **ఝంకార మొనర్చు తుమ్మెదలుగా** వర్ణింపబడుచున్నవి.

**శ్లో॥ ప్రాలేయాచలపల్వలైకబిసినీ సాఽఽర్యాఽఽస్తు వః శ్రేయసే**
**యస్యాః పాదసరోజసీమ్ని మహిషక్షోభాత్ క్షణం విద్రుతాః ।**
**నిష్పిష్టే పతితాస్త్రివిష్టపరిపౌ గీత్యుత్సవోల్లాసినో**
**లోకాస్సప్త సపక్షపాతమరుతో భాన్తి స్మ భృఙ్గా ఇవ ॥ 43**

**ప్ర :** యస్యాః = ఎవతెయొక్క, పాదసరోజసీమ్ని = పాదకమలప్రాంతమున, మహిషక్షోభాత్ = మహిషుని క్షోభవలన, క్షణమ్ = క్షణకాలము, విద్రుతాః = పారిపోయినవై, త్రివిష్టపరిపౌ = రాక్షసుడు, నిష్పిష్టే = పిప్పిచేయబడగా, పతితాః = (వచ్చి) పడినవై, గీత్యుత్సవోల్లాసినః = పాటల పండగలతో ప్రకాశించునవై, సప్త లోకాః = ఏడు లోకములు, సపక్షపాతమరుతః = పక్షముల పాతముతో (నేర్పడిన) గాలులు గల (పక్షపాతముతో కూడిన దేవతలు గలవై), భృంగా ఇవ = తుమ్మెదలవలె, భాంతి స్మ = ప్రకాశించుచుండెనో, సా = ఆ, ప్రాలేయాచలపల్వలైకబిసినీ = మంచుకొండ యనెడి జలాశయమున ఒకే ఒకటైన తామరతీగయగు, ఆర్యా = అమ్మవారు, వః = మీయొక్క, శ్రేయసే = శ్రేయముకొఱకు, అస్తు = అగుగాక!

**తా :** మహిషుని క్షోభవలన మంచుకొండ అను జలాశయమున బుట్టిన ఏకైకమైన తామరతూడు వంటి అమ్మవారి పాదసరోజప్రాంతమునుండి పారిపోయి వాడు చచ్చిన పిదప ఝంకార గీతోత్సవములు కలవై వచ్చిపడిన తుమ్మెదలవలె సప్తలోకములు ఆనందించెను. అట్టి అమ్మవారు మీకు శ్రేయము నొసగుగాక!

**వి :** మంచుకొండ జలాశయముగా అమ్మవారందులోని ఏకైకబిసినిగా రూపింపబడుటచే రెండవ పాదమున, అమ్మవారి పాదమా తీగ పూచిన యొక కమలముగా రూపింపబడుటచే నాల్గవపాదమున, సప్తలోకములు తుమ్మెదలవంటివని సంభావనము అంగిగా చెప్పబడుటచే ఈ శ్లోకమున

**రూపకానుప్రాణితమైన ఉత్ప్రేక్షాలంకార** మేర్పడియున్నది. ఒక జలాశయమున ఒక తామర తీగ యున్నది. దానికి అడుగుభాగమున నొక తామరపూపు పూచినది. దానికడ తుమ్మెదలు మూగి యున్నవి. ఇంతలో మహిష మొకటి జలాశయము జొచ్చినది. తుమ్మెద లెగిరిపోయినవి. జలాశయమున నేర్పడిన మహిష క్షోభముచే ఎగిరి పోయిన తుమ్మెదలు ఆ క్షోభము తొలగిపోయిన వెంటనే ఝంకారము చేయుచు మరల వచ్చిపడినవి. ఆ తామరతీగ అమ్మవారు, ఆమె పాదమే పూచిన కమలము. ఆ కమలము దగ్గఱ తుమ్మెదలవంటి సప్తలోకములు నివసించి యుండగా మహిషాసురుడు వచ్చి క్షోభ కలిగించెను. తుమ్మెదలా యన్నట్లున్న సప్తలోకములు దూరమేగినవి. మహిషు నమ్మవారు చంపివేయగా క్షోభము తొలగినది. మరల యథాప్రకారము అమ్మవారి పాదకమలము నాశ్రయించి ఆనందించుచున్నవి. **ఇట్లుత్ప్రేక్షకు రూపకములు జీవముల పోసినవి.** సప్తాధోలోకములు అమ్మవారి పాదరూపములుగా ఉపాసింపబడుట పురాణప్రతిపాదితము. సప్తోర్ధ్వలోకములకు పైన అమ్మవారి పాదములున్నట్లు పురాణములలో నచ్చటచ్చట కనిపించును. మొదటిది విరాడుపాసన ప్రకారము ఇందు అమ్మవారు జగద్రూపము లేక జగచ్ఛరీరము కలదిగా ఉపాసింపబడును. విశ్వమే అమ్మవారు. అమ్మవారే విశ్వము. **'సర్వమ్ ఖల్విదమ్ బ్రహ్మ'** అను శ్రుతి ఈ ఉపాసనమును సమర్థించును. **పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి అత్యతిష్ఠద్దశాంగులమ్** వంటివి అమ్మవారు విశ్వమున కావలనున్నట్లు ఉపాసించుటను సమర్థించును. ఇందు అమ్మవారు విశ్వరూపగా కాక విశ్వోత్తీర్ణగా భావింపబడును. శైవ వైష్ణవాది పురాణములలో కైలాసవైకుంఠాదులు బ్రహ్మాండముల కావల నున్నట్లు  చెప్పుట పై శ్రుతుల ఉపబృంహణమే. సప్తోర్ధ్వలోకములే ఆమె పాదము కడనున్నవి అని చెప్పుటచే అధోలోకములు వానికి క్రిందివే. ఈ శ్లోకమున అవి ఆమె పాదమునకు క్రిందివని చెప్పబడకున్నను సూచింపబడినది. శంకరభగవత్పాదులు **తేషామప్యుపరి తవ పాదాంబుజయుగమ్** అని అమ్మవారి విశ్వోత్తీర్ణతను చెప్పినారు. ఆమె పాదముల కిరణములు అధః ప్రసృతములై పంచభూత మనస్సు లందున్నవని చెప్పినారు. సమస్తబ్రహ్మాండములు వానిలోని సమస్తలోకములు పంచభూతమనోరూపములే. ఈ కవి సప్తలోకములు తుమ్మెదల వంటివని చెప్పినాడు. ఆనందాకాశమున అధోభాగమున సప్తలోకము లున్నవి. ఊర్ధ్వ భాగమున అమ్మవారి పాదకమల మున్నది. ఈ లోకములు తుమ్మెదలంత అల్పశరీరకములు. వానికన్న అమ్మవారి పాదకమలమే ఎంతో పెద్దది. అనగా ఇక అమ్మవారి ఔన్నత్యము చెప్పుటకు మాటలేవి? ఈ పాదమునందలి రేణువే ఈ సమస్తమని శంకరులే మరొక చోట చెప్పినాడు. అట్టి అల్పములైన ఈ సప్తలోకభ్రమరములు మహిషక్షోభముచే తాత్కాలికముగా వెడలి ఆ క్షోభము తగ్గిన పిదప మరల యథాస్థానము చేరుట కవిచే చెప్పబడినది. ఆ ఆకాశము సర్వేశ్వరికిని లోన బయట సర్వత్ర ఉండు సాక్షిశివ రూపమని కవి ఆశయము కాబోలు. ప్రాలేయాచలపల్వల, నిష్పిష్టే పతితాస్త్రివిష్టపరిపౌ సపక్షపాతమరుతో భాంతి స్మ అను పదబన్ధములలో వృత్త్యనుప్రాసము లున్నవి.

*

**అ :** పై శ్లోకమున అమ్మవారి పాదసరోజసీమయందు మహిషుని నిష్పేషణము చెప్పబడినది. ఈ శ్లోకమున **అమ్మవారి పాదాంగుళీపర్వమున వాని మృత్యువు కృతమైనదని** చెప్పబడుచున్నది.

**శ్లో॥ అప్రాప్యేషురుదాసితాసిరశనేరారాత్కుతః శఙ్కుత-**
**శ్చక్రవ్యుత్క్రమకృత్పరోక్షపరశుః శూలేన శూన్యో యయా ।**
**మృత్యుర్దైత్యపతేః కృతః సుసదృశః పాదాఙ్గులీపర్వతః**
**పార్వత్యా ప్రతిపాల్యతాం త్రిభువనం నిఃశల్యకల్యం తయా ॥ 44**

**ప్ర :** అప్రాప్యేషుః = చేరరాని బాణముగల, ఉదాసితాసిః = ఉదాసీనముగా చేయబడిన కత్తిగల, చక్రవ్యుత్క్రమకృత్ = చక్రమును వెనుక మరలు దానినిగా చేసిన, పరోక్షపరశుః = పరోక్షముగా నున్న పరశువు కల, శూలేన = శూలముతో, శూన్యః = శూన్యుడు అయిన మహిషుడు, అశనేః = వజ్రాయుధముయొక్క, ఆరాత్ = అంచుల సమూహము వలన గాని, శంకుతః = శంకువు వలనగాని, మృత్యుః = చావు, దైత్యపతేః = మహిషునకు, కుతః = ఎక్కడిది, యయా = ఏ, పార్వత్యా = పార్వతిచేత, పాదాఙ్గులీపర్వతః = కాలిగోటికణుపునుండి, సుసదృశః = మిక్కిలి అనుగుణముగా, కృతః = చేయబడినదో, తయా = ఆమెచేత, త్రిభువనమ్ = ముజ్జగము, నిఃశల్యకల్యమ్ = నిశ్శల్యకల్యముగా, ప్రతిపాల్యతామ్ = పరిపాలింపబడు గాక.

**తా :** బాణము వానిని చేరరాదు, కత్తి ఉదాసీనముగా నుండి పోవును, పరశువు కనబడదు, చక్రము వెనుకకు మరలును. శూలము వాని యందు శూన్యమగును. వజ్రాయుధము కాని శంకువు కాని వానిని చంపుట అనునది ఏటిమాట! అని పార్వతి తన పాదాంగుళియొక్క కణుపుతో వానికి తగిన విధముగా మృత్యువును కూర్చినది. అట్టి పార్వతి శల్యహీనమైన ఈ ముజ్జగము నేలుగాక!

**వి :** బాణము, కత్తి, వజ్రాయుధము, శంకువు, చక్రము, పరశువు, శూలము వానిని చంపలేకపోవుట వలన అమ్మవారు తన పాదాఙ్గుళికణుపువలన వానికి చావును కూర్చినదని చెప్పుట వలన ఆయా-యుధముల ధరించిన శివవిష్ణింద్రాదులు వానిని వధింపలేకపోయినారని వ్యంగ్యమగును. ఒకవేళ వారిలో నెవరిచేత నే యాయుధముతోనైన వానికి చావు సంభవించి యుండినను ఇంత మంచి చావు అయ్యెడిది కాదు అని **సుసదృశశబ్దముచే** సూచింపబడినది. ఆ ఇతర దేవతలచేత వానికొక వేళ చావు సంభవించిన వాడు వారి లోకములకే ఏగు వాడేమో? ఆ లోకములు శాశ్వతములు కాకపోవుటవలన వానికి పునరావృత్తి సంభవించి యుండెడిదేమో? ఇప్పు డమ్మవారిచేత సంభవించిన చావు వానికి శాశ్వతమైన అమ్మవారి లోకము కలిగించినది అను సుసదృశ శబ్దముచే వ్యంగ్యమైనది. ఇతరులచేత చచ్చినను లోకములకు మేలే కలిగెడిది. కావున వాని చావు సదృశమైన దనియే చెప్పనగును. కాని సుసదృశమైనదని మాత్రము చెప్పరాదు అని సుశబ్దము వ్యంజించుచున్నది. కుతః శంకుతః అనుచోట యమకము, '**చక్రవ్యుత్క్రమకృత్ పరోక్షపరశుః**', శూలేన శూన్యః మృత్యుర్దైత్యపతేః, నిఃశల్యకల్యమ్ అను పదబన్ధములలో వృత్త్యనుప్రాసములు నున్నవి. *

**అ :** పై శ్లోకమున విష్ణ్వింద్రాదుల చక్రవజ్రాదులు మహిషునందు పనిచేయలేదని చెప్పబడినవి. ఈ శ్లోకమున **మహిషుడు విష్ణ్వింద్రాదుల పరిహసించుట** చెప్పబడుచున్నది.

**శ్లో॥ నష్టానష్టౌ గజేన్ద్రానవతు న వసవః కిం దిశో ద్రాగ్గృహీతాః**
**శార్ఙ్గిన్సఙ్గ్రామయుక్త్యా లఘురసి గమితస్త్వాఽథ తార్క్ష్యేణ తైక్ష్ణ్యమ్ ।**
**ఉత్ఖాతా నేత్రపఙ్క్తిర్న తవ సమరతః పశ్య నశ్యద్బలం స్వమ్**
**స్వర్నాథేత్యాత్తదర్పం వ్యసుమసురముమా కుర్వతీ త్రాయతాం వః ॥ 45**

**ప్ర :** స్వర్నాథ! = ఓ ఇంద్రా!, (భవాన్ = నీవు), నష్టాన్ = పారిపోయిన, అష్టౌ = ఎనిమిది, గజేంద్రాన్ = గజేన్ద్రములను, న అవతు = రక్షించకుందువు గాక!, వసవః = ధనములు, ద్రాక్ = శీఘ్రముగా, గృహీతాః కిమ్ = గ్రహింపబడినవా!, దిశః = దిక్కులు, గృహీతాః = గ్రహింపబడినవా?, తవ = నీ యొక్క, నేత్రపఙ్క్తిః = కన్నుల వరుస, న ఉత్ఖాతా = పెఱికి వేయబడలేదు. సమరతః = యుద్ధమునుండి, నశ్యత్ = పారిపోవుచున్న, స్వమ్ = నీకు సంబంధించిన, బలమ్ = సైన్యమును, పశ్య = చూడుము, శార్ఙ్గిన్! = ఓ విష్ణూ!, సంగ్రామయుక్త్యా = యుద్ధోపాయముచేత, లఘుః అసి = అల్పుడవై యున్నావు. అథ = పిమ్మట, తార్క్ష్యేణ = గరుడునిచేత, తైక్ష్ణ్యమ్ = తీక్ష్ణతను, గమితః = పొందింపబడినావు, ఇతి = అని, ఆత్తదర్పమ్ = పొందిన గర్వముగల, అసురమ్ = రాక్షసుని (మహిషుని), వ్యసుమ్ = ప్రాణహీనునిగా, కుర్వతీ = చేయుచున్న, సా = ఆ, ఉమా = పార్వతి, వః = మిమ్ము, త్రాయతామ్ = కాపాడు గాక!

**తా :** ఓ యింద్రా! పారిపోయిన ఎనిమిది గజేంద్రములను రక్షింపకుందువు గాక. దిక్కులు శీఘ్రముగా గ్రహింపబడినవా? ధనములు గ్రహింపబడినవా? నీ నేత్రముల వరుస పెఱికి వేయబడలేదు గదా! యుద్ధమునుండి పారిపోవుచున్న నీ సైన్యమును చూడుము. ఓ విష్ణూ! యుద్ధోపాయమున అల్పుడవు. గరుడునిచే తీక్ష్ణతను పొందింపబడినవావు అని పలికి గర్వమును పొందిన మహిషుని ప్రాణహీను నొనరించుచున్న ఉమ మిమ్ము రక్షించుగాక!

**వి :** ఇంద్రుడు దిక్పాలకాగ్రణి. దిక్పాలకుల కందఱకును నాయకుడు. దిక్పాలకులు తమ తమ దిక్కుల రక్షించుకొనలేనప్పుడు అచట గజేంద్రులను రక్షించుకొన లేనప్పుడును ఇంద్రుడు వానిని వారి ధనములను రక్షింపవలసిన వాడై యున్నాడు. ఆతడు యుద్ధమునకు వచ్చియు పారిపోవుచున్న సైన్యమును మరలింపలేక నిస్సహాయుడై చూచుచుండగా మహిషుడు ఓ యింద్రా! నీవే దిక్కులేని వాడవైనావు. మిగిలిన దిక్కులను దిక్పాలకులను రక్షింపలేని వాడవైనావు. వేయికన్నుల వరుస కలిగియుండియు గుడ్డివానివలె పారిపోవుచున్న సైన్యమును చూడకున్నావు. నీ ధనము నెవరు గ్రహించినారో నీకు తెలియకున్నది. నీ దిక్కుల నాక్రమించిన దెవరో నీకు తెలియకున్నది. నీ వాహనమైన ఐరావతమును ఇతర దిగ్గజముల నెవరు తీసికొని పోయిరో ఎఱుగకున్నావు. నీ యెదుట నున్న నేనే సుమా! ఇవి యన్ని యొనర్చినది. అని ఇంద్రు నాక్షేపించినాడు. ఓ విష్ణూ! నీవు యుద్ధమున చేయు కుయుక్తులిట చెల్లలేదు. నీ గెలిచిన గెలుపులన్నియు నీ కుయుక్తులచే

సంభవించినవే. నీకు గరుడుడు వాహనముగా నున్నందుననే నీవు పరాభవింపబడకుండ నీ వాపదలలో బడకుండ శీఘ్రముగా నిన్ను దాటించినాడు. ఆతని వలననే యుద్ధమున నితరులపై దొంగదెబ్బ తీయుచు పారిపోవుచు యుద్ధమున తైక్ష్ణ్యముగలవాడు అను కీర్తిని సంపాదించినావు. ఇది యంతయు గతము. నీవు ఇప్పుడు పారిపోవుటలో చూపుచున్న తీక్ష్ణత గరుడునిదే. నీవు సచివాయత్తసిద్ధివి స్వాయత్తసిద్ధివి కావు. అని విష్ణువును మహిషుడాక్షేపించెను. పై ఇంద్ర విష్ణ్వాక్షేపము లీ శ్లోకమున వ్యంగ్యము లగుచున్నవి. గర్వమును పొంది యున్న అసురపతిని వ్యసువు నొనరించినది ఉమ. అసురుడనగా ప్రాణముల తీయువాడు. మహిషుడు వారలకును పతి అనగా ప్రాణముల తీయు విద్యలో ఆరితేరినవాడు. అట్టి వాని వ్యసువును అనగా ప్రాణహీను నొనరించినది అని **అసుర** శబ్దము వ్యంజించును. వసువులు ఎనమండుగురు. రుద్రులు పదకొండుగురు. ఆదిత్యులు పన్నెండుగురు. అశ్వినీ దేవతలిరువురు. ఈ విధముగా వసురుద్రాదిత్యాశ్వినులు అను నాలుగు గణములు దేవతలలో నున్నవి. వీరు మొత్తము ముప్పది ముగ్గురు. ఒక్కొక్కరి కొక్కొక్క కోటి అనుచరులున్నారు. అందుచే దేవతలు ముప్పది మూడు కోట్లనుట పురాణసమ్మతము. శ్లోకమున వసువులు మహిషవిధేయులై పోయినారు. **వసు** శబ్దమునకు ధనము అను అర్థముకూడ నున్నందున సర్వదేవతాధనములను మహిషునిచే గ్రహింపబడిన వను అర్థమును **వసు**శబ్దమొసగును. '**వసవః నవతు న**' (వసువులు తొమ్మండుగురు లేరు) అని అన్వయించి ఆ తొమ్మిదవ వానికి అష్టదిగ్గజము-లధీనములు, నేను ఆ తొమ్మిదవ వాడను, అను అర్థాంతరము గ్రహింపవచ్చును. **అష్టౌ గజేంద్రాః** గజేంద్రము లెనిమిది. ఆ తొమ్మిదవ వసువు కడనున్నా వేమో అను పరిహాసమును ఇందు వ్యంగ్యమగును. **నష్టౌనష్టౌ నవతు న వసవః** అను చోట **నష్ట వ వర్ణావృత్తిచే**, 'పశ్య నశ్యత్' అనుచోట శ వర్ణావృత్తిచే, వృత్త్యనుప్రాసలు ఏర్పడి యున్నవి. నాల్గవపాదమునందలి స్వర్నాథుని ప్రథమపాదము నందలి అవతు అనుక్రియకు కర్తగా అన్వయించుట భవాన్ అను పదము నధ్యాహారముగా తెచ్చుకొనుట నచ్చకపోయినచో ఎవడో ఒకడు శ్లోకమున చెప్పబడని బ్రహ్మయో శివుడో మరొకడో కర్త అని భావించు కొనవలసి యుండును. *

**అ :** పై శ్లోకమున మహిషుడు విష్ణ్వింద్రాదుల పరిహసించుట చెప్పబడినది. ఈ శ్లోకమున **హిమవంతునికి ఆ మహిషు నందు కలిగిన వింధ్యపర్వతభ్రాంతి** చెప్పబడుచున్నది.

**శ్లో॥ శ్రుత్వా శత్రుం దుహిత్రా నిహతమతిజడో௨ ప్యాగతో௨ హ్నాయ హర్షా-**
**దాశ్లిష్యచ్ఛైలకల్పమ్మహిషమవనిభృద్బాన్ధవో విన్ధ్యబుద్ధ్యా ।**
**యస్యాః శ్వేతీకృతే௨ స్మిన్స్మితదశనరుచా తుల్యరూపో హిమాద్రి-**
**ర్ద్రాగ్ద్రాఘీయానివాసీద్భువతమసనిరాసాయ సా స్తాదుమా వః ॥ 46**

**ప్ర :** దుహిత్రా = బిడ్డచేత, శత్రుమ్ = శత్రువును, నిహతమ్ = చంపబడిన వానినిగా, శ్రుత్వా = విని, అతిజడః అపి = మిక్కిలి జడుడైనను, హిమాద్రిః = హిమవత్పర్వతము, అహ్నాయ = శీఘ్రముగా, ఆగతః = వచ్చినదై, అవనిభృద్బాన్ధవః = పర్వతములు బన్ధువులుగా గలది (యగుటచేత), శైలకల్పమ్ = పర్వతమువంటి (ఎత్తైన), మహిషమ్ = మహిషుని, విన్ధ్యబుద్ధ్యా = వింధ్య పర్వతమను బుద్ధితో,

ఆశ్లిష్యన్ = కౌగలించుకొనగా, యస్యాః = ఎవతెయొక్క, స్మితదశనరుచా = చిన్నగా నవ్విన దంతముల కాంతితో, అస్మిన్ = ఇది, శ్వేతకృతే = తెల్లబడగా, తుల్యరూపః = సమానమైన రూపముగలది (అగుటచేత), ద్రాక్ = శీఘ్రముగా, ద్రాఘీయాన్ ఇవ = పొడవైన దానివలె, ఆసీత్ = ఆయెనో, సా = ఆ, ఉమా = ఉమ, వః = మీ యొక్క, భవతమసనిరాసాయ = సంసారాన్ధకార–వినాశము కొఱకు, స్తాత్ = అగుగాక!

**తా :** కూతురు శత్రువును చంపినదని విని మిక్కిలి జడుడయ్యు సంతోషమున శీఘ్రముగా వచ్చిన హిమవంతుడు వింధ్య మనుపేరుగల కొండవంటి మహిషుని కౌగలించుకొనగా నవ్విన అమ్మవారి దంతముల కాంతితో తెల్లబడిన మహిషుని యందున్నందున శీఘ్రముగా పొడవై పోయెను. ఆ హిమవంతునకు కూతురైన ఉమ మీ సంసారాన్ధకారమును పోగొట్టుగాక!

**వి :** అమ్మవారు మహిషాసురుని చంపి దన్న వృత్తాంతము నెవరివలనో హిమవంతుడు విన్నాడు. తన కూతురియొక్క ఈ విజయము నభినందించుట కాతడు వచ్చెను. ఆ హిమవంతు డతిజడుడు. ఎక్కువ జలము కలవాడు. గడ్డకట్టిన జలమే హిమము. ఆ హిమము కలవాడైన హిమవంతుడు అతిజడుడని ఈ శ్లోకమున చెప్పబడినాడు. ఏమియు తెలియని వాడు జడుడు. ఒకప్పుడు తెలివికల వారు కూడ ముసలితనమున కొందఱు జడులగుచుందురు. మతి బాగుగా పనిచేయనందున వారు జడులనబడుదురే కాని పూర్తిగా బుద్ధియే లేనివారని చెప్పజాలము. పూర్తిగా బుద్ధియే లేనివారని, ఎక్కువ జడులని చెప్పుట పాడిగాదు. బుద్ధియే లేని వస్తువు జడము. దాని జాడ్యమున పెఱుగుట తగ్గుట అనునవి ఉండవు కదా! **అతిజడ** అని చెప్పినందున హిమవంతునిలోని జడత పెఱిగినదని చెప్పుటచేతనే ఆయన బుద్ధి గలవాడనియే తెలియును. బుద్ధియే లేనిచో కూతురు విజయ మొందుట వినుట యెట్లు. విని సంతోషించుట యెట్లు కుదురును. ముసలితనమున జాడ్యాధిక్యమును పొందుట ఎక్కువ గడ్డకట్టిన జలము (మంచు) కలిగి యుండుట అను రెండర్థముల **నతిజడ** శబ్దము కలిగి యుండుటచే ఆ రెండర్థముల నొక తొడిమకున్న రెండు కాయలవలె నభిన్నములుగా తోచును. ఇదియే **అభేదాధ్యవసాయ**మని చెప్పబడును. వచ్చిన హిమవంతుడు కూతురును కౌగలించు కొనవలసి యుండెను. అయినను అతడు జడుడగుటచే కొండవలె కనబడిన మహిషుని విన్ధ్యపర్వతమను కొనెనేమో? కౌగలించుకొనెను. పర్వతము లన్నింటితో బాన్ధవ్యము కలవాడైనందున హిమవంతు డట్లు చేయుట ఉచితముగానే ఉన్నది. పొరపాటు మహిషుని వింధ్యపర్వత మనుకొనుటలోనే ఉన్నది. కాని కౌగిలించుకొనుటలో లేదు. హఠాత్తుగా చాలాకాలమునుండి చూడని బంధువు కనబడిన కౌగిలించుకొనుటలో అనౌచిత్యము లేదు. అని **అవనిభృద్బాన్ధవ** శబ్దము వ్యంజించును. అది గాక ఆ మహిషుడు అమ్మవారి నవ్వుచే తెల్లబడి నందున కౌగలించుటచే తెల్లని రెండు కొండలు కలసి ఒక హిమవంతుడైనట్లు తెల్లని హిమవంతుని దైర్ఘ్యము పెరిగినట్లు చూచువారికి తోచెను. లేక అమ్మవారి నవ్వు మహిషుని కౌగిలించుకొన్న హిమవంతుని పై రాశిగా పడుటచే హిమవంతుడు పెరిగినట్లు చూచువారికి తోచుట వింతకాదు. అని చెప్పవలెను. '**స్మితదశనరుచా**' అను తృతీయాంతసమాసము మహిషుని శ్వేతీ భావహేతు వమ్మవారి నవ్వు అని

ఆ నవ్వుతో హిమవంతుని రూపము తుల్యమైనది అని వెనుకనున్న '**శ్వేతీకృతే**' అను శబ్దములోనికి ముందున్న **తుల్యరూపః** అను శబ్దములోనికి అన్వయించు నవకాశ ముండుటచే పై యర్థము స్ఫురించునని తెలియవలెను. అమ్మవారు నల్లని మహిషుని చంపెను. వాడు ఆమె నవ్వుతో శ్వేతీకృతు డయ్యెను. వాని నలుపు తొలగెను. వాడు పాపము నుండి అజ్ఞానమునుండి ముక్తుడయ్యెను. అట్లే ఆమె మీ యందఱి సంసారాన్ధకారమును హరించుటలో ఆశ్చర్యము లేదు అని కవి నాల్గవపాదమున వ్యంజింపజేసినాడు. '**శత్రుం దుహిత్రా నిహతమతిజడోప్యాగతః మహిషమవనిభృద్భ్రాన్ధవో విన్ధ్యబుద్ధ్యా ఆశ్లిష్యన్ శైలకల్పమ్ శ్వేతీకృతేఽస్మిన్ స్మిత**' ద్రాఘ్రాఘీయాన్ **నిరాసాయ సా** అను పదములలో **వర్ణావృత్తిరూప వృత్త్యనుప్రాసనామక శబ్దాలంకారము** లున్నవి. ఈ శ్లోకమున **భ్రాంతిమదలంకారము** అను అర్థాలంకారమున్నది. *

**అ :** పై శ్లోకమున వింధ్యపర్వతము ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున **మందరపర్వతము ప్రస్తావింపబడుచున్నది.**

**శ్లో॥ క్షిప్తోఽయమ్మన్దరాద్రిః పునరపి భవతా వేష్ట్యతాం వాసుకేఽబ్ధౌ**
**ప్రీయస్వానేన కిం తే బిసతనుతనుభిర్భక్షితైస్తార్క్ష్య! నాగైః ।**
**అష్టాభిర్దిగ్గజేన్ద్రైస్సహ న హరికరీ కర్షతీయం హతే వో**
**హ్రీమత్యా హైమవత్యాస్త్రిదశరిపుపతౌ పాన్త్వితి వ్యాహృతాని ॥ 47**

**ప్ర :** వాసుకే! = ఓ వాసుకీ, అయమ్ = ఈ, మన్దరాద్రిః = మన్దరపర్వతము, అబ్ధౌ = సముద్రమున, క్షిప్తః = విసరివేయబడినది, భవతా = నీచేత, పునః అపి = మరియొకసారి, వేష్ట్యతామ్ = చుట్టబడుగాక!, తార్క్ష్య! = ఓ గరుడుడా!, బిసతనుతనుభిః = తామరతూండ్లవలె సన్నని శరీరములుగల, నాగైః = పాములతో, కిమ్ = ఏమి?, అనేన = వీని (మహిషుని)తో, ప్రీయస్వ = తృప్తి నొందుము, అష్టాభిః = ఎనిమిది, దిగ్గజేన్ద్రైః = దిగ్గజేన్ద్రములతో, సహ = కూడి, హరికరీ = ఇంద్రుని ఏనుగు (ఐరావతము), ఇయమ్ = (చచ్చిన) వీనిని (మహిషుని), న కర్షతి = లాగకున్నది. ఇతి = అని, త్రిదశరిపుపతౌ = రాక్షసేన్ద్రుడు (మహిషుడు), హతే = చంపబడగా, హ్రీమత్యాః = సిగ్గుగల, హైమవత్యాః = హైమవతియొక్క, వ్యాహృతాని = పలుకులు, వః = మిమ్ము, పాంతు = కాపాడుగాక!

**వి :** ప్రథమపాదమున అమ్మవారు తాను చంపిన మహిషుని శవమును సముద్రములో పారవేసి మందరాద్రిగా ఆరోపించి వాసుకిని తిరిగి చుట్టుకొనుమని కోరినది. ఎవరేని మహిషుని శరీరమును చూచినచో మందరాద్రిగా భ్రమించెదరని వాసుకి కూడ సందేహించకుండ దానిని చుట్టుకొనునని అమ్మవారి ఆ మాటలు వ్యంజించుటచేత **భ్రాంతిమదలంకారవ్యక్తి** ఏర్పడుచున్నది. రెండవ పాదమున గరుడుని సంబోధించి ఆతని మాంసాహారిత్వమును స్ఫురింప జేయుచు తామరతూండ్ల వంటి నాగుల సన్నని శరీరములలోని మాంసముతో నాతనికి తృప్తి కలుగదని, మహిషుని బలిసిన శరీరమున ఆతనికి కావలసినంత ఆహారము లభించి తృప్తి కలుగునని అమ్మవారి మాటలు వ్యజించుచున్నవి. '**బిసతనుతనుభిః**' అను నాగ విశేషణ సమాసమున వాచకలుప్తోపమాలంకార

మున్నది. తను శబ్దావృత్తిచే యమకాలంకారము కూడ నున్నది. మూడవపాదమున అష్టదిగ్గజములతో కూడియు ఇంద్రుని ఏనుగైన ఐరావతము వీనిని లాగలేకున్నది. అని చెప్పుటలో ఐరావతము అష్టదిగ్గజములలో చేరకపోవుట తెలియుచున్నది. ఇట్లు పలుకుటచేతనే ఆమె సిగ్గు చెందినదేమో? అను అంశమును చతుర్థపాదారంభ మందలి **హ్రీమతీ** శబ్దము సూచించుచున్నది. '**సహా న హరికరీ**' అనుచోట రహల పునరావృత్తిరూపవృత్త్యనుప్రాసమున్నది. చతుర్థపాదారంభమున హ్రీమత్యా హైమవత్యా అనుచోటను వృత్త్యనుప్రాసాలంకార మున్నది. సముద్రములో మహిషుని శవమును వేసినట్లు చెప్పుటచే అమ్మవారికి సిగ్గుకలిగిన దేమో? గరుడునికి నాగాహారత్వమును విధించి ఆతనిని ఆకలిని సగమే తీర్చిన బ్రహ్మ అన్యాయమును వారించి తానాతని ఆకలిని సంపూర్ణముగా తీర్చెద ననుచున్నది. కాని మహిషాహారముతో కడుపు నిండినను అది జీర్ణమైన పిదప మరల నాతని కాకలి కలుగును కదా అను అసంతృప్తి ఆమెకు సిగ్గును కలిగించిన దేమో? అని **హ్రీమతీ** శబ్దము సూచించును. వాస్తవమునకు ఈ మాటలన్నియు కవి నిబద్ధ వక్త (యైన అమ్మవారి) మాటలు మాత్రమే. హ్రీ అను వర్ణము (అక్షరము) పంచదశీ మంత్రమున ముమ్మారు వచ్చును. దీనిలో హ్ ర్ ఈ అను మూడు వర్ణములున్నవి. హకారము సోముని, రేఫము అగ్నిని సూచించును. అగ్నీషో మగరుద్ద్వయము గల కుండలిన్యాత్మకప్రాణహంస మనదగిన హంస మంత్రతుల్య మనదగినది. ఇది సాధకులచే సంపాదింపదగిన హేమము (సువర్ణము). ఈ హేమము కలవాడే హేమవంతుడు. వానికి సాక్షాత్కరించునదే ఈ హైమవతి. **హైమవతీ శబ్దము** హిమవంతుని కూతురు అను అర్థమున ప్రసిద్ధమైనది. అవ్యవధానముగా కూర్పబడిన హ్రీమతీ హైమవతీ శబ్దము లందలి మతుప్ప్రత్యయాంతత్వము పై యర్థమునకు వ్యంజకమై యున్నది. చతుర్థ పాదాది (వర్ణము) తృతీయకూటాంత హ్రీ వర్ణమును కలిగిన మూడవ పాదమందలి సహ న హరికరీ కర్షతి అనుచోట **హరేఫ** ద్వయద్వయము ఈ కారమును కలిగి ప్రథమ ద్వితీయ కూటాంతములలో హ్రీ ద్వయమును మొత్తము మూడు హ్రీలను కలిగిన పంచదశీవిద్యయొక్క **హ్రీమతీత్వము**ను కూడ సూచించును. ఇది మానస సముద్రమున మరల మరల మథింపబడిన మందరాద్రి, కుండలీంద్రమైన వాసుకి మరల మరల చుట్టుకొనగా మథింపదగిన మందరాద్రి. నిర్బిందుకము లైనను **ఐశ్రీహ్రీక్లీ** ఇత్యాదులు ఫలప్రదములనుట మంత్రతంత్రశాస్త్ర దేవీభాగవతాది పురాణప్రతిపాదితము. ఈ శ్లోకము నందలి తార్క్ష్యుడు ఛందోమయేన గరుడేనయ ఉహ్యమానః అని శ్రీమద్భాగవతమున చెప్పబడిన విధముగా అగ్నీషోమగరుద్ద్వయముగల గరుడనామాంతరముగల పరమాత్మ తత్త్వప్రతిపాదకవేదరూపము గల పరమాత్మునకు లేక ప్రథమజీవత్వముకల (బ్రహ్మకు) వాహనమైన ప్రాణహంసయే. *

**అ :** పై శ్లోకమున తార్క్ష్య వాసుకులతో అమ్మవారు పలుకుట చెప్పబడినది. ఈ శ్లోకమున **శివవిష్ణ్వింద్రు లొనర్చిన కృత్యములు నమ్మరానివిగా అమ్మవారు చేయుట** చెప్పబడుచున్నది.

**శ్లో॥ ఏష ప్లోష్టా పురాణాం త్రయమసుహృదురఃపాటనోఽయం నృసింహో**
**హన్తా త్వాష్ట్రం ద్యురాష్ట్రాధిప ఇతి వివిధాన్యుత్సవేచ్ఛాహృతానామ్ ।**

**విద్రాణానాం విమర్దే దితితనయమయే నాకలోకేశ్వరాణా-**
**మశ్రద్ధేయాని కర్మాణ్యవతు విదధతీ పార్వతీ వో హతారిః ॥ 48**

**ప్ర :** హతారిః = చంపబడిన శత్రువుగల, పార్వతీ = పార్వతి, దితితనయమయే = రాక్షసమయమైన, విమర్దే = యుద్ధమున, విద్రాణానామ్ = పారిపోవుచున్న, ఉత్సవేచ్ఛాహృతానామ్ = ఉత్సవేచ్ఛతో తీసుకొని రాబడిన, నాకలోకేశ్వరాణామ్ = స్వర్గలోకప్రభువులైన వారిలో (దేవతలలో), ఏషః = ఈతడు, పురాణామ్ = పురములయొక్క, త్రయమ్ = మూడింటిని, ప్లోష్టా = నశింపఁజేసినవాడు, అయమ్ = ఈతడు, అసుహృదురఃపాటనః = శత్రువు ఱొమ్మును చీల్చినట్టి, నృసింహః = నృసింహుడు, (అయమ్ = ఈతడు), త్వాష్ట్రమ్ = త్వష్టపుత్రుని (వృత్రాసురుని), హంతా = చంపిన ద్యురాష్ట్రాధిపః = స్వర్గాధిపతి అని, వివిధాని = అనేకవిధములైన, కర్మాణి = కర్మలను, అశ్రద్ధేయాని = నమ్మరానివిగా, విదధతీ = చేయుచున్నదై, వః = మిమ్ము, అవతు = రక్షించుగాక!

**తా :** మహిషు యుద్ధమున పారిపోవుచున్న దేవతలను వానిని చంపిన దేవిచే ఉత్సవేచ్ఛతో తీసికొని రాబడగా ఈతడు త్రిపురదమనుడు, ఈతడు శత్రూరఃపాటనుడైన నృసింహుడు, ఈతడు వృత్రహంతయైన స్వర్గాధిపతి అని వారి కర్మల నమ్మరానివిగా చేయుచున్న పార్వతి మిమ్ము కాపాడుగాక!

**వి : ఏతద్** అను దకారాన్తశబ్దముయొక్క ప్రథమైకవచనాంతరూపము **ఏషః** అనునది మిక్కిలి దగ్గఱగా నున్న వానిని సూచించును. పారిపోవుచున్న వారిలో ఉత్సవేచ్ఛతో తీసికొని రాఁబడిన వారిలో నీతడు అమ్మవారికి మిక్కిలి దగ్గఱగా నున్నాడు. ఈతడు పురత్రయమును సంహరించినవాడు. మకారాన్తమైన **ఇదమ్** శబ్దముయొక్క ప్రథమైకవచనాన్తరూపము **అయమ్** అనునది కనఁబడు దానిని సూచించును. ఈతడు శత్రువు ఱొమ్ము చీల్చువాడైన నృసింహుడు. ఈతడు వృత్రుని చంపిన స్వర్గాధిపతి. అమ్మవారికి పరిచయము చేయఁబడిన ఈ ముగ్గురిలో మొదటి వాడు **శివుడు**. రెండవ వాడు నృసింహావతారమున హిరణ్యకశిపువును సంహరించిన **విష్ణువు**. మూడవవాడు త్వష్టపుత్రుడైన వృత్రాసురుని సంహరించిన **ఇంద్రుడు** అని వారిని తెచ్చిన వారు చెప్పుచుండగా ఆ ఉత్సవమునకు వచ్చిన ఇతరులు వారీ కర్మలు చేసినారన్న విషయమును నమ్మ కుండిరి. వారట్టి కర్మల చేసినవారే యైనచో ఇంతగా భయపడి పారిపోవుదురా! అను సందేహమే వారు నమ్మక పోవుటకు కారణము. అమ్మవారు తమ యెదుట మహిషుని చంపినది. కావున మహిషవధ అమ్మవారు చేసినదా? లేదా? అను సందేహము వారికి కలుగుటకు అవకాశము లేదు. కాని శివవిష్ణ్వింద్రులెప్పుడో భూతకాలమున చేసిన కర్మల నమ్ముట కిప్పుడు వారు పిరికితనముతో పారిపోవుట అను అంశము ఆటంకమగుచున్నది. దేవతలు పారిపోవుట వారమ్మ వారు మహిషుని చంపినందుకు విజయోత్సవమునకు తీసికొని రాబడుట అను అంశములు దాదాపు ఏకకాలికముగా చెప్పఁబడుటచే నీ శ్లోకమున **అతిశయోక్త్యలంకార** మేర్పడియున్నది. శివుడని చెప్పక **పురత్రయప్లోష్ట** అని చెప్పఁబడుటచే **పర్యాయోక్త్యలంకార** మేర్పడియున్నది. విష్ణువిపుడు నృసింహావతారమున

లేకున్నను విష్ణువని చెప్పక నృసింహుడని చెప్పుట సింహము మహిషుని చూచి పారిపోయినదని ధ్వనింపఁజేయుట కొఱకే. ఇంద్రుడిప్పుడు స్వర్గరాష్ట్రమునకు అధిపుడు కాకున్నను ద్యురాష్ట్రాధిపుడని చెప్పుట స్వర్గము నేలుటలో ఆతని అనర్హతను ప్రకటింపఁజేయుటకే. అక్కడ ఆ ఉత్సవమున నున్నవారిలో పెక్కురు బహుకాలజీవులు. కావున వారు శివవిష్ణ్వింద్రులొనర్చిన పై కర్మల చూచిన వారే కాని అమ్మవారిప్పుడు వారిలో జ్ఞాపకశక్తిని నశింపఁజేయుటయే కాక వారిలో చెప్పినమాట నమ్మకపోవుల అను అశ్రద్ధను కలిగించుటచే ఆ నమ్మకపోవుటలో వారి దోషములేదని **విదధతీ** అను వర్తమానార్థశత్రంతపదము వ్యంజింపఁజేయు చున్నది. నృసింహు డనగా సగము మనుష్య-శరీరము, సగము సింహశరీరము కలవాడు అని ఒక అర్థము. సింహము వంటి మనిషి అని మరొక అర్థము. ఈ రెండవ అర్థమున విశేషణమైన **అసుహృదురఃపాటన** శబ్దము తనకు శత్రువు మిత్రుడు కాకపోయినపను ప్రాణముల నపహరించి వారి ఱొమ్మును చీల్చువాడు అనగా చంపువాడు అని, మిత్రుడైనను ఇతరుల ప్రాణముల తీయు వాడైనచో వానిని కూడ తన మైత్రిని విడచి చంపును అని, ప్రాణముల తీయువాడైనప్పుడే శత్రువును చంపును అను **నృసింహ** లక్షణముల వ్యంజింపఁజేయును. '**త్వాష్ట్రం ద్యురాష్ట్రాధిపః**' '**విద్రాణానాం విమర్దే**' '**దితితనయమయే నాకలోకేశ్వరాణామ్**' అవతు విదధతీ పార్వతీ వో హతారిః అను పదబన్ధములలో వృత్త్యనుప్రాసాలంకారము లేర్పడి యున్నవి. దేవతలను నాకలోకేశ్వరులని, ఇంద్రుని ద్యురాష్ట్రాధిపుడని చెప్పుట స్వర్గముయొక్క బహునాయకత్వమును తద్వారా ఇంద్రుడు నామ మాత్రమునకే రాష్ట్రాధిపుడని ఆతడు నిజముగా రాష్ట్రమును పాలించుశక్తి కలవాడు కాదని వ్యంజింపఁ జేయును. *

**అ :** పై శ్లోకములో **ఇంద్రాది దేవతల** పరాక్రమహీనత చెప్పబడినది. ఈ శ్లోకమున వారి **భార్యల దైన్యము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ విద్రాణేన్ద్రాణి! కిం త్వం ద్రవిణదదయితే! పశ్య సౌఖ్యం స్వసఖ్యాః**
**స్వాహే! స్వస్థా స్వభర్తర్యమృతభుజి ముధా రోహిణీ రోదితీవ ।**
**లక్ష్మి! శ్రీవత్సలక్ష్మోరసి వససి పురేత్యార్తమాశ్వాసయన్త్యాం**
**స్వర్గస్త్రైణం జయాయాం జయతి హతరిపోర్హ్రేపితం హైమవత్యాః ॥ 49**

**ప్ర :** ఇన్ద్రాణి! = ఓ శచీదేవీ!, త్వమ్ = నీవు, విద్రాణా కిమ్ = పారిపోవుచున్న దానివేమి? ద్రవిణదదయితే! = ఓ కుబేరుని ప్రియురాలా!, స్వసఖ్యాః = నీ సఖియొక్క, సౌఖ్యమ్ = సౌఖ్యమును, పశ్య = చూడుము, స్వాహే = ఓ స్వాహా దేవీ!, స్వభర్తరి = నీ భర్త (అగ్ని), అమృతభుజి = హవిస్సును భుజించువాడు కాగా, స్వస్థా = స్వస్థురాలివి (కాగలవు), రోహిణీ = రోహిణి, ముధా = వ్యర్థముగా, రోదితీవ = ఏడ్చుచున్నట్లున్నది, లక్ష్మి = ఓ లక్ష్మీదేవి!, శ్రీవత్సలక్ష్మోరసి = శ్రీవత్స చిహ్నము గలవాని (విష్ణువు) ఉరమున, పురా = పూర్వము, వససి = నివసించి ఉన్నావు, ఇతి = అని, ఆర్తమ్ = దుఃఖితమైన, స్వర్గస్త్రైణమ్ = దేవతాస్త్రీ సమూహమును, జయాయామ్ = జయ, ఆశ్వాసయన్త్యామ్ = ఊరడించుచుండగా, హతరిపోః = చంపఁబడిన శత్రువుగల, హైమవత్యాః

= పార్వతియొక్క, హ్రేపితమ్ = సిగ్గు కలిగించుట లేక కలిగింపఁబడిన సిగ్గు, జయతి = సర్వోత్కర్షముగా వర్ధిలుచున్నది.

**తా :** ఓ ఇంద్రాణీ నీవు పారిపోవుచున్నావేమి. ఓ కుబేరపత్నీ నీ సఖియొక్క సౌఖ్యమును చూడుము. స్వాహాదేవి! నీ భర్త హవిస్సును భుజించువాడు కాగా నీవు స్వస్థతను పొందెదవు. లక్ష్మీ! నీవు ఇదివరకు శ్రీవత్సచిహ్నముగల విష్ణువు ఱొమ్మునుండి యున్నావు అని దుఃఖితమైన స్వర్గ స్త్రీ జనమును జయ ఊరడించుచుండగా హైమవతికి కలిగిన సిగ్గు మిమ్ము కాపాడుగాక!

**వి :** మహిషభయమున ఇంద్రుడు పారిపోవుచుండగా అమ్మవారు మహిషుని చంపెను. ఆ విషయము తెలియక ఇంద్రుని వెంట ఇంద్రాణియు పారిపోవుచుండగా అమ్మవారి చెలికత్తె యగు జయ ఓ ఇంద్రాణీ! పరుగెత్తు చున్నావేమి? అని ప్రశ్నించినది. ఇప్పుడు మహిషుడు మరణించినాడు కావున పారిపోవలసిన అవసరము లేదు వాని భయమిప్పుడు లేదు అను ఓదార్పు ఆ ప్రశ్నము వలన వ్యంజింపఁబడుచున్నది. ఎందఱో దేవతలున్నను వారి నాయకుడైన ఇంద్రుని పైననే శత్రువు పగ తీర్చుకొనుటకు యత్నించుట సహజము. కావున ఏ దేవతా స్త్రీయు పారిపోకున్నను ఇంద్రాద్వేషమున తన నవమానించెదరేమో అను భయమే ఇంద్రాణి పారిపోవుటకు కారణము కావచ్చును. ఎప్పుడు నగరమునకు శత్రుభయము కలిగినను ఎక్కువ భయపడు వారు ధనవంతులే. కుబేరుడు అధిక ధనవంతుడు. అంతేగాక అవసరమైనప్పు డందఱకు ధనమును అప్పుగా నిచ్చు చుండును. కావున ఆతడు ధనవంతుడను మాట లోకమున ప్రసిద్ధమై పోయినది. ఇప్పుడింద్రాణి ఇంటి మీదకు శత్రువు దాడి చేసినాడేమో ఆమె పారిపోవుచున్నది. ఇక నాయింటి మీదకును దాడికి వచ్చెదరేమో అని కుబేరుని భార్య భయపడుచున్నది. పైగా కుబేరు డిదివఱకే పారిపోయినందున మరింత భయపడుచున్నది. కుబేరుని భార్యకు ఈశానుని భార్య స్నేహితురాలు. ఆమె ధనవంతుని భార్య కాదు. ఇంటి మీదికి దాడికి వచ్చెదరేమో అను భయమును వీడి హాయిగా నున్నది చూడుము అని జయ కుబేరుని భార్యతో పలికినది. వడ్డీలకు డబ్బు నప్పిచ్చు బేరము **కుసీద** మనఁబడును. డబ్బు పుచ్చుకున్న వారు కూడ ఆ ధనవంతునిపై నసూయ కలిగి యుందురు. వాని వినాశమును కోరు చుందురు. ఆతని కాపద వచ్చినప్పుడు సాయమునకు ఒకప్పుడిచ్చినను ఇప్పుడు అప్పు ఈయనిచో శీఘ్రముగా రారు. వాని డబ్బు అంతయు పోయి తమవలె పేదవాడు కావలెననియే వారు కోరుకొనుచుందురు. ఆ సమయమున తమకు ఒకప్పుడు అప్పిచ్చి ఆదుకొన్నాడన్న కృతజ్ఞతయే వారి కుండదు. ఈశానుని భార్యకు డబ్బు లేకున్నను అప్పుడప్పుడు కుబేరుని భార్యకడ అప్పుగా అవసరమైనంత మేరకే తెచ్చుకొని కాలము గడుపుచుండుటచే తన యింట డబ్బు లేకుండుటచే తన డబ్బు ఎత్తుకొని పోవుదురన్న భయములేక ఎట్లు నిశ్చింతగా నున్నదో ఆమె సౌఖ్యమును చూడుము. ఇప్పుడు మహిషుడు చచ్చినాడు కావున నీ ధనము (నగలు) ఎత్తుకొని పోవుదురని భయము లేదు. నీ స్నేహితురాలివలె సుఖముగా నిద్రింపుము. అని జయ ఊరడించినది. ఇదంతయు ప్రథమపాదద్వితీయార్ధవ్యంగ్యము. మహిషుడు యజ్ఞవిధ్వంసకుడగుటచే అగ్నికి హవిస్సు (అమృతము)

లభించుట లేదు. ఇక స్వాహా దేవి కేమి యిచ్చును. అగ్ని పారిపోగా స్వాహాదేవి ఆకలితో నకనకలాడుచున్నది. అప్పుడు జయ వచ్చి మహిషుడు చచ్చినాడు. ఇక యజ్ఞములు బహుళముగా జరుగగలవు. నీ భర్తకు పుష్కలముగా హవిస్సు లభించును. అందఱు దేవతలకును కడుపునిండ పెట్టి కడుపు నిండ తినగలిగినంత హవిస్సు మీకు లభించును. ఆయన కడుపు నిండ తిననిదే పతివ్రతవైన నీవు కడుపునిండ తినవు గదా. అందుకే ఇప్పుడు స్వస్థగా లేవు. ఇక ముందు ఆయన దేవతలు అందరు కడుపునిండ తినునంతవఱకు వారికి పెట్టి తను కడుపు నిండ తినును. అప్పుడు నీవు కడుపు నిండ తిని స్వస్థురాలవు కాగలవు. ఆ కాలమింక ఎంతో దూరము లేదు. ఆ కాలము రానే వచ్చినది. ఇక చింతింపకుము. అని ఓదార్చుట ద్వితీయపాదపూర్వార్ధమున వ్యంగ్యము. మహిషునికి తపింపఁజేయు సూర్యుడన్ననే కోపము, చంద్రుడన్న ఆతనికి కోపము లేదు. వెన్నెలలో చల్లగా పడుకొని నెమరు వేయు చుండును. అట్టి చంద్రుని భార్య రోహిణి, ఇతర దేవతా స్త్రీ లేడ్చుట చూచి ఏడ్చుచున్నదే గాని ఆమె కేడువ వలసిన ఆవశ్యకతయే లేదు. ఆమె వ్యర్థముగా ఏడ్చుచున్నది అనుచు జయ ముందున కేగినది. ద్వితీయపాద ద్వితీయార్ధ వ్యంగ్యము. ఆ చంద్రుని సోదరి లక్ష్మి. ఆమె విష్ణువుయొక్క శ్రీవత్సచిహ్నాంకితమైన విశాలమైన ఱొమ్మున హాయిగా నిద్రించు నభ్యాసముండుటచే విష్ణు విప్పుడు పారిపోయినందున ఆ సుఖము లేదని యేడ్చుచున్నదే కాని ఇప్పుడామెకు వచ్చిన దుఃఖమేమియు లేదు. కాలమొక్క రీతిగా గడవదు కదా! ఆ సుఖము పోయినదని యేడ్చుచున్నది గదా! ఓ లక్ష్మీ మరల నీకు సుఖము త్వరలో లభింపగలదులే అని జయ, లక్ష్మి నూరడించినది. ఇది తృతీయపాదపూర్వార్ధవ్యంగ్యము. ఇట్లు దేవతాస్త్రీల నందఱ నూరడించుట యనగా మహిషుని చంపిన అమ్మవారి పరాక్రమమును ప్రశంసించుటయే కావున ఆమెకు సిగ్గు కలిగినది. ఆ కలిగిన సిగ్గుతో ఆమె ముఖము శత్రుజయముతోనే వికసించి యుండగా ఈ ప్రశంసయొక్క బరువుతో వంగిపోయినట్లు ఆ ముఖము నేలచూపులు చూచుచున్నది. ఆ స్థితి ఆమె ముగ్ధమనోహరత్వమును పెంచుచున్నది. అది యట్లే సర్వోత్కర్షముగా వర్ధిలుగాక. ఇది చతుర్థపాద వ్యంగ్యము. 'విద్రాణేంద్రాణి' 'ద్రవిణద దయితే', 'సౌఖ్యమ్ స్వసఖ్యాః', స్వాహే స్వస్థా స్వభర్తరి', 'రోహిణీ రోదితి', లక్ష్మి శ్రీవత్సలక్ష్మోరసి వససి పురా', జయాయాం జయతి, ఈ పదబన్ధములలో వృత్త్యనుప్రాసాలంకారము లున్నవి. **స్వస్థా** శబ్దము స్వర్గమునందున్న దానిని బోధించును. స్వర్గమునందున్నను స్వస్థతలేని స్థితిలో నున్న స్వాహాదేవి దైన్యము నీ పదము వ్యంజించును. **స్వాహే అస్వస్థా** అని విడదీసికొను నవకాశమున్న ఆ శబ్దముయొక్క శక్తికి పై యర్థము గుణభావము నొందుచున్నందున ఈ వ్యంగ్యము **గుణీభూత- వ్యంగ్యము**. మహిషుడు చచ్చినాడు. యజ్ఞము లారంభమైనవి. నీ భర్త అమృతమును భుజించు- చున్నాడు. నీకు తెలియదా? వైదికులు స్వాహా అనియే నీపేరనే ఆహుతు లొసగుచున్నారు గదా! నీ అస్వస్థతస్థితికి అర్థమే లేదు. అనియు వ్యంగ్య మగును. **అగ్ని అమృతభుక్** అని ఈ శ్లోకమున చెప్పబడినాడు. పాలసముద్రమున బుట్టిన అమృతమును దేవతలందఱతో పాటు అసముడైన అగ్ని భుజించి యున్నాడేమో, కాని వైదికుల హోమకర్మమునందు లభించు హవిస్సునకన్న ఆ అమృతము గొప్పది

కాదు. '**అమృతం నామ యత్సంతో మంత్రజిహ్వేషు జుహ్వతే' శోభైవ మన్దరక్షుబ్ధ-క్షుభితాంభోధివర్ణనా**' (మంత్రజిహ్వలలో అనగా స్వాహాకారములలో సత్పురుషులు హుత మొనర్చినదే అమృతము. మన్దరక్షోభచే పాలసముద్రము క్షోభించినట్లు వర్ణించుట కవులు తమను క్షోభపెట్టుకొనుటయే. అది వర్ణన చమత్కారమే. శోభయే. కాని వాస్తవము కాదు) అని మాఘుడు **శిశుపాలవధ మహాకావ్యము**న చెప్పెను. కావున పాలసముద్రమున బుట్టిన అమృతము నామ మాత్రము కలదియే కావున అది తిని అమృతమును తిన్నామని తృప్తి నొందుటచే దేవతల కీ రాక్షసయుద్ధములలో పరాజయక్లేశములు వచ్చి పడుచున్నవి. భూలోకముపైన వైదికులు క్షేమార్థము నిరంతరము సువృష్టి గురిపించు చుండగా వారు నిరంతరము యజ్ఞములు చేయుచుండగా లభించు హవిస్సమృతము దేవతల పాపముల సైతము నశింపజేసి వారికీ పరాజయదుఃఖము లేకుండ జేయగలదు. దేవతలు తమకు వర్షము కురిపించుటయం దధికారమున్నదని నిరూపించుట కప్పుడప్పుడు వర్షములు కురిపించక పోవుట, వైదికుల యజ్ఞము లాగిపోవుట, దేవతల పరాజయ-క్లేశములవలన స్వర్గము నందున్నను అస్వస్థతాస్థితి వచ్చిపడు చున్నది. ఇక ముందట్టి పరిస్థితి రాకుండు గాక! అని కవి ఆ **అమృతభుక్శబ్దప్రయోగద్వారము**న ఆశించుచున్నాడు. *

**అ :** పై శ్లోకమున అమ్మవారి సఖి జయ పలుకులు చెప్పబడినవి. ఈ శ్లోకమున అమ్మవారి శత్రువు **మహిషుని పలుకులు** చెప్పబడుచున్నవి.

**శ్లో॥ నిర్వాణః కిం త్వమేకో రణశిరసి శిఖిన్! శార్ఙ్గధన్వాపి విధ్యం-**
**స్తత్తే ధైర్యం క్వ యాతం జహిహి జలపతే! దీనతాం త్వం న దీనః ।**
**శక్తో నో శత్రుభఙ్గే భయపిశునసునాసీర! నాసీరధూలి-**
**ర్ధిగ్యాసి క్వేతి జల్పన్రిపురవధి యయా పార్వతీ పాతు సా వః ॥ 50**

**ప్ర :** శిఖిన్! = ఓ అగ్నీ!, త్వమ్ = నీవు, ఏకః = ఒకడవు, రణశిరసి = యుద్ధముయొక్క ముందు భాగమున, నిర్వాణః కిమ్ = చల్లారిన వాడ (బాణహీనుడ) వా? శార్ఙ్గధన్వా అపి = విష్ణువు కూడ, విధ్యన్ = (బాణమును) గ్రుచ్చుచు, నిర్వాణః = బాణహీనుడైనవాడే, జలపతే! = ఓ వరుణా!, తే = నీయొక్క, తత్ = ఆ, ధైర్యమ్ = ధైర్యము, క్వ = ఎక్కడికి, యాతమ్ = పోయినది, హి = ఎందువలన, త్వమ్ = నీవు, నదీనః = నదీ భర్తవో (దీనుడవు కావు), (అందువలన) దీనతామ్ = దీనతను, జహిహి = విడువుము, భయపిశున = భయమును సూచించు, సునాసీర! = ఇంద్రా!, నాసీరధూలిః = సైన్యముయొక్క దుమ్ము, శత్రుభఙ్గే = శత్రువు భంగమునందు, నో శక్తః = చాలినది కాదు, క్వ = ఎక్కడకు, యాసి = పోవుచున్నావు, ధిక్ = ధిక్కారము, ఇతి = అని, జల్పన్ = వాగుచు, రిపుః = శత్రువు (మహిషుడు), యయా = ఎవతె చేత, అవధి = చంపబడెనో, సా = ఆ, పార్వతీ = పార్వతి, వః = మిమ్ము, పాతు = రక్షించుగాక!.

**తా :** ఓ అగ్నీ!, నీ వొకడవేకాక విష్ణువును బాణహీనుడైనాడు. ఓ వరుణా! నదీనుడవు అనగా దీనుడవు కాని నీవు దీనతను విడువుము. నీ ధైర్య మెక్కడకు పోయినది. ఓ యింద్రా! నీ సైన్యపు

దుమ్మునకు నిన్ను చంపలేదు. ఎక్కడకు పారిపోవుచున్నావు. ఛీ అని పల్కుచున్న మహిషుని చంపిన పార్వతి మిమ్ము కాపాడు గాక!

**వి :** యుద్ధభూమియందు అగ్ని అణగి పోయినాడు. ఆయన శిఖి, శిఖలు (జ్వాలలు) కలవాడు. అవి యన్నియు ఆతని శౌర్యములు. అవి చల్లారినవి. చల్లారిపోవుట నాకే ఉన్నందున నేనే అందఱు దేవతల కన్న ముందు అణగి పోయినానని దుఃఖించుచుండగా మహిషుడు నీవు ఒక్కడవే నిర్వాణుడవగుట కాదు. బాణమును శార్ఙ్గమున సంధించి నాపై గ్రుచ్చుచు విష్ణువు కూడా నిర్వాణుడైనాడు. అనగా '**వబయోరభేదః**' సూక్తి ననుసరించి బాణహీనుడైనాడు. అని ప్రథమపాదము వ్యంజింపజేయును. ఓ వరుణా! నీవు నదీనుడవు. (**నదీ+ఇనః**) నదీనః అను శబ్దము నదీ భర్తవను నర్థముతో బాటు, న+దీనః దీనుడవు కావు అను అర్థము నిచ్చును. నీ ధైర్య మెక్కడకు పోయినది. నీవు దీనతను విడువుము. యుద్ధము చేయుము. అని మహిషుడు రెచ్చగొట్టుట ద్వితీయపాదమున నున్నది. వరుణుడు సముద్రరూపుడు. సముద్రము మిక్కిలి లోతుగా నుండును. ఎన్నియో నదులు వచ్చి చేరును. అన్నింటిని తనలో గలుపు కొనును. అట్టి సముద్రరూపుడవై ధైర్యము గల వాని మనసున భయము పుట్టనే పుట్టదు. ఒకవేళ పుట్టినను పైకి దానిని కానరానీయడు. సముద్రము తనలోని వస్తువులను కనిపింపకుండ దాచి యుంచునట్లు ధీరుడు తన మనోభావములను బయట పెట్టకుండును. నీలోని దీనత్వమును పైకి ప్రకటించుట ఉచితము కాదు. దానిని విడువుము. అని మహిషుని అభిప్రాయ మిట వ్యంగ్యము. నీవు దీనతను విడువ లేవులే 'హి హి' అని నవ్వుట 'జహిహి' అని ప్రయోగించుట వలన వ్యంగ్యమగును. 'జహి' శబ్దము చంపుము అని అర్థము కలది. కావున నీ దీనత్వమును చంపుము అని అర్థము చెప్పవలెను. దానికి విడువుము అనే అర్థమే తాత్పర్యముగా గ్రహింపవలెను. చంపబడుట కది ప్రాణికాదు గదా! లేక 'జహీహీ' అని నీచజనోచితముగా పల్కినాడనుట కూడ ఇటు వ్యంగ్యమగును. తృతీయపాదమున ఇంద్రుడు మహిషునిచే సునాసీర అని సంబోధింపబడినాడు. యుద్ధమున నెప్పుడును వెనుకంజవేయక ముందు కేగు సైన్యము గలవాడు అని **సునాసీర** శబ్దము బోధించును. పెక్కు యుద్ధములలో ఇంద్రుని సైన్యము దుమ్ము చూచియే శత్రువులు యుద్ధము మానుకొనినారు. నేనట్టి వాడగాను. దుమ్ము అని దున్నపోతున కేమి భయము లేదని నన్ను దుమ్ము కలత పెట్టలేదని వ్యంగ్యమగును. అయినను పారిపోవుచున్న నీకు ధిక్కారము అని ఇంద్రుని ధిక్కరించుట నాల్గవపాదము పూర్వార్ధమున ఉన్నది. ఈ పాదముయొక్క ఉత్తరార్ధమున ఇట్లు వాగుచుండగనే మహిషుని చంపిన పార్వతి మిమ్ము కాపాడుగాక అను ఆశీస్సు ఉన్నది. **దీనతాం నదీనః , సునాసీర నాసీరధూలిః** అను పద బంధములలో **యమకాలంకార** మున్నది. 'శిరసి శిఖిన్ శార్ఙ్గ' 'జహిహి' జలపతే పార్వతీ పాతు శక్తో నో శత్రుభంగే' ఇత్యాది పదబన్ధములలో వృత్త్యనుప్రాసాలంకారము లున్నవి. *

**అ :** పై శ్లోకమున మహిషకృతదేవతాపరిభవము చెప్పబడినది. ఈ శ్లోకమున **తత్కృతప్రమథ-పరిభవము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ నన్దిన్నానన్దదో మే తవ మురజమృదుస్సమ్ప్రహారే ప్రహారః**
**కిం దన్తే రోమ్ణి రుగ్ణే వ్రజసి గజముఖ! త్వం వశీభూత ఏవ ।**
**నిఘ్నన్నిఘ్నన్నిదానీం ద్యుజనమిహ మహాకాల ఏకోఽస్మి నాన్యః**
**కన్యాఽద్రేర్దైత్యమిత్థం ప్రమథపరిభవే మృద్నతీ త్రాయతాం వః ॥ 51**

**ప్ర :** నన్దిన్! = ఓ నందీ!, తవ = నీయొక్క, సంప్రహారే = యుద్ధమునందు, ప్రహారః = దెబ్బ, మే = నాకు, మురజమృదుః = మద్దెలవలె మృదువైనదై, ఆనందదః = ఆనందమును కలిగించునదైనది, గజముఖ! = ఓ వినాయకా!, రోమ్ణి = రోమమైన, దంతే = దన్తము, రుగ్ణే = రోగయుక్తముకాగా, త్వమ్ = నీవు, వశీభూత ఏవ = లోబడిన వాడవే, ఇహ = ఇచ్చట, ద్యుజనమ్ = స్వర్గజనమును, నిఘ్నన్ నిఘ్నన్ = చంపుచు చంపుచు, ఇదానీమ్ = ఇప్పుడు, ఏకః = ఒక, మహాకాలః = మహాకాలుడను, అస్మి = అగుచున్నాను, అన్యః = ఇతరుడు, న = కాదు, ఇత్థమ్ = ఇట్లు, ప్రమథ పరిభవే = ప్రమథులయొక్క అవమానమునందు, దైత్యమ్ = రాక్షసుని, మృద్నతీ = చంపుచున్న, అద్రేః = పర్వతముయొక్క, కన్యా = కన్య, వః = మిమ్ము, త్రాయతామ్ = కాపాడుగాక!

**తా :** ఓ నన్దీ! యుద్ధమునందు నీ దెబ్బ మద్దెల దెబ్బవలె మృదువై నాకు ఆనందమును కలిగించునదై యున్నది. ఓ గజాననా! నీ దన్తము నాకు రోమమువలె తగిలి విఱిగి పోయినది. స్వర్గవాసులను కూడ చంపి చంపి నేనొకడనే మహాకాలుడ నగుచున్నాను. ఇంకొక మహాకాలుడు లేడు. అని ప్రమథులను పరిభవించు సమయమున మహిషుని మర్దించుచున్న పార్వతి మిమ్ము కాపాడుగాక!

**వి :** శివుని తాండవ సమయమున నంది మద్దెల మ్రోగించును. అది యెఱిగిన మహిషుడు నన్దితో యుద్ధమునందు నీవు నన్ను కొట్టిన దెబ్బ మద్దెలదెబ్బవలె మృదువుగా తగిలి మనోహరధ్వనిని కలిగించునదై నాకు ఆనందమును కలుగజేయుచున్నది. ఏ మాత్రము నొప్పి కలిగించుట లేదు. దీనివలన నీ దెబ్బ పస ఎంతో తెలిసిపోయినదని ప్రథమపాదము వ్యంజించుచున్నది. గజముఖుని దంతము రోమముగా చెప్పబడుటయే గాక అది మహిషునకు తగిలి విఱిగి పోయి రోగగ్రస్తమైనది. నీ అన్ని ఆయుధములు వ్యర్థములై చివఱగా నిరాయుధుడవైన నీవు దంతముతో నన్ను గ్రుచ్చవలసిన వాడవైనావు. అదియు విఱిగి పోవుటచే యుద్ధరంగమునుండి వెడలిపోవు చున్నావు అను మహిషుని అభిప్రాయము ద్వితీయపాదమున వ్యక్తమైనది. స్వర్గములోని వారిని చంపుటకు యముడు యోగ్యుడు కాదు. వారమృతము త్రాగినవారైనందున వారిని యముడు వధింపలేడు. అదిగాక యముడు కూడ దేవతలలో నొకడు గావున తనవారిని తానెట్లు చంపగలడు. దేవతలను కూడ ప్రలయకాలమున చంపుటచే శివునకు **మహాకాల** నామము ప్రసిద్ధమై యున్నది. 'శివుడు మహాకాలనామార్హుడు కాడు, దేవతలను చంపుచు చంపుచు అకాలమున ప్రలయమును సృష్టించు నేనే మహాకాలుడను' అనునది తృతీయపాద వివరణము. **సంప్రహారే ప్రహారః** అనుచోట **యమక** మున్నది. రోమ్ణిరుగ్ణే నందిన్నానందదః, మురజమృదుః, వ్రజసి గజముఖ, ద్యుజన మిహ మహాకాల అను పదబన్ధములలో వృత్త్యనుప్రాసము లున్నవి.

*

**అ :** పై శ్లోకమున నంది వినాయకులు ఆయుధములు పోగొట్టుకొని హస్తదన్తములతో మహిషునితో పోరాడుట చెప్పబడినది. ఈ శ్లోకమున **ఇంద్రాదులు తాము మహిషుని తోడి యుద్ధమున పోగొట్టుకొన్న ఆయుధముల నమ్మవారు వానిని పాదమున త్రొక్కి చంపగా మరల పొందినట్లు** చెప్పబడుచున్నది.

**శ్లో॥ వజ్రమ్మజ్ఞో మరుత్వానరి హరిరురసః శూలమీశశ్శిరస్తో**
**దణ్డం తుణ్డాత్కృతాన్తస్త్వరితగతిగదామస్థితోఽర్థాధినాథః ।**
**ప్రాపన్యత్పాదపిష్టే ద్విషి మహిషవపుష్యఙ్గలగ్నాని భూయో-**
**ఽప్యాయూంషీవాయుధాని ద్యువసతయ ఇతి స్తాదుమా సా శ్రియే వః ॥ 52**

**ప్ర :** మహిషవపుషి = మహిష శరీరముగల, ద్విషి = శత్రువు, యత్పాదపిష్టే = ఎవతె పాదముచే నలిపి వేయబడగా, మరుత్వాన్ = ఇంద్రుడు, మజ్ఞః = మజ్జ నుండి, వజ్రమ్ = వజ్రమును, హరిః = విష్ణువు, ఉరసః = ఱొమ్మునుండి, అరి = చక్రమును, శిరస్తః = శిరమునుండి, ఈశః = శివుడు, శూలమ్ = శూలమును, తుండాత్ = ముట్టెనుండి, కృతాన్తః = యముడు, దండమ్ = దండమును, అస్థితః = ఎముక(ల)నుండి, అర్థాధినాథః = కుబేరుడు, త్వరితగతిగదామ్ = శీఘ్రగమనముగల గదను, అంగలగ్నాని = శరీరమున చిక్కుకొని యున్న, ఆయుధాని = ఆయుధములను, ద్యువసతయః = దేవతలు, ఆయూంషి ఇవ = ఆయువులనువలె, ప్రాపన్ = పొందిరో, సా = ఆ, ఉమా = పార్వతి, వః = మీయొక్క, శ్రియే = సంపదకొఱకు, స్తాత్ = అగుగాక!

**తా :** అమ్మవారు మహిషుని చంపగా దేవతలంతకు ముందు యుద్ధమున వానిపై ప్రయోగించిన ఆయుధముల వాని దేహావయములనుండి అనగా ఇంద్రుడు మజ్జనుండి వజ్రమును, విష్ణువు ఱొమ్మునుండి చక్రమును, శివుడు శిరము నుండి శూలమును, ముట్టెనుండి యముడు దండమును, శీఘ్రగమనము గల గదను కుబేరుడు ఎముకలనుండి తిరిగి పొందినారు. వాని శరీరమునుండి వాని ఆయువులను తీసికొన్నట్లు తమ ఆయుధములను తీసికొన్నారు. వారికి యవకాశమును మహిషుని చంపి ఇచ్చిన అమ్మవారు ఉమాదేవి మీకు సంపదల ప్రసాదించుగాక!

**వి :** మరుత్తులు (సేవకులుగా) గలవాడు **మరుత్వాన్**. ఆ పేరు ఇంద్రునిది. దితి గర్భమున ప్రవేశించి ఆమె గర్భములోని పిండము నేడు ముక్కల చేసి ఒక్కొక్క ముక్కను మరల నేడు భాగములజేసి మొత్తము నలుబది తొమ్మండుగురిని మరుత్తులను పేరుగల దితి ప్రసవించిన వారిని సేవకులుగా ఇంద్రుడు గ్రహించినాడనుట పురాణకథ! దేవతలు ప్రాణుల శరీరముల నుండి తమ అంశములను తిరిగి తీసికొనుటయే స్థూలదేహమునకు మరణము అని చెప్పబడును. ప్రాణులకున్న జ్ఞానకర్మేంద్రియము లన్నియు దేవతాంశములు. **త్వక్కు వాయ్వంశము. చక్షువు సూర్యాంశము, శ్రోత్రము దిగ్దేవతాంశము, జిహ్వ వరుణాంశము, నాసిక భూదేవతాంశము, వాక్కు అగ్న్యంశము, పాణి ఇంద్రాంశము, పాదము విష్ణ్వంశము, పాయువు నిరృత్యంశము, ఉపస్థ ప్రజాపత్యంశము,** చచ్చిపోవుట అనగా **స్థూలదేహమునుండి ఈ జ్ఞానకర్మేంద్రియములు వెడలిపోవుటయే అనగా అవి ఆ స్థూలదేహమున పనిచేయకుండ బయటకు పోవుటయే.** కావున

ఆయువులను (జ్ఞానకర్మేంద్రియములను) వలె దేవతలు ఆయుధముల తిరిగి స్వీకరించినారని శ్లోకమున చెప్పబడినది. ప్రాణములు వాయు దేవతాంశములు. దేవతలు తమ అంశములైన ప్రాణేంద్రియముల స్వీకరించగా ఆయువులు తొలిగి స్థూలదేహము నిర్జీవమగును. ఆయుధములను తీసికొను దేవతలు ఆయువుల తీసుకొనుచున్నారా అను సంభావన మీ శ్లోకమున చెప్పబడుటచే **నుత్ప్రేక్షాలంకార** మేర్పడి యున్నది. అదిగాక దేహమునందు గ్రుచ్చబడిన ఆయుధములు దేహికి పీడ కలిగించుచుండును. దానిని భరించలేక వానిని తొలగించి తన బాధను పోగొట్టుమని ఆయుధమును గ్రుచ్చిన వానిని వేడుకొనును. ఆయుధముల గ్రుచ్చిన వారా యాయుధముల తొలగించుట ఆ ప్రాణిప్రాణములు పోవుట దాదాపు ఒక్కసారే జరుగును. దేవతలు తమ ఆయుధముల తీసికొనగా వాని ఆయువులు (ప్రాణములు) పోయినవి. 'మఙ్క్షో మరుత్వాన్', అరి హరిరురసః' 'శూలమీశః శిరస్తః, దండం తుండాత్, కృతాంతస్త్వరితగతిగదామ్, అస్థితోఽర్థాధినాథః, ప్రాపన్ యత్పాదపిష్టే, ద్విషి మహిషవపుషి, 'భూయోఽప్యాయూంషీవాయుధాని ద్యువసతయః, ఇతి స్తాదుమా సా శ్రియే వః అను పదబన్ధములలో వృత్త్యనుప్రాసనామక శబ్దాలంకారము లున్నవి. *

**అ :** పూర్వశ్లోకమున దేవతలు తమ ఆయుధములను తిరిగి పొందినట్లు చెప్పబడినది. ఈ శ్లోకమున శివునితో పాటు **మహిషునియందు పశుపతిత్వము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ దృష్టావాసక్తదృష్టిః ప్రథమమివ తథా సమ్ముఖీనాభిముఖ్యే**
**స్మేరా హాసప్రగల్భే ప్రియవచసి కృతశ్రోత్రపేయాధికోక్తిః ।**
**ఉద్యుక్తా నర్మకర్మణ్యవతు పశుపతౌ పూర్వవత్పార్వతీ వః**
**కుర్వాణా సర్వమీషద్వినిహితచరణాలక్తకేవ క్షతారిః ॥ 53**

**ప్ర :** పశుపతౌ = పశుపతియందు, పూర్వవత్ = పూర్వమువలె, దృష్టౌ = చూపునందు, ఆసక్తదృష్టిః = ఆసక్తమైన చూపుగలది, ప్రథమమ్ ఇవ = పూర్వమువలె, అభిముఖ్యే = అభిముఖ్యమునందు, సమ్ముఖీనా = సాముఖ్యము గలది, హాసప్రగల్భే = నవ్వుతో చతురమైన, ప్రియవచసి = ప్రియమైన మాటయందు, కృతశ్రోత్రపేయాధికోక్తిః = చేయబడిన మిక్కిలి చెవుల కింపైన ఎక్కువ మాటలు కలది, నర్మకర్మణి = నర్మకర్మయందు, ఉద్యుక్తా = సిద్ధముగా నున్నదియునై, సర్వమ్ = అంతయు, కుర్వాణా = చేయుచున్నదై, ఈషద్వినిహితచరణాలక్తకా ఇవ = కొంచెము ఉంచబడిన కాలిపారాణి గలదానివలె, క్షతారిః = చంపబడిన శత్రువుగల, పార్వతీ = పార్వతి, వః = మిమ్ము, అవతు = కాపాడు గాక!

**తా :** చూచిన చూచుచు, ఎదురగుచో ఎదురగుచు, నవ్వుతో తీయగా మాట్లాడునప్పుడు మరింత తీయగా మాట్లాడుచు, నర్మకర్మయందు సిద్ధముగా నున్నదై అంతయు పూర్వమువలెనే పశుపతి విషయమున నాచరించుచున్న పార్వతి కొంచెము పారాణి పూయబడినదా యన్నట్లు శత్రువును చంపినదై మిమ్ము కాపాడుగాక!

**వి :** స్త్రీపురుషసంయోగమునందును, ఇరువురు శత్రువులసంయోగమునందును కదన లక్షణములు కొన్ని కనిపించును. ఒకరు చూచినప్పుడు మరొకరు మరింత ఆసక్తితో చూచుట, అభిముఖముగా నున్నప్పుడు అభిముఖత నొందుట, చతురవచనములు మాట్లాడినప్పుడు మరింత చతురముగా మాట్లాడుట, నర్మకర్మయందు సిద్ధమై యుండుట అనునవి స్త్రీపురుష మదనకదనమందును, ఇరువురు శత్రువులయొక్క యుద్ధమునందును సమానముగా నుండు లక్షణములు. అమ్మవారికి శివునితో మదనకదనము, మహిషునితో యుద్ధము నున్నవి. ఇరువురును పశుపతి యని చెప్పదగినవారే. పశువులనగా జీవులు. వారందరకు శివుడు పతి. కావున పశుపతి. మహిషుడు పశువులైన దున్నపోతులకు పతి కావున పశుపతి. పశుపతి (శివుని) దృష్టియందు తన చూపును నిలుపుట, ఆతనితో సమానముగా ప్రగల్భములు పలుకుట. నర్మకర్మ యందు సిద్ధముగా నుండుట అమ్మవారికి బాగుగా అభ్యస్తము. మహిషుడును పశుపతియే కావున మహిషుడు చూచినపుడు తీవ్రముగా చూచుట, వాడు ప్రగల్భము లాడినప్పుడు మరింత తీవ్రముగా అధిక్షేపించుట, నర్మకర్మల యందు నర్మస్థలములందు కొట్టుట అను పనులను అమ్మవారు పూర్వమువలెనే చేయుచున్నదని కవి చెప్పినాడు. అమ్మవారు వలదనుచు కాలును వెనుకకు తీసికొని నప్పుడు పారాణి పూయుటకు సిద్ధమై వచ్చిన శివుడు కొంత పారాణి పూయనే పూసినాడు. మహిషుడును అమ్మవారితోడి యుద్ధమున రక్తము చిమ్ముచు కొంత రక్తమును అమ్మవారు పాదమున చిమ్మనే చిమ్మినాడు. అదియు వాడు శివునివలె కొంచెము పారాణి పూసినప్పటి స్థితినే స్మరింపజేయుచున్నది. శత్రువు నెక్కడ కొట్టవలెనో అని పరకాయించి చూచుట **ఆసక్తదృష్టి**, మాటకు మాట చెప్పి శత్రువు మాటను త్రుంచి వేయుట అధికకర్ణపేయోక్తి, శత్రువే కర్మ చేసిన (గ్రుచ్చుట, పొడుచుట, కుమ్ముట, త్రోసివేయుట మొదలగు కర్మలలో నేదో యొక్కటి) చచ్చునో ఆ కర్మ నర్మకర్మము. వాని నమ్మవారు చేయుటకు సిద్ధమై యుండుట ఆవశ్యకములు కావున అమ్మవారి యందా కర్మలు చెప్పబడినవి. అమ్మవారు వాని కామదృష్టిని క్రోధదృష్టితో అణచినది. యుద్ధమునకు వెనుదీయక ఎదురుగా నిలబడుట అను అభిముఖ్యముతో వాని అభిముఖత నెదుర్కొన్నది. వాని పరిహాసవచనమును వానికి మృత్యుహేతు వగునని హెచ్చరించినది. వాని నర్మోక్తికి (చాటువచనమునకు) నర్మగర్భముగా వాని చావును సూచించుచు బదులు పలికినది. **దృష్టావా = చూడ బడినదై, ఆసక్త దృష్టి = తప్పని సరిగా తిరిగి చూచుటలో అసహ్యతను ప్రకటించు చూపు కలది**, అభిముఖ్యే = అభిముఖ్యము నందు, అసమ్ముఖీనా = స్నేహమునకు వైముఖ్యము కలది, ప్రియవచసి = ప్రియమైన వచనము చెప్పబడగా అస్మేరా = చిఱునవ్వు చిందించనది, శ్రోత్రపేయాధికోక్తిః = చెవులచే అవశ్యముగా పేయములైన అనగా వినదగిన హితవచనములు (వాని అనుచితప్రవర్తనకు తగిన శిక్ష లభించుటను చెప్పుట) ఎక్కువగా వచించినది. అనర్మకర్మణి = బహిరంగముగా చంపుట అను కర్మయందు ఉద్యుక్తా = సిద్ధమై యున్నది. ఇట్లు **అర్థాంతరకల్పనమునకు తగినట్లు కవి పదములను కూర్చి యుండుట ప్రశంసనీయము**. పూర్వవత్పార్వతీ కుర్వాణా సర్వమ్, ప్రథమమివ తథా అనుచోట్ల వృత్త్యనుప్రాసాలంకారము లున్నవి. **ప్రథమమివ పూర్వవత్** అనునవి దాదాపు ఏకార్థములే కావున ఒకటి అనావశ్యకమని అంగీకరింపక తప్పదేమో అనిపించును. *

**అ :** పై శ్లోకమున **హాసప్రగల్భప్రియవచనము** ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున జయయొక్క అట్టి వచనము చెప్పబడుచున్నది.

**శ్లో॥ దైత్యో దోర్దర్పశాలీ నహి మహిషవపుః కల్పనీయాభ్యుపాయో**
**వాయో! వారీశ! విష్ణో! వృషగమన! వృషన్కిం విషాదో వృథైవ ।**
**బధ్నీత బ్రధ్నమిశ్రాః కవచమచకితాశ్చిత్రభానో! దహారీ-**
**నేవం దేవాఞ్జయోక్తే జయతి హతరిపోర్హ్రేపితం హైమవత్యాః ॥ 54**

**ప్ర :** మహిషవపుః = దున్నపోతు శరీరము గల, దైత్యః = రాక్షసుడు, దోర్దర్పశాలీ = బాహుగర్వము కలవాడు, కల్పనీయాభ్యుపాయః = కల్పింపదగిన గొప్ప ఉపాయము గలవాడు, నహి = కాదు గదా, వాయో! = ఓ వాయువా, వారీశ! = ఓ వరుణా!, విష్ణో! = ఓ విష్ణూ, వృషగమన! = ఓ శివా, వృషన్! = ఓ ఇన్ద్రా, విషాదః = దుఃఖము, వృథా ఏవ = వ్యర్థమే, బ్రధ్నమిశ్రాః = సూర్యునితో కలిసిన వారై (యూయమ్ = మీరు), అచకితాః = భయములేని వారై, కవచమ్ = కవచమును, బధ్నీత = కట్టుకొనుడు, చిత్రభానో! = ఓ అగ్నీ!, అరీన్ = శత్రువులను, దహ = కాల్చుము, ఏవమ్ = ఇట్లు, దేవాన్ = దేవతల గూర్చి, జయోక్తే = జయచేత చెప్పబడగా, హతరిపోః = చంపబడిన శత్రువుగల, హైమవత్యాః = పార్వతియొక్క, హ్రేపితమ్ = సిగ్గు, జయతి = సర్వోత్కర్షముగా వర్ధిలుచున్నది.

**తా :** ఈ మహిషాసురుడు, బాహుగర్వము గలవాడు, గొప్ప ఉపాయములు చేయదగినవాడు కాదు, ఓ వాయూ, ఓ వరుణా, ఓ విష్ణూ, ఓ శివా, ఓ ఇంద్రా మీరందఱు సూర్యునితో కలిసి కవచములను ధరింపుడు. ఓ అగ్నీ శత్రువును కాల్చుము. ఇట్లు జయ పలుకగా చంపబడిన శత్రువు గల పార్వతి పొందిన సిగ్గు సర్వోత్కర్షముగా వర్ధిలుచున్నది.

**వి :** ఈ మహిషుడు తనకు దోర్బలమున్నదని గర్వించుచున్నాడే కాని వీనికి అన్ని పాదములే కాని భుజములే లేవు. భుజములే లేనప్పుడు భుజబలగర్వమెంత అనుచితమో తెలియదు. వీని కొఱకై ఎట్టి గొప్ప ఉపాయములు కల్పనీయములు కావు. పశువు కదా అనుట ప్రథమపాదవ్యంగ్యము. దైత్యో దోర్దర్ప అనుచోట మూడు దాది పదము లుండుటచే పాదాద్యనుప్రాసమున్నది. రెండవ పాదమున వాయు వరుణ విష్ణు శివేంద్రులు వకారాది పదములతో సంబోధింపబడినందున పదాద్యనుప్రాసము (వృత్త్యనుప్రాసభేదము) ఏర్పడి యున్నది. మీరు విషాదము నొందుట వ్యర్థమే. ఏమి చేయవలెనో తోచనప్పుడు విషాదము కలుగును. ఏదియో చేయవలెనే కాని విషాదము నొందిన లాభమేమి అని ఇందు వ్యంగ్యమగుచున్నది. మూడవ పాదమున పై దేవతలు సూర్యునితో కలిసి కవచములు ధరించుడని జయ చెప్పిన ఉపాయము చెప్పబడినది. కవచముల ధరించినచో వాని కుమ్ములాట వలన మీకేమి బాధ కలుగదనుటచే కవచధారణ ప్రయోజనము వ్యంగ్యమగును. అగ్నికి కవచధారణ మక్కఱలేదు. ఆతడు కవచము ధరించినచో అదియు కాలిపోవును. అట్టి ఓ అగ్నీ నీ పని శత్రువుల కాల్చుటయే, ఆ పని చేయుము. కవచమును నీవు ధరింపనక్కఱలేదు కాని

ఇతరుల కాదర్శముగా మాత్రమే ధరింపవలసి యున్నదను అర్థము. **బధ్నీత బ్రధ్నమిశ్రాః** అనుచో వ్యంగ్యము ఇందలి బాదిపదములచే పదాద్యనుప్రాసమున్నది. నాలుగవపాదమున ఏవమ్ దేవాన్ జయోక్తే జయతి హతరిపోర్త్రేపితం హైమవత్యాః అను పదబన్ధములలో వృత్త్యనుప్రాసము లున్నవి. *

**అ :** పై శ్లోకమున అగ్ని శత్రుదహనమునకై జయచే కోరబడినది. ఈ శ్లోకమున అమ్మవారి మూడు కన్నులనుండి విడువబడిన **అగ్నిచే మహిషుడు మూర్ఛిలుట** చెప్పబడుచున్నది.

**శ్లో॥ ఆ వ్యోమవ్యాపిసీమ్నాం వనమతిగహనం గాహమానో భుజానా-**
**మర్చిర్మోక్షేణ మూర్ఛన్దవదహనరుచాం లోచనానాం త్రయస్య ।**
**యస్యా నిర్మజ్జమజ్జచ్చరణభరనతో గాం విభిద్య ప్రవిష్టః**
**పాతాలం పఙ్కపాతోన్ముఖ ఇవ మహిషః స్తాదుమా సా శ్రియే వః ॥ 55**

**ప్ర :** ఆ వ్యోమవ్యాపిసీమ్నామ్ = ఆకాశమువఱకు వ్యాపించిన హద్దుగల, భుజానామ్ = భుజముల యొక్క, అతిగహనమ్ = మిక్కిలి చొఱరాని, వనమ్ = వనమును, గాహమానః = చొచ్చుచున్నవాడై, దవదహనరుచామ్ = దావాగ్ని కాంతులుగల, లోచనానామ్ = కన్నులయొక్క, త్రయస్య = త్రయము-యొక్క, అర్చిర్మోక్షేణ = అగ్నియొక్క విడువబడుటచే, మూర్ఛన్ = మూర్ఛిలుచు, యస్యాః = ఎవతెయొక్క, నిర్మజ్జమజ్జచ్చరణభరనతః = మజ్జలేని మునుగుపాదముయొక్క బరువుతో వంగిన, మహిషః = మహిషుడు, పంకపాతోన్ముఖ ఇవ = బురదలో పడుటకు సిద్ధమైన వానివలె, గామ్ = భూమిని, విభిద్య = చీల్చుకొని, పాతాలమ్ = పాతాలమును, ప్రవిష్టః = ప్రవేశించినవాడు ఆయెనో, సా = ఆ, ఉమా = పార్వతి, వః = మీయొక్క, శ్రియే = సంపద కొఱకు, స్తాత్ = అగుగాక.

**తా :** అమ్మవారి ఆకాశమే హద్దుగా వ్యాపించిన భుజముల అడవిలోనికి ప్రవేశించిన మహిషుడు, దావాగ్ని కాంతులు గల అమ్మవారి మూడు కన్నులలోనుండి అగ్ని విడువబడుటచేత మూర్ఛిల్లెను. అట్టి మహిషుని అమ్మవారు త్రొక్కగా ఆమె కాలియొక్క బరువుచేత భూమిని చీల్చుకొని బురదలో పడుటకు సిద్ధమైన వానివలె పాతాలమున ప్రవేశించెను. అట్టి మహిషుని త్రొక్కి చంపిన పార్వతి మీకు శ్రేయము నొసగుగాక!

**వి :** అమ్మవారి భుజములే చెట్లుగా ఆ యుద్ధభూమి యందొక అడవి ఏర్పడెను. దానిలో అమ్మవారి మూడుకన్నులు దావాగ్ని కాంతివంటి కాంతి గలవై ఉండెను. ఆ మూడుకన్నులు అగ్నిని చిమ్ము చుండెను. ఆ వేడికి మహిషుడు మూర్ఛిల్లు చుండెను. అమ్మవారి భుజసమూహము అడవిగా భుజములు చెట్లుగా రూపింపబడుటచే **రూపకాలంకార** మేర్పడినది. అట్లే మూడుకన్నులు దావాగ్ని కాంతులు కలిగి యున్నవనుటచే ఆ మూడుకన్నులు దావాగ్నులుగా రూపింపబడి రూపకాలంకార మేర్పడినది. అడవులలో దావాగ్ను లేర్పడుట లోకస్వభావము. మహిషునిపై కోపముచే ఒక్కటే అగ్నినేత్రముగానున్న అమ్మవారి ముఖమునందలి మూడుకన్నులును అగ్నిగోళములై మహిషుని యందు జ్వాలల చిమ్ముటచే ఆ వేడికి తాళలేని మహిషుడు మూర్ఛిల్లు చుండెను. ఇది పూర్వార్ధము

యొక్క వివరణము. అట్టి మహిషుడు బురదలో పడుటకు సిద్ధమైనా డన్నట్లుగా సంభావింపబడుటచే ఉత్తరార్ధమున **ఉత్ప్రేక్షాలంకార** మేర్పడినది. నీటి అడుగున బురద ఉండుట లోకస్వభావము. ఆ బురద పాతాలముగా ఇట చెప్పబడినది. దున్నపోతునకు పంకపాతోన్ముఖత్వము స్వాభావికము. మహిషుడు పాతాలమునంటుట అతిశయోక్తియే. మహిషునిలోని మజ్జయే పాతాలపంకముగా రూపొందినదను వ్యంగ్యము కూడ ఇచట ఉన్నది. ఆ వ్యోమవ్యాపిసీమ్నామ్, వనమతిగహనమ్ గాహమానః, దవదహనరుచామ్, నిర్మజ్జమజ్జచ్చరణభరనతః, పాతాలమ్, పంకపాతోన్ముఖ అను పదబన్ధములతో వృత్త్యనుప్రాసాలంకారము లేర్పడి యున్నవి. *

**అ :** పై శ్లోకమున మహిషునమ్మవారిచే త్రొక్కబడినట్లు చెప్పబడినది. ఈ శ్లోకమున **అమ్మవారు శూలముతో మహిషుని పొడిచినట్లు** చెప్పబడుచున్నది.

**శ్లో॥ నీతే నిర్వ్యాజదీర్ఘామఘవతి మఘవద్వ్రజలజ్జానిదానే**
**నిద్రాం ద్రాగేవ దేవద్విషి ముషితరుషః సంస్మరన్త్యాః స్వభావమ్ ।**
**దేవ్యా దృగ్భ్యస్తిసృభ్యస్త్రయ ఇవ గలితా రాశయో రక్తతాయా-**
**స్త్రాయన్తాం వస్త్రిశూలక్షతకుహరభువో లోహితామ్భస్సముద్రాః ॥ 56**

**ప్ర :** అఘవతి = పాపియైన, మఘవద్వ్రజలజ్జానిదానే = ఇంద్రుని వజ్రముయొక్క సిగ్గునకు మూలకారణమైన, దేవద్విషి = రాక్షసుడు, ద్రాక్ ఏవ = శీఘ్రముగానే, నిర్వ్యాజదీర్ఘనిద్రామ్ = మరణమును, నీతే = పొందింపబడగా, ముషితరుషః = దొంగిలించిన కోపముగల, స్వభావమ్ = స్వభావమును, సంస్మరన్త్యాః = స్మరించుచున్న, దేవ్యాః = అమ్మవారియొక్క, త్రిశూలక్షతకుహరభువః = త్రిశూలము యొక్క గాయపు గుహలనుండి పుట్టిన, తిసృభ్యః = మూడు, దృగ్భ్యః = కన్నులనుండి, గలితా = జారి పడిన, రక్తతాయాః = ఎఱుపుయొక్క, రాశయః ఇవ = రాశులవలె, లోహితామ్భస్సముద్రాః = రక్తజలసముద్రములు, వః = మిమ్ము, త్రాయన్తామ్ = కాపాడుగాక!

**తా :** ఇంద్రుని వజ్రపుదెబ్బ మహిషు నేమి చేయజాలకపోవుటచే వజ్రమునకు సిగ్గును కలిగించిన మహిషు నమ్మవారు త్రిశూలముచే పొడవగా వాడు చచ్చెను. అప్పు డమ్మవారి కోపమే కన్నుల నుండి బయటకు వచ్చిన రక్తపురాశులుగా ఏర్పడిన రక్తజలసముద్రములు మిమ్ము కాపాడుగాక!

**వి :** మహిషునిపై ఇంద్రుని వజ్రాయుధము నిష్ఫలమగుటయే దాని సిగ్గునకు కారణముగా సంభావింపబడుటచే ప్రథమపాదమున **ఉత్ప్రేక్షాలంకార** మేర్పడి యున్నది. అమ్మవారి మూడు కన్నులనుండి బయటకు వచ్చి ఎఱుపుకాంతి రాశులుగా త్రిశూలముచే మహిషుని శరీరముపై ఏర్పడిన మూడు గాయములు మూడు రక్తజలసముద్రములుగా నున్న వనుటచే ఉత్తరార్ధమున **అతిశయోక్త్యలంకార** మేర్పడి యున్నది. అమ్మవారికి కోపము కలిగినందుకు గుర్తు ఆమె కన్నులలో ఎఱుపు కాంతి యుండుట అమ్మవారి కోపము మహిషుడు చచ్చిన వెంటనే తొలగిపోయెను. ఆమె కన్నులనుండి బయల్వెడలిన ఎఱుపుకాంతి రాశులో యనునట్లుగా అమ్మవారి త్రిశూలపు మూడు

గాయముల నుండి మూడు రక్తసముద్రములున్నవని సంభావింపబడుటచే **నుత్ప్రేక్షాలంకారము** కూడ నేర్పడి యున్నది. మఘవతి మఘవత్ అనుచోట యమకాలంకార మున్నది. ద్రాగేవ దేవ 'ద్విషి ముషితరుషః' 'దేవ్యా దృగ్భ్యస్తిసృభ్యః' అనుచోట్ల **వృత్త్యనుప్రాసాలంకారము** లేర్పడి యున్నవి. అమ్మవారి కోపము తొలగినను ఆమె కన్నులలోని ఎఱుపు పోలేదు. కోపము తొలగిన ఎఱుపు పోవలె గదా నిజమేకాని ఇప్పుడు కన్నులలోని ఎఱుపు స్వాభావికమైనదే, లేదా ఇంతకు ముందు కలిగిన కోపము సంస్మరించుటచే కన్నులలో తిరిగి ఎఱుపుకాంతి కలిగెననియు వ్యంగ్యమగు నంశము.

*

**అ :** పై శ్లోకమున నమ్మవారి కన్నులలో ఎఱుపు వర్ణింపబడినది. ఈ శ్లోకమున **అమ్మవారి యందు నలుపు ఎఱుపు తెలుపు వన్నెలు** చెప్పబడుచున్నవి.

**శ్లో॥ కాలీ కల్పాన్తకాలాకులమివ సకలం లోకమాలోక్య పూర్వం**
**పశ్చాత్ శ్లిష్టే విషాణే విదితదితిసుతా లోహితా మత్సరేణ ।**
**పాదోత్పిష్టే పరాసౌ నిపతతి మహిషే ప్రాక్స్వభావేవ గౌరీ**
**గౌరీ వః పాతు పత్యుః ప్రతినయనమివావిష్కృతాన్యోన్యరూపా ॥ 57**

**ప్ర :** కల్పాంతకాలాకులమ్ ఇవ = ప్రలయకాలముచే (లేక అప్పటి యమునిచే) వ్యాకులమై యున్నట్లున్న, సకలమ్ = సర్వమైన, లోకమ్ = లోకమును, పూర్వమ్, ఆలోక్య = చూచి , కాలీ = నల్లనిదై, పశ్చాత్ = పిమ్మట, విషాణే = కొమ్ము, శ్లిష్టే = తొలగినది కాగా, విదితదితిసుతా = తెలిసిన రాక్షసుడు గలదై, మత్సరేణ = కోపముచే, లోహితా = ఎఱ్ఱనైనదై, పాదోత్పిష్టే = కాలిచే త్రొక్కబడిన, మహిషే = మహిషుడు, పరాసౌ = వేఱైన ప్రాణములు గలవాడై, నిపతతి = పడిపోగా, ప్రాక్స్వభావా ఇవ = పూర్వస్వభావము గల దానివలె, గౌరీ = తెల్లనైనదై, పత్యుః = భర్తయొక్క, ప్రతినయనమ్ ఇవ = ప్రతికన్నువలె, ఆవిష్కృతాన్యోన్యరూపా = ఆవిష్కరింపబడిన పరస్పర రూపములుగల, గౌరీ = పార్వతి, వః = మిమ్ము, పాతు = రక్షించుగాక!

**తా :** మహిషుడు లోకమును ప్రలయయమకల్పముగా చేయగా అమ్మవారు కాలి (నల్లనిది) అయ్యెను. కాని కొమ్ము తగిలి అది శత్రువుదని తెలిసికొని అసూయచే లోహిత (ఎఱ్ఱనిది) ఆయెను. వానిని కాలితో త్రొక్కి వాడు చనిపోగా పూర్వస్వభావము నొందినట్లు గౌరి (తెల్లనిది) అయ్యెను. ఇట్లు భర్తయొక్క మూడుకన్నుల మూడురంగుల నావిష్కరించిన పార్వతి మిమ్ము కాపాడుగాక!

**వి :** మహిషుడు లోకమునెంత చీకాకు పఱచినాడనగా ప్రలయకాలమే వచ్చిపడిన దేమో అన్నంతగా చీకాకు పఱచినాడు. అది చూచి ప్రలయకాలమని అమ్మవారు కాలి యయ్యెననుటచే ప్రథమపాదమున అమ్మవారి భ్రాంతి వ్యంగ్యమగుటచే **భ్రాంతిమదలంకారధ్వని** యేర్పడి యున్నది. అమ్మవారి పాదమునకు మహిషుని కొమ్ము తగులగా అది రాక్షసునిదని గుర్తించిన అమ్మవారు వానిపై కలిగిన కోపముచే **లోహిత** అనగా ఎఱ్ఱనిదైనది. ఇది ద్వితీయపాదవివరణము. మూడవ

పాదమున మహిషుడు చచ్చిన పిదప అమ్మవారి కోపము పోగా దానివలన కలిగిన ఎఱుపును పోయి స్వాభావికమైన తొలుతటి తెలుపు ఆమెకు ఏర్పడినది. హిమవంతుడు తెల్లని వాడు కావున ఆయన కూతురు మొదట తెల్లనిదిగానే ఉండెను. ఇది మూడవపాదముయొక్క వివరణము. శివుని కున్నవి మూడుకన్నులు కాలస్వరూపములు. ఒక కన్ను పగలు ఆ కన్ను **తెల్లనిది**. మరొక కన్ను రాత్రి అది **నల్లనిది**. నొసటి కన్ను **ఎఱ్ఱనిది** అది సన్ధ్య. తెల్లని కన్ను సూర్యరూపము. చంద్రుడు తన కాంతిలేక సూర్యుని కాంతిచే వెలుగు వాడు కావున ఆతడు స్వాభావికముగ చీకటి వలె నల్లనివాడు. నొసటి కన్ను అగ్నిరూపము. సన్ధ్యా కాలములలో అగ్ని ఆరాధింపబడుచుండుటచే ఆ ప్రాతస్సాయంసన్ధ్యా కాలముల కాంతి ఎఱ్ఱగా నుండుటచే అగ్నినేత్ర మెఱ్ఱనిదని చెప్పబడినది. ప్రకృతిస్వరూపిణి యైన అమ్మవారు లోహిత. శుక్ల కృష్ణ అజామేకాం **లోహితశుక్లకృష్ణామ్** అని ఉపనిషత్తున చెప్పబడినది. రజోగుణమును అమ్మవారు సృష్టించును. రజోగుణ మెఱుపు లోహిత రంగుగా చెప్పబడును. శివుడా రజోగుణాధిక్యతమైన సృష్టికాలికమైన ప్రకృతియందు ప్రతిబింబించి **ఎఱ్ఱని వాడగును**. స్థితికాలమున సత్త్వగుణాధిక్యము కలదగుటచే తత్కాలప్రకృతియందు ప్రతిబింబించి **తెల్లని (శుక్ల) వాడగును**. అట్లే ప్రలయకాలమున తమస్సుయొక్క ఆధిక్యముచే తత్కాలప్రకృతి నల్లనిది. దానిలో ప్రతిబింబించి **నల్లని (కృష్ణ) వాడగును**. ప్రకృతిసంబంధముచే శివుని యందీ మూడు రంగు లేర్పడును. ఆ రంగులు తనవైనను శివునివని భ్రమింపజేయుట అమ్మవారి స్వభావము. లేక శివుడు తెల్లని కన్నుచే చూడగా ప్రకృతి తెల్లగా కనబడును. నల్లని కన్నుచే చూడగా నల్లగా కనబడును. ఎఱ్ఱని కన్నుచే చూడగా ఎఱ్ఱగా కనబడును. అమ్మవారు కూడ అట్టి మూడు కన్నులు కలదే యగుటచే అమ్మవారి మూడు రంగుల కన్నులకు శివుడు మూడు రంగులుగా కనబడిన వాడని చెప్పవచ్చును. శివుని నల్లని కంటికి కాలిగా, ఎఱ్ఱని కంటికి లోహితగా, తెల్లని కంటికి తెల్లగా కనబడినట్లీ శ్లోకమున చెప్పబడినది. కాలియొక్క రంగు శివుని ముఖమున బడి శివుని కంటియొక్క నలుపు రూపు నావిష్కరించెను. లోహితయొక్క రంగు శివుని కంటి ఎఱుపు నావిష్కరించెను. అట్లే శివుని ఒక కంటిలోని నలుపు అమ్మవారి **కాళీత్వమును**, శివుని మరొక కంటిలోని ఎఱుపు అమ్మవారి **లోహితాత్వమును**, శివుని మరొక కంటిలోని తెలుపు అమ్మవారి **గౌరీత్వమును** ఆవిష్కరించెను. ఇట్లు అన్యోన్యరూపావిష్కారహేతువులైనారా దంపతులు. కాళీ కల్పాంతకాలాకులమపి సకలమ్ 'లోకమాలోక్య' విదితదితిసుతా లోహితా' 'పాదోత్క్షిప్తే పరాసౌ నిపతతి' అనుచోట్ల **వృత్త్యనుప్రాసాలంకారము** లున్నవి. **గౌరీ గౌరీ** అను యమకము తృతీయచతుర్థ–పాదాంతాదులలో నున్నది.

*

**అ :** పై శ్లోకమున శివుని త్రినేత్రము లనదగిన సూర్యచంద్రాగ్నులు అమ్మవారి శరీర కాలి లోహిత గౌర వర్ణరూపమున ప్రస్తావింపబడినారు. ఈ శ్లోకమున ఆ **సూర్యచంద్రాగ్నుల అగమ్యత మహిషుని యందు** చెప్పబడుచున్నది.

**శ్లో॥ గమ్యం నాగ్నేర్న చేన్దోస్సపది దినకృతాం ద్వాదశానామసహ్యం**
**శక్రస్యాక్ష్ణాం సహస్రం సహ సురసదసా సాదయన్తం ప్రసహ్య ।**

**ఉత్పాతోగ్రాన్ధకారాగమమివ మహిషం నిఘ్నతీ శర్మ దిశ్యా-**
**ద్దేవీ వో వామపాదామ్బురుహనఖమయైః పఞ్చభిశ్చన్ద్రమోభిః ॥ 58**

**ప్ర :** అగ్నేః = అగ్నికి, న గమ్యమ్ = గమ్యముకాని, ఇన్దోః = చన్ద్రునకు, న (గమ్యమ్) = గమ్యముకాని, ద్వాదశానామ్ = పన్నెండుగురు, దినకృతామ్ = సూర్యులకు, న (గమ్యమ్) = గమ్యముకాని, అసహ్యమ్ = సహించరాని, శక్రస్య = ఇన్ద్రునియొక్క, అక్ష్ణామ్ = కన్నులయొక్క, సహస్రమ్ = వేయిని, సురసదసా సహ = స్వర్గముతో కూడిన దానిని, ప్రసహ్య = బలవంతముగా, సాదయన్తమ్ = నశింపజేయుచున్న, ఉత్పాతోగ్రాన్ధకారాగమమ్ ఇవ = ఉత్పాతమునకు సంబంధించిన ఉగ్రాన్ధకారముయొక్క రాకయో యన్నట్లున్న, మహిషమ్ = మహిషుని, వామపాదామ్బురుహ-నఖమయైః = ఎడమపాదపద్మముయొక్క గోళ్ళు అనబడు, పంచభిః = అయిదు, చంద్రమోభిః = చన్ద్రులచేత, నిఘ్నతీ = చంపుచున్న, దేవీ = దేవి, వః = మీకు, శర్మ = సుఖమును, దిశ్యాత్ = ఇచ్చుగాక!

**తా :** చంద్రాగ్నులకు ద్వాదశాదిత్యులకును అగమ్యము అసహ్యమునైన ఇంద్రుని వేయికండ్లను ఆతని దేవతా సదస్సుతో పాటు బలాత్కారముగా క్షీణింపజేయుచున్న ఉత్పాతమునకు సంబంధించిన గొప్ప చీకటి రాకయో యన్నట్లున్న మహిషుని తన ఎడమపాదపద్మమునందలి వ్రేళ్ళ గోళ్ళనెడి అయిదు చంద్రులచేత నశింపజేయుచున్న దేవి మీకు సుఖము నొసగు గాక!

**వి :** మహిషుడు అజ్ఞానాన్ధకారస్వరూపుడు. ఈ బ్రహ్మాండమున వెలుగున కన్న చీకటియే అధికము. చంద్రుడు అగ్ని ద్వాదశాదిత్యులు ఆకసమందలి ఇంద్రుని కన్నులో యనదగిన కోట్ల కొలది నక్షత్రములు ఈ లోకములోని చీకటితో పోరాడుచు కొంతవఱకు అనగా తామున్న పరిసరములోని చీకట్లను నశింపజేయుచున్నవి. కాని అజ్ఞానాన్ధకారము కడకీ అగ్ని కాని చన్ద్రుడు కాని ద్వాదశాదిత్యులు కాని నక్షత్రములు కాని చేరనేలేవు. ఇక నశింపజేయుట ఏటి మాట. అజ్ఞానాన్ధకారము హృదయగుహలో నుండును. గుహలోని చీకటినే ఈ ఆకాశమందలి ప్రచండ-భానువు నశింపజేయలేకపోవుచున్నాడు. అగ్నికాని చన్ద్రుడు కాని చుక్కలు గాని నశింపజేయలేక పోవుచున్నవి. పైగా అన్ధకారమే ఇన్ద్రుని కన్నులను సురసదస్సుతో సహ నశింపజేయు చున్నది. అట్టి అజ్ఞానాన్ధకారమునకు ప్రతీకముగా మహిషుని భావింపవలసి యున్నది. వెనుక చెప్పబడిన విధముగా చీకటితో పోరాడుచు కొంత కొంత చీకటిని నశింపజేయుచున్నట్లున్న నక్షత్రములు వెలిగి వెలిగి శక్తి హరించిపోగా చీకటిగా మారి పోనున్నవి. అప్పుడీ బ్రహ్మాండ మంతయు చీకటియే. ఆ చీకటి పెంజీకటి అని ఆన్ధ్రమహాభాగవతమున పోతనామాత్యుడు చెప్పినాడు. దాని కావలనున్న వెలుగు అమ్మవారి పాదాంబుజమందలి వ్రేళ్ళగోళ్ళనెడు అయిదు చంద్రులనుండి వచ్చునట్టిది. చీకటి అజ్ఞానమునకు, చంద్రుడు జ్ఞానమునకు ప్రతీకలు. ఆ గోళ్ళు చన్ద్రులుగా రూపింపబడుటచే నాలుగవ పాదమున **రూపకాలంకార** మున్నది. అంబురుహ విరోధులైన అయిదుగురు చన్ద్రులు ఆ పాదమున గోళ్ళ రూపమున ఉండుట **విరోధాభాసము**. అంబురుహమున చంద్రులుండుట

విరోధము. అమ్మవారి మహిమచే విరోధులు కలిసి యుండవచ్చును. కావున ఆ విరోధము పరిహరింపబడును. **స్వర్గోలోకోజ్యోతిషావృతః** అను వేదవచనము ననుసరించి యిచట సురసదస్సు జ్యోతిరావృతమైనది. కాని మహిషాన్ధకారము అగ్నీన్దుద్వాదశాదిత్యులకు సహింపరానిదై ఇన్ద్రుని సహస్రనేత్రములను సురసదస్సుతో సహ నశింపజేయ గలిగి యున్నది. అంతటి అన్ధకారము కన్న మించిన అన్ధకారము అజ్ఞానము. దానిని నశింపజేయు జ్ఞానము (ప్రకాశము) అమ్మవారే అయియున్నది అనుట ఈ శ్లోకము ముఖ్యముగా ప్రతిపాదించు నంశము. 'సహస్రం సహ సురసదసా సాదయన్తమ్ ప్రసహ్య' అనుచోట **వృత్త్యనుప్రాసాలంకార** మున్నది. *

**అ :** పై శ్లోకమున అమ్మవారి పాదము పద్మమని చెప్పబడినది. ఈ శ్లోకమున **పద్మమున కేసరములు తుమ్మెదలు నుండుట చెప్పబడుచున్నది.**

**శ్లో॥ దత్వా స్థూలాన్త్రమాలావలివిఘసహసద్ఘస్మరప్రేతకాన్తం**
**కాత్యాయన్యాఽఽత్మనైవ త్రిదశరిపుమహాదైత్యదేహోపహారమ్ ।**
**విశ్రాన్త్యై పాతు యుష్మాన్క్షణముపరి ధృతం కేసరిస్కన్ధభిత్తే-**
**ర్బిభ్రత్తత్కేసరాలీమలిముఖరరణన్నూపురం పాదపద్మమ్ ॥** **59**

**ప్ర :** స్థూలాంత్రమాలావలివిఘసహసద్ఘస్మరప్రేతకాంతమ్ = లావైన ప్రేగుల మాలల గుంపు అను ఆహారమున నవ్వుచున్న క్రూరప్రేతములకు మనోహరమైన, త్రిదశరిపుమహాదైత్యదేహోపహారమ్ = దేవతలకు శత్రువైన మహాదైత్యుని దేహము అను బలిని, దత్వా = ఇచ్చి, కాత్యాయన్యా = కాత్యాయనిచే, ఆత్మనా+ఏవ = స్వయముగనే, క్షణమ్ = క్షణకాలము, విశ్రాన్త్యై = విశ్రాంతికొఱకు, కేసరిస్కన్ధభిత్తేః = సింహముయొక్క మూపు అనుగోడయొక్క, ఉపరి = పైన, తత్కేసరాలీమ్ = దాని జూలును (కేసరములుగా), బిభ్రత్ = మోయుచున్న, అలిముఖర-రణన్నూపురమ్ = తుమ్మెదవలె మ్రోయు (ధ్వనించు) అందెగల, పాదపద్మమ్ = పాదము అను పద్మము, యుష్మాన్ = మిమ్ము, పాతు = రక్షించు గాక.

**తా :** లావైన ప్రేగుల పోగులు తినదగినవిగా ఉన్నవని నవ్వుచున్న క్రూరప్రేతములకు మనోహరమైన మహిషరాక్షసుని దేహమును బలిగా కాత్యాయని స్వయముగా ఇచ్చి విశ్రాంతి కొఱకు సింహము యొక్క మూపు అనుగోడపై పెట్టియున్న సింహము జూలు కేసరములుగా, అందెమ్రోత తుమ్మెద మ్రోతగా నున్న అమ్మవారి పాదమను పద్మము మిమ్ము కాపాడుగాక!

**వి :** అమ్మవారు త్రొక్కుటచేత మహిషశరీరమునందలి మాంస మంతయు బయటకు పోగా ప్రేగులు మిగిలిన మహిషదేహమును బలి యీయగా ప్రేతము లిట్టి బలి నిదివఱకెవరు నీయలేదని నవ్వినవి. ఇది మొదటిపాదముయొక్క వివరణము. ఉత్తరార్ధమున అమ్మవారు తన పాదమును సింహపు మూపుపై పెట్టినది. సింహపు జూలు పాదముయొక్క గోళ్ళ సందులలో నుండి పైకి సాగి కనబడుటచే అవి పద్మకేసరములు గలవైనవి. నూపురము మ్రోతగల ఆ పాదము తుమ్మెద మ్రోతగలదైనది.

ఇట్లు పద్మలక్షణములు పాదమునందు ఏర్పడి యుండుటచే అమ్మవారి పాదము పద్మముగా రూపింపబడుటయొక్క సామంజస్యము సమర్థింపబడినది. కావున **రూపకాలంకార**మిట సావయవమైనది. అలిముఖరరణన్నూపురమ్ అనుచోట వృత్త్యనుప్రాసాలంకార మున్నది. *

**అ :** పై శ్లోకమున ప్రేతముల నవ్వునకు కారణమైన మహిషదేహాపహారము చెప్పబడినది. ఈ శ్లోకమున **అమ్మవారు మహిషుని చంపినట్లు** చెప్పబడుచున్నది.

**శ్లో॥ కోపేనేవారుణత్వం దధదధికతరాలక్ష్యలాక్షారసశ్రీః**
**శ్లిష్యచ్ఛృఙ్గాగ్రకోణక్వణితమణితులాకోటిహుఙ్కారగర్భః ।**
**ప్రత్యాసన్నాత్మమృత్యు ప్రతిభయమసురైర్వీక్షితో హన్త్వరీన్వః**
**పాదో దేవ్యాః కృతాన్తోఽపర ఇవ మహిషస్యోపరిష్టాన్నివిష్టః ॥ 60**

**ప్ర :** కోపేన ఇవ = కోపముతో వలె, అరుణత్వమ్ = ఎఱుపును, దధత్ = ధరించుచున్న, అధికతరాలక్ష్యలాక్షారసశ్రీః = ఎక్కువగా, బాగుగా చూడదగిన లాక్షారసశోభకలిగిన, శ్లిష్యత్ శృంగాగ్రకోణక్వణితమణితులాకోటిహుంకారగర్భః = తగులుకొనుచున్న కొమ్ముయొక్క చివరకొనచే ధ్వనించిన అందెయొక్క హుంకారములోనగల, ప్రత్యాసన్నాత్మమృత్యుప్రతిభయమ్ = సమీపించిన తమ మృత్యువునుండి యెదురైన భయము గలుగునట్లుగా, అసురైః = రాక్షసులచే, వీక్షితః = చూడబడిన, అపరః = మరొక, కృతాంత ఇవ = యముడో అన్నట్లున్న, మహిషస్య = మహిషుని యొక్క, ఉపరిష్టాత్ = పైన, నివిష్టః = కూర్చొని యున్న, దేవ్యాః = అమ్మవారియొక్క, పాదః = పాదము, వః = మీ యొక్క, అరీన్ = శత్రువులను, హన్తు = చంపుగాక!

**తా ॥** కోపమున ఎఱ్ఱదనమును ధరించినట్లున్న బాగుగా లత్తుక శోభ కనబడునట్టి తగులుకొన్న కొమ్ముయొక్క చివర కొనతో మ్రోగించబడిన అందె ధ్వని హుంకారముగా గల మృత్యువు సమీపించినదేమో అను భయముతో రాక్షసులచే చూడబడిన, మహిషునిపైన కూర్చొనియున్న అమ్మవారి పాదము మీ శత్రువుల చంపుగాక!

**వి :** అమ్మవారి పాదమునందు లత్తుక పూయబడి యున్నది. కోపముతో ఎఱుపెక్కినదా యన్నట్లున్నదిగా లత్తుక ఎఱుపు సంభావింపబడినది. మహిషుని కొమ్ముకొన అమ్మవారి గజ్జెల అందెకు తగిలి ఘల్లుమను ధ్వని వచ్చినది. అది హుంకారముగా సంభావింపబడినది. ఆ అమ్మవారి పాదము సమీపింపగా రాక్షసులు తమను మృత్యువుగా చూచుచున్నారు. ఆ పాదము మరొక యముడుగా భావింపబడుటచే **ఉత్ప్రేక్షాలంకార** మీ శ్లోకమున ఏర్పడి యున్నది. కోపమున ఎఱ్ఱబడుట హుంకరించుట (ఎదుటి వారికి మృత్యుభయము కలిగించుట మహిషముపై కూర్చొనుట) అను **యమలక్షణములు**, లత్తుక పూయబడుట, మహిషుని కొమ్ముకొన తగిలి అందె మ్రోగుట అను **పాదలక్షణములు** బింబప్రతిబింబభావము కలిగిన ధర్మములు చూచువారికి మృత్యుభయము కలిగించుట ఉభయసాధారణలక్షణము. ఈ సామ్యలక్షణములు అమ్మవారి పాదమునందు **అపరయమ** సంభావనకు తోడ్పడుచున్నవి. 'దధదధిక' 'లక్ష్యలాక్షా' 'శ్లిష్యత్ శృంగాగ్ర' 'కోణక్వణితమణి' '**ప్రత్యాసన్నాత్మమృత్యుప్రతిభయమ్**' 'ఉపరిష్టాన్నివిష్టః' పదబన్ధములలో వృత్త్యనుప్రాసము లున్నవి. *

**అ :** పై శ్లోకమున అమ్మవారు మహిషుని త్రొక్కి చంపినట్లు వ్యంజింపబడినది. ఈ శ్లోకమున **అమ్మవారు మహిషుని త్రిశూలముచే పొడిచి చంపినట్లు** చెప్పబడుచున్నది.

**శ్లో॥ శత్రౌ శాతత్రిశూలక్షతవపుషి రుషా ప్రేషితే ప్రేతకాష్ఠాం**
**కాలీ కీలాలకుల్యాత్రయమధికరయం వీక్ష్య విశ్వాసితద్యోః ।**
**త్రిస్రోతాస్త్ర్యమ్బకేయం వహతి తవ భృశం పశ్య రక్తావిశేషా-**
**న్నో మూర్ధ్నా ధార్యతే కిం హసితపతిరితి ప్రీతయే కల్పతాం వః ॥ 61**

**ప్ర :** రుషా = కోపముతో, శాతత్రిశూలక్షతవపుషి = వాడి త్రిశూలముచే పొడువబడిన శరీరముగల, శత్రౌ = శత్రువు, ప్రేతకాష్ఠామ్ = చచ్చి చలించని స్థితిని గూర్చి, ప్రేషితే = పంపించబడగా, విశ్వాసితద్యోః = విశ్వసింపజేయబడిన స్వర్గముకల, కాలీ = కాలి, అధికరయమ్ = మిక్కిలి వేగముగల, కీలాలకుల్యాత్రయమ్ = రక్తపు మూడు కాలువలను, వీక్ష్య = చూచి, త్ర్యమ్బక! = ఓ శివా!, ఇయమ్ = ఇది, రక్తావిశేషా! = రక్తమయమైన, త్రిస్రోతాః = గంగ, మూర్ధ్నా = శిరమున, కిమ్ = ఎందుకు, నో ధార్యతే = ధరింపబడదు?, ఇతి = అని, హసితపతిః = పతిని పరిహసించునదై, వః = మీయొక్క, ప్రీతయే = సంతోషముకొఱకు, కల్పతామ్ = కల్పించుగాక!

**తా :** కోపముతో త్రిశూలమును గ్రుచ్చగా మహిషుని శరీరమునుండి పెల్లుబికి వచ్చు రక్తపు మూడు కాలువలను చూచి ఓ శివా! ఈ ఎఱ్ఱని గంగని శిరముపై నేల ధరింపవు అని భర్తను పరిహసించిన పార్వతి మీకు సంతోషమును గలిగించుగాక!

**వి :** శివుడు కైలాసమున నుండును, కైలాసము స్వర్గమున కెంతో పైన నున్నది. శివుని శిరము నుండి ప్రవహించు గంగ స్వర్గప్రాంతము మీదుగా ప్రవహించుచున్నప్పుడు **స్వర్గంగ** (ఆకాశగంగ) అని పిలువబడును. **మన్దాకిని** అనియు పిలువబడును. భూమిపై ప్రవహించునపుడు గంగ **జాహ్నవి** అని పిలువబడును. పాతాళమున కేగి **పాతాళగంగ** అని పిలువబడును. ఇట్లు మూడు లోకములలో ప్రవహించు ప్రవాహములుగల ఈ నది అన్ని లోకములందును త్రిస్రోత, త్రిస్రోతస, త్రిపథగ అని పిలువబడును. అమ్మవారు మహిషుని త్రిశూలమున బొడువగా వాని శరీరమున మూడు ఛిద్రము లేర్పడి, మూడు ఛిద్రములనుండి మూడు రక్తప్రవాహము లేర్పడినవి. వానిలో నొకటి పైన, ఒకటి నడుమ, మరొకటి క్రింద ప్రవహించుటచే మహిషుని మూడు రక్తపుటేర్లు కలిసి త్రిస్రోత అని చెప్పబడుట కవకాశమేర్పడినదని ఎఱ్ఱగా నున్నంత మాత్రమున 'ఇది గంగ కాదా, నీ వెందుకు త్రిస్రోతను శిరమున ధరింపకున్నావు?' అని శివుని పరిహసించిన దమ్మవారు. రక్తపు గంగగా మహిషరక్తము సంభావింపబడుటచే నీ శ్లోకమున **గమ్యోత్ప్రేక్షాలంకార**మేర్పడి యున్నది. 'కీలాల కుల్యాత్రయమధికరయమ్' అనుచోట పదాంతయమక మున్నది. శత్రౌ శాతత్రిశూలక్షతవపుషి రుషా ప్రేషితే వీక్ష్య విశ్వాసితద్యోః' 'త్రిస్రోతాస్త్ర్యంబక' 'హసితపతిరితి ప్రీతయే' అనుచోట్ల **వృత్త్యనుప్రాసాలంకారము** లున్నవి.

*

**అ :** పై శ్లోకమున అమ్మవారు శివుని పరిహసించుట చెప్పబడినది. ఈ శ్లోకమున **మహిషుడు శివుని పరిహసించుట** చెప్పబడుచున్నది.

**శ్లో॥ శృఙ్గే పశ్యోర్ధ్వదృష్ట్యాఽ ధికతరమతనుస్సన్నపుష్పాయుధోఽస్మి
వ్యాలాసఙ్గేఽపి నిత్యం న భవతి భవతో భీర్న యజ్ఞోఽస్మి యేన।
త్వమ్ముఞ్చోచ్చైః పినాకిన్పునరపి విశిఖం దానవానాం పురోఽహం
పాయాత్సోత్ప్రాసమేవం హసితహరముమా మృద్నతీ దానవం వః॥ 62**

**ప్ర :** ఊర్ధ్వదృష్ట్యా = పై చూపుతో, శృఙ్గే = కొమ్ములను, పశ్య = చూడుము, అతనుః = మన్మథుడును (లావుగా ఉన్నవాడను), సన్ = అగుచు, అపుష్పాయుధః = పుష్పాయుధములులేని వాడను, అస్మి = అగుచున్నాను, నిత్యమ్ = ఎల్లప్పుడు, వ్యాలాసఙ్గే అపి = పాములతో సంబంధమున్నను, భవతః = నీ నుండి, భీః = భయము, న భవతి = కలుగదు, యేన = ఏ కారణముచేత, యజ్ఞః = యజ్ఞము, న = కానో, (ఆ కారణమున), పినాకిన్ = ఓ పినాకీ!, పునః అపి = మరలను, ఉచ్చైః = పైకి, విశిఖమ్ = బాణమును, ముఞ్చ = విడువుము, దానవానామ్ = రాక్షసులకు, పురః = (పట్టణములు), ముందు, అహమ్ = నేను, అస్మి = ఉన్నాను, ఏవమ్ = ఇట్లు, సోత్ప్రాసమ్ = ఎకసెక్కెముగా, హసితహరమ్ = హరునపహసించిన, దానవమ్ = రాక్షసుని, మృద్నతీ = మర్దించుచున్న, ఉమా = పార్వతి, వః = మిమ్ము, పాయాత్ = రక్షించుగాక!

**తా :** ఓ పినాకీ! పై చూపుతో, నా కొమ్ములను చూడుము. నేను అతనుడనే (లావుగా ఉన్నాడనే మన్మథుడనే) కాని పుష్పాయుధుడను కాను, ఎల్లప్పుడు పాములతో సంబంధము నీకున్నను నేను మంత్రము నెఱిగిన వాడనుగాన నీనుండి భయము కలుగుట లేదు. నీవు మరొకసారి పైకి బాణమును విడువుము. నేను దానవులకు ముందున్నాను. అని యిట్లు శివుని పరిహసించు మహిషుని మర్దించుచున్న పార్వతి మిమ్ము రక్షించుగాక!

**వి :** నేను శరీరహీనుడనైనను పుష్పాయుధుడను కాను అను వాక్యమున మన్మథుడనైన మన్మథుడను కాను అను విరోధముతో కూడిన అర్థము తెలియబడుచున్నది. తను శబ్దము సన్ననివాడు అను అర్థము కలదగుటచే నేను లావైన వాడను అర్థము చెప్పి విరోధము పరిహరించు కొనవచ్చును. అట్లే 'ఎల్లపుడు పాములతో సంబంధమున్న వానిని చూచినచో భయము కలుగవలసి యుండగా నాకు భయము లేదు. నేను నయజ్ఞః అనగా నీతినెఱిగిన వాడను' అను అర్థము నిచ్చు వాక్యమున పాములున్నను నీనుండి నాకు భయము కలుగుట లేదు అను విరోధము చెప్పబడినది. పాముల సంబంధముగల వానివలన భయము కలుగకుండుటెట్లు? దీనికి మంత్రజ్ఞుడను మంత్రము నెఱిగిన వాడను, నాకు భయము కలుగుట లేదు అని అర్థము చెప్పి విరోధము పరిహరించుకొన వచ్చును. కావున ప్రథమద్వితీయపాదములలో **విరోధాభాసాలంకార** మేర్పడి యున్నది. ఓ పినాకీ! పినాక మను ధనువుగల శివుడా! నీవు ఆ పినాకమను ధనువున నారాయణు నస్త్రముగా సంధించి

మరొకసారి విడువుము. ఇదివఱకు నీ బాణము పురాసురుని చంపినది. కాని ఇప్పుడు నారాయణు నస్త్రముగా సంధించి మరొకసారి ప్రయోగించినను నేను ఇదివఱకు నారాయణు నోడించిన వాడనే. అయినందున ఆ యస్త్రము నన్నేమియు చేయజాలదు. **దానవామ్ పురః పునరపి విశిఖమ్ ముంచ** దానవులలో నేను పురాసురుడను. నా మీద మరొకసారి అస్త్రమును ప్రయోగించు మనుటలో చచ్చిన పురాసురునిపై మరల నొకసారి ప్రయోగించు మనుటలో విరోధమున్నది. కాని నేను దానవాగ్రేసరుడను. 'దానవానామ్ పురః' అను వాక్యమున కర్థము చెప్పి విరోధము పరిహరించు కొనవచ్చును. కావున విరోధాభాసము కూడ మూడవపాదమున నున్నది. కాని ఇట విరోధాభాసము వ్యంగ్యమై యున్నది. రెండవ పాదమున '**న యజ్ఞోఽస్మి**' అను వాక్యమునకు నేను యజ్ఞమును కాను. కావున నీ పాములకు నానుండియు భయము లేదను అర్థాంతరము నేను పాతాలలోకవాసి నైనందున నాకు వ్యాలసంబంధమున్నను నా పాములకు నేను యజ్ఞమును కాను. కావున భయము లేదను అర్థాంతరము కలుగుట కవకాశమున్నది. యజ్ఞము లనిన నాగములకు భీతి. అది **పూర్వకల్పకాలికజనమేజయకృతసర్పయజ్ఞము** నాటినుండి యేర్పడి యున్నది. నేను యజ్ఞమును కాను. కావున నీ పాముల పాతాలవాసి సంబంధమున నా దగ్గఱకు స్వేచ్ఛగా వచ్చునే కాని భయపడవు. నన్ను భయపెట్టవు అను అర్థాంతరము కూడ వ్యంగ్యమగును. నేను దక్షయజ్ఞమును కాను కనుక నీనుండి నాకు భయము లేదు. ఆహుతి ఈయరని అవమానించెదరని నీకును భయము లేదు అనియు వ్యంగ్యమగును. '**పినాకిన్**' అను సంబోధనము వలన నీకు ధనువున్నదే కాని బాణము లేదు. బాణము కావలసినచో నారాయణుని బాణముగా నుండమని ప్రార్థింప-వలసినదే అను ఎత్తిపొడుపు వ్యంగ్యమగును. మరియు నీవు బాణమును ప్రయోగించి ఎవరిని చంపి ఎఱుగవు కావున నీ ధనువు అలంకారార్థమే. కాని యుద్ధమున ఉపయోగపడదు. ఏది చేతనైనచో బాణమును విడువుము అను పరిహాసము గూడ వ్యంగ్యమగును. మొదటి పాదమున '**ఊర్ధ్వదృష్ట్యా**' అను సమాసమున్నది. అది శివుని పైనున్న కన్నును అనగా అగ్నినేత్రమును బోధించును. ఇది వఱకు పుష్పాయుధముల ప్రయోగించిన మన్మథుడు ఆ అగ్నినేత్రమునుండి వచ్చిన మంటలకు కాలిపోయి అతనువైనాడు. అనగా శరీరహీనుడైనాడు. నీవిపుడూర్ధ్వదృష్టితో నన్ను చూచిన ఇదివఱకే అతనుడనైన అనగా తనువుగా (సూక్ష్మముగా) లేక లావుగా నున్న నన్ను అగ్ని నిదివఱకే ఓడించిన నన్ను ఆ అగ్ని ఏమియు చేయజాలని దనుటచేత సంతోషించి మరింత లావగుదును. అని 'అధికతరమ్', 'అతనుః' అనుచోట నున్న 'అధికతరమ్' అను పదము వ్యంజింపజేయును. నీలాకాశమున నీలముగా నున్న నేను నీ ఊర్ధ్వదృష్టికి కానవచ్చెదనో లేదో కాని నా కొమ్ములు మాత్రమే నీలముగా లేకపోవుటచే కానిపించును. అంత ఎత్తునకు నీ ఊర్ధ్వదృష్టి ప్రసరించి నా శృంగముల చూచి వానిని కాల్చి భంగము కలిగించునో లేదో కాని నా కొమ్ములు కాలకున్న నీకు శృంగభంగము అనగా అవమానము కలుగుట మాత్రము తథ్యము. భక్తులందఱు **అమ** యను చంద్రుని షోడశకల నీ శిరమందుండునందురు. అది కనబడకున్నను తత్సన్నిహితమైన కల ద్వితీయనాడు ఆకసమందు కనబడునని ఆసక్తితో చూచెదరు. నీ శిరమునందు దక్షిణ శృంగమని

ఉత్తరశృంగమని చంద్రుని కలను చూచి మ్రొక్కెదఱు. అందఱు ఆసక్తితో చూచు నీ శిరశ్చంద్ర-దక్షిణోత్తరశృంగములు కనిపించిన కనుపించును. లేకున్న తృతీయనాడు దర్శించుటకు యత్నించెదరు. అందరు ఆసక్తితో ఊర్ధ్వదృష్టితో నీ శిరశ్చంద్రశృంగదర్శనము చేయుచుందురు గదా. ఇప్పుడు నీవు ఊర్ధ్వదృష్టితో నా దక్షిణోత్తరశృంగద్వయము నేక కాలమున చూడుము. నీకు మరింత పుణ్యము లభించును. వారిచే నూర్ధ్వదృష్టితో చూడదగిన చంద్రశృంగము నీకున్నది. నీవు చూడదగిన రెండుశృంగములు నాకున్నవి. అవి చంద్ర శృంగముకన్న పెద్దవి. కావున ఏకకాలమున చూచి చేతనైనచో కాల్చివేయుము. లేకున్న రెండు శృంగముల కొక నమస్కారము చేసి బ్రతికి పొమ్ము అను అర్థమును వ్యంగ్యమగును. 'అధికతరమతనుః' 'న భవతి భవతో భీ ర్న' 'పినాకిన్ పునరపి' 'దానవానామ్' 'సోత్త్రాసమ్' 'హసితహరమ్' అనుచోట్ల **వృత్త్యనుప్రాసాలంకారము** లున్నవి. *

**అ :** పూర్వశ్లోకమున నొక దాని యందు అమ్మవారి మహిషవధోత్సవము ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున **అమ్మవారిని దేవతలు దర్శించుట** చెప్పబడుచున్నది.

**శ్లో॥ నన్దీశోత్సార్యమాణాపసృతిసమనమన్నాకిలోకం నువత్యా**
**నప్తుర్హస్తేన హస్తం తదనుగతగతేః షణ్ముఖస్యావలమ్బ్య ।**
**జామాతుర్మాతృమధ్యోపగమపరిహృతే దర్శనే శర్మ దిశ్యా-**
**న్నేదీయచ్చుమ్బ్యమానా మహిషవధమహే మేనయా మూర్ధ్న్యుమా వః ॥ 63**

**ప్ర :** మహిషవధమహే = మహిషవధోత్సవమునందు, నన్దీశోత్సార్యమాణాపసృతిసమనమ-న్నాకిలోకమ్ = నన్దీశ్వరునిచే తొలగింపబడుచు తొలగింప బడుటతో పాటు వంగుచు నమస్కరించుచున్న దేవసమూహమును, నువత్యా = స్తుతించుచున్న, మేనయా = మేనాదేవిచేత, నప్తుః = మనుమడైన, తదనుగతగతేః = ఆమెను వెంబడించుచున్న, షణ్ముఖస్య = కుమారస్వామి యొక్క, హస్తమ్ = చేయి, అవలమ్బ్య = పట్టుకొని, జామాతుః = అల్లుని (శివుని) యొక్క, దర్శనే = దర్శనము, మాతృమధ్యోపగమపరిహృతే = మాతృగణము నడుమ తొలగినది కాగా, మూర్ధ్ని = తలపై, నేదీయః = అతిసమీపముగా, చుమ్బ్యమానా = ముద్దిడు కొనబడుతున్న, ఉమా = పార్వతి, వః = మీకు, శర్మ = సుఖమును, దిశ్యాత్ = ఇచ్చుగాక!

**తా :** మహిషవధోత్సవమునకు అసంఖ్యాకముగా వచ్చిన దేవతల నదుపు చేయుచు నందీశ్వరుడు దండమును ప్రయోగించునేమో అని భయపడిన దేవతలు తొలగిపోవుచునే శివునకు నమస్కరించుచుండగా వారిని మేనక స్తుతించుచున్నది. వెంబడించు మనుమడైన కుమారస్వామి చేతిని తనచేత పట్టుకొని, మాతృమధ్యమున నున్న శివుడు చూడనప్పుడు, మేనక మిక్కిలి దగ్గఱగా చేరి పార్వతిని శిరమున చుంబించెను. అట్లు చుంబింపబడిన పార్వతి మీకు సుఖమును ప్రసాదించు గాక!

**వి :** దేవతలలో నొక్కొక్కరు వరుసగా శివుని దర్శించుట కేర్పాటు చేయుచున్న నందీశ్వరుడు

దర్శనమైన వెంటనే వారిని తొలగించుచుండగా ఆ తొలగించు సమయమందే దేవతలు శివునకు అమ్మవారికిని నమస్కరించుచు తొలగి పోవుచున్న వారి నొక్కొక్కరిని హిమవంతుని భార్యయైన మేనక స్తుతించుచున్నది. ఇది ప్రథమపాదవివరణము. మిగిలినది స్పష్టము. 'జామాతుర్మాతృ-మధ్యోపగమపరిహృతే' 'దర్శనే శర్మ దిశ్యాత్ మహిషవధమహే మేనయా మూర్ధ్న్యమా' అనుచోట్ల వృత్త్యనుప్రాసాలంకారము లున్నవి. *

**అ :** పై శ్లోకమున మహిషవధోత్సవమందలి యొక విశేషము చెప్పబడినది. ఈ శ్లోకమున మరొక విశేషము చెప్పబడుచున్నది.

**శ్లో॥ భక్త్యా భృగ్వత్రిముఖ్యైర్మునిభిరభినుతా బిభ్రతీ నైవ గర్వం**
**శర్వాణీ శర్మణే వః ప్రశమితసకలోపప్లవా సా సదాఽస్తు ।**
**యా పార్ష్ణి క్షుణ్ణశత్రుర్విగలితకులిశప్రాసపాశత్రిశూలం**
**నాకౌకోలోకమేవ స్వమపి భుజవనం సంయుగేఽవస్త్వమంస్త ॥ 64**

**ప్ర :** యా = ఎవతె, పార్ష్ణి = మడమయందు, క్షుణ్ణశత్రుః = త్రొక్కబడిన శత్రువుగలదై, విగలితకులిశ-ప్రాసపాశత్రిశూలమ్ = జారిన వజ్రము, బడిసె, పాశము, త్రిశూలముగల, నాకౌకోలోకమ్ ఏవ = దేవలోకమునేకాక, స్వమ్ = తన, భుజవనమ్ అపి = బాహువుల అడవిని కూడ, అవస్తు = పనికిరాని వస్తువుగా, అమంస్త = తలచినదో, సా = ఆ, శర్వాణీ = పార్వతి, భక్త్యా =భక్తితో, భృగ్వత్రిముఖ్యైః = భృగువు, అత్రి మొదలైన, మునిభిః = మునులచేత, అభినుతా = బాగుగా స్తుతింపబడినదై, గర్వమ్ = గర్వమును, న ఏవ బిభ్రతీ = ధరించనిదై, ప్రశమిత సకలోపప్లవా = సకలలోకపీడలను తొలగించినదై, సదా = ఎల్లప్పుడు, వః = మీయొక్క, శర్మణే = సుఖము కొఱకు, అస్తు = అగుగాక!

**తా :** మడమతో మహిషుని చంపినప్పుడు సకలదేవతల చేతులలోని వజ్ర శూల త్రిశూలములు జారిపడినవి కాగా వానితో పాటు తమకున్న ఇన్ని బాహువుల (అడవి) సమూహము వ్యర్థము అని తలంచినట్టి, సకలలోకపీడలను తొలగించినట్టి, భృగ్వాది మునులు బాగుగా భక్తితో స్తుతించినను గర్వమును బొందనట్టి ఆ శివపత్ని శర్వాణి మీకెల్లప్పుడు సుఖమును కలిగించుగాక!

**వి :** అమ్మవారు మహిషుని పైకి దండెత్తిపోగా సకలదేవతలు తమ తమ ఆయుధములతో ఆమెకు బాసటగా వచ్చిరి. కాని అమ్మవారు వానిని మడమతో చంపగా దేవతలు తమ ఆయుధము లనావశ్యకములని వానిని పారవైచిరి. ఒకప్పుడు వానిని చంపుట కాయాయుధముల ప్రయోగించి అవి విఫలము లైనప్పుడే వాని అనావశ్యకత సిద్ధమైనది. అమ్మవారితో కలసి దండెత్తినపుడును అట్లే జరుగుటచే వానిని పారవేయుట ఉచితమని తలచిరి. దేవతల ఆయుధముల పారవైచుట చూచి అమ్మవారు అనావశ్యకములని దేవతాయుధముల బారవైచుట ఉచితమగుచో నా యీ ఇన్ని భుజముల నేమి చేయవలెను. ఆయుధములనువలె భుజములను పారవేయుట కవకాశమున్నచో బాగుండెడిదని అమ్మవారు తలచినది. యుద్ధమున కుపయోగపబడని ఆయుధములు బాహువులు

వ్యర్థములని తలచుట తగినదైనచో సంకల్పమాత్రమున సర్వలోకముల పీడలను తొలగించగల అమ్మవారికున్న స్థూలశరీరమును వ్యర్థమని తలచి ఆమె తన స్థూలశరీరమును కూడ విడచి వేయును. ఆమెకు మనవలె స్థూలశరీరములేకయే భక్తుల హృదయములలో ఆనందమును కలుగజేయుచుండ గలదు. ఆమె తన స్థూలశరీరమును నిచ్ఛామాత్రమున ధరించు చుండును. 'భక్త్యా భృగ్వత్రిముఖ్యైర్మునిభిరభినుతా బిభ్రతీ నైవ గర్వం శర్వాణీ శర్మణే వః ప్రశమితసకలోపప్లవా సా సదాస్తు విగలితకులిశప్రాసపాశత్రిశూలమ్ నాకౌకోలోకమ్ (అ) వస్త్వమంస్త' అను పదబన్ధములలో **వృత్త్యనుప్రాసాలంకారము** లున్నవి. *

**అ :** పై శ్లోకమున అమ్మవారి భుజముల వైయర్థ్యము చెప్పబడినది. ఈ శ్లోకమున **దేవతల ఆయుధముల వైయర్థ్యము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ చక్రం శౌరేః ప్రతీపం ప్రతిహతమగమత్ప్రాగ్ద్యుధామ్నాం తు పశ్చా-**
**దాపచ్చాపం బలారేర్న పరమగుణతాం పూస్త్రయప్లోషిణోఽపి ।**
**శక్త్యాఽలమ్మాం విజేతుం న జగదపి శిశౌ షణ్ముఖే కా కథేతి**
**న్యక్కుర్వన్నాకిలోకం రిపురవధి యయా సాఽవతాత్పార్వతీ వః ॥ 65**

**ప్ర :** ప్రాక్ = మొదట, శౌరేః = విష్ణువుయొక్క, చక్రమ్ = చక్రము, పశ్చాత్ = తరువాత, ద్యుధామ్నామ్ = దేవతలయొక్క, చక్రమ్ = చక్రము (సైన్యము), ప్రతిహతమ్ = కొట్టబడి, ప్రతీపమ్ = వెనుకకు, అగమత్ = పోయెను, బలారేః = ఇన్ద్రునియొక్క, చాపమ్ = విల్లు, అగుణతామ్ = గుణహీనతను, ఆపత్ = పొందెను, పరమ్ = శ్రేష్ఠమైన, పూస్త్రయప్లోషిణః = మూడు పట్టణముల నశింపజేసిన వాని (శివుని) యొక్క, చాపమ్ అపి = విల్లు కూడ, అగుణతామ్ = గుణహీనతను, ఆపత్ = పొందెను, మామ్ = నన్ను, విజేతుమ్ = గెలుచుటకు, శక్త్యా = (శక్తి) తో, జగత్ అపి = జగము కూడ, న అలమ్ = చాలదు, శిశౌ = శిశువు అయిన, షణ్ముఖే = కుమారస్వామియందు, కథా = కథ, కా = ఏమి, ఇతి = అని, నాకిలోకమ్ = దేవలోకమును, న్యక్కుర్వన్ = ధిక్కరించుచు, రిపుః = శత్రువు, యయా = ఎవతెచేత, అవధి = చంపబడెనో, సా = ఆ, పార్వతీ = పార్వతి, వః = మిమ్ము, అవతాత్ = కాపాడుగాక!

**తా :** మొదట విష్ణువుయొక్క చక్రము, ఆ పిదప దేవతలయొక్క చక్రము (సైన్యము) కొట్టబడి వెనుకకు పోయెను. నిర్గుణమైనది ఇంద్రుని ధనువే కాదు. శివుని ధనువు కూడ నిర్గుణమైనది. ఈ జగము కూడ శక్తితో నన్ను గెలవలేదు. శిశువైన కుమారస్వామి విషయమున చెప్పవలసిన దేమి యున్నది? అని దేవతలను ధిక్కరించుచున్న శత్రువు ఎవతె చేత చంపబడినదో ఆ పార్వతి మిమ్ము రక్షించుగాక!

**వి :** మహిషునిచే కొట్టబడి విష్ణుచక్రము మొదట వెనుకకు పోయినది. ఆ పిదప దేవతల సైన్యము కొట్టబడి వెనుకకు పోయినది. అని చెప్పుటచేత నాయకత్వము వహించిన విష్ణువుయొక్క చక్రము

కొట్టబడి వెనుకకు పోయిన దనుటచే విష్ణువు ముందు యుద్ధముచేయుట చెప్పబడినందున ఆతని నాయకత్వముయొక్క సామంజస్యము వ్యంజింపబడినది. నాయకుడు ముందు యుద్ధము చేయుట ఆదర్శము కదా! వర్షజలబిందువులనుండి సూర్యకిరణములు దూసుకొని పోయినప్పుడు సూర్యుని కెదురుగా నున్న దిక్కున ఏడు రంగులు చాపాకారమున విడివిడిగా కనబడుట, ఆ రంగుల విల్లు **ఇంద్రచాప** మనబడును. అది అల్లెత్రాడు లేనిదే కావున అది తొలుతటి నుండి నిర్గుణమే అయి యుండగా ఇప్పుడు శివుని విల్లైన పినాకము అల్లెత్రాడు కూడ యుద్ధమున మహిషునిచే త్రెంపబడి నిర్గుణమై పోయినది. అయినను ఇంద్రుడు నిర్గుణమైన తన చాపముతోడనే మహిషుని కొట్టబోయినప్పుడు దాని నిర్గుణత మరొకసారి స్పష్టమగుట ద్వితీయపాదమున వ్యంగ్యమైనది. పరశబ్దము శివుని చాపము యొక్క శ్రేష్ఠతను వ్యంజించుచు ఇంద్రచాపము యొక్క యుద్ధోపయోగ–హీనత అను అశ్రేష్ఠతను వ్యంజించుచున్నది. మూడవపాదమున లోకమంతయు కలసి స్వశక్తితో జయింపలేని నన్ను శిశువైన ఈ షణ్ముఖుడు తన శక్తితో అనగా శక్త్యాయుధముతో జయింపగలడా అను పరిహాసము వ్యంగ్యమగుచున్నది. ఇన్ద్రుడు బలుడను పేరుగల రాక్షసుని జయించుటచే **బలారి** అను ప్రసిద్ధిని వహించినాడు. ఇన్ద్రుడు విద్యుద్దేవత కావున తత్స్ఫూర్త్యతో ఎవని బలమునైనను హరింపగలడు. అటువంటి ఇన్ద్రుడును తన ధనువుతో మహిషుని జయించలేని వాడై తన చాపముతో పాటు తానును నిర్గుణుడైనాడు అని బలము అను గుణమును చెప్పు బలశబ్దము అరిశబ్దముతో కలసి వ్యంజించుచున్నది. **ఇంద్రుడు పురన్దరుడుగా ప్రసిద్ధుడు.** ఎన్నో రాక్షసుల పట్టణముల ధ్వంస మొనర్చినవాడు అయినను మూడు పురముల నశింపజేసి శివుడు పురన్దరుని మించిన కీర్తిని పొందినాడు అని ద్వితీయపాదాంతమందలి **అపి** శబ్దము వ్యంజింపజేయు చున్నది. ప్రతీపమ్ 'ప్రతిహతమగమత్' నాకిలోకమ్ రిపురవధి, ఆపచ్చాపమ్ న్యక్కుర్వన్ నాకిలోకమ్ పార్వతీ అను పదబంధములు వృత్త్యనుప్రాసాలంకృతములై యున్నవి. *

**అ :** పై శ్లోకమున తమ ఆయుధములతో గెలువలేని దేవతల పరిహాసమును మహిషుడొనర్చినట్లు చెప్పబడినది. ఈ శ్లోకమున **దేవతల ఆయుధముల వ్యర్థ మొనర్చిన పిదప మహిషు నమ్మవారు చంపుట** చెప్పబడుచున్నది.

**శ్లో॥ విద్రాణే రుద్రవృన్దే సవితరి తరలే వజ్రిణి ధ్వస్తవజ్రే**
**జాతాశఙ్కే శశాఙ్కే విరమతి మరుతి త్యక్తవైరే కుబేరే ।**
**వైకుణ్ఠే కుణ్ఠితాస్త్రే మహిషమతిరుషం పౌరుషోపఘ్ననిఘ్నం**
**నిర్విఘ్నం నిఘ్నతీ వః శమయతు దురితం భూరిభావా భవానీ ॥ 66**

**ప్ర :** రుద్రవృన్దే = రుద్రులగణము, విద్రాణే = పారిపోవుచుండగా, సవితరి = సూర్యుడు, తరలే = చలించినవాడు కాగా, వజ్రిణి = ఇన్ద్రుడు, ధ్వస్తవజ్రే = నశించిన వజ్రము కలవాడు కాగా, శశాంకే = చన్ద్రుడు, జాతాశంకే = శంక గలిగిన వాడు కాగా, మరుతి = వాయువు, విరమతి = విరమించిన వాడు కాగా, కుబేరే = కుబేరుడు, త్యక్తవైరే = శత్రుభావమును విడచిన వాడు కాగా,

వైకుంఠే = విష్ణువు, కుంఠితాస్త్రే = వ్యర్థములైన అస్త్రములు కలవాడు కాగా, పౌరుషోపఘ్ననిఘ్నమ్ = పౌరుషమును మాత్రమే బాసటగా చేసికొన్న, అతిరుషమ్ = మిక్కిలి కోపముగల, మహిషమ్ = మహిషుని, నిర్విఘ్నమ్ = విఘ్నము లేకుండగ, నిఘ్నతీ = చంపుతున్న, భూరిభావా = గొప్ప భావముగల, భవానీ = భవాని, వః = మీ యొక్క, దురితమ్ = పాపమును, శమయతు = శమింప జేయుగాక!

**తా :** రుద్రగణము పారిపోగా, సూర్యుడు చలించిపోగా, ఇంద్రుడు వజ్రమును పోగొట్టుకొనగా, చంద్రుడు భయపడిపోగా, వాయువు యుద్ధమునుండి విరమించు కొనగా, కుబేరుడు శత్రుత్వమునే విడచిపెట్టిగా, విష్ణువు తన అస్త్రముల వ్యర్థముగా ప్రయోగించిన వాడు కాగా, పౌరుషమును వీడని అధికకోపముగల మహిషుని నిర్విఘ్నముగా చంపుచున్న పార్వతి మీయొక్క పాపమును పోగొట్టుగాక!

**వి :** పదకొండుగురు రుద్రులు **రుద్రగణ**మని చెప్పబడును. ఆ రుద్రగణము మొత్తముగా పారిపోయినది. వానిలో నొక్కడును యుద్ధమున నిలువలేదు అని **వృన్ద** శబ్దము వ్యంజించును. సవిత అనగా సూర్యుడు. ఆయన సమక్షమున చీకటి పారిపోవలెను కాని చీకటి వంటి మహిషునికి సూర్యుడే వణకి పోయినాడని **తరల** శబ్దము వ్యంజించును. అట్లే జాతాశంకే శశాంకే అను పదములు పై విధముగనే వ్యంజించును. **వజ్రిణి** శబ్దము ప్రశస్తవజ్రముకల ఇన్ద్రుని బోధించును. ఆయన వజ్రము ఈనాడు అప్రశస్తమైనది అని **ధ్వస్తవజ్ర** శబ్దము వ్యంజించును. మరుత్తనగా వాయువు. ఆయన విరామ మెఱుగక చలించుతు ఉండును. ఆయన కూడ ఆగిపోయినాడు అని **విరమతి** శబ్దము వ్యంజించును. కుబేరుడు పోరాడలేక మహిషునితో సఖ్యము చేయదలచినాడని త్యక్తవైర శబ్దము వ్యంజించును. వైకుంఠుడనగా విష్ణువు. ఆయన పంచాయుధములు కలవాడు, చక్రము, శంఖము, శార్ఙ్గమ్, గద, ఖడ్గము అను ఆ అయిదు ఆయుధములును వ్యర్థము లయినవని **కుంఠితాస్త్ర** శబ్దము వ్యంజించును. నిరాయుధుడైన మహిషుడు సాయుధులైన దేవతల నోడించినాడని **పౌరుషోపఘ్నమ్** అను శబ్దము వ్యంజించును. మహిషుడు నల్లని వాడగుటచే పాపమని చెప్ప దగిన వాడు (పాపము నల్లగా నున్నదనుట కవి సమయము). అట్టి మహిషుని చంపిన అమ్మవారు పాపమును చంపుననుటలో సంశయమక్కర లేదు అని నాల్గవపాదము వ్యంజించును. ఈ శ్లోకమున ఏడు జంట పదములలోనను **వృత్త్యనుప్రాసాలంకారము** లున్నవి. అట్లే పౌరుషోపఘ్ననిఘ్నమ్ నిర్విఘ్నం నిఘ్నతీ అను పదము లందును, **భూరిభావా భవానీ** అను పదము లందును వృత్త్యను ప్రాసాలంకారము లున్నవి. *

**అ :** పై శ్లోకమున విష్ణువుయొక్క ఆయుధములు వ్యర్థము లగుట చెప్పబడినది. ఈ శ్లోకమున యుద్ధమున ఆయుధములన్నియు వ్యర్థములు కాగా దన్తము నుపయోగింపగా **మహిషుడు విఱుగగొట్టిన దన్తమునకు బదులు రెండు దన్తములు వినాయకునకు కుమారస్వామి కూర్చుట** చెప్పబడుచున్నది.

శ్లో॥ భూషాం భూయస్తవాద్య ద్విగుణతరమహం దాతుమేవైష లగ్నో
భగ్నే దైత్యేన దర్పాన్మహిషితవపుషా కిం విషాణే విషణ్ణః ।
ఇత్యుక్త్వా పాతు మాతుర్మహిషవధమహే కుఞ్జరేన్ద్రాననస్య
న్యస్యన్నాస్యే గుహో వః స్మితసితరుచినీ ద్వేషిణో ద్వే విషాణే ॥ 67

ప్ర : భూయః = మరల, తవ = నీకు, అహమ్ = నేను, ద్విగుణతరమ్ = రెండింతలుగా, దాతుమ్ ఏవ = ఇచ్చుటకే, ఏషః = వీడు, భూషామ్ = (పాదము యొక్క) సొమ్మునకు అందెకు, లగ్నః = అంటుకొని యున్నాడు, మహిషితవపుషా = దున్నపోతు శరీరముగల, దైత్యేన = రాక్షసునిచేత, దర్పాత్ = గర్వమువలన, విషాణే = కొమ్ము, భగ్నే = విఱవబడగా, విషణ్ణే = (ఆ విఱచినవాడు) చచ్చిపడి యుండగా, కిమ్ = ఎందుకు, విషణ్ణః = దుఃఖింతుడవు, (అసి = అగుచున్నావు), మాతుః = తల్లి యొక్క, మహిషవధమహే = మహిషవధోత్సవము నందు, ఇతి = ఇట్లు, ఉక్త్వా = పలికి, కుంజరేన్ద్రాననస్య = గజముఖునియొక్క, ఆస్యే = ముఖమునందు, స్మితసితరుచినీ = చిఱునవ్వుచే తెల్లనికాంతి కలిగిన, ద్వేషిణః = శత్రువుయొక్క (మహిషుని యొక్క), ద్వే = రెండు, విషాణే = కొమ్ములను, న్యస్యన్ = ఉంచుచున్న, గుహః = కుమారస్వామి, వః = మిమ్ము, పాతు = రక్షించుగాక!

తా : మహిషాసురుడు యుద్ధమున వినాయకుని దంతమును విఱచెను. మహిషుడు చచ్చిన పిదప అమ్మవారి మహిషవధోత్సవమున దిగాలుపడి యున్న వినాయకునితో ఇదిగో ఈ మహిషుడు అమ్మవారి కాలి అందెకు తగిలి యుండుట నీకు రెండు రెట్లు అలంకారమును కల్పించుటకు వీలు కల్గించుటకే అని పలుకుచు అమ్మవారి నవ్వుతో తెల్లనికాంతి నొందిన మహిషుని రెండు కొమ్ములను వినాయకుని నోటిలో నుంచుచున్న **కుమారస్వామి** మిమ్ము కాపాడుగాక!

వి : పరశురాముడో రావణాసురుడో వినాయకుని రెండు దన్తములలో నొక దానిని విఱచి వేసినట్లున్నది లేక పూర్వకల్పీయవ్యాసభారతము వ్రాయుట కవసరముగా తానే తన యొక్క దన్తమును విఱచి దానితోడనే భారతము వ్రాసి పాఱవైచెనో కాని ప్రస్తుతము వినాయకుడేకదన్తుడే అయి యున్నాడు. ఆ ఒక దన్తము మహిషునితోడి యుద్ధమున వాని కొమ్మునకు దగిలి విఱిగిపోయినది. దేవతలందఱు పోయిన తమ ఆయుధములు లభించుటచే వాడు చచ్చుటచేత ఓడిన దుఃఖము మఱచి సంతసించుచునే అమ్మవారి మహిషవధోత్సవమున తిరుగుచున్నారు. కాని వినాయకుడొక మూల తన విఱిగిన దన్తమితరులకు కనబడునేమోయని ఒక మూల దిగులుతో కూర్చొని యుండగా కుమారస్వామి ఆతని కడకు వచ్చి 'అన్నా నీ దన్తము నొక దానిని మహిషుడు విఱుచుట మంచిదే ఐనది. చచ్చిన వీని కొమ్ములు రెండు నీకిపుడు నీ ముఖమున శోభను కూర్చగలవు. ఒక దన్తము పోగా నీ కిపుడు రెండు దన్తముల నిచ్చు నవకాశము నాకు కల్పించుటకే నీ దన్తమును వాడు విఱిచినాడు'. అని పలుకుచుండగా అమ్మవారు నవ్వినది. మహిషుని కొమ్ములా నవ్వుయొక్క కాంతితో బాగుగా తెల్లబడినవి. ఏనుగు దన్తములంత తెల్లగానైన ఆ మహిషుని రెండు కొమ్ములను

కుమారస్వామి వినాయకుని ముఖమున నుంచినాడు. అట్టి కుమారస్వామి మిమ్ము (మీకేమైన అవయవములు విఱిగియున్నచో వాని నతికించి) కాపాడుగాక (అవయవవైకల్యమున కన్న జ్ఞానశూన్యతావైకల్యము ఎక్కువ దుఃఖహేతువు. కావున) జ్ఞానమును కలిగించి జ్ఞానశూన్యతను పోగొట్టి మిమ్ము కాపాడుగాక అని ఈ శ్లోకమున వ్యంగ్యమగుచున్నది. భూషామ్ భూయః తవాద్య ద్విగుణతరమహం దాతుమేవ లగ్నే భగ్నే, దైత్యేన దర్పాత్, మహిషితవపుషా, విషాణే విషణ్ణః, 'ఇత్యుక్త్వా పాతు మాతుః', 'మహిషవధమహే న్యస్యన్నాస్యే', 'స్మితసితరుచినీ'చ 'ద్వేషిణో ద్వే విషాణే' అను పదబన్ధములలో వృత్త్యనుప్రాసాలంకారము లున్నవి. *

**అ :** పై శ్లోకమున వినాయకుని పోయిన వెలుగుల వంటి తెల్లని దన్తములు వచ్చినట్లు చెప్ప బడినది. ఈ శ్లోకమున **మహిషాన్ధకారరాత్రి కారణముగా పోయిన వెలుగును మరల నమ్మవారిచే లోకముల కీయబడినట్లు** చెప్పబడుచున్నది.

**శ్లో॥ విశ్రామ్యన్తి శ్రమార్తా ఇవ తపనభృతః సప్తయస్సప్త యస్మిన్**
**సుప్తాస్సప్తాపి లోకాస్స్థితిముషి మహిషే యామినీధామ్ని యత్ర ।**
**ధారాణాం రౌధిరీణామరుణిమని నభస్సాన్ద్రసన్ధ్యాం దధాన-**
**స్తస్య ధ్వంసాత్సుతాఽద్రేరపరదినపతిః పాతు వః పాదపాతైః ॥ 68**

**ప్ర :** యస్మిన్ = ఏ, యామినీధామ్ని = రాత్రికాంతిగల, మహిషే = మహిషుడు, స్థితిముషి = స్థితిని దొంగిలింపగా, శ్రమార్తా ఇవ = శ్రమచే అలసిన వానివలె, తపనభృతః = సూర్యునే మోయు, సప్త = ఏడు, సప్తయః = గుఱ్ఱములు, విశ్రామ్యంతి = విశ్రమించుచున్నవో, యత్ర = ఏ మహిషుడు, స్థితిముషి = స్థితిని దొంగిలించు వాడు కాగా, సప్త = ఏడు, లోకాః = లోకములును, సుప్తాః = నిదురించి (దీర్ఘనిద్ర కలిగి) యున్నవో, తస్య = వానియొక్క (మహిషుని యొక్క), పాదపాతైః = తన్నులతో, ధ్వంసాత్ = నాశమువలన, రౌధిరీణామ్ = రక్తపు, ధారాణామ్ = ధారలయొక్క, అరుణిమని = ఎఱుపునందు, నభస్సాంద్రసన్ధ్యామ్ = ఆకాశమున దట్టమైన సన్ధ్యను ధరించుచున్న, అద్రేః = కొండయొక్క, సుతా = కూతురు అను, అపరదినపతిః = మరొక సూర్యుడు, వః = మిమ్ము, పాతు = రక్షించుగాక!

**తా :** రాత్రి కాంతి గల మహిషుడు లోకముల స్థితిని దొంగిలించిన వాడు కాగా సూర్యుని మోయు ఏడు గుఱ్ఱములు శ్రమతో అలసిన వానివలె ఆగి విశ్రమించుచున్నవి. ఏడు లోకములును నిదురించుచున్నవి. ఇంతలో అమ్మవారు వానిని చంపగా వాని శరీరమునుండి బయలుదేరిన రక్తధారలు ఆకసమున సన్ధ్య నేర్పఱచి నట్లున్నవి. అమ్మవారు మరొక సూర్యునివలె తన పాదముల (కిరణముల) స్పర్శములతో మిమ్ము కాపాడుగాక!

**వి :** మహిషుడు రాత్రికాంతి గలవాడు అనగా అన్ధకారరూపుడు. వాడు విజృంభించి లోకముల యొక్క స్థితిని (వెలుగును) దొంగిలించి ప్రలయాన్ధకారమును సృష్టించినాడని '**స్థితిముషి**' అను

సమాసము వ్యంజించుచున్నది. అన్ధకారము రాత్రి కాంతి. రాత్రికాంతియైన అన్ధకారమును వ్యంజింపజేసి లోకముల స్థితిని అనగా వెలుగును అపహరింపగా రాత్రియైనదని సూర్యుడు ఏడు గుఱ్ఱములు అలసినవా అన్నట్లు ఆగి విశ్రమించుచున్నవనుటచేత నిజముగా అవి అలయకున్నను లోకములన్నియు మహిషునిచే చీకాకు పఱచబడి స్థితిని కోల్పోయి ప్రలయము వచ్చిన దన్న భావముతో సూర్యుని గుఱ్ఱములు పూర్తిగా ఆగి విశ్రాంతి గైకొనుచున్నవి. ఈ విశ్రాంతి ఎంతవఱకు? ప్రలయరాత్రి ముగియువరకు సాధారణమైన రాత్రి కాలమున భూగోళముయొక్క మఱొక వైపున సూర్యుడు ప్రయాణించుచునే ఉండును. కావున సూర్యుని గుఱ్ఱములకు విశ్రాంతి ఉండదు. ప్రలయమున సప్త లోకములు నిదురించును అనుటచేత ఏ లోకమునను సూర్యుడు ప్రయాణించడు కావున ఆతని గుఱ్ఱములు పునఃసృష్టి వఱకు విశ్రమించును. కాని నిజమున కిప్పుడు ప్రలయము రాలేదు. మహిషుడు ప్రలయకాలమునాటి పరిస్థితిని సృష్టించుటచే సూర్యుని గుఱ్ఱములు అలసిపోయినట్లు భ్రాంతినొంది విశ్రమించుచున్నట్లు సప్తలోకములు నిద్రించి (చచ్చి) నట్లు కవిచేత సంభావింపబడినందున **ఉత్ప్రేక్షాలంకారము** పూర్వార్ధమున ఏర్పడి యున్నది. **భ్రాంతిమదలంకారము వ్యంగ్యమై** యున్నది. అధోలోకములు నిత్యాన్ధకారము గలవి అను భావముతో క్రొత్తగా చీకటి అనునది వ్యాపించి యుండకపోవుటచేత ప్రలయకాలమున మాత్రమే నిదురించు ఏడు ఊర్ధ్వలోకములే ఇట గ్రహింపబడవలసి యున్నవి. అమ్మవారు మహిషుని తన్ని చంపినప్పుడు వానినోటినుండి రక్తధారలు చిమ్మునట్లు చేసి ఆకసమున సన్ధ్యను కలిగించినది. అందువలన అమ్మవారు మరొక సూర్యుడుగా ఉత్ప్రేక్షింపబడుట ఉత్తరార్ధమున అలంకారమై యున్నది. సప్తయస్సప్త యస్మిన్ అనుచోట **యమకాలంకార** మున్నది. 'సుప్తాస్సప్తాపి' 'స్థితిముషి మహిషే' ధారాణాం రౌధిరీణామ్ అను పదబన్ధములలో వృత్త్యనుప్రాసాలంకారము లున్నవి. సూర్యునినుండి బయలుదేరు కాంతియందు ఏడు రంగులున్నవి. అవి వర్షమునకు ముందు వెనుకను సూర్యుని కిరణములు వర్షబిందువుల నుండి దూసుకొని పోయినప్పుడు ఏడు రంగులుగా విభజింపబడి ఇంద్రధనువుగా మనకు కనబడును. సూర్యుని కాంతిలోని ఏడు రంగులే సూర్యుని ఏడు గుఱ్ఱములుగా మన సాహిత్యమున చెప్పబడినవి. ఏకో<u>ఽ</u> శ్వో వహతి సప్త నామా అను వేదమంత్రపాదము కాంతి ఒకటే సప్త నామములు కలిగియున్నదని చెప్పుటచే వెనుక చెప్పబడిన కాంతిలో ఏడురంగులున్నవని ఆధునికశాస్త్రము చెప్పిన విషయమును కొన్నివేల సంవత్సరములకు పూర్వమే మన పూర్వులెఱిగి యున్నారనుట స్పష్టమగుచున్నది. దేవత ప్రకాశరూపమని, రాక్షసుడు అన్ధకారరూపమనియు ఈ శ్లోకము వ్యంజించుచున్నది. *

**అ :** పై శ్లోకమున అమ్మవారు సన్ధ్యను ధరించిన సూర్యుడుగా చెప్పబడినది. ఈ శ్లోకమున **సంధ్యాశ్రయమున సూర్యునందు ఉపాస్యులైన బ్రహ్మ విష్ణు రుద్రులు జయచేత పరిహసింపబడుట** చెప్పబడుచున్నది.

శ్లో॥ దేవారేర్దానవారే! ద్రుతమిహ మహిషచ్ఛద్మనః పద్మసద్మా
నిద్రాతీత్యత్ర చిత్రం తవ కిమితి భవన్నాభిజాతో యతస్సః ।
నాభీతోఽభూః స్వయమ్భూరివ సమరభువి త్వం తు యద్విస్మితాఽస్మీ-
త్యుక్త్వా తద్విస్మయం వః స్మరరిపుమహిషీవిక్రమేఽవ్యాజ్జయాయాః ॥ 69

ప్ర : దానవారే! = ఓ విష్ణూ!, ద్రుతమ్ = శీఘ్రముగా, ఇహ = ఇచట, మహిషచ్ఛద్మనః = మహిష మిషగల, దేవారేః = రాక్షసునివలన, పద్మసద్మా = బ్రహ్మ, నిద్రాతి =నిద్రించుచున్నాడు, ఇతి అత్ర = అను విషయమున, చిత్రమ్ కిమ్ = విస్మయమెందుకు, యతః = ఎందువలన, సః = అతడు (బ్రహ్మ), భవన్నాభిజాతః = నీ నాభినుండి పుట్టిన వాడో, (తతః = అందువలన), భవన్ = ఓ పూజ్యుడా!; సః = ఆతడు, న+అభిజాతః = ఉత్తమవంశీయుడు కాడు గదా!, దానవారే = ఓ శివా!, స్వయమ్భూః ఇవ = బ్రహ్మవలె, సమరభువి = యుద్ధభూమియందు, త్వమ్ = నీవు, న అభీతః అభూః = భయపడని వాడవు కాకపోతివి, ఇతి యత్ = అనునది యేది కలదో, తత్ = అది (దానివలన), విస్మితా అస్మి = విస్మితురాలను అగుచున్నాను, ఇతి = అని, ఉక్త్వా = చెప్పి, స్మరరిపుమహిషీవిక్రమే = శివుని పట్టపురాణియొక్క విక్రమునందు, జయాయాః = జయ యొక్క, తత్ = ఆ, విస్మయమ్ = ఆశ్చర్యము, వః = మిమ్ము, అవ్యాత్ = కాపాడుగాక!

**తా :** ఓ విష్ణూ! మహిషాసురుని యుద్ధమున బ్రహ్మ నిద్రించుచున్నాడని ఏల ఆశ్చర్యపడెదవు. ఆతడు నీ నాభినుండి పుట్టిన వాడగుటచే అభిజాతుడు అనగా ఉత్తమవంశీయుడు కాడు. ఓ శివా! బ్రహ్మవలె నీవును భయపడనివాడవు కాకపోతివి అని అమ్మవారు మహిషుని చంపిన పరాక్రమమునకు అమ్మవారి చెలికత్తె పొందిన ఆశ్చర్యము మిమ్ము కాపాడుగాక!

**వి : దానవారి** అను పదము దానవుల శత్రువు అను అర్థము కలది. విష్ణువు వలె శివుడును కొందఱు దానవుల చంపినను విష్ణువున కాపదము వాచకముగా ప్రసిద్ధమైనట్లు శివవాచకముగా ప్రసిద్ధము కాలేదు. విష్ణువు శివుని అధోక్షము అనగా గుదము నుండి పుట్టినవాడగుటచే అభిజాతుడు ఉత్తమవంశీయుడు కాడు. అట్టి అభిజాతుడు కాని విష్ణువుయొక్క నాభినుండి పుట్టిన బ్రహ్మ ఎట్లు అభిజాతుడగును. అని **భవన్నాభిజాత** శబ్దశక్తివలన ధ్వనించుచున్నది. యతః = ఏ నీ నుండి, సః = వాడు (పుట్టెనో), భవ = ఓ శివా!, భవన్ = ఓ పూజ్యుడా, నాభిజాతః = నీ నాభినుండి పుట్టిన వాడగుటచే, న+అభిజాతః = ఉత్తమవంశీయుడు కాడు అని అన్వయాంతరము చెప్పుట కవకాశముండుట పై ధ్వనికి హేతువగు చున్నది. ప్రసిద్ధము కాకపోయినను ఈ శ్లోకమున దానవారి శబ్దము శివుని గూడ బోధించును. సంబోధనము లేకుండ త్వమ్ అనుట ఉచితము కాదు. కావున **దానవారే అనుపదము శివుని సంబోధనముగా** కూడ ఇట చెప్పవలసివచ్చుచున్నది. అమ్మవారి భర్త యగుటచే శివుని భవచ్ఛబ్దముతో చెప్పుట ఉచితము. ఆతనిని (శివుని) త్వమ్ అని చెప్పి, అభిజాతుడు కాదని నిందింపబడిన బ్రహ్మకు నాభియందు జన్మనిచ్చిన విష్ణువును భవన్ అని అభిముఖీకరించుటచే **వ్యాజనింద** వ్యక్త మగుచున్నది. ఓ శివా! నీవు బ్రహ్మవలె నాభీతః నాభినుండి

వచ్చినావా? కాదే. కానిచో నీవు బ్రహ్మవలె ఏల అభీతః భయరహితుడవు న = కాలేదు అని నాభీత శబ్దశక్తివలన వ్యక్తమగు చున్నది. నాభి శబ్దము ఇకారాంతముగా ఈకారాంతముగా కూడ నుండుటచే పై వ్యక్తికి అవకాశము కలిగినది. అభిజాతులు కాని బ్రహ్మవిష్ణువులు యుద్ధమున మహిషునికి పరాఙ్ముఖులనుటలో వింతలేదు. కాని నీవును బ్రహ్మవలె నాభీతః = అభీతుడవు కాకపోతివి. భీతుడవే అయితివనుట చేతనే విస్మయమొందుచున్నాను అని జయ ఆశ్చర్యము ప్రకటించినది. యుద్ధమున పోరాడవలసిన బ్రహ్మ పోరాడకుండ నిద్రించుచున్నాడు. వర్షాకాలము నాలుగు నెలలు రాత్రింబవళ్ళు నిద్రించు విష్ణువు ఇతర సమయములలో కూడ శేషశయనమందు నిద్రమత్తు వీడక కాబోలు పడుకొనియే యుండును. పద్మసద్మయైన లక్ష్మి పాదములొత్తుచుండగా లేచిన ఈ సుఖము (సోమరితనపు సుఖము) పోవునని కాబోలు లేవక పడుకొనియే ఉండును. అట్టి నిద్రాళు విష్ణునాభిజాతుడైన బ్రహ్మ నిద్రించుటలో వింతలేదనియు ప్రథమార్ధము వ్యంజించును. 'స్వయమ్భూః' అని బ్రహ్మకు పేరున్నది. కాని ఆతడు అమ్మవారి సంకల్పమున శివుని దక్షిణ భాగమునుండి పుట్టినాడు. కావున స్వయమ్భూ శబ్ద మాతనికి చెల్లదు. శరీరములేని శివుడు శరీరధారియగుటచే శరీరముతో స్వయముగ నుద్భవించిన వాడగుటచే స్వయమ్భూ శబ్దము శివుని యందు సహజముగా నున్నది. అర్హత లేకున్నను స్వయమ్భూ అని పేరు పెట్టుకొన్న బ్రహ్మ భయము నొందుటలో వింతలేదు. కాని ఓ యథార్థస్వయమ్భూ! నీవెట్లు మహిషునకు భీతుడవైతి వనుటయు ద్వితీయార్ధమున వ్యంగ్యమగుచున్నది. దేవారే దానవారే అను పదములు అంత్యానుప్రాస శోభితములు. 'మహిషచ్ఛద్మనః పద్మసద్మా' 'భవన్నాభిజాతో నాభీత' 'స్వయమ్భూరివ సమరభువి' 'విస్మితాస్మి ఇతి' అను పదబన్ధములలో **వృత్త్యనుప్రాసము** లున్నవి. *

**అ :** పై శ్లోకమున బ్రహ్మ విష్ణు రుద్రులను జయ పరిహసించుట చెప్పబడినది. ఈ శ్లోకమున దేవరాక్షసు లమ్మవారితో **మహిషుని చంపవలెనని చంపవలదనుట** చెప్పబడుచున్నది.

**శ్లో॥ నిస్త్రింశే నోచితం తే విశసనమురసశ్చణ్డి! కర్మాస్య ఘోరం**
**వ్రీడామస్యోపరి త్వం కురు దృఢహృదయే! ముఞ్చ శస్త్రాణ్యమూని ।**
**ఇత్థం దైత్యైస్సదైన్యం సమ(ము)దమపి సురైస్తుల్యమేవోచ్యమానా**
**రుద్రాణీ దారుణం వో ద్రవయతు దురితం దానవం దారయన్తీ ॥ 70**

**ప్ర :** చణ్డి! = ఓ కోపస్వభావురాలా!, నిస్త్రింశే = ఖడ్గముచేత, ఉరసః = ఱొమ్ముయొక్క, విశసనమ్ = చీల్చుట, న ఉచితమ్ = తగినది కాదు (దైత్యులు) ఉచితము కాదా ( అను కాకుస్వర ప్రయోగమువలన అర్థము చెప్పి) పై వాక్యము దేవతల వాక్యమనియు చెప్పవచ్చును. అస్య = వీని యొక్క, కర్మ = కర్మ, ఘోరమ్ = ఘోరమైనది అని దేవతలు, ఘోరమైనదా? (అని దైత్యులు) ఇటువంటి క్రూరకర్మగల వానిపైనను దయను చేయుము. సోత్ప్రాసముగా దేవతలు, దృఢహృదయే! = ఓ దృఢహృదయము కలదానా!, అమూని = ఈ, శస్త్రాణి = ఆయుధములను, ముంచ = విడువుము, అని దేవతలు, వీని విషయమున ఆయుధములు విడచి పెట్టుమని దైత్యులు, ఇత్థమ్

= ఇట్లు, దైత్యైః = దైత్యులచేత, సదైన్యమ్ = దైన్యయుక్తముగ, సురైః = దేవతలచేత, సముదమ్ = సంతోషముగా, తుల్యమ్ ఏవ = సమానముగానే, ఉచ్యమానా = చెప్పబడుచున్నదై, దానవమ్ = రాక్షసుని, దారయన్తీ = చీల్చుచున్నదై, రుద్రాణీ = రుద్రుని భార్య, వః = మీ యొక్క, దురితమ్ = పాపమును, ద్రవయతు = కరిగించు గాక!

**తా :** ఓ చణ్డీ! ఈ మహిషుని కర్మ ఘోరమైనది. కావున వీని ఱొమ్మును కత్తితో చీల్చుట ఉచితము. వీని మీద దయచూపదగినది కాదు. వీనిపై నీ యాయుధముల ప్రయోగింపుము అని సంతోషముగా దేవతలు, వీని కర్మ ఘోరమా? కత్తితో ఱొమ్ము చీల్చుట ఉచితమా! దయ చూపుము. ఆయుధముల విడచి పెట్టుము అని రాక్షసులచేత దీనముగా సమానవాక్యములచేతనే చెప్పబడుచున్నదై రాక్షసులను జీల్చుచున్నదై రుద్రుని భార్య మీ పాపమును నశింపజేయు గాక!

**వి :** సమదమపి అను పాఠాంతరము ననుసరించి నీ కత్తితో వీని ఱొమ్మును చీల్చవద్దు. వీని యందు దయచూపి ఆయుధముల విడచుట మానుము. త్రొక్కి చంపుము లేనిచో మా సిగ్గు పోవును. అని దేవతలు పల్కినట్లుగా కూడ వ్యాఖ్యానించవచ్చును. నిస్త్రింశే నోచితం తే విశసన-మురసః 'దైత్యైస్సదైన్యమ్', సమ(ము)దమపి సురైః నాల్గవపాదము మొత్తమును వృత్త్యనుప్రాసాలంకార సహితములై యున్నవి. *

**అ :** పై శ్లోకమున దేవీకృతమైన నిస్త్రింశాది శస్త్రములలో సమీపస్థ మహిషునియొక్క దారణము ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున **దూరస్థమహిషునిపై బాణప్రయోగము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ చాతుర్ద్దిక్షు క్షిపన్త్యాశ్చలితకమలినీచారుకోషాభితామ్రం**
**మన్ద్రధ్వానానుయాతం ఝటితి వలయినో ముక్తబాణస్య పాణేః ।**
**చణ్డ్యాస్సవ్యాపసవ్యం సురరిపుషు శరాన్ప్రేషయన్త్యా జయన్తి**
**త్రుట్యన్తః పీనభాగే స్తనవలనభరాత్ సన్ధయః కఞ్చుకస్య ॥ 71**

**ప్ర :** చలితకమలినీచారుకోషాభితామ్రమ్ = కదలిన తామరతీగయొక్క అందమైన కొసవలె మిక్కిలి ఎఱ్ఱనైన, చాతుర్ద్దిక్షు = నాలుగు దిక్కులందు గల, ముక్తబాణస్య = విడువబడిన బాణములు గల, పాణేః = చేతియొక్క, మన్ద్రధ్వానానుయాతమ్ = మన్ద్రధ్వని ననుసరించి, (చక్షుః = చూపును), ఝటితి = వేగముగా, క్షిపన్త్యాః = విసరుచున్న, సవ్యాపసవ్యమ్ = ఎడమకుడులుగా, సురరిపుషు = రాక్షసులయందు, శరాన్ = బాణములను, ప్రేషయన్త్యాః = పంపుచున్న, చణ్డ్యాః = చండియొక్క, స్తనవలనభరాత్ = స్తనముల కదలిక బరువువలన, పీనభాగే = బలిసిన భాగమున, త్రుట్యన్తః = చిఱుగుచున్న, కంచుకస్య = రవికయొక్క, సన్ధయః = సన్ధులు, జయన్తి = సర్వోత్కర్షముగా వర్ధిలుచున్నవి.

**తా :** తామరతీగ మొగ్గవలె నెఱ్ఱనై బాణముల విడచు కడియములు గల చేతియొక్క మన్ద్రధ్వని ననుసరించి వేగముగా విసరుచున్న ఎడమకుడులుగా బాణములను దేవశత్రువులందు పంపుచున్న

అమ్మవారియొక్క బరువైన స్తనముల కదలికకు చిఱుగుచున్న **అవికసన్ధులు** సర్వోత్కర్షముగా వర్ధిలుచున్నవి.

**వి :** అమ్మవారి చూపు తామరతీగ మొగ్గవలె ఎఱ్ఱనిదను చెప్పుటచే ప్రథమపాదమున **లుప్తోపమాలంకార** మేర్పడి యున్నది. రాక్షసులు దిక్కులన్నింట చెలరేగు చుండుటచే అమ్మవారు (తనచూపును) దిక్కులన్నింట వేగముగా బాణములను ప్రసరింపజేయుచున్నది. అట్లే సవ్యాపసవ్య–హస్తములతో బాణముల విసరుచుండగా కడియములు గల కుడిచేయి ఒకసారి, ఎడమచేయి మరొకసారి ధ్వనించుచున్నది అని **పాణి** శబ్దైకవచనమున ధ్వనించుచున్నది. **చక్షు (చాతు) ర్దిక్షు చలితకమలినీ** చారు, ముక్తబాణస్య పాణేః సవ్యాపసవ్యం సురరిపుషు శరాన్ ప్రేషయన్త్యా క్షిపన్త్యా, పీనభాగే స్తనవలనభరాత్ అను పదబన్ధములు వృత్త్యనుప్రాసాలంకృతములై యున్నవి. *

**అ :** పై శ్లోకమున అమ్మవారి శరీరమందలి కంచుకిత స్తనభారము వర్ణింపబడినవి. ఈ శ్లోకమున బాహుస్తనతటోదరనాభిముఖముల కప్పిన **కంచుకకాంచ్యర్ధాంశుకకేశోచ్చయములు** వర్ణింపబడు చున్నవి.

**శ్లో॥ బాహూత్క్షేపసముల్లసత్కుచతటం ప్రాన్తస్ఫుటత్కఞ్చుకం**
**గమ్భీరోదరనాభిమణ్డలగలత్కాఞ్చీధృతార్ధాంశుకమ్ ।**
**పార్వత్యా మహిషాసురవ్యతికరే వ్యాయామరమ్యం వపుః**
**పర్యస్తావధిబన్ధబన్ధురలసత్కేశోచ్చయం పాతు వః ॥ 72**

**ప్ర :** బాహూత్క్షేపసముల్లసత్కుచతటమ్ ప్రాన్తస్ఫుటత్కంచుకమ్ = బాహువులయొక్క పైకెత్తుటచే బాగుగా ప్రకాశించు స్తనతటముయొక్క ప్రాంతమున చినిగిన రవిక గల, గమ్భీరోదరనాభిమణ్డల–గలత్కాంచీధృతార్ధాంశుకమ్ = లోతైన పొట్టపైని బొడ్డు మండలమునుండి జారుచున్న కాంచి చేత పట్టుకొనబడిన సగము చీరగల, పర్యస్తావధిబన్ధబన్ధురలసత్కేశోచ్చయమ్ = విసరబడిన చివఱ ముడులచే దట్టముగా నున్న ప్రకాశించుచున్న కేశముల సమూహముగల, మహిషాసురవ్యతికరే = మహిషాసురసంబన్ధమున, వ్యాయామరమ్యమ్ = వ్యాయామముచేత సుందరమైన, పార్వత్యాః = పార్వతియొక్క, వపుః = శరీరము, వః = మిమ్ము, పాతు = రక్షించుగాక!

**తా :** బాహువు లెత్తుటచే బాగుగా ప్రకాశించుచున్న కుచప్రాంతమున చినిగిన కంచుకము, లోతైన పొట్టమీది బొడ్డు ప్రాంతమునుండి జారుచున్న ఒడ్డాణముచే పట్టుకొనబడిన సగము చీర చివఱలలో ముడులు గలిగి దట్టముగా నున్న కేశముల సమూహము గల, మహిషాసురుని తోడి యుద్ధమున వ్యాయామము కలుగుటచే సున్దరమైన శరీరము మిమ్ము రక్షించుగాక!

**వి :** అమ్మవారు నడుమునకు పై భాగమున రవికె ధరించి యున్నది. బాహువులెత్తి నప్పుడా రవిక స్తనప్రాంతమున చిఱుగుచున్నది. అమ్మవారు నడుము క్రింది భాగమున చీర ధరించి యున్నది.

ఆ చీర జారుచుండగా ఒడ్డాణము ఆ చీరలోని సగభాగమును పట్టుకొని జారకుండ చేయు చున్నది. **కంచుక శబ్దము, కాంచీ శబ్దమును** కచిధాతువునుండి యేర్పడినవి. ఆ ధాతువు ప్రకాశార్థకము. కావున పై శరీరమును ముఖ్యముగా స్తనభాగమును కప్పు కంచుకము, నడుము భాగమును కప్పిన కాంచియు ప్రకాశము కలవి. అంశు(క) శబ్దము కూడ కిరణబోధకము. కావున అదియు ప్రకాశము కలదియే. ప్రకాశరూపములైన **కంచుకకాంచ్యంశుకములు** అమ్మవారి శరీరము ఊర్ధ్వమధ్యాధో భాగముల కప్పి యున్నవి. సముల్లసత్కుచతటమ్ ప్రాంతస్ఫుటత్కంచుకమ్ గంభీరోదరనాభి'చ మణ్డలగలత్కాంచీధృతార్ధాంశుకమ్', 'మహిషాసురవ్యతికరే', వ్యాయామరమ్యమ్ పర్యస్తావధిబన్ధబన్ధురలసత్కేశోచ్ఛయమ్' అను పదబన్ధములు వృత్త్యనుప్రాసాలంకృతములై యున్నవి. మొదటి మూడవ పాదములలో దాక్షిణాత్యమైన వర్ణమైత్రి (వళి) కన్పించుచున్నది. ఈ శ్లోకము **శార్దూలవిక్రీడిత** వృత్తమున నిబంధింపబడి యున్నది. 'మసజసతతగ', అను గణములు, 19 అక్షరము లందుండును. 12 వర్ణముల పిదప విరామ ముండును. *

**అ :** పూర్వశ్లోకమున అమ్మవారి బాణప్రయోగము చెప్పబడినది. ఈ శ్లోకమున ఆమె **శూల ప్రయోగము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ పాదావష్టమ్భనమ్రీకృతమహిషతనోరుల్లసద్బాహుమూలం**
**శూలం ప్రోల్లాసయన్త్యాస్సరలితవపుషో మధ్యభాగస్య దేవ్యాః ।**
**విశ్లిష్టస్పష్టదృష్టోన్నతవిరలబహువ్యక్తగౌరాన్తరాలా-**
**స్తిస్రో వః పాన్తు రేఖాః క్రమవశవికసత్కఞ్చుకప్రాన్తముక్తాః ॥ 73**

**ప్ర :** పాదావష్టమ్భనమ్రీకృతమహిషతనోః = పాదముయొక్క నిశ్చలతచేత వంచబడిన మహిషుని శరీరముగల, ఉల్లసద్బాహుమూలమ్ = పైకి కాంతిని జిమ్ము బాహుమూలములు గలుగునట్లుగా, శూలమ్ = శూలమును, ప్రోల్లాసయన్త్యాః = మెఱపించుచున్న, సరలితవపుషః = ఋజువైన శరీరముగల, దేవ్యాః = అమ్మవారియొక్క, విశ్లిష్టస్పష్టదృష్టోన్నతవిరలబహువ్యక్తగౌరంతరాలాః = విడిపోయిన, స్పష్టముగా చూడబడిన, ఎత్తైన కొంచెమైన, ఎక్కువగా కనబడిన తెల్లని మధ్యభాగము గల, క్రమవశవికసత్కంచుకప్రాన్తముక్తాః = క్రమముగా వశములై వికసించుచున్న కంచుకము యొక్క చివఱ నుండి విడివడిన, తిస్రః = మూడు, (పాండు) రేఖాః = (తెల్లని) రేఖలు, వః = మిమ్ము, పాన్తు = రక్షించు గాక!

**తా :** అమ్మవారు మహిషుని శరీరముపై పాదము మోపినందునవలన ఆ శరీరము వంగిపోయినది. తన బాహుమూలములు ప్రకాశించునట్లుగా శూలమును వాని శరీరముపై గ్రుచ్చుచుండగా ఆమె శరీరము ఋజువుగానైనది. అప్పుడా వళుల లోపలి (తెల్లని) మూడు రేఖలు బయల్పడి కంచుకము క్రిందుగా నుండుటచే నిరావరణములై కనిపించుచున్నవి. అవి మిమ్ము కాపాడుగాక!

**వి :** వక్రస్వభావము గల మహిషుడు వంగుట, ఋజుస్వభావము గల దేవి సరళముగా నుండుట.

ప్రవర్తనవలన లోకమున కలుగుగా పతనోత్థానములకు వ్యంజకములు. సాధారణస్థితినుండి పతనమును వంగుట, సాధారణస్థితి నుండి ఉత్థానమునకు సరలత వ్యంజింప జేయును. నమ్రీకృత మహిషతనోః, శూలమ్ ప్రోల్లాసయన్త్యాస్సరలిత', 'విశ్లిష్టస్పష్టదృష్టో', 'గౌరాంతరాలా' అనుచోట్ల వృత్త్యనుప్రాసాలంకారము లున్నవి. *

**అ :** పై శ్లోకములలో మహిషునితో అమ్మవారి యుద్ధము వర్ణింపబడినది. ఈ శ్లోకమున **హరిహరుల ఆయుధములు వ్యర్థములగుట** చెప్పబడినది.

**శ్లో॥ చక్రం చక్రాయుధస్య క్వణతి నిపతితం రోమణి గ్రావణీవ**
**స్థాణోర్బాణశ్చ లేభే ప్రతిహతిమురుణా చర్మణా వర్మణేవ ।**
**యస్యేతి క్రోడగర్భా హసితహరిహరా తస్య గీర్వాణశత్రోః**
**పాయాత్పాదేన మృత్యుమ్మహిషతనుభృతః కుర్వతీ పార్వతీ వః ॥ 74**

**ప్ర :** గ్రావణీవ = రాతియందువలె, యస్య = ఎవనియొక్క, రోమణి = రోమమునందు, చక్రాయుధస్య = విష్ణువుయొక్క, చక్రమ్ =చక్రము, నిపతితమ్ = పడినదై, క్వణతి = ధ్వనించు చున్నదో, స్థాణోః = శివునియొక్క, బాణః చ = బాణమును, వర్మణా ఇవ = కవచముతో వలె, ఉరుణా = గొప్పవైన, చర్మణా = చర్మముతో, ప్రతిహతిమ్ = ఎదురుదెబ్బను, లేభే = పొందునో, ఇతి = అని, హసిత–హరిహరా = హరిహరుల వెక్కిరించిన, క్రోడగర్భాః = వరాహగర్భమువంటి గర్భము గల, పార్వతీ = పార్వతి, తస్య = ఆ, మహిషతనుభృతః = మహిషశరీరధారియైన, గీర్వాణశత్రోః = రాక్షసునియొక్క, మృత్యుమ్ = మరణమును, పాదేన = పాదముతో, కుర్వతీ = చేయుచున్నదై, పాయాత్ = రక్షించుగాక!

**తా :** మహిషుని జాతివంటి రోమమునకు తగిలి విష్ణుని చక్రము మ్రోగినది. శివుని బాణము వాని కవచమువంటి చర్మమునకు తగిలి ఎదురు దెబ్బను పొందినది. అని హరిహరుల నపహసించిన పార్వతి మహిషాసురుని పాదముతో చంపుచున్నదై మిమ్ము కాపాడుగాక!

**వి :** మహిషుని రోమము రాయివంటిదని, వాని చర్మము కవచము వంటిదని వ్యక్తమగుటచే పూర్వార్థమున **అతిశయోక్త్యలంకారవ్యక్తి** ఉన్నది. 'రోమణి గ్రావణీవ', 'చర్మణా వర్మణేవ', 'గీర్వాణశత్రోః మృత్యుం కుర్వతీ పార్వతీ', 'హసితహరిహరా' అను పదబన్ధములలో వృత్త్యనుప్రాసాలంకారము లున్నవి. *

**అ :** పై శ్లోకమున అమ్మవారు హరు నపహసించుట చెప్పబడినది. ఈ శ్లోకమున హరునివలె మహిషుని పాదమును క్షేపించుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ కృత్వా వక్త్రేన్దుబిమ్బం చలదలకలసద్భ్రూలతాచాపభఙ్గం**
**క్షోభవ్యాలోలతారం స్ఫురదరుణరుచిస్ఫారపర్యన్తచక్షుః ।**

**సన్ధ్యాసేవాపరాద్ధం భవమివ పురతో వామపాదామ్బుజేన**
**క్షిప్తం దైత్యం క్షిపన్తీ మహిషితవపుషం పార్వతీ వః పునాతు ॥ 75**

**ప్ర :** వక్త్రేన్దుబింబమ్ = చంద్రబింబమువంటి ముఖమును, చలదలకలసద్భ్రూలతాచాపభంగమ్ = కదలుచున్న ముంగురులతో ప్రకాశించుచున్న వింటివంటి కనుబొమ ముడి గలుగునట్లుగా, క్షోభవ్యాలోలతారమ్ = కలతతో కదలు గ్రుడ్లు కలుగునట్లుగా, స్ఫురదరుణరుచిస్ఫారపర్యన్తచక్షుః = కదులుచున్న ఎఱ్ఱని కాంతిగల విప్పారిన కటాక్షము గలుగునట్లుగా, కృత్వా = చేసి, పురతః = ఎదుట, సన్ధ్యాసేవాపరాద్ధమ్ = సన్ధ్యను సేవించి అపరాధియైన, భవమ్ ఇవ = శివుని వలె, వామపాదామ్బుజేన = ఎడమ కమలమువంటి పాదముతో, క్షిప్తమ్ = నెట్టబడిన, మహిషితవపుషమ్ = మహిషశరీరముగల, దైత్యమ్ = రాక్షసుని, క్షిపన్తీ = నెట్టుచున్న, పార్వతీ = పార్వతి, వః = మిమ్ము, పునాతు = పవిత్రుల నొనర్చుగాక!

**తా :** ముఖమున చూపులెఱ్ఱపడి, అలకలు కనుబొమలు ముడివడగా చలించగా సన్ధ్యను సేవించి అపరాధియైన శివునెడమ పాదముతో త్రోసినట్లు మహిషాసురుని త్రోసిన పార్వతి మిమ్ము పవిత్ర మొనర్చుగాక!

**వి :** కనుబొమల ముడుచుట, కనుగ్రుడ్లు నటునిటు త్రిప్పుట, కనులెఱ్ఱబడుట అను మూడు కోపచిహ్నములను అమ్మవారు ముఖమున ధరించి యున్నవని పూర్వార్ధము చెప్పుచున్నది. వక్త్రేన్దుబిమ్బమ్ అను సమాసమున **లుప్తోమాలంకార** మున్నది. 'క్షోభవ్యాలోలతారమ్' అను సమాసములోని తార శబ్దము చుక్కలను, కనుగ్రుడ్లను తెలుపును. ఉత్తరార్ధమున **సన్ధ్యాశబ్దము** స్త్రీలింగము అగుటచే సన్ధ్యయందు నాయకత్వము వ్యంజింపబడినది. అందుకు కోపించిన అమ్మవారు శివునెదుట బ్రతిమాలుచుండగా నెడమ పాదముతో త్రోసివేసినట్లు మహిషాసురు నెడమపాదముతో త్రోసివేయుట చెప్పబడినందున అపరాధి నెడమకాలితో త్రోయుటయే తగిన శిక్ష అని వ్యక్తమగుచున్నది. శివుని త్రోయుట అనురాగముతో, మహిషుని త్రోయుట కోపమున, కావున శివుడు సంతసించుట మహిషుడు చచ్చుట జరిగినవని, పాదముతో విసరుట నిమిత్తమాత్రమే అని అమ్మవారి సంకల్పము చేతనే వాడు చచ్చుట జరిగినదనియు వ్యంగ్యమగుచున్నది. '**చలదలకలసద్భ్రూలతాచాపభంగమ్**', క్షోభవ్యాలోలతారమ్', 'స్ఫురదరుణరుచిస్ఫారపర్యన్తచక్షుః', 'భవమివ పురతో వామపాదామ్బుజేన', 'క్షిప్తం దైత్యం క్షిపన్తీ మహిషితవపుషం', 'పార్వతీ వః పునాతు' అను పదబన్ధములలో వృత్త్యను ప్రాసాలంకారము లున్నవి. *

**అ :** పై శ్లోకమున అమ్మవారు సన్ధ్యయందలి అసూయతో శివుని పాదముతో ప్రహరించుట చెప్పబడినది. ఈ శ్లోకమున **గంగయందలి అసూయతో శివునట్లు చేయుట** చెప్పబడుచున్నది. (మహిషునకు శివునకువలె పాదప్రహారము రెండు శ్లోకములలో సమానముగా నున్నది.)

శ్లో॥ గఙ్గాసమ్పర్కదుష్యత్కమలవనసముద్ధూతధూలీవిచిత్రో
వాఞ్ఛాసమ్పూర్ణభావాదధికతరరసం తూర్ణమాయాత్సమీపమ్ ।
క్షిప్తః పాదేన దూరం వృషగ ఇవ యయా వామపాదాభిలాషీ
దేవారిః కైతవావిష్కృతమహిషవపుః సాఽవతాదమ్బికా వః ॥ 76

ప్ర : గంగాసమ్పర్కదుష్యత్కమలవనసముద్ధూతధూలీవిచిత్రః = గంగయొక్క సంపర్కమున చిందఱ వందఱైన కమలవనమునుండి పుట్టిన ధూలిచేత చిత్రవర్ణమును విశేషము నొందిన వాడు, వాంఛా-సమ్పూర్ణభావాత్ = వాంఛ సమ్పూర్ణ మగుటవలన, అధికతరరసమ్ = ఎక్కువ సంతసము కలుగునట్లు, తూర్ణమ్ = శీఘ్రముగా, సమీపమ్ = దగ్గఱకు, ఆయాత్ = వచ్చెను, వామపాదాభిలాషీ = ఎడమకాలిని కోరిన, వృషగ ఇవ = శివునివలె, కైతవావిష్కృతమహిషవపుః = కపటమున బయట పెట్టిన దున్న శరీరముగల, దేవారిః = రాక్షసుడు, యయా = ఎవతె చేత, పాదేన = పాదముతో, దూరమ్ = దూరముగా, క్షిప్తః = విసరివేయబడెనో, సా = ఆ, అమ్బికా = అమ్మవారు, వః = మిమ్ము, అవతాత్ = కాపాడుగాక.

**తా :** గంగయొక్క సంపర్కమువలన గంగలోని కమలవనము చిందవందఱ కాగా అందలి దుమ్ము శరీరము విచిత్ర వర్ణము కలదిగా మార్చబడగా ఎక్కువ కోరికతో సంతసమున సమీపించగా ఎడమకాలిని కోరిన శివునివలె ఎడమ పాదముతో దూరముగా మహిషాసురుని నెట్టివేసిన పార్వతి మిమ్ము కాపాడుగాక!

**వి :** గంగా సంపర్కమున శివుని శరీరముపై కమలములలోని పుప్పొడి పడగా ఆతని రంగు మారి విచిత్రవర్ణము గలవాడయ్యెను. ఆ పుప్పొడి సువాసనతో శివునిలోని కామము అధికముకాగా సంతోషమున అమ్మవారిని సమీపించెను. కొంతసేపటికి తనమీది పుప్పొడికి గంగాసంపర్కము కారణమని యెఱిగిన శివుడు తనను వామపాదము తోడనే సత్కరించునని తెలిసికొనియే ఇప్పటికది చాలు లెమ్మని సంతృప్తి నొందెను. మహిషుడును అట్లే సమీపించెను. వాని వర్ణము నల్లనిదైనను గంగలో పొరలాడుటచే అందులోని కమలముల పుప్పొడితో వాని శరీరమును విచిత్రవర్ణము గలదయ్యెను. వాడు సమీపించగా శివునివలెనే ఎడమకాలితో దూరముగా నెట్టివేసెను. అమ్మవారి సంపర్కమును కోరుటలో శివుని కర్హత యున్నది. అర్హతలేకపోయినను ఆశించిన మహిషుడు మృత్యువు వాత బడినాడు. అనుచితసంగమాభిలాష ఇట్టి ఫలితము కలిగి యుండుననుట శ్లోకములోని వ్యంగ్యము. 'కమలవనసముద్ధూత', 'అధికతరరసం తూర్ణమాయాన్సమీపమ్', 'దేవారిః కైతవావిష్కృతమహిషవపుః' అను పదబన్ధములు వృత్త్యనుప్రాసాలంకారయుతములై యున్నవి. *

**అ :** పై శ్లోకములలో శృంగారనాయకునకు లభింపవలసిన వామపాదప్రహారము మహిషునకు లభించుట చెప్పబడినది. ఈ శ్లోకమున **రసాభాసహేతువులైన మహిషుని సరసవచనములు** చెప్పబడుచున్నవి.

శ్లో॥ భద్రే! భ్రూచాపమేతన్నమయసి ను వృథా విస్ఫురన్నేత్రబాణం
నాహం కేలౌ రహస్యే ప్రతియువతికృతాఖ్యాతిదోషః పినాకీ ।
దేవీ సోత్ప్రాసమేవం ధృతమహిషతనుం దృప్తమన్తస్సకోపం
దేవారిం పాతు యుష్మానతిపరుషపదా నిఘ్నతీ భద్రకాలీ ॥ 77

ప్ర : భద్రే = ఓ భద్రురాలా!, విస్ఫురన్నేత్రబాణమ్ = అదరుచున్న నేత్రము (చూపు) అను బాణము కల, ఏతత్ = ఈ, భ్రూచాపమ్ = వింటివంటి కనుబొమను, వృథా = వ్యర్థముగా, నమయసి ను = వంచుచున్నావు గదా, అహమ్ = నేను, కేలౌ రహస్యే = రహస్యకేలీ సమయమున, ప్రతియువతి–కృతాఖ్యాతిదోషః = సవతి పేరు చెప్పుట అను దోషము చేసిన, పినాకీ = శివుడను, న = కాను, ఏవమ్ = ఇట్లు, సోత్ప్రాసమ్ = ఎకసెక్కెమాడు, దృప్తమ్ = గర్వించుచున్న, ధృతమహిషతనుమ్ = దున్న శరీరమును ధరించిన, దేవారిమ్ = రాక్షసుని, అన్తః = లోపల, సకోపమ్ = కోపముతో, అతిపరుషపదా = మిక్కిలి కఠినమైన పాదము గలుగునట్లుగా, నిఘ్నతీ = చంపుచున్న, భద్రకాలీ = భద్రకాలి అను పేరుగల, దేవీ = దేవి, యుష్మాన్ = మిమ్ము, పాతు = కాపాడుగాక!

**తా :** ఓ చణ్డీ! వింటివంటి కనుబొమను వంచి బాణముల వంటి చూపులతో యేల చూచెదవు? రతికేళీ సమయములో సవతి పేరు పొరపాటున పలికిన శివుడను కాను నేను. ఇట్లెకసక్కెమాడు మహిషుని మిక్కిలి కఠినమైన పాదముతో చంపిన భద్రకాళి మిమ్ము కాపాడుగాక!

**వి :** నేత్రము బాణముగా, కనుబొమ చాపముగా రూపింపబడుటచే ప్రథమపాదమున **రూపకాలంకార** మున్నది. దక్షిణనాయకుడు ఒక నాయిక దగ్గఱ మరొక నాయిక పేరు చెప్పుట అను పొరపాటు లోకమున కనిపించు నట్టిదే. నేనట్టి దోషము చేయనివాడను. నీపై శుద్ధప్రేమను గలవాడను. కావున నీకు సవతి ఉండదు. కావున నీవు నన్నంగీకరించవలెను. అను మహిషుని పలుకు అమ్మవారికి మిక్కిలి కోపము కలిగించినది. అందుచేతనే మహిషుని గట్టిగా తన్నగా వాడు చచ్చెనను అర్థము శ్లోకమున వ్యంగ్యమ. 'భద్రే భ్రూ', 'చాపమేతన్నమయసి ను', 'ప్రతియువతికృతాఖ్యాతి', 'ధృతమహిషతనుమ్', 'పాతు యుష్మానతిపరుషపదా' అను పదబన్ధములలో వృత్త్యనుప్రాసాలంకారము లున్నవి. *

**అ :** పై శ్లోకమున మహిషుని **శృంగారరసాభాసహేతుప్రసంగము** కొంత చెప్పబడినది. ఈ శ్లోకమున **మరికొంత** చెప్పబడు చున్నది.

శ్లో॥ అన్యోన్యాసఙ్గగాఢవ్యతికరదలితభ్రష్టకాపాలమాలాం
శమ్భోస్సంత్యజ్య సఙ్ఖ్యే ఖురపుటదలితప్రోల్లసద్ధూలిపాణ్డుః ।
భద్రే! క్రీడాభిమర్దీ తవ సవిధమహం కామతః ప్రాప్త ఈశో–
ఽత్రైవం సోత్ప్రాసమవ్యాన్మహిషసురరిపుం నిఘ్నతీ పార్వతీ వః ॥ 78

ప్ర : శమ్భోః = శివునియొక్క, సంఖ్యే = యుద్ధమున, అన్యోన్యాసంగగాఢవ్యతికరదలితభ్రష్ట–

కాపాలమాలామ్ = పరస్పరము పెనుగులాట అను సంబంధమున విఱిగిన జారిన కపాలములతో చేయబడిన మాలను, సంత్యజ్య = విడచి, ఖురపుటదలితప్రోల్లసద్ధూలిపాండుః = గిట్టలచే (చిన్న) ముక్కలుగా చేయబడిన పైకి ప్రకాశించుచున్న, ధూలితో తెల్లబడిన వాడై, భద్రే! = ఓ భద్రురాలా!, క్రీడాభిమర్దీ = క్రీడలో బాగుగా మర్దించువాడను, తవ = నీ యొక్క, సవిధమ్ = దగ్గఱకు, కామతః = కామమువలన, అత్ర = ఇటకు, ప్రాప్తః = చేరిన, ఈశః = ఈశుడను, ఏవమ్ = ఇట్లు, సోత్ర్పాసమ్ = ఎకసక్కెమాడు, మహిషసురరిపుమ్ = మహిషాసురుని, నిఘ్నతీ = చంపుచున్న, పార్వతీ = పార్వతి, వః = మిమ్ము, అవ్యాత్ = కాపాడుగాక!

**తా :** శివునితో పెనుగులాడుచుండగా ఆతని కపాలమాల విఱిగి జారిపడి యుద్ధభూమియందు శత్రుపరాజయచిహ్నముగా గ్రహింపవలసియున్నను దాని నా యుద్ధభూమిలోనే వదలిన మహిషాసురుడు గిట్టల తాకిడితో రేగిన దుమ్ముతో తెల్లబడిన శరీరము కలవాడై అమ్మవారి కడకు వచ్చి నేను క్రీడలో బాగుగా మర్దించువాడను, కోరికతో వచ్చిన ఈశుడనే అని ఎకసక్కెముగా పలుకుచున్న మహిషు నమ్మవారు చంపినది. అట్టి అమ్మవారు మిమ్ము కాపాడుగాక!

**వి :** ఒడలు తెల్లగా ఉండుట శివునియొక్క లక్షణము. నల్లని తన శరీరమును గిట్టలవలన రేగిన దుమ్ము తెల్లగా చేసినది. పార్వతిని భ్రమింపజేయుట కిది చాలునని మహిషుడు భావించినాడు. కపాలమాల శివుని మరొక లక్షణము. అది యేమైనదని పార్వతి అడిగిన మహిషుని తోడి యుద్ధమున విఱిగి యుద్ధభూమిలో నెటనో పడిపోయినదని చెప్పవచ్చు ననుకున్నాడు. ఒకవేళ అమ్మవారు మహిషుడని గుర్తించినచో ఓడినవాని భార్య గెలిచిన వానిదే గదా! శివుని నోడించి వచ్చితిని, ఆతని వలెనే తెల్లగానే ఉన్నాను గదా అని చెప్పవచ్చు ననుకొన్నాడు. ఈశుడను కామము వలన నీ దగ్గఱకు ఇటకు వచ్చితినని చెప్పగానే అమ్మవారు వానిని చంపినది. వాని తలంపులును వానితో పాటే చచ్చినవి అని శ్లోకమున వ్యంగ్యమగు నర్థము. '**కాపాలమాలాం**', 'తవ సవిధమ్' అను పదబన్ధములలో వృత్త్యనుప్రాసాలంకారము లున్నవి. *

**అ :** పై శ్లోకమున శివుని కపాలమాలాభ్రంశము చెప్పబడినది. ఈ శ్లోకమున **విష్ణువు చక్రము యొక్క మహిషభేదనాశక్తత** చెప్పబడుచున్నది.

**శ్లో॥ జ్వాలాధారాకరాలం ధ్వనితకృతభయం యం ప్రభేత్తుం న శక్తం**
**చక్రం విష్ణోర్దృఢాశ్రి ప్రతివిహతరయం దైత్యమాలావినాశి ।**
**క్షుణ్ణస్తస్యాస్థిసారో విబుధరిపుపతేః పాదపాతేన యస్యా**
**రుద్రాణీ పాతు సా వః ప్రశమితసకలోపప్లవా నిర్వ్యఘాతమ్ ॥ 79**

ప్ర : జ్వాలాధారాకరాలమ్ = జ్వాలల ధారలతో క్రూరమైన, ధ్వనితకృతభయమ్ = ధ్వనితో భయమును కలిగించు, దృఢాశ్రి = గట్టి అంచులుగల, దైత్యమాలావినాశి = రాక్షసుల వరుసలను నశింపజేయు, విష్ణోః = విష్ణువుయొక్క, చక్రమ్ = చక్రము, ప్రతివిహతరయమ్ = కొట్టబడిన వేగము కలదై,

యమ్ = ఎవని, ప్రభేత్తుమ్ = భేదించుటకు, న శక్తమ్ = శక్తము కాదో, తస్య = ఆ, విబుధరిపుపతేః = రాక్షసపతియొక్క, అస్థిసారః = ఎముకల గట్టితనము, యస్యాః = ఎవతె యొక్క, పాదపాతేన = తన్నుటచేత, క్షుణ్ణః = నలిగిపోయినదో, ప్రశమితసకలోపప్లవా = అందఱి పీడల తొలగించిన, సా = ఆ, రుద్రాణీ = రుద్రుని భార్య, నిర్విఘాతమ్ = అడ్డు లేకుండగా, వః = మిమ్ము, పాతు = కాపాడుగాక!

**తా :** గట్టి అంచులతో జ్వాలలతో రాక్షసుల వరుసల నశింపజేసిన, ధ్వనితోడనే భయమును కలిగించు విష్ణువు చక్రము తన వేగమును కోల్పోయినదై మహిషుని భేదించలేక పోయినది. అట్టి మహిషుని గట్టి యెముకలు త్రొక్కి తుక్కు చేసిన, సర్వపీడలను తొలగించిన ఆ రుద్రాణి మిమ్ము నిర్విఘ్నముగా కాపాడుగాక!

**వి :** 'ధ్వనితకృతభయమ్', 'ప్రతివిహతరయమ్' అను పదములలో **పదాన్తాను**ప్రాసమున్నది. 'జ్వాలాధారాకరాలమ్', 'విబుధరిపుపతేః పాదపాతేన' అను సమాసములు వృత్త్యనుప్రాసశోభితములు. వః ప్రశమితసకలోపప్లవా అను పదములు పదాన్తానుప్రాసశోభితములు. యం రం లం అను బీజములు నిర్బిందువులుగాను ఈ శ్లోకమున ప్రయుక్తములైనవి. ప్రథమచతుర్థపాదములలో పాదాన్తానుప్రాసమును ఉన్నవి.

*

**అ :** పై శ్లోకమున చక్రపాణి (విష్ణు) చక్రముయొక్క అశక్తత చెప్పబడినది. ఈ శ్లోకమున **శక్తియొక్క శూలపాణిత** చెప్పబడుచున్నది.

**శ్లో॥ గాఢావష్టమ్భపాదప్రబలభరనమత్పూర్వకాయోర్ధ్వభాగం**
**దైత్యం సఞ్జాతశిక్షం జనమహిషమివ న్యక్కృతాగ్ర్యాఙ్గభాగమ్ ।**
**ఆరూఢా శూలపాణిః కృతవిబుధభయం హన్తుకామం సగర్వం**
**దేయాద్వశ్చిన్తితాని ద్రుతమహిషవధావాప్తతుష్టిర్భవానీ ॥ 80**

**ప్ర :** గాఢావష్టమ్భపాదప్రబలభరనమత్పూర్వకాయోర్ధ్వభాగమ్ = గట్టిగా మోపిన పాదముయొక్క, బలముయొక్క బరువుచేత వంగుచున్న శరీరోర్ధ్వభాగముగల, సంజాతశిక్షమ్ = శిక్షణమును పొందిన, న్యక్కృతాగ్ర్యాంగభాగమ్ = వంచిన ముందు శరీరము గల, జనమహిషమ్ ఇవ = జనుల (చే నెక్కబడు) దున్న వంటి, కృతవిబుధభయమ్ = దేవతలకు భయము కలిగించిన, సగర్వమ్ = గర్వముగల, హంతుకామమ్ = చంపుకోరిక గల, దైత్యమ్ = రాక్షసుని, ఆరూఢా = ఎక్కిన, శూలపాణిః = శూలముచేతగల, ద్రుతమహిషవధావాప్తతుష్టిః = గట్టిగా నున్న మహిషుని చంపుటచేత పొందబడిన సంతోషముగల, భవానీ = భవుని భార్య, వః = మీ యొక్క, చిన్తితాని = కోరిన వానిని, దేయాత్ = ఇచ్చుగాక!

**తా :** గట్టిగా పాదము మోపుటచేత మహిషుడు తన ముందు భాగము వంగిపోయి యుండగా ఎక్కుటకు వీలుగా వంగు అభ్యాసముయొక్క శిక్షణము గల జనులచే నెక్కబడు మహిషమువలె కనబడిన మహిషుడు గర్వముతో అమ్మవారినే చంపు కోరిక కలవాడై యుండగా ఆ రాక్షసుని

చంపి మహిషుని వధించుటచేత కలిగిన తుష్టిగల భవుని భార్య మీరు చింతించిన ఇష్టములను ఇచ్చుగాక!

**వి :** ఎత్తైన మహిషము నెక్కవలె ననిన దాని ముందు భాగమో వెనుక భాగమో వంగి యుండవలెను. అరుదుగానైనను దున్నలపై నెక్కుట పల్లెలో చూచుచుందుము. దున్న నెక్కిన వాడు కనబడినప్పుడు పెద్దవారికి యముడు జ్ఞప్తికి వచ్చును. ఓపిక గలిగి ఎంతదూరమైనను ప్రయాణించగల దున్నలు వాహనములుగా చేసికొను వారును అక్కడక్కడ తారసపడుచుందురు. శిక్షితము లైనచో గుఱ్ఱములు ఏనుగులు మొదలగు జంతువులవలె దున్నలు కూడ ఎక్కువారి కనుకూలముగా వంగు చుండును. అమ్మవారు మహిషుని త్రొక్కగానే వాని ముందుభాగము వంగి పోయెను. ఆ సమయమున అమ్మవారి నెక్కించు కొనవలెనని వంగిన దున్నవలెనే ఆ రాక్షసుడుండెను. కాలుడు దండపాణి. మహాకాలుడు **శూలపాణి**. మహాకాలుడైన భవుని భార్య శూలపాణియైన మహాకాలి యయ్యెనని శూలపాణి శబ్దము వ్యంజింప జేయును. కోరికలను తీర్చుకొనుటకు కొందఱు మహాకాలికి దున్నలను బలి యిచ్చెదరు. ఆ బలితో ఆమెకు సంతోషము కలుగును. ఇప్పుడును మహిషవధచేత అట్టి సంతోషమే భవానికి కలిగినది అని నాలుగవపాదము వ్యజించుచున్నది. పూర్వార్ధములోని రెండు పాదములు పాదాంతానుప్రాసము కలిగి యున్నవి. **యం వం షం సం గం** అను బీజములు సబిందువులుగా నిర్బిందువులుగా ప్రయుక్తములై యున్నవి. ప్రథమపాదము గకారాది శకారాన్తమై యున్నది. 'అవష్టంభ పాదప్రబలభరనమత్పూర్వకాయోర్ధ్వభాగమ్', 'న్యక్కృతాగ్ర్యాంగభాగమ్', 'వధావాప్తతుష్టిర్భవానీ' అను పదబన్ధములలో **వృత్త్యనుప్రాసము** లున్నవి. *

**అ :** పై శ్లోకమున అమ్మవారు శూలపాణియై శివు ననుకరించుట చెప్పబడినది. ఈ శ్లోకమున **శివుడు ధూర్జటియై పార్వతి ననుకరించుట మహిషపరిహాసహేతువుగా** చెప్పబడుచున్నది.

**శ్లో॥ బ్రహ్మా యోగైకతానో విరహభవభయాద్ధూర్జటిః స్త్రీకృతాత్మా**
**వక్షః శౌరేర్విశాలం ప్రణయకృతపదా పద్మవాసాధిశేతే ।**
**యుద్ధక్ష్మామేవమేతే విజహతు ధిగిమం యస్త్యజత్యేష శక్రో**
**దృప్తం దైత్యేన్ద్రమేవం సుఖయతు సమదా నిఘ్నతీ పార్వతీ వః ॥ 81**

**ప్ర :** బ్రహ్మా = బ్రహ్మ, యోగైకతానః = యోగనిష్ఠ కలవాడు, ధూర్జటిః = శివుడు, విరహభవభయాత్ = (పార్వతి) విరహమువలన కలిగిన భయమువలన, స్త్రీ కృతాత్మా = తనను ఆడుదానినిగా చేసికొనినాడు, శౌరేః = విష్ణువుయొక్క, విశాలమ్ = వెడల్పైన, వక్షః = ఱొమ్మును, ప్రణయకృతపదా = ప్రేమకు చేయబడిన స్థానముకల, పద్మవాసా = లక్ష్మి, అధిశేతే = పడుకొని యున్నది. ఏతే = వీరు, ఏవమ్ = ఈ విధముగా, యుద్ధక్ష్మామ్ = యుద్ధభూమిని, విజహతు = వదలుదురుగాక!, యః = ఏ, ఏషః = ఈ, శక్రః = ఇన్ద్రుడు, త్యజతి = విడుచుచున్నాడో, ఇమమ్ = వీనిని (ఇన్ద్రుని) గూర్చి, ధిక్ = ధిక్కారము, ఏవమ్ = ఇట్లు, దృప్తమ్ = గర్వించిన, దైత్యేన్ద్రమ్ = రాక్షసేన్ద్రుని,

నిఘ్నతీ = చంపుచున్న, సమదా = ముదముతో కూడిన, పార్వతీ = పార్వతి, వః = మిమ్ము, సుఖయతు = ఆనందింపజేయుగాక!, అమృతీకరించుగాక! తర్పింపజేయుగాక!

**తా :** బ్రహ్మ యోగనిష్ట గలవాడు. శివుడు జడల భారముతో విరహమువలన తనను స్త్రీగా చేసికొన్నాడు. విష్ణువుయొక్క విశాలమైన ఱొమ్మున ప్రేమతో లక్ష్మి పడుకొని యున్నది. ఈ ముగ్గురు యుద్ధభూమిని వదలిన వదలుదురు గాక. కాని ఈ యింద్రుడు యుద్ధభూమిని వదలుట మాత్రము నిందింపదగినదే.

**వి :** యుద్ధభూమినుండి తప్పించుకొనుటకు మొదటినుండియే యోగసాధనమును మిషగా చేసికొనియున్న బ్రహ్మ యుద్ధము చేయడని మహిషుడు ముందే నిశ్చయించుకొని యున్నాడు. కావున ఆతడు యుద్ధము చేయకపోవుట మహిషునకు తప్పనిపించలేదు. అట్లే పార్వతీవిరహమునకు కారణమైన యుద్ధము చేయవలసివచ్చునేమో యని శివుడు జడలు పెంచుకొనుచు ఆడు దాని ననుకరించుచున్నాడు. యుద్ధము చేయవలసి వచ్చుననియే దానిని తప్పించుకొనుటకే ఆ పని శివుడొనర్చినాడని యెఱిగిన మహిషుడు శివుడు యుద్ధమునకు రాకపోవుటను తప్పుగా పరిగణించలేదు. విష్ణువు లక్ష్మికి తనమీద ప్రేమ యున్నదని యెఱిగి యుద్ధము తప్పించుకొనుటకు ఆమెను ఱొమ్మున ధరించి ఆమె నిద్రించుచున్నను ఆమెను ఱొమ్మునుండి బయటపడనీయుట లేదు అని యెఱిగిన మహిషుడు విష్ణువు యుద్ధముచేయకపోవుట తప్పుగా పరిగణింపలేదు. కాని ఇన్ద్రుడు యుద్ధము చేయుదునని వీరాలాపము లాడుచు సమయము వచ్చుసరికి యుద్ధభూమి నుండి పారిపోవుట మాత్రము తప్పుగా పరిగణించి ఇన్ద్రుని ధిక్కరించుచున్నాడు. ఇంతకు ఇన్ద్రుడు దురదృష్టవంతుడు. మిగిలిన ముగ్గురు మూర్తులు మహిషుని ధిక్కారమును తప్పించుకొని యుండగా ఇన్ద్రుడు మాత్రము తప్పించుకొనలేకపోయినాడు అని ఈ శ్లోకమున వ్యంగ్యము. 'భవభయాత్'చ 'ప్రణయకృతపదా పద్మవాసాధిశేతే', 'ఏవమేతే విజహతు ధిగిమం యస్త్యజతి' అను పదబన్ధములలో వృత్త్యనుప్రాసాలంకారము లున్నవి. *

**అ :** పై శ్లోకమున శివుని పార్వతీవిరహభయము చెప్పబడినది. ఈశ్లోకమున **శివుని అన్యస్త్రీ యందలి ఆసక్తి** సూచింపబడుచున్నది.

**శ్లో॥ ఏవమ్ముగ్ధే! కిలాసీః కరకమలరుచా మా ముహుః కేశపాశం**
**సోఽన్యస్త్రీణాం రతాదౌ కలహసముచితో యః ప్రియే దోషలబ్ధే ।**
**వైదగ్ధ్యాదేవమన్తఃకలుషితవచనం దుష్టదేవారినాథం**
**దేవీ వః పాతు పార్ష్ణ్యా దృఢతనుమసుభిర్మోచయన్తీ భవానీ ॥ 82**

**ప్ర :** ముగ్ధే! = ఓ అమాయకురాలా!, కరకమలరుచా = కమలకాంతిగల చేతికాంతితో, ముహుః = మాటి మాటికి, కేశపాశమ్ = వరుణపాశమును, ఏవమ్ = ఇట్లు, మా అసీః = విసరకుము, ప్రియే = ప్రియుడు, దోషలబ్ధే = దోషమున పట్టుబడగా, రతాదౌ = రతముయొక్క మొదట, యః

= ఏది, కలహసముచితః = కలహమునకు తగినదో, సః = అది, అన్యస్త్రీణామ్ కిల = ఇతర స్త్రీలదే గదా!, ఏవమ్ = ఇట్లు, వైదగ్ధ్యాత్ = ప్రౌఢతవలన, అన్తఃకలుషితవచనమ్ = లోపలి కలుషముతో కూడిన మాటగల, దృఢతనుమ్ = దృఢమైన శరీరముగల, దుష్టదేవారినాథమ్ = దుష్టరాక్షసపతిని, పార్ష్ణ్యా = మడమతో, అసుభిః = ప్రాణములతో, మోచయన్తీ = విడిపించుచున్న, భవానీ దేవీ = శివుని భార్యయగు భవానీ దేవి, వః = మిమ్ము, పాతు = కాపాడుగాక!

**తా :** అమాయకురాలా! కమలకాంతిగల చేతితో నీవిట్లు వరుణపాశమును విడువకుము. ఇది ప్రియుని దోషము పట్టుపడగా రతముయొక్క మొదట అన్య స్త్రీలు చేయదగిన ఈ కేశపాశప్రహారము నీకు తగినది కాదు. ఇట్లు వైదగ్ధ్యముతో లోపల పాపియై మాట్లాడుచున్న దుష్టుడైన రాక్షసపతిని మడమతో ప్రాణముల విడిపించుచున్న భవానీదేవి మిమ్ము కాపాడుగాక!

**వి :** యౌవనారంభమున నున్నదై భర్తకడ మిక్కిలి సిగ్గు కలిగియుండు అమాయకురాలైన శృంగారనాయిక **ముగ్ధ** అనబడును. ప్రియునికి రతియందెట్లు సహకరించవలెనో తెలియని ముగ్ధవలె నీవీ కేశపాశమును నామీద విడచుచున్నావేమీ? అని మహిషుని ప్రశ్నమును నీవు తెలియక ఇట్లు చేయుచున్నందున నీ మీద నాకు కోపము వచ్చుట లేదనుట **ప్రథమపాదవ్యంగ్యము**. అమ్మవారు వరుణపాశమును మహిషునిపై ప్రయోగించగా మహిషునకది జడదెబ్బవలె మృదువుగా తగిలెను అనునది **కేశపాశ** శబ్దశక్తితో వ్యంగ్యమైన అర్థము. ఇతర స్త్రీల ననుభవించి వచ్చిన శృంగార నాయకులు పొరపాటున ఈ నాయికను మరొక నాయిక పేర పిలుచుట (గోత్రస్ఖలనము) మొదలగు దోషములు కనబడి నప్పుడా నాయిక ఇతర స్త్రీలపట్ల అసూయతో భర్తను జడతో కొట్టుట మొదలగు క్రియలతో తమ కోపమును ప్రదర్శించుట లోకస్త్రీ సాధారణము. నాయందట్టి దోషము కనబడుట లేదు. కావున నన్ను కేశపాశముతో దండించుట నీవంటి ఉత్తమస్త్రీకి ఉచితము కాదనుట ద్వితీయపాద వ్యంగ్యము. మహిషుని ఈ పలుకులు వాని వైదగ్ధ్యమును తెలుపుచున్నను వానిలోని పాపమును బహిర్గత మొనరించునట్టివి. అట్టి మాటలతో కోపించిన అమ్మవారు మడమతో త్రొక్కి వాని శరీరము అను చెఱసాలలో ఉన్న ప్రాణములను విడిపించెను అనుట మూడవపాదమున స్ఫురించు వ్యంగ్యము. మొదటిపాదమునందలి **ముగ్ధే** అను పదమును మహిషవిశేషణముగా కూడ సమన్వయించు కొనవచ్చును. అప్పుడు అమాయకుడనైన నాయందీ కేశపాశప్రహారమేల అను అర్థము వ్యంగ్యమగును. కరకమలరుచా అను సమాసమున **లుప్తోపమాలంకార** మున్నది. 'కేశపాశమ్'చ 'పాతు పార్ష్ణ్యా' అను పదబంధములలో వృత్త్యనుప్రాసము లున్నవి. 'దేవీ వః భవానీ దృఢతనుమ్' అను పదములలోనను వృత్త్యనుప్రాసాలంకారము లున్నవి. *

**అ :** పై శ్లోకమున అమ్మవారి నుద్దేశించి మహిషుడు పలికిన విదగ్ధవచనము చెప్పబడినది. ఈ శ్లోకమున శివుని తత్కుమారు నుద్దేశించి వాని ధిక్కారవచనము చెప్పబడుచున్నది.

**శ్లో॥ బాలోఽద్యాపీషుజన్మా సమరముదుపభృత్పాంసులీలావిలాసీ**
**నాగాస్యశ్చాతదన్తః స్వతనుకరమదాద్విహ్వలస్సోఽపి శాన్తః ।**

**ధిగ్యాసి క్వేతి దుష్టం ముదితతనుమదం దానవం సంస్ఫురోక్తం**
**పాయాద్వః శైలపుత్రీ మహిషతనుభృతం నిఘ్నతీ వామపార్ష్ణ్యా ॥ 83**

**ప్ర :** సమరమ్ = యుద్ధమును గూర్చి, ఇషుజన్మా = కుమారస్వామి, అద్య అపి = నేటికిని, బాలః = బాలుడు, ఉడుపభృత్ = చంద్రధరుడు (శివుడు), పాంసులీలావిలాసీ = దుమ్ము ఆటతో ప్రకాశించుచున్నాడు, శాతదన్తః = వాడి దన్తముకల, నాగాస్యః = గజముఖుడు, స్వతనుకరమదాత్ = తన శరీరముయొక్క తొండముయొక్క మదమువలన, విహ్వలః = బాధింపబడిన వాడు, సః అపి = ఆతడును, శాన్తః = శాంతుడై యున్నాడు, క్వ = ఎక్కడకు, యాసి = పోయెదవు, ఇతి = అని, సంస్ఫురోక్తమ్ = తొట్రుపడు మాటలు కల, దుష్టమ్ = దుష్టుడైన, ముదితతనుమదమ్ = సంతోషించిన శరీర మదము కల, మహిషతనుభృతమ్ = దున్న శరీరము ధరించిన, దానవమ్ = రాక్షసుని, వామపార్ష్ణ్యా = ఎడమమడమతో, నిఘ్నతీ = చంపుచున్న, శైలపుత్రీ = పార్వతి, వః = మిమ్ము, పాయాత్ = కాపాడుగాక!

**తా :** యుద్ధమును గూర్చి కుమారస్వామి ఇంకను బాలుడే. మదము స్రవించు శరీరము తొండమును కల, వాడియైన దంతము కల గజముఖుడును శాంతుడుగనే ఉన్నాడు. చంద్రధరుడైన శివుడు వల్లకాటి దుమ్ము అనగా కాటిబూడిదతో ఆడుకొనుచున్నాడు. నీ వెక్కడకు పోయెదవని అఱచుచు తన శరీరబలమున తానే మదించియున్న మహిషాసురుని ఎడమమడమతో చంపుచున్న పార్వతి మిమ్ము కాపాడుగాక!

**వి :** ఇషువు శరము పర్యాయములు. కుమారస్వామి శరజన్ముడు. **శరజన్మా షడాననః** అని నిఘంటువు కుమారస్వామిని శరజన్ముడని పేర్కొన్నది. శరజన్ముడైన కుమారస్వామి ఇట ఇషు జన్ముడని పేర్కొనబడినాడు. యుద్ధవిషయమున నేటికిని బాలుడే. యుద్ధము చేయదగిన వయస్సు ఆతనికి రాలేదు. పిల్లలతో కలసి యున్నప్పుడు కొంత పిల్లతనమును పెద్దలు అనుభవించెదరు. శివుడు తన శిరమునందలి బాలచంద్రుని నాడించుటకో లేక కుమారస్వామితో కూడి యున్నందుననో వల్లకాటి దుమ్ము (బూడిద)తో ఆట ఆడుకొనుచున్నాడు. ఆతనిని యుద్ధమున కెట్లాహ్వానింపగలను. చిన్నవాడైనను గజముఖుడు మదముతో విహ్వలుడై యున్నాడు. పైగా ఆతని దంతమొకటి లేకపోయినను ఉన్న ఆ ఒక దంతము వాడిగా నున్నదని అనుకొనుచున్నాడు. అయినను నాతో పోరాడిన మరొక దంతము పోవునేమో అని భయపడి శాంతుడుగా నున్నాడు. శివుడు మధ్య నున్నాడు. ఒకవైపు కుమారస్వామి మరొక వైపు గజముఖు దున్నాడు. ఇద్దఱు బాలురమధ్యనున్న శివుడు బాలచంద్రధరుడై బాలభావమున బూడిదతో నాడుకొనుచున్నాడు అని పూర్వార్ధమున మొదట కుమారస్వామి చివఱ గజముఖుడు మధ్య శివుడున్నట్లు వ్యంగ్యమగుచున్నది. తనను పట్టించుకొనక యున్న పై ముగ్గురిని విడచి మహిషుడు తన కడకు వచ్చిన అమ్మవారిని ఎక్కడకు పోయెదవు అని ధిక్కరించి పలికినాడని లేక అమ్మవారే ఎక్కడకు పోయెదవు అని ధిక్కరించి పలికినదని చెప్పవచ్చును. 'సమరముడుపభృత్ పాంసులీలావిలాసీ' అనుచోట వృత్త్యనుప్రాసా-

లంకారము లున్నవి. శాతదన్తః శాన్తః సంస్ఫురోక్తం మహిషతనుభృతమ్ అను పదబన్ధములలో పదాన్తవృత్త్యనుప్రాసాలంకారము లున్నవి. *

**అ :** పై శ్లోకమున యుద్ధముచేసి తమ ఆయుధములను వ్యర్థ పఱచుకొన్న శివకేశవులు చెప్పబడు చున్నారు.

**శ్లో॥ మూర్ధ్నః శూలమ్మమైతద్విఫలమభిముఖం శఙ్కరోత్థాతశూలం**
**సఙ్గ్రామాద్దూరమేతద్ధృతమరి హరిణా మన్మనః కర్షతీవ ।**
**గర్వాదేవం క్షిపన్తం విబుధజనవిభూన్ దైత్యసేనాధినాథం**
**శర్వాణీ పాతు యుష్మాన్పదభరదలనాత్ప్రాణతో దూరయన్తీ ॥** **84**

**ప్ర :** శంకరోత్థాతశూలమ్ = శంకరునిచే నాటబడిన శూలము, అభిముఖమ్ = ఎదురై, విఫలమ్ = నిష్ఫలము, ఏతద్ = ఇది, మమ = నాకు, మూర్ధ్నః = తలయొక్క, శూలమ్ = నొప్పి, సంగ్రామాత్ = యుద్ధమునుండి, అరి = చక్రము, మన్మనః = నా మనస్సును, కర్షతీవ = ఆకర్షించుచున్నట్లున్నది, ఏవమ్ = ఇట్లు, విబుధజనవిభూన్ = దేవప్రభువులను, క్షిపన్తమ్ = అధిక్షేపించుచున్న, దైత్యసేనాధినాథమ్ = దైత్యసైన్యమునకు అధిపతియైన మహిషుని, పదభరదలనాత్ = పాదముయొక్క బరువుచే విఱచుటవలన, ప్రాణతః = ప్రాణములనుండి, దూరయన్తీ = దూరము చేయుచున్న, శర్వాణీ = శివుని భార్య, యుష్మాన్ = మిమ్ము, పాతు = రక్షించుగాక!

**తా :** శివుడు నాపై విసరిన శూలము నాకెదురుగా వచ్చి విఫలమై నాకు తల నొప్పిని కలిగించినది. విష్ణువు యుద్ధమునకు దూరముగా పోయి ప్రయోగించిన చక్రము నా మనస్సు నాకర్షించు చున్నట్లున్నది. ఈ విధముగా దేవ ప్రభువులను అధిక్షేపించుచున్న మహిషుని తన పాదముయొక్క బరువుతో ముక్కలు చేసి ప్రాణములకు దూరము చేయుచున్న శివుని భార్య మిమ్ము రక్షించుగాక!

**వి :** పరాక్రమమునకు నిదర్శనము శత్రువుతో నిరాయుధముగా తలపడుట. శివుడు శూలమును ప్రయోగించినాడనగా కొంత దూరము నుండియే శూలమును విసరినాడనుటయే, అట్లే విష్ణువును యుద్ధమున దూరముగా నుండియే చక్రము ప్రయోగించినాడు. ముఖమునకెదురై శూలము శిరమునకు తగిలినట్లున్నది. కొంచెము తలనొప్పి కలిగించినది. విష్ణు చక్రము శరీరమునకు తగిలినదో లేదో కాని అది వచ్చుచుండగా నా మనస్సును కొంత ఆకర్షించినది అను అర్థములు వ్యంగ్యములు. **శూలశబ్దము** ఆమ్రేడితమై ప్రథమపాదమున యమకమను శబ్దాలంకార మేర్పడి యున్నది. రెండవపాదమున **రేఫము** బహువారావృత్తమై యుండుటచే వృత్త్యనుప్రాసాలంకార మేర్పడి యున్నది. మూడవపాదమున **వకారము** మూడుసార్లు ఆవృత్తమై వృత్త్యనుప్రాసాలంకారము నేర్పరచినది. నాల్గవ పాదమున రేఫ దకారముల ఆవృత్తి ఆ అలంకారమునే ఏర్పఱచినది. *

**అ :** పై శ్లోకమున శివకేశవుల శూలచక్రములకు కంపించని మహిషుడు వర్ణింపబడినాడు. ఈ శ్లోకమున **సముద్రములను కంపింపజేసిన మహిషుడు** వర్ణింపబడుచున్నాడు.

శ్లో॥ భ్రామ్యద్ధామౌర్వదాహక్షుభితజలచరవ్యస్తవీచీన్సకమ్పాన్
కృత్వైవాశు ప్రసన్నాన్పునరపి జలధీన్మన్దరక్షోభభాజః ।
దర్పాదాయాన్తమేవ శ్రుతిపుటపరుషం నాదమభ్యుద్గిరన్తం
కన్యాఽద్రేః పాతు యుష్మాంశ్చరణభరనతం పింషతీ దైత్యనాథమ్ ॥ 85

ప్ర : భ్రామ్యద్ధామౌర్వదాహక్షుభితజలచరవ్యస్తవీచీన్ = తిరుగుచున్న తేజము గల బడబాగ్నిచే క్షోభనొందిన జలచరములచే విసరి వేయబడిన తరంగములుగల, సకంపాన్ = కంపముతో కూడిన, ఆశు = శీఘ్రముగా, ప్రసన్నాన్ = ప్రసన్నములయిన, జలధీన్ = సముద్రములను, పునః = మరల, మన్దరక్షోభభాజః = మన్దరముయొక్క క్షోభ పొందినవిగా, కృత్వా ఏవ = చేసియే, ఆయాన్తమ్ = వచ్చుచున్న, శ్రుతిపుటపరుషమ్ = చెవులకు కఠినముగా నున్న, నాదమ్ = ధ్వనిని, ఉద్గిరన్తమ్ = ఉచ్చరించుచున్న, దైత్యనాథమ్ = మహిషుని, చరణభరనతమ్ = కాలిబరువుచే వంగిన వానిని, పింషతీ = మర్దించుచున్న, అద్రేః = కొండయొక్క, కన్యా = కూతురు, యుష్మాన్ = మిమ్ము, పాతు = కాపాడు గాక!

**తా :** మహిషుడు సముద్రమున తిరుగుచుండగా బడబాగ్ని తిరుగుచున్నట్లు అనిపించి జలచరముల క్షోభతో తరంగములను దూరముగా విసరును. మహిషుడాగినప్పుడు శాంతముగా నుండును. ఒడ్డుమీదినుండి సముద్రములలోనికి దూకినప్పుడు మన్దరపర్వతము పడవేసినప్పటి క్షోభను సముద్రములు మరల పొందినవి కాగా అట్టి సముద్రములో నుండి వచ్చుచున్న మహిషుని శరీరముపై కాలుమోపి మర్దించిన అద్రికన్య మిమ్ము రక్షించుగాక!

**వి :** బడబాగ్ని సముద్రమున ఒకచోటనుండి చుట్టుపక్కలకు వేడిని వ్యాపింప జేయును. మహిషాసురుడు సముద్రములలో తిరుగునప్పుడు బడబాగ్ని తిరుగుచున్నట్లు భావించిన జంతువులు ఆ వేడిని తప్పించుకొనుటకు ఒడ్డులవైపు వచ్చును. అప్పుడు సముద్రములలోని తరంగములు ఒడ్డులవైపు అధికముగా వ్యాపించును. ఆ మహిషాసురుడు అలసి ఆగినప్పుడు జలచరక్షోభము లేనందున సముద్రములు సాధారణస్థితి నొంది ప్రసన్నములుగా నుండును. మహిషుడు సముద్రములోనికి దుమికినప్పుడు మాత్రము దేవరాక్షసులు మోసికొని తెచ్చిన మన్దరపర్వతమును, బరువును సహింపలేక వేగముతో విసరినప్పుడు క్షీరసముద్ర మెంత క్షోభించెనో అంత క్షోభమును మరొకసారి సముద్రములలో కలిగెను. అట్టి మహిషుడు అంకెలు వైచుచు వచ్చుచుండగా అమ్మవారు వాని శరీరమును కాలితో త్రొక్కి వంచి మర్దించి చంపినది. జలచరవ్యస్తవీచీన్ మన్దరక్షోభభాజః దర్పాదాయాన్తమేవ శ్రుతిపుటపరుషమ్ చరణభరనతమ్ అను పదబన్ధములలో వృత్త్యను-ప్రాసాలంకారము లున్నవి. *

**అ :** పై శ్లోకమున మహిషుని సముద్రజలవిహారము వర్ణింపబడినది. ఈ శ్లోకమున సముద్ర పుత్త్రుడైన **చంద్రుని** ఆతని మిత్రుడైన **సూర్యుని బలహీనత మహిషోక్తముగా** చెప్పబడుచున్నది.

శ్లో॥ మైనామిన్దోఽభినైషీః శ్రితపృథుశిఖరాం శృఙ్గయుగ్మస్య పార్శ్వం
యుద్ధక్ష్మాయాం తనుం స్వాం రతిమదవిలసత్ స్త్రీకటాక్షక్షమేయమ్ ।
భానో! కిం వీక్షితేన క్షితిమహిషతనౌ త్వం హి సంన్యస్తపాదో
దర్పాదేవం హసన్తం వ్యసుమసురముమా కుర్వతీ త్రాయతాం వః ॥ 86

**ప్ర :** ఇయమ్ = ఇది (నీ శరీరము), రతిమదవిలసత్–స్త్రీకటాక్షక్షమా = ప్రేమ మదముతో ప్రకాశించు ఆడువారి చూపుల నోర్చు కొనునది, ఇన్దో! = ఓ చన్ద్రుడా!, యుద్ధక్ష్మాయామ్ = యుద్ధభూమియందు, ఏనామ్ = ఈ, స్వామ్ = నీకు సంబంధించిన, శ్రితపృథుశిఖరామ్ = పెద్ద శిఖరము నాశ్రయించిన, తనుమ్ = శరీరమును, శృంగయుగ్మస్య = రెండు కొమ్ముల, పార్శ్వమ్ మా అభినైషీః = ప్రక్కకు చేర్చకుము, భానో! = ఓ సూర్యుడా!, వీక్షితేన = చూపుతో, కిమ్ = ఏమి, త్వమ్ = నీవు, క్షితిమహిషతనౌ = భూమి దున్న శరీరము నందు, సంన్యస్తపాదః = పాదము పెట్టిన వాడవు, దర్పాత్ = గర్వమువలన, ఏవమ్ = ఇట్లు, హసన్తమ్ = అపహసించుచున్న, అసురమ్ = రాక్షసుని, వ్యసుమ్ = ప్రాణరహితునిగా, కుర్వతీ = చేయుచున్న, ఉమా = పార్వతి, వః = మిమ్ము, త్రాయతామ్ = కాపాడుగాక!

**తా :** ఓ చన్ద్రుడా! రతిమదమున ప్రకాశించు చూపుల నోర్చుకొనగలుగు నీ శరీరము పెద్దకొండ నాశ్రయించి యున్నను, యుద్ధభూమియందు నా కొమ్ముల ప్రక్కన మాత్రము చేర్చకుము. ఓ సూర్యుడా! భూమిమీద దున్నపై పాదమునుంచు నీవు నన్ను చూచుట ఏల! అని గర్వమున పరిహసించుచున్న మహిషుని ప్రాణహీనునిగా చేయుచున్న పార్వతి మిమ్ము రక్షించుగాక!

**వి : శృంగ**శబ్దము పర్వతశిఖరమును మరియు పశువుకొమ్మును బోధించును. చంద్రుడు కొండ శిఖరము పైకి వచ్చినప్పుడు కొండమీద కూర్చొని యున్నట్లు కనిపించును. తన కొమ్ములను చూచిన చన్ద్రుడు తనవైపు వచ్చునేమో ఆతనికి తన కొమ్ము తగిలి చచ్చునేమో యని భావించి మహిషుడు చన్ద్రా! నీవు కొమ్ము నాశ్రయించి యుండుట అలవాటే అయినను నా కొమ్ములు మిక్కిలి వాడిగా నున్నట్టివి, వానిలో నొకదాని కొన నీకు తగిలిన నీ వోర్చుకొనలేవు. నీవు రతిమదముతో ప్రకాశించు ఆడుదాని వాడియైన చూపుల నోర్చుకొన గలిగిన వాడవైన అగుదువుగాక! అని చన్ద్రుని అపహసించెను. ఓ సూర్యా! నీవు భూమి దున్నను తపింపజేయగల (పాదములు – కిరణములు) వాడవే అయినను నీవు నావైపేల చూచెదవు. నీ చూపు ఎంతవాడిగా ఎంత వేడిగా ఉన్నను నన్నేమియు చేయజాలదు. తననేమి చేయజాలవని పూర్వార్ధమున చంద్రుని, మూడవ పాదమున సూర్యుని పరిహసించుట వ్యంగ్యమగుచున్నది. సూర్యుని పుత్త్రుడైన యముడు దున్నపై పాదముంచి దాని నెక్కి తిరుగును. ఈ విద్య నాతడు తన పాదములతో భూమి దున్నను తపింపజేయు సూర్యుని నుండి నేర్చుకొనుట వ్యంగ్యమగుచున్నది. లోకమును చంపుటకు దున్ననెక్కు యమునకు అబ్బవైనను నీ పాదములే నన్నేమి చేయలేని వనగా నీ కొడుకు యముడు నన్నేమి చేయలేడు. లోకమును చంపు యముడే ఏమియు చేయలేక వెనుదిరిగి పోయినా డనగా ఆకసమున అంత

దూరముగా నున్న నీ చూపు నన్నేమియు చేయజాలదనియు వ్యంగ్యము. మైనామిన్ద్రోఽభినైషీః, శ్రితపృథుశిఖరామ్ శృంగయుగ్మస్య పార్శ్వమ్, యుద్ధక్ష్మాయాం స్త్రీకటాక్షక్షమేయమ్, భానో కిం వీక్షితేన క్షితిమహిషతనౌ, దర్పాదేవమ్ వ్యసుమసురముమా, కుర్వతీ త్రాయతాం అను పదబన్ధములలో వృత్త్యనుప్రాసాలంకారము లున్నవి. *

**అ :** పై శ్లోకమున సూర్యపరిహాసము చెప్పబడినది. ఈ శ్లోకమున **తత్పుత్త్రయముని పరిహాసము** చెప్పబడుబచున్నది.

**శ్లో॥ సఙ్గ్రామాత్త్రస్తమేతం త్యజ నిజమహిషం లోకజీవేశ! మృత్యో!**
**స్థాతుం శూలాగ్రభూమౌ గతభయమజయం మత్తమేతం గృహాణ ।**
**దైత్యే పాదేన యస్యాశ్చలమహిషతనౌ శాయితే దీర్ఘనిద్రాం**
**భావోత్పత్తౌ జయైవం హసతి పితృపతిం సాఽమ్బికా వః పునాతు ॥ 87**

**ప్ర :** లోకజీవేశ! = లోకములోని జీవులకు ప్రభుడవైన, మృత్యో = ఓ యమా!, సంగ్రామాత్ = యుద్ధమువలన, త్రస్తమ్ = భయపడిన, ఏతమ్ = ఈ, నిజమహిషమ్ = నీ దున్నపోతును, త్యజ = విడువుము, శూలాగ్రభూమౌ = శూలముయొక్క ముందున్న భూమియందు, స్థాతుమ్ = నిలచుటకు, గతభయమ్ = భయములేని, అజయమ్ = జయింపరాని, మత్తమ్ = మదించిన, ఏతమ్ = దీనిని (దున్నపోతును), గృహాణ = గ్రహింపుము, చలమహిషతనౌ = చలించు మహిష శరీరము గల, దైత్యే = రాక్షసుడు, యస్యాః = ఎవతెయొక్క, పాదేన = పాదమున, దీర్ఘనిద్రామ్ = దీర్ఘనిద్రను, శాయితే = పడుకొనబెట్టబడగా, భావోత్పత్తౌ = (సంతోష) భావముయొక్క పుట్టుట యందు, జయా = జయ, ఏవమ్ = ఇట్లు, పితృపతిమ్ = యముని, హసతి = పరిహసించు చున్నదో, సా = ఆ, అమ్బికా = అమ్బిక, వః = మిమ్ము, పునాతు = పవిత్రుల నొనర్చుగాక!

**తా :** లోకజీవులకు ప్రభుడవైన ఓ యమా! యుద్ధమునుండి భయపడిన నీయీ వాహనమైన దున్నను విడచి ఇదిగో ఈ అమ్మవారు చంపిన మహిషాసురుని వాహనముగా స్వీకరింపుము. ఇది శూలముయొక్క ముందు భూమి యందును భయపడలేదు. ఎవరిచేతను ఓటమిని పొందలేదు. అని దేవి మహిషుని పాదమున త్రొక్కి చంపగా ఆమె చెలికత్తె జయ యముని పరిహసించినది. ఆ అమ్బిక మిమ్ము పవిత్రులనొనర్చుగాక.

**వి :** మహిషునితో యుద్ధము చేయలేక అంతకు ముందే భయపడి పారిపోవు చున్న తన వాహనమైన దున్నపై యముడును పారిపోవలసిన వాడయ్యెను. ఏమి చేయుదును యుద్ధమున నొకదున్న (మహిషాసురుడు) ఎదురుపడగా నీయీ దున్న పారిపోయినది. నేను దానిమీద నుండుటచే తప్పనిసరిగా యుద్ధమునుండి మరల వలసి వచ్చినదని యముడు తనకు కనబడిన వారితో వారు పరిహసించక ముందే చెప్పి వారి పరిహాసమును తప్పించుకొనుచుండెను. అది చూచిన అమ్మవారి చెలికత్తె జయ ఓ యమా! యుద్ధభూమినుండి భయపడి పారిపోయిన ఈ పిటికి దున్నను విడచి ఏ దున్న (మహిషు)ను చూచి నీ యీ దున్న భయపడినదో దానినే వాహనముగా చేసికొనుము.

నీ యీ పాతపిటికిదున్నను విడచి వేయుము. అమ్మవారు చంపిన ఈ దున్న శూలమునకు ముందున్న భూమియందును భయపడలేదు. అనగా శివుడు శూలపాణియై వచ్చినప్పుడును భయపడి పారిపోలేదు. శూలపాణి యనగా ఎవరో తెలియునా! మఱచిపోయినావేమో! మార్కండేయుని ప్రాణముల నపహరించుటకు వచ్చిన శివుని చేతిలోని శూలమునకు ముందున్న భూమిపై నిలచి యున్నప్పుడును నీ యీ దున్న భయముతో పారిపోయినది. నీవు భయపడినావో లేదో తెలియదుగాని, అప్పటినుండి శివభక్తుల ప్రాణముల తీయుటకు వచ్చుటకే వెనుకంజ వేయుచుంటివి. ఈ దున్న (మహిషాసురుడు) మాత్రము శివునిచేతను అపజయము నొందలేదు. అమ్మవారు వానిని చంపినది. ఇదిగో అమ్మవారి పక్షమున ఈ దున్న (మహిషాసురు)ని తీసికొనిపోదలచినచో దీనికి మరల అమ్మవారితో చెప్పి పునర్జీవితము నొనరించెదను. అని జయ యముని పరిహసించినది. శూలాగ్ర-భూమౌ అను సమాస మీ యర్థములను వ్యంజింప జేసినది. సంగ్రామాత్త్రస్తమేతం, త్యజ నిజమహిషమ్, లోకజీవేశ! మృత్యో! స్థితుమ్, గతభయమజయమ్, మత్తమేతమ్, దైత్యే హసతి పితృపతిమ్ అను పదబన్ధములలో వృత్త్యనుప్రాసాలంకారము లున్నవి. *

**అ :** పై శ్లోకమున అమ్మవారు మహిషుని చంపగా జయకు కలిగిన సంతోషభావోత్పత్తి చెప్పబడినది. ఈ శ్లోకమున **శివునకు కలిగిన సంతోషభావము** చెప్పబడుచున్నది.

**శ్లో॥ శ్రుత్వైతత్కర్మ భావాదనిభృతరభసం స్థాణునాభ్యేత్య దూరాత్**
**శ్లిష్టా బాహుప్రసారం శ్వసితభరచలత్తారకా ధూతహస్తా ।**
**దైత్యే గీర్వాణశత్రౌ భువనసుఖముషి ప్రేషితే ప్రేతకాష్ఠాం**
**గౌరీ వోఽవ్యాన్మిషత్సు త్రిదివిషు తమలం లజ్జయా వారయన్తీ ॥ 88**

**ప్ర :** ఏతత్ = ఈ, కర్మ = కర్మను, శ్రుత్వా = విని, భావాత్ = భావమువలన, అనిభృతరభసమ్ = దాచని ఆనందము కలుగునట్లుగా, స్థాణునా = శివునిచేత, దూరాత్ = దూరమునుండి, అభ్యేత్య = వచ్చి, బాహుప్రసారమ్ = బాహువులు చాచబడునట్లుగా, శ్లిష్టా = కౌగిలింపబడిన, శ్వసితభరచలత్తారకా = నిట్టూర్పుల బరువుతో కదులు కనుగ్రుడ్లు గల, ధూతహస్తా = కదలిన చేతులుకల, గౌరీ = గౌరి, భువనసుఖముషి = లోకసుఖమును దొంగిలించిన, గీర్వాణశత్రౌ = దేవశత్రువైన, దైత్యే = రాక్షసుడు, ప్రేతకాష్ఠామ్ = మృత్యుస్థితికి, ప్రేషితే = పంపబడగా, త్రిదివిషు = దేవతలు, మిషత్సు = చూచు చుండగా, లజ్జయా = సిగ్గుతో, తమ్ = ఆతనిని (శివుని), అలమ్ = చాలును, వారయన్తీ = వారించుచు, వః = మిమ్ము, అవ్యాత్ = కాపాడు గాక!

**తా :** అమ్మవారు లోకసుఖమును దొంగిలించిన రాక్షసుని చంపగా ఆ కర్మను వినిన శివుడు దూరమునుండి చేతులు చాచుచు వచ్చి సంతోషము పట్టలేనివాడై ఆయాసమున కనుగ్రుడ్లు త్రిప్పుచు, చేతులు కదల్చుచు, నిట్టూర్పులు విడచుచున్న ఆమెను కౌగిలించుకొన, దేవతలు చూచుచున్నారని శివుని వారించుచున్న గౌరి మిమ్ము కాపాడుగాక!

**వి :** అమ్మవారు అనితరసాధ్యమైనప మహిషవధ కర్మ నొనరించినదని విని ఆతని మానసమున భావము అనగా ప్రేమ కలిగినది. దానివలన సంతోషము (ఆనందము) కలిగినది. దానిని దాచుకొనలేక పోయెను అని '**అనిభృతరభసమ్**' క్రియావిశేషణము వ్యంజించును. అన్ని రకాల ఉద్రేకముల నణచ గలిగిన శివుడు కొందఱి దృష్టిలో స్థాణువే. స్థాణువైన వృక్షమునకును లోన భావములుండునేమోకాని ఈ శివుడు పాషాణరూపస్థాణువే. అట్టి స్థాణువునకు భావము కలిగినది. అది రసముగా నుప్పొంగినది. ఇక ఆగలేక పోయినాడు. ఆ పోవుట యెట్లు? దూరము నుండియే చేతులు చాచినాడు. ఆమెను సమీపించి సమీపించక మునుపే కౌగిలించుకొనవలెనను శివుని తీవ్రవాంఛను '**బాహుప్రసారమ్**' అను క్రియావిశేషణము వ్యంజించును. నిట్టూర్పుల బరువు వలన ఆమె కనుగ్రుడ్లు, హస్తములు కదలుచున్నవి. అట్లయ్యు ఆమె, దేవతలు తమను చూచుచున్నారని గ్రహించి, శివుని వారించుచున్నది. **వర్తమానార్థకశతృప్రత్యయమగుటచే** వారయన్తీ శబ్దము శివుని పూర్తిగా వారించలేదని వ్యంజించుచున్నది. శ్రుత్వైతత్కర్మ భావాదనిభృతరభసమ్, బాహుప్రసారం శ్వసితభరచలత్తారకా, గౌరీ వారయన్తీ ఈ పదబన్ధములలో వృత్త్యనుప్రాసాలంకారము లున్నవి. *

**అ :** పై శ్లోకమున శివుడు స్థాణువుగా పిలువబడినాడు. ఈ శ్లోకమున **అమ్మవారి పాదము స్థాణువని** చెప్పబడు చున్నది.

**శ్లో॥ భద్రే! స్థాణుస్తవాఙ్ఘ్రిః క్షతమహిషరణవ్యాజకణ్డూతిరేష-**
**త్రైలోక్యక్షేమదాతా భువనభయహరః శఙ్కరోఽతో హరోఽపి ।**
**దేవానాం నాయికే! త్వద్గుణకృతవచనోఽతో మహాదేవ! ఏష**
**కేలావేవం స్మరారిర్హసతి రిపువధే యాం శివా పాతు సా వః ॥ 89**

**ప్ర :** భద్రే! = ఓ భద్రురాలా!, తవ = నీ యొక్క, అంఘ్రిః = పాదము, స్థాణుః = స్థాణువు, ఏషః =ఇది, క్షతమహిషరణవ్యాజకణ్డూతిః = కొట్టబడిన మహిషుని యుద్ధమిష కండూతి గలది, త్రైలోక్యక్షేమదాతా = ముజ్జగమునకు క్షేమము నిచ్చునది. అతః = అందువలన, శఙ్కరః = శంకరము, భువనభయహరః = భువనముల భయమును పోగొట్టునది, హరః అపి = హరము కూడ, దేవానామ్ = దేవతలయొక్క, నాయికే = నాయికా!, త్వద్గుణకృతవచనః = నీ గుణ(భావ)ముచే ఆజ్ఞను పాటించునది, అతః = అందువలన, ఏషః = ఇది, మహాదేవః = దేవతలలో గొప్పది, రిపువధే = శత్రువధమునందు, కేలౌ = కేళియందు, స్మరారిః = మన్మథశత్రువైన శివుడు, ఏవమ్ = ఇట్లు, యామ్ = ఎవతెను, హసతి = పరిహసించునో, సా = ఆ, శివా = శివ, వః = మిమ్ము, పాతు = రక్షించుగాక!

**తా :** ఓ భద్రురాలా! నీ అంఘ్రియే స్థాణువు. మహిషుని యుద్ధకండూతినిది తొలగించినది. ముజ్జగమునకు క్షేమము నిచ్చునది. కావున ఇది శంకరము. దాని భయమును తొలగించినది కావున హరము. ఓ దేవతా నాయికా! నీ గుణభావముచేత ఆజ్ఞను పాటించునది కావున మహాదేవము అని శత్రువధానంతరము రతికేళిసమయమున శివునిచే పరిహసింపబడిన శివ మిమ్ము రక్షించుగాక!

**వి :** శివునకు **స్థాణు**వను పేరు కలదు. ఆయన నెవరును కదలించలేరు. కావున స్థాణువను పేరు ఆయనకు సార్థకము. ఇప్పటివఱకు నా పేరే స్థాణువు. యుద్ధమునందు స్థిరముగా నుండి మహిషుని యుద్ధకండూతిని తొలగించినది. కావున ఇప్పటినుండి నీ పాదమే స్థాణు నామమున కర్హము. పశువులు తమ దురదను చెట్లకు రాచుకొని తీర్చుకొనుచుండును. మహిషుడొక పశువు కావున స్థాణువైన నీ పాదమునకు ఱాచుకొని తన యుద్ధకండూతిని తీర్చుకొన్నాడు అని ప్రథమ పాదము వ్యంజించుచున్నది. రెండవపాదము ఇప్పటివఱకు నాపేరు శంకరుడు కాని నేను మహిషుని చంపి త్రైలోక్యమునకు క్షేమము కలిగించలేకపోయిన నాకా పేరు తగియుండ లేదు. నీ పాదమా పని చేసినది. కావున ఇప్పటినుండి మహిషుని చంపి త్రైలోక్యక్షేమము కలిగించిన నీ పాదమునకే ఆ పేరు అర్హమై ఉన్నది. అట్లే త్రిభువనము మహిషునివలన భయము నొంది యుండగా నేను దానిని వారించలేక పోయినందున ఇప్పటిదాక నాకున్న ఆ హరనామము త్రిభువనభయమును హరించిన నీ పాదమునకు అర్హమై ఉన్నది అని వ్యంజించుచున్నది. మూడవ పాదమున నాయకుడని చెప్పబడిన వాడు తానెవరికి నాయకుడో వారిని యుద్ధమునకు నడుపగలిగిన వాడై యుండవలెను. నేను మహిషయుద్ధమున దేవతల నడిపింపజాలనందున దేవతా నాయకత్వమును కోల్పోయి యున్నాను. నీవు ఆ యుద్ధమున దేవతలకు నాయకత్వమును వహించినావు. కావున నీవే దేవతానాయికవు. అందువలననే నిన్ను **దేవతానాయికా** అని సంబోధించుచున్నాను. దేవతలకు నాయికవైన నీకు గుణభావము అనగా అవయవత్వమును పొందినదై నీ ఆజ్ఞను పాటించిన నీ పాదమే ఇప్పుడు మహాదేవనామమున కర్హమైనది. నీ ఆజ్ఞను పాటించి నేను యుద్ధమున మహిషుని చంపలేకున్నందున నాకా మహాదేవ నామమును ధరించు అర్హత లేదు అని వ్యంజించుచున్నది. దేవతలను తన కనుగుణముగా ఉండునట్లు ఆజ్ఞను పాటించునట్లుచేసి లేక దేవతలనాయక కార్యమును సఫల మొనరించి మహాదేవుడు అనబడవలెను. కాని దేవతల నాయికవైన నీయాజ్ఞను నిర్వహించలేని నీ కార్యము సఫల మొనర్చని నాకు మహాదేవ నామమర్హము కాదు అని **త్వద్గుణకృతవచనః** అను సమాసము వ్యంజించును. భువనభయహరః శంకరోఽ తో హరోఽపి స్మరారిర్హసతి రిపువధే, శివా పాతు సా వః అను పదబన్ధములలో వృత్త్యనుప్రాసాలంకారము లున్నవి. *

**అ :** పై శ్లోకమున శివుని పేర్ల నిరర్థకత శివుని చేతనే చెప్పబడినది. ఈ శ్లోకమున **కృష్ణుని** (విష్ణుని) **ఖడ్గముయొక్క పేరుయొక్క నిరర్థకత అమ్మవారి చెలికత్తె జయచేత చెప్పబడుచున్నది.**

**శ్లో॥ ఖడ్గః కృష్ణస్య నూనం రహితగుణగతిర్నన్దకాఖ్యాం ప్రయాతః**
**శత్రోర్భఙ్గేన వామస్తవ ముదితసురో నన్దకస్త్వేష పాదః ।**
**భావాదేవం జయాయాం నుతికృతి నితరాం సన్నిధౌ దేవతానాం**
**సవ్రీడా భద్రకాలీ హతరిపురవతాద్వీక్షితా శమ్భునా వః ॥ 90**

**ప్ర :** నన్దకాఖ్యామ్ = నన్దకమను పేరును, ప్రయాతః = పొందిన, కృష్ణస్య = విష్ణువుయొక్క, ఖడ్గః

= ఖడ్గము, నూనమ్ = నిశ్చయముగా, రహితగుణగతిః = ఆనుగుణ్యములేనిది, శత్రోః = శత్రువుయొక్క, భంగేన = నాశముచేత, ముదితసురః = సంతోషింపజేయబడిన దేవతలు గల, తవ = నీ యొక్క, ఏషః = ఈ, వామః = ఎడమ, పాదః = పాదము, నన్దకః = నందకము, ఏవమ్ = ఇట్లు, భావాత్ = భావమువలన, జయాయామ్ = జయ, నితరామ్ = మిక్కిలి, దేవతానామ్ = దేవతలయొక్క, సన్నిధౌ = దగ్గఱ, నుతికృతి = స్తుతిని చేయునది కాగా, సవ్రీడా = సిగ్గు కలదైన, శమ్భునా = శివునిచే, వీక్షితా = చూడబడిన, హతరిపుః = చంపబడిన శత్రువుగల, భద్రకాలీ = భద్రకాలి, వః = మిమ్ము, అవతాత్ = రక్షించుగాక!

**తా :** నందకము అను పేరొందిన విష్ణుని ఖడ్గము ఆనుగుణ్యము లేనిదైనది. శత్రువును చంపుటచే నీ ఎడమపాదము దేవతల సంతోషింపజేసినదై నన్దక మైనది. ఇట్లు ప్రేమభావమున జయ దేవతల ఎదుట శత్రువును చంపిన అమ్మవారిని ప్రశంసించుచుండగా శివునిచే చూడబడినదై సిగ్గునొందిన భద్రకాలి మిమ్ము రక్షించుగాక!

**వి :** పేరు పేరుగల వాని గుణమునకు తగినట్లుండవలెను. విష్ణుని ఖడ్గమునకు నందకమను పేరున్నది. ఒకప్పుడు శత్రువుల జయించి దేవతల సంతోషింప జేసియుండిన దగుటచే దానికా పేరు అప్పుడు తగియుండవచ్చును. కాని నేడు మహిషుని చంపుటలో వైఫల్యము నొంది దేవతలను సంతోషింప జేయజాలని ఆతని కత్తి కిప్పుడును నందకమను పేరుండుట ఉచితము కాదు. ఇప్పుడమ్మవారి ఎడమపాదము శత్రువును చంపి దేవతల సంతోషింపజేసిన దగుటచే నందకమను పేరు పెట్టిన సార్థకమగును. అదిగాక దేవతల సంతోషింపజేయలేకపోయిన విష్ణుని ఖడ్గము వామమైనది. అనగా నన్దకత్వమునకు విపరీతమైన ఆనందకత్వమును పొంది యున్నది. అమ్మవారి పాదము వామమైనను విష్ణుని ఖడ్గమువలె ఆనన్దకము గాక నన్దకమై యున్నది అని పూర్వార్థము నందు వ్యంగ్యమైన అర్థమునకు **వామశబ్దమునందలి శక్తి** మూలమైనది. నుతికృతి నితరాం సన్నిధౌ దేవతానామ్, హతరిపురవతాద్వీక్షితా అను పదములలో వృత్త్యనుప్రాసాలంకారమున్నది. *

**అ :** పై శ్లోకమున విష్ణుఖడ్గము పరిహసింపబడినది. ఈ శ్లోకమున **విష్ణుపాదపద్మము** పరిహసింపబడు చున్నది.

**శ్లో॥ ఏకేనైవోద్గమేన ప్రవిలయమసురం ప్రాపయామీతి పాదో**
**యస్యాః కాన్త్యా నఖానాం హసతి సురరిపుం హన్తుముద్యన్సగర్వమ్ ।**
**విష్ణోస్త్రిః పాదపద్మం బలినియమవిధావుద్ధృతం కైతవేన**
**క్షిప్రం సా వో రిపూణాం వితరతు విపదం పార్వతీ క్షుణ్ణశత్రుః ॥ 91**

**ప్ర :** ఏకేన ఉద్గమేన ఏవ = ఒక్కసారే ఎత్తుటచేతనే, అసురమ్ = రాక్షసుని, ప్రవిలయమ్ = మృత్యువును, ప్రాపయామి = పొందించెదను, ఇతి = అని, యస్యాః = ఎవతెయొక్క, పాదః = పాదము, నఖానామ్ = గోళ్ళయొక్క, కాన్త్యా = కాంతితో, సురరిపుమ్ = రాక్షసుని, హన్తుమ్ =

చంపుటకు, ఉద్యన్ = లేచుచు, సగర్వమ్ = సగర్వముగా, కైతవేన = కపటముతో, బలినియమ–విధౌ = బలిని నియమించు విధియందు, త్రిః = ముమ్మాఱు, ఉద్ధృతమ్ = ఎత్తబడిన, విష్ణోః = విష్ణువుయొక్క, పాదపద్మమ్ = పద్మమువంటి పాదమును, హసతి = పరిహసించుచున్నదో, క్షుణ్ణశత్రుః = దుమ్ము చేయబడిన శత్రువుగల, సా = ఆ, పార్వతీ = పార్వతి, క్షిప్రమ్ = శీఘ్రముగా, వః = మీ యొక్క, రిపూణామ్ = శత్రువులకు, విపదమ్ = ఆపదను, వితరతు = ఇచ్చుగాక!

**తా :** ఒక్కసారే ఎత్తబడినదై శత్రువును చంపెదనని శత్రువును చంపుటకు లేచుచున్న అమ్మవారి పాదము బలిని నియమించుటకు మూడుసార్లు కపటముతో ఎత్తబడిన విష్ణువుయొక్క పాదపద్మమును తన గోళ్ళ కాంతితో పరిహసించు పాదము గల అమ్మవారు మీ శత్రువుల కాపద నిచ్చుగాక!

**వి :** బలిని నియమించుటకు కపటవేషము వేసిన విష్ణువు మూడుసార్లు తన పాదము నెత్తినాడు. అమ్మవారు మాత్రము నిష్కపటముగా ఒకసారే పాదమును పైకి లేపి శత్రువును చంపినది. అమ్మవారి పాదము నందలి గోళ్ళ కాంతి మూడుసార్లు కపటమున ఎత్తబడిన విష్ణువుయొక్క పాదపద్మమును పరిహసించుచున్నట్లున్నది అని సంభావింపబడినందున ఈ శ్లోకమున **ఉత్ప్రేక్షాలంకార** మేర్పడి యున్నది. విష్ణువుయొక్క పాదమును పద్మమనుట **రూపకాలంకారము**. అమ్మవారి పాదము పద్మముతో రూపింపబడక మొగవాడైన విష్ణువుయొక్క పాదము పద్మముతో రూపింపబడుట అమ్మవారి పాదమునకన్న విష్ణువు పాదము బలహీనతను వ్యంజించుచున్నది. విష్ణుపాదము బలహీన మగుటచే అది బలిని నియమించుటకు మూడుసార్లెత్తబడినది. అమ్మవారి పాదము అధికతరబలముకల దగుట చేతనే ఒకసారి యెత్తుటచేతనే మహిషుని చంపగలిగినదని వ్యంజించుచున్నది. శత్రుసంహారక పాదముగల అమ్మవారు మీ శత్రువులకు విపత్తును అనగా మృత్యువు నిచ్చుగాక అని చతుర్థపాదములోని **క్షుణ్ణ** శత్రుపదము వ్యంజించుచున్నది. ఏకేనైవోద్గమేన, హసతి సురరిపుం హన్తుమ్, వో రిపూణాం వితరతు విపదమ్ పార్వతీ అను పదబన్ధములు వృత్త్యనుప్రాసాలంకృతములై యున్నవి.

*

**అ :** పై శ్లోకము అమ్మవారి పాదము విష్ణుపాదపద్మమును పరిహసించుట చెప్పబడినది. ఈ శ్లోకమున **మహిషుడు శివుని పరిహసించుట చెప్పబడుచున్నది**.

**శ్లో॥ ఖడ్గం ఖట్వాఙ్గయుక్తం యువతిరపి విభో! తే శరీరార్ధలీనా**
**హాస్యం ప్రాగేవ లబ్ధం సురజనసమితౌ దుష్కృతేన త్వయైవమ్ ।**
**జాతా భూయోఽపి లజ్జా రణత ఇయమలం హాస్యతా శూలభర్త–**
**ర్దర్పాదేవం హసన్తం భవమసురముమా నిఘ్నతీ త్రాయతాం వః ॥ 92**

ప్ర : ఖడ్గమ్ = కత్తి, ఖట్వాంగయుక్తమ్ = మంచపుకోడుతో కూడినది, విభో = ఓ ప్రభూ!, యువతిః అపి = ఆడుదికూడ, తే = నీయొక్క, శరీరార్ధలీనా = సగము శరీరమున దాగి యున్నది, సురజనసమితౌ = దేవతలతోడి యుద్ధమున లేక దేవసభయందు, హాస్యమ్ = పరిహాసము, ప్రాక్

ఏవ = ముందే, దుష్కృతేన = పాపియైన, త్వయా = నీచేత, ఏవమ్ = ఇట్లు, లబ్ధమ్ = పొందబడినది, రణతః = యుద్ధమునుండి, భూయః అపి = మరలను, లజ్జా = సిగ్గు, జాతా = కలిగినది, ఇయమ్ = ఈ, హాస్యతా = పరిహసించుచున్న, అసురమ్ = రాక్షసుని, నిఘ్నతీ = చంపుచున్న, ఉమా = పార్వతి, వః = మిమ్ము, త్రాయతామ్ = రక్షించుగాక!

**తా :** ఓ శూలము మోయువాడా! నీ కత్తికి మంచపుకోడును తోడయినది. ఆడుది నీ సగము శరీరమున లీనమై యున్నది. నీవిది వఱకు దేవతలతోడి యుద్ధమున ఓడి పరిహాసము నొందితివి లేక దేవసభలో నీకు పరిహాసము లభించినది. ఇప్పుడు మరల యుద్ధమునుండి పరుగెత్తి పోయి సిగ్గుల పాలయితివి. అపహాస్యము నొందితివి అని గర్వమున శివుని పరిహసించుచున్న రాక్షసు నుమ చంపుచున్నదై మిమ్ము కాపాడుగాక!

**వి :** శివుడొకచేత శూలము, మరొక చేత కత్తి, ఇంకొక చేత మంచపుకోడు, మరొక చేత బ్రహ్మకపాలము ఇత్యాది బహువస్తువుల ధరించియున్నాడు. శూలము కత్తి ధరించితివి సరే మరి యీ మంచపు కోడెందుకు? ఆయుధములను సంపాదింపలేని నీవు మంచపుకోడు నాయుధముగా ధరింపవచ్చును. ఇంత నీ సగము శరీరమాడుదియై యున్నది. నీవు మగవాడ వెట్లగుదువు? నీ మగతనమే సన్దేహాస్పదమైనది. ఇక దేవతల సభలో పరిహాసము నొందుటతో వింతయేమి? చంద్ర బృహస్పతుల తారా నిమిత్త కలహమునందు దేవతలందఱు బృహస్పతి పక్షము నవలంబించగా నీవు చంద్రుని పక్షము నవలంబించి యోడి పరిహాసము నొందితివి. దక్షుని యజ్ఞమునందలి దేవసభలో కూడ నీకాహుతి ఈయబడక పోవుటయే నిన్ను దేవతలు పరిహసించుట. అవన్ని పాతవిషయములు పోనిమ్ము. ఇప్పుడు నాతోడి యుద్ధమున నోడి పారిపోయి సిగ్గుల పాలయితివి. పారిపోవుచున్న నీకు పరిహాసమే కదా కావలసినది. ఇది చాలదా. నీ పరిహాస భాజనతా నిదర్శనము ఇంకను వేఱు కావలెనా? అని శివుని పరిహసించు రాక్షసుని పార్వతి చంపినది. అనగా భర్తపారిపోగా భార్య యుద్ధమునకు ధైర్యముతో వచ్చినది. నీ శూలము మోతకొఱకు పనికివచ్చినది. నీ శత్రువును చంపుటకు కాదు అని ఆ **శూలభర్తః** అను పదము వ్యంజించును. శివుడు పశుపతి. మహిషుడు పశువు కావున బలవంతుడైన మహిషుడు బలహీనుడైన శివుని "**విభో**" అని సంబోధించుట శివుని పరిహాస్యతనే వ్యంజించును. ఖడ్గం ఖట్వాంగయుక్తమ్, యువతిరపి విభో, సురజనసమితౌ, జాతా భూయోఽపి లజ్జా, హసన్తమ్ భవమసురముమా అను పదబన్ధములు వృత్త్యనుప్రాసా-లంకృతములై యున్నవి. *

**అ :** పై శ్లోకమున **మహిషుడు** శివుని పరిహసించుట చెప్పబడినది. ఈ శ్లోకమున నాతడు **తన మహిషరూపముచే ధిక్కరించుకొనుట** చెప్పబడుచున్నది.

**శ్లో॥ స్థాణౌ కణ్డూ వినోదో నుదతి దినకృతస్తేజసా తాపితం నో**
**తోయస్థానే న చాప్తం సుఖమధికతరం గాహనేనాఙ్గజాతమ్ ।**

**శూన్యాయాం యుద్ధభూమౌ వదతి హి ధిగిదమ్మాహిషం రూపమేవం**
**రుద్రాణ్యాఽఽరోపితో వః సుఖయతు మహిషే ప్రాణహృత్పాదపద్మః ॥ 93**

**ప్ర :** స్థాణౌ = స్థాణువునందు, కండూవినోదః = దురదను తీర్చుకొనుటయే (ఐనది), దినకృతః = సూర్యునియొక్క, తేజసా = తేజమున, తాపితమ్ = తపింపజేయబడినదై, నో నుదతి = బాధనొందుట లేదు, అంగజాతమ్ = అవయవముల సముదాయము, తోయస్థానే = వరుణునందు జలాశయమునందు, అధికతరమ్ = ఎక్కువగా, గాహనేన = మునుగుటచే, సుఖమ్ = సుఖము, న ఆప్తమ్ చ = పొందబడలేదు కూడ, శూన్యాయామ్ = శూన్యమైన, యుద్ధభూమౌ = యుద్ధభూమి యందు, ఇదమ్ = ఈ, మాహిషమ్ = మహిష సంబంధియైన, రూపమ్ = రూపమును గూర్చి, ధిక్ = ధిక్కారము, ఏవమ్ = ఇట్లు, వదతి = పలుకుచున్న, మహిషే = మహిషునియందు, రుద్రాణ్యా = రుద్రుని భార్యచే, ఆరోపితః = పైన పెట్టబడిన, ప్రాణహృత్ = ప్రాణముల హరించు, పాదపద్మః = పద్మమువంటి పాదము, వః = మిమ్ము, సుఖయతు = సుఖింపజేయుగాక!

**తా :** శివునికి రాచుకొన్నను నా దురద తీరలేదు. సూర్యుని తాపమున నా అవయవ సముదాయమునకు బాధ కలుగలేదు. వరుణుడు (తోయస్థానము) మునిగిన నా అవయవ సముదాయముయొక్క లోపమును తీర్చి సుఖింపజేయలేకున్నాడు. యుద్ధభూమినుండి అందఱు పాఱిపోయినప్పుడు మహిషుడు తన మహిషరూపమును తానే నిందించుకొనుచున్నాడు. అట్టివానిపై మోపబడి, ప్రాణముల హరించిన అమ్మవారి పాదపద్మము మిమ్ము సుఖింపజేయుగాక!

**వి :** శివుడు చెట్టువంటి వాడో లేక ఱాతివంటి వాడో గాని, నా కవ్వింపులు వినియు నాతో యుద్ధమునకు రాలేదు. నేనే పోయి వానికి రాచుకొన్నను కదలలేదు. ఏమి చేయుదును. వానిని వదలి వచ్చితిని. నా ప్రతాపము ముందు సూర్యుని తాపము పనికి రాలేదు. వాడు నా మీద కరముల పాదముల బఱపినను నన్నేమి చేయలేక పోయినాడు. తోయస్థాన రూపుడైన వరుణుడు నేను సముద్రములలో మునిగినను నాతో తలపడలేదు. యుద్ధభూమియందున్న వాఱందఱు నన్ను చూచి పారిపోయిరి. నాయీ దున్నపోతు శరీరమును బాధించుటకు గాని సుఖింపజేయుటకు గాని ఈ దేవతలు సమర్థులు కాకపోయిరి. నాకీ యుద్ధకండూతి తీరుటయెట్లు? ఈ మహిష రూపము దాల్చుట చేతనే నాకీ స్థితి యేర్పడినదని తన మహిష రూపమునే తాను నిందించుకొనుచున్న మహిషునిపై అమ్మవారు తన ప్రాణాంతకపాదము మోపినది. స్థాణౌ కండూ వినోదో నుదతి దినకృతస్తేజసా తాపితం నో, తోయస్థానే, న చాప్తం సుఖమధికతరం గాహనేనాంగజాతమ్, ఆరోపితః ప్రాణహృత్పాదపద్మః అను పదబన్ధములు వృత్త్యనుప్రాసాలంకృతములై యున్నవి. *

**అ :** పై శ్లోకమున మహిషుడొనర్చిన స్వరూపనింద చెప్పబడినది. ఈ శ్లోకమున వానిని త్రొక్కిన **అమ్మవారి పాదము** స్తుతింపబడుచున్నది.

**శ్లో॥ పింషఞ్ఛైలేన్ద్రకల్పమ్మహిషమతిగురుర్భగ్నగీర్వాణగర్వం**
**శమ్భోర్జాతో లఘీయాఞ్ఛ్రమరహితవపుర్దూరమభ్యూహ్యపాతః ।**
**వామో దేవారిపృష్ఠే కనకగిరిపదం క్షేమకారోఽఙ్ఘ్రిపద్మో**
**యస్యా దుర్వార ఏవం వివిధగుణగతిస్సాఽవతాదమ్బికా వః ॥ 94**

**ప్ర :** శైలేన్ద్రకల్పమ్ = పర్వతేన్ద్రమువంటి, భగ్నగీర్వాణగర్వమ్ = దేవతల గర్వమునణచిన, మహిషమ్ = మహిషుని గూర్చి అతిగురుః = మిక్కిలి బరువైన, శమ్భోః = శివునియొక్క, శ్రమరహితవపుః దూరమ్ = శ్రమలేని శరీరమును దూరముగా, అభ్యూహ్యపాతః = ఊహింపబడినదై పడుటగల, లఘీయాన్ = మిక్కిలి తేలిక, జాతః = అయినది, దేవారిపృష్ఠే = రాక్షసుని వీపునందు, కనకగిరిపదమ్ = మేరుపర్వతపాదమునకు, వామః = విపరీతమై, ఎడమదైన, క్షేమకారః = క్షేమమును కలిగించు, యస్యాః = ఎవతెయొక్క, పాదః = పాదము, ఏవమ్ = ఇట్లు, దుర్వారః = వారింపరానిదో, వివిధగుణగతిః = వివిధగుణముల నడక కలదో, సా = ఆ, అమ్బికా = అమ్బిక, వః = మిమ్ము, అవతాత్ = రక్షించుగాక!

**తా :** పర్వతేన్ద్రమువంటి, దేవతల గర్వము నణచిన మహిషుని పిండి చేయగలిగినంత బరువుగలదై, శ్రమలేని, శివుని శరీరము నూహించిన దూరపాతము గలదై, తేలికయైన మేరుపర్వతపాదమునకు క్షేమకరమై, రాక్షసుని వీపునందు తద్విపరీతమై, అనగా హానికరమైన, ఇట్లు బహువిధగుణములు గల నడకగల దుర్వారమైన అమ్మవారి ఎడమపాదపద్మము మిమ్ము రక్షించుగాక!

**వి :** మన్దరపర్వతము మోసుకొని తెచ్చితిమన్న దేవతల గర్వమును పర్వతేంద్రమువంటి మహిషుని కదిలించలేక పోవుటచే భగ్నమైనదని ప్రథమపాదము నందలి **శైలేన్ద్రకల్ప** శబ్దము వ్యంజించును. అట్టి మహిషుని పిండిచేసిన అమ్మవారి పాదముయొక్క బరువును **అతిగురు** శబ్దము తెలుపును. మహిషుని విషయమున అంత బరువైన పాదము శ్రమలేని (శివుని) శరీరమున పద్మమువలె తాకినది. అంత తేలికగా ఆ పాదము ఆవశ్యకత ననుసరించి తన బరువు పోగొట్టుకొన్నది ఒక విషయమున (మహిషుని విషయమున) బరువైన ఆ పాదమే మరొక విషయమున (శివుని విషయమున) మిక్కిలి తేలిక యైనది. శివుని విషయమున లఘుత్వమే గుణము, అని పూర్వార్ధము వ్యంజించుచున్నది. రాక్షసుని వీపుపై ఆ లఘిమయే వామయైనది. అనగా విపరీతమైన మేరు పర్వతమంతటి బరువు (గరిమ) ను పొందినది. వాని వీపుపై ఆమె పాదము పడినప్పుడు వాని కాపాదము మేరుపర్వతమే అయినది. కావుననే వాడు పిండి యైనాడు. లేక మేరుపర్వతము పదము అనగా నివాసముగా గల దేవతల విషయమున ఆ పాదము క్షేమకారక మైనదనియు అన్వయించుకొనవచ్చును. భగ్నగీర్వాణగర్వమ్, శమ్భోర్జాతః, అభ్యూహ్యపాతః, వామః క్షేమకరః, వివిధగుణగతిస్సావతాదమ్బికా వః అను పదబన్ధములలో వృత్త్యనుప్రాసాలంకారము లున్నవి. *

**అ :** పై శ్లోకమున అమ్మవారి పాదమున మహిషవధమునకు తగియున్న బరువు చెప్పబడినది. ఈ శ్లోకమున అందుకు తగియున్న వేగము చెప్పబడుచున్నది.

శ్లో॥ మార్గం శీతాంశుభాజాం సరభసమలఘుం హన్తుముద్యన్సురారిం
నేత్రైరుద్వృత్తతారైస్సచకితమమరైరున్ముఖైర్వీక్ష్యమాణః ।
యస్యా వామో మహీయాన్ముదితసురమనాః ప్రాణహృత్పాదపద్మః
ప్రాప్తస్తన్మూర్ధసీమాం సుఖయతు భవతః సా భవానీ హతారిః ॥ 95

ప్ర : అలఘుమ్ = గొప్పవైన, సురారిమ్ = రాక్షసుని, హన్తుమ్ = చంపుటకు, సరభసమ్ = వేగముగా, శీతాంశుభాజామ్ = చన్ద్రునితో కూడిన, మార్గమ్ = మార్గమును, ఉద్యన్ = పైకిపోవుచు, ఉన్ముఖైః = ఉన్ముఖులైన, అమరైః = దేవతలచేత, సచకితమ్ = భయయుక్తముగా, ఉద్వృత్తతారైః = తిరిగి పోయిన గ్రుడ్లు గల, నేత్రైః = కన్నులతో, వీక్ష్యమాణః = చూడబడుచున్న, యస్యాః = ఎవతెయొక్క, మహీయాన్ = గొప్పవైన, ముదితసురమనాః = సంతోషింపజేసిన దేవతల మనస్సుగల, ప్రాణహృత్ = ప్రాణముల తీయు, పాదపద్మః = పద్మమువంటి పాదము, తన్మూర్ధసీమామ్ = వాని తలపై భాగమును, ప్రాప్తః = పొందినదో, సా = ఆ, భవానీ = భవాని, హతారిః = చంపబడిన శత్రువుగలదై, భవతః = మిమ్ము, సుఖయతు = సుఖింప జేయుగాక!

**తా :** మహిషుని చంపుట కెత్తిన దేవి పాదము చంద్రుని మార్గమును చేరగా భయము నొందిన దేవతలు తిరిగిపోయిన గ్రుడ్లుగల కన్నులతో చూచిరి. ఆ పాదము మహిషుని తలపై భాగమును చేరి వానిని చంపెను. అట్టి పాదముగల ఆ భవాని మిమ్ము సుఖింపజేయుగాక!

**వి :** అమ్మవారు మహిషుని చంపుట కెత్తిన పాదము చంద్రలోకము చేరినది. చంద్రుని కళల నాహారముగా స్వీకరించు దేవతలా పాదమును భయముతో చూచిరి. బలి భయమును వారించుట కాతని స్వర్గాధికారమును నిర్మూలింపజేయుటకై ఆకాశమున వ్యాపించిన **త్రివిక్రమపాదము** అనుకొని ఉన్ముఖులై చూచిరి. ఉన్ముఖులగుట ఎందుకనగా ఆ పాదమింకను పైకి పోవుచుండ ముఖముల నెత్తి చూడవలసి వచ్చెను అని **ఉన్ముఖ** శబ్దము వ్యంజించుచున్నది. అమ్మవారి పాదము వాని తలపై భాగమును స్పృశించినదో లేదో వాడు చచ్చెనని సీమాం శబ్దము వ్యంజించుచున్నది. నేత్రైరుద్వృత్తతారైరమరైః అను పదములు పదాన్తవృత్త్యనుప్రాసయుక్తములై యున్నవి. ప్రాణహృత్ పాదపద్మః అను పదములలోనను వృత్త్యనుప్రాసము లున్నవి. *

**అ :** పై శ్లోకమున అమ్మవారి పాదము పద్మమని చెప్పబడినది. ఈ శ్లోకమున **చచ్చిన మహిషుడు** ఆ పద్మమున **తుమ్మెదవలె** నున్నాడని చెప్పబడుచున్నది.

శ్లో॥ మూర్ధన్యాపాతభగ్నే మిషమహిషతనుస్సన్ననిశ్శబ్దకణ్ఠః
శోణాబ్జాతస్య కాన్తిప్రతతఘనబృహన్మణ్డలే పాదపద్మే ।
యస్యా లేభే సురారిర్మధురసనిభృతద్వాదశార్ధాఙ్ఘ్రిలీలాం
శర్వాణీ పాతు సా వస్త్రిభువనభయహృత్ స్వర్గిభిః స్తూయమానా ॥ 96

ప్ర : మూర్ధని = తల, ఆపాతభగ్నే = ఆపాతమున విఱిగిపోగా, సన్ననిశ్శబ్దకంఠః = వాలిపోయిన

ధ్వని లేని కంఠముగల, మిషమహిషతనుః = మిషయైన దున్న శరీరము గల, సురారిః = మహిషాసురుడు, శోణాబ్జాతస్య = ఎఱ్ఱకమలముయొక్క, కాంతిప్రతతఘనబృహన్మండలే = కాంతిచే వ్యాపింపబడిన మేఘముల గొప్ప మండలము గల, యస్యాః = ఎవతెయొక్క, పాదపద్మే = పద్మమువంటి పాదమున, మధురసనిభృతద్వాదశార్ధాంఘ్రిలీలామ్ = మధుర రసమున దాగిన తుమ్మెదయొక్క విలాసమును, లేభే = పొందెనో, త్రిభువనభయహృత్ = ముజ్జగము భయమును పోగొట్టు, స్వర్గిభిః = దేవతలచేత, స్తూయమానా = స్తుతింప బడుచున్న, సా = ఆ, శర్వాణీ = శర్వుని భార్య, వః = మిమ్ము, పాతు = కాపాడుగాక!

**తా :** అమ్మవారి పాదము మహిషుని తలపైబడగా అది వాలి పాలిపోయి వాని కంఠము నిశ్శబ్దమయ్యెను. ఎఱ్ఱని చంద్రుని కాంతి వ్యాపించిన మేఘముల గొప్పమండలముగల అమ్మవారి ఆ పాదపద్మమున రెండు కొమ్ములు కాళ్ళవలె క్రిందికి వ్రేలాడగా ఆరు కాళ్ళు గల తుమ్మెదవలె ఆ మహిషుడు కనబడినాడు. అట్టి పాదపద్మముగల అమ్మవారు దేవతలచే స్తుతింపబడుచున్నదై మిమ్ము రక్షించుగాక!

**వి :** సన్ధ్యాకాల చంద్రుడెఱ్ఱనివాడు. అప్పటి మబ్బుగల గుంపుపై ఆతని కాంతి వ్యాపించినప్పు డవియు ఎఱ్ఱగా నుండును. అమ్మవారి పాదపద్మముపై ఆ ఎఱ్ఱని మబ్బు మండలము వ్యాపించి యున్నది. మబ్బులనగా ఆకాశమునందలి జలములే. అవి పాదపద్మమున మధురరసభావము నొందియున్నవి. మహిషుడందులో చిక్కిన తుమ్మెదవలె ఉన్నాడు. అని చెప్పబడుటచే ఈ శ్లోకమున **ఉపమాలంకార** మేర్పడి యున్నది. శోణాబ్జాత శబ్ద మెఱ్ఱని కమలము అను నర్థము నిచ్చును. మిషమహిషతనుః, సురారిర్మధు రసనిభృత, శోణాబ్జాతస్య కాంతిప్రతత, త్రిభువనభయహృత్స్వర్గిభిః లేభే అంఘ్రిలీలామ్, శర్వాణీ స్తూయమానా అను పదబన్ధములలో వృత్త్యనుప్రాసాలంకారము లున్నవి.

*

**అ :** పై శ్లోకమున మహిషుడమ్మవారి పాదపద్మమునందలి తుమ్మెదతో బోల్చబడినాడు. ఈ శ్లోకమున దేవతలచేత ఈయబడిన హవియా యన్నట్లు సంభావింపబడుచున్నాడు.

**శ్లో॥ పాదోత్క్షేపాద్వ్రజద్భిర్నఖకిరణశతైః ప్రోక్షితశ్చన్ద్రగౌరై-**
**ర్మూర్ధాగ్రే చాపతద్భిశ్చరణతలగతైరంశుభిః శోణశోభః ।**
**సన్యస్తోత్తంసమౌలిప్రవిరచితకరైశ్చర్చితః క్షిప్తకాయై-**
**ర్యస్యా దేవైః ప్రణీతో హవిరివ మహిషః సాఽవతాదమ్బికా వః ॥ 97**

**ప్ర :** పాదోత్క్షేపాత్ = పాదము నెత్తివేయుట వలన, వ్రజద్భిః = పోవుచున్న, చన్ద్రగౌరైః = చన్ద్రునివలె తెల్లనైన, నఖకిరణశతైః = వందల గోళ్ళకాంతులచేత, ప్రోక్షితః = ప్రోక్షింపబడిన, మూర్ధాగ్రే చ = తలపైనను, ఆపతద్భిః = వచ్చిపడుచున్న, చరణతలగతైః = అరికాలి యందున్న, అంశుభిః = కాంతులచేత, శోణశోభః = ఎఱ్ఱనికాంతిగల, సన్యస్తోత్తంసమౌలిప్రవిరచితకరైః = విడువబడిన శిరోలంకారములు గల, శిరస్సు నందు చేయబడిన చేతులుగల, క్షిప్తకాయైః = పడవేయబడిన

శరీరములు గల వారిచేత, చర్చితః = పూయబడిన, మహిషః = మహిషుడు, దేవైః = దేవతలచేత, హవిరివ = హవిస్సువలె, యస్యాః = ఎవతెకు, ప్రణీతః = సమర్పింపబడెనో, సా = ఆ, అమ్బికా = అమ్బిక, వః = మిమ్ము, అవతాత్ = కాపాడుగాక!

**తా :** అమ్మవారు పాదము నెత్తగా ఆమె చంద్రునివలె తెల్లని కాలిగోళ్ళ వందల కాంతులు మహిషునిపై జలమును ప్రోక్షించినట్లుండెను. మహిషుని తలపైకి వచ్చిపడుచున్న అమ్మవారి అరికాలి యందున్న కిరణములచేత ఎఱ్ఱని శోభ కలిగెను. శిరోలంకారములు తొలగించుకొని సాష్టాంగ పడిన దేవతల తలలపైన చేతులచేత పూయబడినట్లున్న మహిషుడు దేవతలచే సమర్పింపబడిన హవిస్సా యనునట్లుండెను. అట్లు మహిషుని చంపిన అమ్మవారు మిమ్ము కాపాడుగాక!

**వి :** అమ్మవారు మహిషుని చంపుట కెడమకాలి నెత్తినప్పుడు కాలిగోళ్ళ కాంతులు మహిష హవిస్సుపై జలము ప్రోక్షించినట్లుండెను. అమ్మవారి అరికాలి యందున్న ఎఱ్ఱనికాంతులతో మహిషుడు అను హవిస్సు ఎఱ్ఱని శోభ కలదయ్యెను. అమ్మవారి పాదములకు తమ శిరోలంకారములను వదలి తలలపై సంఘటించిన చేతులు మహిషు హవిస్సున గంధపుపూత యన్నట్లుండెను. ఇట్లు దేవతలు సమర్పించిన హవిస్సో యనునట్లున్న మహిషుని చంపిన అమ్మవారు మిమ్ము కాపాడుగాక! అని మహిషునియందు దేవసమర్పితహవిస్సంభావనము చెప్పబడుటచే **ఉత్ప్రేక్షాలంకార** మేర్పడి యున్నది. నఖకిరణశతైః చరణతలగతైః అను సమాసములతో పదాన్తవృత్త్యనుప్రాస మున్నది. అంశుభిః శోణశోభః దేవైః ప్రణీతో హవిరివ సాఽవతాదమ్బికా వః అను పదబన్ధములలో వృత్త్యనుప్రాసాలంకారము లున్నవి. *

**అ :** పై శ్లోకమున **మహిషుడు** అమ్మవారికి దేవత లిచ్చిన హవిస్సుగా సంభావింపబడుట చెప్పబడినది. ఈ శ్లోకమున **వజ్రరూపుడని** చెప్పబడుచున్నాడు.

**శ్లో॥ క్వాయం తీక్ష్ణోగ్రధారాశతనిశితవపుర్వజ్రరూపస్సురారిః**
**పాదశ్చాయం సరోజద్యుతిరనతిగురుర్యోషితః క్వేతి దేవ్యాః ।**
**ధ్యాయం ధ్యాయం స్తుతో యస్సురరిపుమథనే విస్మయాబద్ధచిత్తైః**
**పార్వత్యాః సోఽవతాద్వస్త్రిభువనగురుభిస్సాదరం వన్ద్యమానః ॥ 98**

**ప్ర :** తీక్ష్ణోగ్రధారాశతనిశితవపుః = తీక్ష్ణములైన ఉగ్రములైన వందల అంచులతో వాడియైన శరీరము గల, వజ్రరూపః = వజ్రముయొక్క రూపమువంటి రూపముగల, సురారిః = రాక్షసుడు, క్వ = ఎక్కడ, సరోజద్యుతిః = కమలమువంటి కాంతిగల, అనతిగురుః = ఎక్కువ బరువులేని, యోషితః = ఆడుదియైన, దేవ్యాః = దేవియొక్క, అయమ్ = ఈ, పాదః = పాదము, క్వ = ఎక్కడ, సురరిపు–మథనే = రాక్షస వధమున, ధ్యాయం ధ్యాయమ్ = ధ్యానించుచు ధ్యానించుచు, విస్మయాబద్ధచిత్తైః = ఆశ్చర్యమున కట్టబడిన మనస్సులు గల, త్రిభువనగురుభిః = త్రిభువనమునకు గురువుల చేత, యః = ఏది, స్తుతః = స్తుతింపబడినదో, సాదరమ్ = సాదరముగ, వన్ద్యమానః = నమస్కరింపబడు–

చున్నదో, సః = ఆ, పార్వత్యాః = పార్వతియొక్క, పాదః = పాదము, వః = మిమ్ము, అవతాత్ = కాపాడుగాక!

**తా :** తీక్ష్ణములైన వందల కొలది ఉగ్రములైన అంచులుగల వజ్రముయొక్క రూపము వంటి రూపముగల రాక్షసుడెక్కడ, కమలముయొక్క కాంతివంటి కాంతిగల ఎక్కువ బరువులేని ఆడుదియైన దేవియొక్క పాదమెక్కడ అని ధ్యానించుచు ధ్యానించుచు మహిషుని చంపినందుకు ఆశ్చర్యపడిన చిత్తము గల త్రిభువనగురువులచేత స్తుతింపబడిన సాదరముగా నమస్కరింపబడుచున్న అమ్మవారి పాదము మిమ్ము కాపాడుగాక!

**వి :** తీక్ష్ణోగ్రధారాశతనిశితవపుర్వజ్రరూపః అను సమాసమున **లుప్తోపమాలంకార** మున్నది. '**సరోజద్యుతిః**' అను సమాసముననను లుప్తోపమాలంకార మున్నది. రాక్షసుడెక్కడ అమ్మవారి పాదమెక్కడ అని విరూపఘటన చెప్పబడి నందున పూర్వార్ధమున **విషమాలంకారమేర్పడి** యున్నది. అమ్మవారి పాదమతిగురువైనను త్రిభువనగురువులచే వంద్యమాన మగుట అమ్మవారి ఆంతరంగిక మహిమను వ్యంజించును. శ్లోకమున రేఫ తకార వకార యకారముల పునరావృత్తులచే వృత్త్యనుప్రాసాలంకారము లేర్పడి యున్నవి. వజ్రమును పూవు భేదించుట అను విరోధము అమ్మవారి మహిమచేత పరిహృతమై **విరోధాభాసాలంకారము**ను వ్యంజించుచున్నది. త్రిభువనగురువు లనగా బ్రహ్మ విష్ణు మహేశులు. వారికిని అమ్మవారు వంద్యా అని చెప్పుటచే ఆమె మహిమ సర్వాతిశాయి యని వ్యంగ్యమగుచున్నది. *

**అ :** పై శ్లోకమున త్రిభువన గురువులు ప్రస్తావింపబడినారు. ఈ శ్లోకమున సాయుధులైన వారి కృత్య మమ్మవారిచే చేయబడినట్లు చెప్పబడుచున్నది.

**శ్లో॥ వజ్రిత్వం వజ్రపాణేర్దితితనయభిదశ్చక్రిణశ్చక్రకృత్యం**
**శూలిత్వం శూలభర్తుః సురకటకవిభోశ్శక్తతా షణ్ముఖస్య ।**
**యస్యాః పాదేన సర్వం కృతమమరరిపోర్బాధయైతత్సురాణాం**
**రుద్రాణీ పాతు సా వో దనువిఫలయుధాం స్వర్గిణాం క్షేమకారీ ॥ 99**

**ప్ర :** వజ్రపాణేః = వజ్రముచేతగల వాని ఇంద్రునియొక్క, వజ్రిత్వమ్ = వజ్రిత్వము, దితితనయభిదః = రాక్షససంహారియైన, చక్రిణః = చక్రము గలవాని (విష్ణువు)యొక్క, చక్రకృత్యమ్ = చక్రము యొక్క పని, శూలభర్తుః = శూలము మోయువాని (శివుని), శూలిత్వమ్ = శూలిత్వము, సురకటకవిభోః = సురసేనానాయకుడైన, షణ్ముఖస్య = కుమారస్వామియొక్క, శక్తతా = శక్తిమత్త్వము, అమరరిపోః = రాక్షసునియొక్క, బాధయా = వధముచేత, సురాణామ్ = దేవతలయొక్క, సర్వమ్ = అంతయు (కర్తవ్యము), యస్యాః = ఎవతెయొక్క, పాదేన = పాదముచేత, కృతమ్ = చేయబడినదో, దనువిఫలయుధామ్ = దను రాక్షసులతో వ్యర్థముగా యుద్ధము చేయు, స్వర్గిణామ్ = దేవతలయొక్క, క్షేమకారీ = క్షేమము నొనర్చు, సా = ఆ, రుద్రాణీ = రుద్రుని భార్య, వః = మిమ్ము, పాతు = రక్షించుగాక!

**తా :** ఇంద్రుని వజ్రిత్వము, విష్ణుచక్రముయొక్క కృత్యము, శివుని శూలిత్వము, కుమారస్వామి యొక్క శక్తిమత్త్వము, మహిషవధము విషయమున విఫలముకాగా వారి క్షేమము కోరి ఆ మహిషుని వధ మొనర్చుటచే సర్వదేవతాకృత్యము నంతయు తానే చేసిన పాదముతో నొప్పు అమ్మవారు రుద్రాణి రుద్రుని భార్య మిమ్ము రక్షించుగాక!

**వి :** పర్వతము ఱెక్కల విఱచి లోకములకు క్షేమమును ఇన్ద్రుడు వజ్రము తోడనే చేసెను. కాని ఆ వజ్రము మహిష పక్షమును (మహిషునికి సాయ మొనరించు దైత్యుల సమూహమును) ఏమియు చేయజాలలేదు. ఎందఱో రాక్షసుల కుత్తుకల నుత్తరించిన విష్ణుచక్రము మహిషుని శరీరమునకు గాయమును కూడ చేయలేక పోయినది. అట్టిదేయైన శూలమును మహిషునేమియు చేయలేక పోయినది. త్రిమూర్తులు సంహరింపలేని తారకుని సంహరించిన కుమారుని శక్తియు మహిషునేమియు చేయలేకపోయినది. ఆ యా ఆయుధముల పనిని ఆయుధధారులు చేయవలసిన పనిని అమ్మవారి పాదమే చేసినది. అని **దనువిఫలయుధామ్** అను దేవతావిశేషణము వ్యంజించు చున్నది. **చక్రిణశ్చక్రవత్త్వమ్** అను పాఠముపక్రమానుగుణముగా నుండును. సర్వకృతమమరరిపో-ర్భాధయైతత్ సురాణాం రుద్రాణీ అను పదబన్ధమున వృత్త్యనుప్రాసాలంకార మున్నది. *

**అ :** పై శ్లోకమున కొందఱు సాయుధ దేవతలు మహిషు నోడించుటలో వైఫల్యము నొందుట చెప్పబడినది. ఈ శ్లోకమున **సూర్యునోడించగలిగియు ఆతనిపై జాలితో మహిషుడు వైరము విడుచుట** చెప్పబడు చున్నది.

**శ్లో॥ పఙ్గుర్నేతా హరీణామసమహరియుతః స్యన్దనశ్చైకచక్రో**
**భానోస్సామగ్ర్యపేతః కృత ఇతి విధునా త్యక్తవైరః పతఙ్గే ।**
**దర్పాద్భ్రామ్యన్రణోర్వ్యాం ప్రతిభటసమరాశ్లేషలుబ్ధః సురారి-**
**ర్యస్యాః పాదేన నీతః పితృపతిసదనం సాఽవతాదమ్బికా వః ॥ 100**

**ప్ర :** హరీణామ్ = గుఱ్ఱములయొక్క, నేతా = నాయకుడు, పఙ్గుః = కుంటివాడు, అసమహరియుతః = బేసి గుఱ్ఱములతో కూడిన, స్యన్దనః చ = రథమును, ఏకచక్రః = ఒక చక్రము కలది, విధినా = దైవముచేత, భానోః = సూర్యుడు, సామగ్ర్యపేతః = (యుద్ధసాధన) సమగ్రత లేనివాడుగా, కృతః = చేయబడినాడు, ఇతి = అని, పతఙ్గే = సూర్యునియందు, త్యక్తవైరః = వైరమును విడచిన వాడై, రణోర్వ్యామ్ = యుద్ధభూమియందు, ప్రతిభటసమరాశ్లేషలుబ్ధః = ప్రతివీరునితోడి యుద్ధము-నందు లోభముగల, సురారిః = రాక్షసుడు, యస్యాః = ఎవతెయొక్క, పాదేన = పాదమున, పితృపతిసదనమ్ = యముని యింటికి, నీతః = చేర్చబడినాడో, సా = ఆ, అమ్బికా = అమ్బిక, వ= మిమ్ము, అవతాత్ = రక్షించుగాక!

**తా :** సారథి కుంటివాడు, గుఱ్ఱములు బేసి సంఖ్య కలవి, రథమునకు చక్రమొక్కటి, ఇట్లు సాధనముల సమగ్రత లేనివాడుగా దైవముచే చేయబడినాడని సూర్యునియందు వైరమును విడచిన మహిషుని చంపిన అమ్మవారు మిమ్ము కాపాడుగాక!

**వి :** యుద్ధభూమియందు తనతో పోరాడుట కెవరును లేకపోవుటచే సూర్యునితో యుద్ధము చేసిన ఎట్లుండునని మహిషు డాలోచించినాడు. ఆతనికి యుద్ధసాధనములు పూర్తిగా లేవు కావున ఆతడు తనకు తగిన ప్రతిభటుడు కానందున ఆతని నోడించినను తనకు కీర్తి కలుగదు. పైగా అపకీర్తియే కలుగును. ఆతనియందు వైరమును విడచినాడు అని చెప్పుటలో మహిషుని ఉదాత్తత వ్యంగ్యమగుచున్నది. హరీణామసమహరియుతః స్యందనశ్చైకచక్రః చ సామగ్ర్యపేతః కృత ఇతి త్యక్తవైరః పతఙ్గే, భ్రామ్యన్ రణోర్వ్యామ్ ప్రతిభటసమరాశ్లేషలుబ్ధః సురారిం, పాదేన నీతః పితృపతిసదనం సాౖ వతాత్ అను పదబన్ధములలో వృత్త్యనుప్రాసాలంకారము లున్నవి. *

**అ :** పై శ్లోకమున సూర్యుని యుద్ధానర్హత చెప్పబడినది. ఈ శ్లోకమున పారిపోయి యుద్ధమున సూర్యనేత్రుడైన **శివుడు తన అనర్హతను ప్రకటించుకొనుటయొక్క ఆశ్చర్యకరత్వము** చెప్పబడు చున్నది.

**శ్లో॥ యుక్తం తావద్గజానాం ప్రతిదిశమయనం యుద్ధభూమేర్దిగీశాం**
**హీయేతాశాగజత్వం సుభటరణకృతాం కర్మణా దారుణేవ ।**
**యుద్యేష స్థాణుసంజ్ఞో భయచకితదృశా నశ్యతీత్యద్భుతం త-**
**ద్దర్పాదేవం హసన్తం సురరిపుమవతాన్నిఘ్నతీ పార్వతీ వః ॥ 101**

**ప్ర :** దిగీశామ్ = దిక్పతులయొక్క, గజానామ్ = ఏనుగులకు, యుద్ధభూమేః = యుద్ధభూమి నుండి, ప్రతిదిశమ్ = ప్రతిదిక్కును గురించి, అయనమ్ = పోవుట, యుక్తం తావత్ = ఇప్పు డుచితమగుగాక!, సుభటరణకృతామ్ = గొప్ప వీరులతో యుద్ధమొనర్చు వారలయొక్క, దారుణేన = క్రూరమైన, కర్మణా = కర్మతో, ఆశాగజత్వమ్ = దిగ్గజత్వము, హీయేత = క్షీణించును, యది = ఒకవేళ, ఏష = ఈ, స్థాణుసంజ్ఞః = స్థాణువను పేరుగలవాడు (శివుడు)ను, భయచకితదృశా = భయకంపితదృష్టితో, నశ్యతీతి = పారిపోవుట అనునది యేదో, తత్ = అది, అద్భుతమ్ = వింత, ఏవమ్ = ఇట్లు, దర్పాత్ = గర్వమువలన, హసన్తమ్ = నవ్వుచున్న, సురరిపుమ్ = రాక్షసుని, నిఘ్నతీ = చంపుచున్న, పార్వతీ = పార్వతి, వః = మిమ్ము, అవతాత్ = కాపాడుగాక!

**తా :** దిక్పతుల గజములు యుద్ధభూమిలో నేదిక్కుకైనను పారిపోవుట యుక్తమైన అగుగాక! ప్రతివీరులతో యుద్ధము బాగుగా చేయువారి దారుణకర్మచేత వానికి దిగ్గజత్వము తొలగును. అంత మాత్రమే కాని స్థాణువు (స్థిరము గా నిలబడు శివుడు) భయకంపితదృష్టిగలవాడై పారిపోవుట మాత్రము వింతయే యని గర్వముతో నవ్వుచున్న మహిషుని చంపుచున్న పార్వతి మిమ్ము కాపాడుగాక!

**వి :** దిక్పతికి మరొక దిక్పతిపై నభిమాన ముండును. పొరపాటున తోడి దిక్పతియొక్క గజము తనదిక్కున వచ్చి ఆహారము తినిపోయినను అభిమానముతో ఆ తప్పును పట్టించుకొనవలసిన అవసరముండదు. యుద్ధభూమియందు నావంటి ప్రతివీరునితో యుద్ధమున దారుణమైన సంఘటనము సంభవించినప్పుడట్లు పారిపోయినచో ఆ గజము దిగ్గజత్వమును కోల్పోవును.

మరొక దిక్కునకు తూర్పుదిక్కుయొక్క గజము పోయినచో దాని పూర్వదిగ్గజము అను పేరును కోల్పోవును. పూర్వదిగ్గజము పూర్వదిశయందే ఉండవలె గదా అట్లు ప్రాణభయమున దిక్కులు మార్చుకొని పోయిన దిగ్గజములకు దిగ్గజత్వము పోయిన పోవుగాక! గాని గజత్వము మాత్రము పోదు. స్థాణువు కూడ ఈశానదిశ కధిపతి. ఆయన దిక్కునందలి ఏనుగు పోయినది. దిగ్గజత్వమును కోల్పోయిన కోల్పోవుగాక! ఆ దిక్కున స్థిరముగా నుండువాడు స్థాణువు సంజ్ఞను పొందియున్న శివుడు యుద్ధభూమియం దే దిక్కునకో తెలియకుండ పారిపోవుట మాత్ర మద్భుతము అని గర్వముతో నవ్వుచున్న మహిషున కమ్మవా రెదురుపడి చంపునప్పుడు వాని కే దిక్కును లేకపోయినది. ప్రతిదిశమ్ దిగీశామ్, ఆశాగజత్వమ్, దృశా నశ్యతి, రణకృతాం కర్మణా దారుణేన, స్థాణుసంజ్ఞః, అద్భుతం తత్ హసంతమ్ సురరిపుమవతాన్నిఘ్నతీ పార్వతీ" అను పదబన్ధములు వృత్త్యనుప్రాసాలంకృతములై యున్నవి. *

**అ :** పై శ్లోకమున శివునకు స్థాణుసంజ్ఞ నిరర్థకమైనదని చెప్పబడినది. ఈ శ్లోకమున తద్విపరీతముగా **శివునకు స్థాణుసంజ్ఞ సార్థకమ**ని చెప్పబడుచున్నది.

**శ్లో॥ నష్టాఙ్గస్సన్నచేతా భయహతవచనస్సన్నదోర్దణ్డశాఖః**
**స్థాణుర్దృష్ట్వా యమాజౌ క్షణమివ సరుషం స్థాణురేవోపజాతః ।**
**తస్య ధ్వంసాత్సురారేర్మహిషితవపుషో లబ్ధమానావకాశః**
**పార్వత్యా వామపాదః శమయతు దురితం దారుణం వస్సదైవ ॥ 102**

**ప్ర :** నష్టాంగః = శిథిలములైన అవయవములు గలవాడు, సన్నచేతా = శిథిలమనస్సు కలవాడు, భయహతవచనః = భయముచేత మాట పోయినవాడు, సన్నదోర్దణ్డశాఖః = శిథిలములైన కొమ్మలవంటి బాహుదండములుగల, సరుషమ్ = కఠినుడయినవాడు నయిన, స్థాణుః = స్థాణువు, యమ్ = ఎవనిని, అజౌ = యుద్ధమున, దృష్ట్వా = చూచి, క్షణమ్ ఇవ = క్షణకాలము, స్థాణుః ఏవ = స్థాణువే, ఉపజాతః = అయ్యెనో, తస్య = ఆ, మహిషితవపుషః = మహిషముగా నయిన శరీరము గల, సురారేః = రాక్షసునియొక్క, ధ్వంసాత్ = చంపుటవలన, లబ్ధమానావకాశః = పొందబడిన గౌరవముయొక్క అవకాశముగల, పార్వత్యాః = పార్వతియొక్క, వామపాదః = ఎడమపాదము, సదా ఏవ = ఎప్పుడు, వః = మీ యొక్క, దారుణమ్ = క్రూరమైన, దురితమ్ = పాపమును, శమయతు = శమింపజేయుగాక!

**తా :** ఏ కఠినుని చూచి అవయవములు, బాహువులు, మనస్సు, శిథిలములైనవో, మాట చేష్ట లుడిగి స్థాణువే ఆయెనో, అట్టి మహిషాసురుని నశింపజేసి గౌరవము నొందిన పార్వతియొక్క వామపాదము మీయొక్క దారుణమైన దురితమును శమింపజేయుగాక!

**వి :** చరించలేని వృక్షపాషాణాదులను **స్థాణువు** లందురు. శివుడు **అచలపరబ్రహ్మ** మగుటచే **స్థాణువు** అని చెప్పబడినాడు. మహిషుడు కఠినుడు. వానిని చూచి శివుని అవయవములు

బాహువులును మాలిన్యములేని వయ్యెను. స్థాణువయ్యెను. సాధారణముగా చెట్లు (మొదలు కదలకున్నను కొమ్మలు) కదలు చుండును. మహిషుని చూచిన శివుని దోర్దండ శాఖలు కదలలేని వయ్యెను. వృక్షము కొమ్మల కదలికతో కొంచెము ధ్వనించుచుండును కాని శివుని కొమ్మలవంటి చేతులు చేష్టలులేని వగుట గాక మూగయు నయ్యెను. స్థాణువు స్థాణువైనాడనగా స్థాణువు అనుపేరు సార్థకమైన దనుటయే. స్థాణుః స్థాణురేవ అనుచోట **స్థాణు**శబ్దము తాత్పర్యభేదమున ద్విరుక్తమయినందున **లాటానుప్రాసాలంకార**మేర్పడి యున్నది. దోర్దండములందు శాఖాత్వ-రూపణముచేత శివుని యందు స్థాణుత్వము రూపితమై **రూపకాలంకార**మేర్పడియున్నది. *

**అ :** పై శ్లోకమున మహిషయుద్ధమున శివుని స్థాణుత్వము నిరూపితమయినది. ఈ శ్లోకమున **అమ్మవారు తన ఆయుధములు విఫలములు కాగా తన పాదముతో మహిషుని చంపుట** చెప్పబడుచున్నది.

**శ్లో॥ కున్తే దన్తైర్నిరుద్ధే ధనుషి విముఖితజ్యే విషాణేన మూలా-**
**ల్లాఙ్గూలేన ప్రకోష్ఠే వలయిని పతితే తత్కృపాణే స్వపాణేః ।**
**శూలే లోలాఙ్ఘ్రిపాతైర్లలితకరతలాత్ప్రచ్యుతే దూరముర్వ్యాం**
**సర్వాఙ్గీణం లులాయం జయతి చరణతశ్చణ్డికా చూర్ణయన్తీ ॥ 103**

**ప్ర :** కుంతే = కుంతము, దంతైః = పండ్లచే, నిరుద్ధే = అడ్డగింపబడగా, ధనుషి = ధనువు, విషాణేన = కొమ్ముచే, విముఖితజ్యే = త్రెంపబడిన అల్లెత్రాడు కలది కాగా, మూలాత్ = మూలమునుండి, లాంగూలేన = తోకచేత, ప్రకోష్ఠే = ముంజేయి, వలయిని =కడియము కలది కాగా, తత్కృపాణే = ఆ(మె)కత్తి, స్వపాణేః = తనచేతినుండి, పతితే = పడిపోగా, శూలే = శూలము, లోలాంఘ్రిపాతైః = చంచలములైన తన్నులచేత, లలితకరతలాత్ = మృదువైన చేతినుండి, దూరమ్ = దూరముగా, ఉర్వ్యామ్ = భూమియందు, ప్రచ్యుతే = జారిపడిపోగా, సర్వాంగీణమ్ = సర్వాంగములతో యుద్ధము చేయుచున్న, లులాయమ్ = దున్నపోతును, చరణతః = పాదమువలన, చూర్ణయన్తీ = పొడి పొడి చేయుచున్న, చణ్డికా = చండిక, జయతి = సర్వోత్కర్షముగా వర్ధిలుచున్నది.

**తా :** అమ్మవారు బల్లెము విసరరగా దానిని మహిషుడు పండ్లచేత పట్టుకొని ఆపినాడు. అమ్మవారు ధనువున అల్లెత్రాటిని కూర్చి బాణము వేయుచుండగా మహిషుడు అల్లెత్రాటిని కొమ్ముతో త్రెంచి వేసినాడు. వాడు తోకతో అమ్మవారి ముంజేతిని చుట్టుకొనగా ఆమె చేతినుండి కత్తి క్రిందపడినది. మహిషుని కాళ్ళు అమ్మవారి చేతికి తగులగా చేతిలోని శూలము యుద్ధభూమిలో దూరముగా పడిపోయినది ఇట్లు అన్ని అవయవములతో యుద్ధము చేయుచున్న మహిషాసురుని అమ్మవారు తన పాదముతో త్రొక్కి పొడి పొడి చేసెను. అట్టి అమ్మవారు సర్వోత్కర్షముగా వర్ధిలుచున్నది.

**వి :** చండిక మహాలక్ష్మిగా దేవతల తేజమునుండి ఆవిర్భవించి వారిచ్చిన శూలాది బహువిధాయుధముల ధరించిన పదునెనిమిది చేతులతో కూడినదై యుద్ధమున మహిషునితో

తలపడినది. దేవతలొసగిన ఏ ఆయుధముతోనైనను మహిషు నమ్మవారు చంపినచో ఆ ఆయుధము నిచ్చిన దేవతలాయుధముల నిచ్చుట చేతనే అమ్మవారు చంపగలిగినదని ఆమె సర్వశక్తిమత్త్వమును తిరస్కరించు నవకాశ మేర్పడును. అట్టి అవకాశము నే దేవతలకును ఈయదలచలేదు. శివుని నుండి శూలమును గ్రహించియు ఆ శూలమున వానిని చంపలేదు. శూలముతో చంపినచో శివుడా మహిషవధవలన కలుగు కీర్తిలో భాగస్వామి యగును. అట్టి అవకాశమీయదలచని అమ్మవారు ఆ దేవతలను గౌరవించుటకే ఆయాయుధముల నుపయోగించి వాని వైఫల్యమును వారి కెఱుక పరచి తాను నిరాయుధగానే కేవలస్వశక్తితోడనే వానిని చంపి దేవతల నాశ్చర్య పఱచినది. 'కుంతే దన్తైః' ధనుషి విముఖితజ్యే విషాణేన', మూలాల్లాంగూలేన వలయిని, పతితే తత్కృపాణే స్వపాణేః, శూలే లోలాంఘ్రిపాతైర్లలితకరతలాత్ప్రచ్యుతే, దూరముర్వ్యామ్, అను పదబన్ధములలో వృత్త్యనుప్రాసాలంకారము లున్నవి. తత్కృపాణే, స్వపాణేః అనుచోట యమకాలంకార మున్నది. విఫలమైన చాపము మారుతు డొసగినది. అట్టిదేయైన కత్తి కాలు (యము)డొసగినది. అట్టిదేయైన కుంతమును దేవతలలో అనామకుడెవడో యిచ్చెను. మహాదేవుడని పేరుకల శివుడిచ్చిన శూలము విఫలమైనదని ఈవఱకే చెప్పబడినది. *

'శ్రీచణ్డీశతకము', ప్రసాదినీ వ్యాఖ్యయు సర్వము సంపూర్ణము.

శ్రీః



# అకారాదిశ్లోకానుక్రమణిక



శ్రీః

# ఆశీరక్షతలు

శ్లో॥ యః ప్రాకాశయదద్భుతాః కృతితతీః సాహిత్యశాస్త్రే తథా
వేదాంతేఽపి చ మంత్రశాస్త్రవిషయే చాంధ్ర్యా చ దైవ్యా గిరా ।
యస్మాద్వైదికసంస్కృతిః సువిపులాం వ్యాప్తిం గతా శాశ్వతీం
సోఽయం మోహనరాయమిత్రసుమణిః కీర్త్యా చిరం వర్ధతామ్ ॥ 1

శ్లో॥ శ్రీమన్! మోహనరాయ! మిత్రసుమణే! త్వత్సద్యశఃకౌముదీ
హ్యాచంద్రార్కమిహ ప్రభాతి వితతా సాహిత్యభవ్యాంబరే ।
శ్రీమద్వేంకటనాయకస్య కరుణావీక్షాః సదా సించతు
త్వాం దత్వా సకలం తవేప్సితతమం సాహిత్యసంపోషక! ॥ 2

– డా ॥ ఇ. ఏ. శింగరాచార్యులు.